తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్ 34

సంజయఉవాచ

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య 35

అర్జునఉవాచ,

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః 36
కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్. 37
త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరంనిధానమ్,

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. 44

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

శ్రీభగవానువాచ.

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. 47

న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః,
ఏవంరూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర 48

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్,

వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య. 49

సంజయఉవాచ.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపుర్మహాత్మా. 50

అర్జునఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. 51

శ్రీభగవానువాచ.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. 52

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. 54

మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాండవ. 55

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూప
సందర్శనయోగోనామ ఏకాదశోఽధ్యాయః.

---

వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంతరూప. 3

వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ,
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే. 39

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి,
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాఽపి. 41

యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథ వాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్. 42

పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్,
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. 43

# శ్రీమద్భగవద్గీతా.

## ద్వాదశోఽధ్యాయః

అర్జున ఉవాచ

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః 1

శ్రీభగవానువాచ

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. 2

యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ 3
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః.
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4
క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. 5

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. 7

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8
అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. 10
అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11
శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతిరనంతరమ్. 12

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ. 13
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్త స్స మే ప్రియః 14
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో య స్సచ మే ప్రియః. 15
అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. 16
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్య స్స మే ప్రియః. 17
సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః. 18
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః 19

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః 20

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో
నామ ద్వాదశోఽధ్యాయః.

# శ్రీమద్భగవద్గీతా.

## త్రయోదశోఽధ్యాయః.

---

శ్రీభగవానువాచ.

ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః 1

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. 2

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 3

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః. 4

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ,
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః. 5

ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః,
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ 6

అమానిత్వమదంభిత్వమహింసా క్షాంతిరార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః. 7

ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్. 8

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు. 9

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది. 10

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా 11

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే 12

సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతఃశ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. 13

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. 14

బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ,
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ 15

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్,
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ 16

జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం సర్వస్య హృది ధిష్ఠితమ్ 17

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. 18

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. 19

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,

పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. 20

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు 21

ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 22

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే 23

ధ్యానేనాత్మనిపశ్యంతి కేచిదాత్మానమాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 24

అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుంశ్రుతిపరాయణాః. 25

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ. 26

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 27

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్. 28

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తదాత్మానమకర్తారం స పశ్యతి. 29

యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 30

అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. 31

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 32

యథా ప్రకాశయత్యేక కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 33

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమంతరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్. 34

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగోనామ త్రయోదశోఽధ్యాయః.

---

# శ్రీమద్భగవద్గీతా.

## చతుర్దశోఽధ్యాయః.

### శ్రీభగవానువాచ.

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్,
యజ్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధిమితో గతాః. 1

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ 2

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా. 4

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ 5

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. 6

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. 7

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. 9

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. 10

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా,
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. 12

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. 13

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే. 14

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. 15

కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్. 16

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ. 17

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 18

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

గుణానేతానతీత్య త్రీ౯ దేహీ దేహసముద్భవా౯,
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. 20

అర్జునఉవాచ.

కైర్లింగై స్త్రీ౯ గుణానేతానతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాంస్త్రీ౯ గుణానతివర్తతే. 21

శ్రీభగవానువాచ

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23
సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః. 24
మానావమానయోస్తుల్య స్తుల్యోమిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే 25
మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణా౯ సమతీత్యైతా౯ బ్రహ్మభూయాయ కల్పతే. 26
బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ 27

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ
విభాగయోగోనామ చతుర్దశోఽధ్యాయః

---

# శ్రీమద్భగవద్గీతా.

## పంచదశోఽధ్యాయః

### శ్రీభగవానువాచ.

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ 1

అధశ్చోర్ధ్వం చ ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః,
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా 3

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తంతి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ 4

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,

ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్. 5

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. 6

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. 8

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే 9

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః 10

యతంతో యోగిన శ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. 11

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. 13

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ 14

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్. 15

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. 17

యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత 19

ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్కృతకృత్యశ్చ భారత. 20

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ
ప్రాప్తియోగోనామ పంచదశోఽధ్యాయః

---

# శ్రీమద్భగవద్గీతా.

## షోడశోఽధ్యాయః.

### శ్రీభగవానువాచ.

అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ 1

అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునమ్,
దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్. 2

తేజః క్షమా ధృతి శ్శౌచమద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవిమభిజాతస్య భారత 3

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ 4

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మా శుచ స్సంపదం దైవిమభిజాతోఽసి పాండవ. 5

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు 6

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ 8

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః　9

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః 10

చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః.　11

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్.　12

ఇదమద్య మయా లబ్ధమిదం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.　13

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ.　14

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.　15

అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.　16

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్　17

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. 19

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ 20

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః,
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్. 21

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్. 22

యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 23

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. 24

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంప
ద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః

---

# శ్రీమద్భగవద్గీతా.

## సప్తదశోఽధ్యాయః.

### అర్జున ఉవాచ.

యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః. 1

### శ్రీభగవానువాచ.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతితాం శృణు. 2

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః 3

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః 4

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపోజనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5

కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామమచేతసః,
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. 6

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు. 7

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః 8

కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే 13

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్,
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే 14

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్'
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే 15

మనఃప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః.
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే 16

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే 17

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్. 18

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్. 19

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్రాజసముదాహృతమ్. 21

అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్. 22

ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధ స్స్మృతః,
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. 24

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 25

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే 27

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చయత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. 28

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగోనామ సప్తదశోఽధ్యాయః.

# శ్రీమద్భగవద్గీతా.

## అష్టాదశోఽధ్యాయః

అర్జున ఉవాచ.

సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. 1

శ్రీభగవానువాచ.

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః. 2

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే. 3

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః. 4

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. 6

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః. 7

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః. 9

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే. 11

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. 12

పంచేమాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః,
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. 16

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాఁల్లోకాఁ న హంతి న నిబధ్యతే. 17

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి. 19

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ 20

పృథక్త్వేన తు యత్ జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్తమహైతుకమ్,
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ 22

నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే 23

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ 24

అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతే కర్మ తత్తామసముదాహృతమ్. 25

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే 26

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామసఉచ్యతే. 28

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు,
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ. 29

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. 30

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ,
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ, 31

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ. 32

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. 33

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ. 34

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ. 35

సుఖంత్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్. 37

విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్. 39

న తదస్తి పృధివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః. 40
బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. 41
శమో దమస్తప శ్శౌచం క్షాంతిరార్జవమేవ చ,
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42
శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43
కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44
స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 47
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. 48
అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి 49
సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ,
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః, 42

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్. 55

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. 56

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ. 57

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథచేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి. 58

యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. 59

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. 60

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. 61

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్  62
ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు.  63
సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్  64
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.  65
సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః  66
ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి  67
య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః. 68
న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి  69
అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః  70
శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోఽపి ముక్తశ్శుభాఀల్లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.
కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ.  72

అర్జున ఉవాచ

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ 73

సంజయ ఉవాచ.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాదమిమ మశ్రౌషమద్భుతం రోమహర్షణమ్. 74

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానిమం గుహ్యమహం పరమ్,
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతః స్వయమ్.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమ మద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. 76

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః 77

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. 78

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీ మద్భగవద్గీతాసూప
నిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాస
యోగోనామ అష్టాదశోఽధ్యాయః.

సమాప్తమ్.

---

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 9 | 10 | మర్హసి | మర్హతి. |
| 30 | 6 | యోగరూ | యోగారూ |
| 32 | 5 | యతోప | యత్రోప |
| ,, | 16 | కంచదపి | కించిదపి |
| 40 | 7 | భూతాభావో | భూతభావో |
| 42 | 13 | భత్క్యా | భక్త్యా |
| 46 | 6 | పార్థయంతే | ప్రార్థయంతే |
| 47 | 10 | స్సమ్యగ్వవసితో | స్సమ్యగ్వ్యవసితో |
| 52 | 6 | జ్ఞానేన | జ్ఞాతేన |
| 57 | 11 | తేజోభిరాపూర్వ | తేజోభిరాపూర్య |
| 58 | 7 | వ్యధిష్టాః | వ్యధిష్ఠా |
| ,, | 17 | ద్రిశో | దిశో |
| 62 | 5 | పరమో | పరయో |
| 64 | 7 | న | స |
| 66 | 3 | కార్యకారణ | కార్యకరణ |
| 70 | 11 | స్వస్థవ | స్వస్థ |
| 74 | 6 | తేటః | తేజః |
| ,, | ,, | శౌచ | శ్శౌచ |
| 74 | 8 | దర్పోభి | దర్పోతి |
| ,, | 11 | ముపజాతో | మభిజాతో |

# గీతాహృదయము.

## మొదటి యధ్యాయము.

శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన గీతాశాస్త్రమును శ్రీవ్యాసమహర్షి చెప్పఁదలంచి, తత్ప్రస్తావనంబుగాఁ గురుపాండవ యుద్ధసన్నాహంబును వివరించువాఁడై, సంజయునిగూర్చి ధృతరాష్ట్రుఁడడిగిన ప్రశ్నను ఉపోద్ఘాతము గాఁ జేకొని యిట్లు ప్రారంభించుచున్నాఁడు

ధృతరాష్ట్రుఁడు అడుగుచున్నాఁడు

సంజయా! మావారును బాండవులును యుద్ధంబునకై ధర్మక్షేత్రమగు కురుక్షేత్రంబునఁ గూడిరంటివి అట్లుగూడి యేమిచేసిరి 1

ధృతరాష్ట్రుఁడట్లు ప్రశ్నింపఁగా విని పరమాశ్చర్యమునొంది సంజయుఁ డిట్లు నిరూపించుకొనెను 'పాపము! ధృతరాష్ట్రునకు మనోభ్రాంతి కలిగి నట్లున్నది కాదని యితఁ డిట్లడుగఁడు. యుద్ధమునకుగాఁ జేరినవారు యుద్ధము చేయుదు రని బాలురకుఁగూడ స్పష్టమైయుండఁగా వివేకశాలియగు నితఁడట్లడుగుటకుఁ గారణాంతరము గాన్పింపదు. తనకులమెల్లఁ దనకన్నులయెదుటనే పోరాడి నశింపనున్నదను దుఃఖంబున నితఁడు మతిభ్రష్టుఁడైనాఁడనక తీఱదు ఇట్టి సంకటము నెట్టివారికైన నిట్లు గావింపఁజాలును గదా'—ఇట్లు నిశ్చయించుటకుఁ గూడ వీలుగాకున్నది ఉభయపక్షముల యోధులు నశింతురను శోకము వీనికిఁ గలదేని 'మామకాః పాండవాశ్చైవ' అని దుర్యోధనాదులు తనవారుగాఁ బాండవులు పరకీయులుగా భావించునా? ఇట్లు పాండవులను వేఱుచేసియడుగుట వలన నితని భావము వేఱని స్పష్టమయ్యెడు ధృతరాష్ట్రుఁడు మొట్టమొదట నుండి పాండవుల నంతగాఁ బ్రేమింపఁడు ఈ యుద్ధము రాజ్యమునకై వచ్చినది. తనకొడుకులకుఁ గాదని తమ్ముని కొడుకులకు రాజ్యము గట్టిపెట్టు తండ్రియుండఁడు. రాజ్యమెట్లయినను దనకొడుకులకే సంక్రమింపవలయునని యితని నిశ్చయాభిప్రాయము పాండవులు జయింపనిదే రాజ్యము కౌరవులకుఁ

దక్కఁడు. కౌరవులపక్షమునఁ బదునొకండక్షౌహిణులున్నారు, పాండవులపక్షమున నేడక్షౌహిణులుమాత్రమే గలవు. యోధులన్ననో స్వమరణశీలుఁడగు భీష్ముఁడు, ధనుర్వేదపారంగతులగు ద్రోణాచార్యకృపాచార్యులు, అజేయుఁడగు కర్ణుఁడు మహాప్రచండుఁడైన యశ్వత్థామ మున్నగు మహాశూరులు కౌరవపక్షమునన్నారు. అర్జునుఁ డొక్కఁడు లెక్కింపఁదగిన శూరుఁడు. మఱియొక్కఁడేనియుఁ బాండవులపక్షమున లేఁడు. ఇదియునుగాక యుద్ధమునకై వీరు చేరినది కురుక్షేత్రము. సేనాబలము స్థానబలము రెండుఁ గౌరవులకుఁగలవు. కావునఁ గౌరవులకే జయమని ధృతరాష్ట్రుని పరమాభిప్రాయము. అంతియగాదు. ధర్మముగూడ తనవంకనే యున్నదని యితని భావము. ఎట్లనిన—ఈ రాజ్యమునకు మూలపురుషుఁడు కురువనురాజు, వానినుండి రాజ్యము వంశక్రమాగతముగాఁ దనకువచ్చినదనియు, తాను పుట్టుగ్రుడ్డియగుటంజేసి రాజగౌరవమున మాత్రము దానుంచుకొని పరిపాలనభారమును దమ్మునిపైమోపితిననియు, అంతమాత్రాననే రాజ్యము పాండవులదిగాదనియు, తమదిదిగాని సొమ్మునకై పాండవులుపోరుట ధర్మముగాదనియు, అధర్మమెన్నడు జయింపదనియు నితని విశ్వాసము.

జయాపజయంబులఁగూర్చి ధృతరాష్ట్రునకు సంశయములేకున్నను విషము పెట్టించుట, లక్కయిల్లుకట్టించి వారినందుఁజేర్చి యిల్లుగాల్చుట, కపటద్యూతమున రాజ్యమపహరించుట, వారిని గుట్టలకుఁదోలుట, సభామధ్యంబున ద్రౌపదికి మానభంగమొనర్చుట—మున్నగు మహాపచారములు కౌరవులు పాండవులకుఁ గావించియున్నారనియు నందులకై పాండవులుపగపట్టి ప్రాణములు తెగించియున్నారనియు, తెగించినవారితోడిపోరు నిరుపద్రవము కానేరదనియు వానియెదలో నాటియున్నది. అయినను ధర్మరాజు ఎవరేమి చెప్పినను నీచమార్గము ద్రొక్కఁడను నమ్మిక వానికిఁబూర్ణముగాఁగలదు. ధర్మరాజట్టివాఁడగుటవలనను, వారుచేరినది ధర్మక్షేత్రమగుటవలనను, క్షేత్రప్రభావంబున నిరుదెగలవారు అధర్మమునుమాని ధర్మమునవలంబింపవచ్చుననియు, ఆపక్షమున సంధికుదిరి యుద్ధము సమసిపోవచ్చుననియు వానియంతర్భావము. అట్టిదానికేదేని అవకాశముగల్గునోయని విని నిరీక్షించుచున్నాఁడు. ఇన్నితలఁపులెదఁ గోఁబెట్టుకొని యిట్లు ప్రశ్నించెనేగాని మనోభ్రాంతివలనఁ గాదని పర్యాలోచిం

ౘగా స్పష్టమగుచున్నది ప్రశ్నకుదగినట్లు సమాధానమిత్తుగాక, అని సంజయుఁడు చెప్పుచున్నాఁడు

రాజా ! నీకుమారుఁడగు దుర్యోధనుఁడు వ్యూహాకారముగాఁ దీర్చియున్న పాండవ సైన్యంబునుజూచి ద్రోణాచార్యులను సమీపించి యిట్లనియెను 2

గురువర్యా ! పాండుపుత్త్రుల యీమహాసైన్యంబునుజూడుము. ధీమంతుఁడగు నీశిష్యుఁడు ధృష్టద్యుమ్నుఁడు ఈసైన్యంబునెల్ల వ్యూహముగాఁ దీర్చియున్నాఁడు. 3

దుర్యోధనుఁడిట్లు వచింపఁగా ద్రోణాచార్యుఁడువిని ఊఱకుండెను. మాయుద్ధము సమానమైనదికా'దను భావముతో నాచార్యుఁడు జవాబుచెప్పకేమొ గాఁబోలు' నని దుర్యోధనుఁడు తలంచి అట్టి దురభిప్రాయము మానుటకుఁగా జరుగనున్న యుద్ధము సమానజనయుద్ధమేయని యీక్రింది మూఁడు శ్లోకములతోఁ దెలుపుచున్నాఁడు

ఇందు సాత్యకి విరాటుఁడు ద్రుపదుఁడు ధృష్టకేతువు చేకితానుఁడు కాశీరాజు పురుజిత్కుంతిభోజుఁడు శైబ్యుఁడు యుధామన్యువు విక్రాంతుఁడు ఉత్తమౌజుఁడు అభిమన్యుఁడు ద్రౌపదీసుతులగు ప్రతివింధ్య శ్రుతసేన శ్రుతకీర్తి శతానీక శ్రుతకర్మలను నుపపాండవు లేవురుఁగలరు ఈనరపుంగవులెల్లరు శౌర్యవంతులును శూరులును మహారథులును ధనుర్విద్యాప్రవీణులు నగుటయేగాక యుద్ధముచేయుటయందు భీమార్జునులకుసమానులేగాని తక్కువవారుగారు 4-6

దుర్యోధనుఁడిట్లుచెప్పినను ద్రోణాచార్యుఁడు పలుకకుండెను అది గాంచి 'ఇతఁడు మొదటినుండియుఁ బాండవులయెడఁ బక్షపాతముగలిగి నాకృతము నాక్షేపించుచుండును, ఆకారణంబున నామాట సరకుసేయఁడు ఎదురాడఁడు' అని నిశ్చయించి 'శత్రు పక్షపాతియైన యితనికి నాభయమేల సూచించితిని ? అట్లుచేయుటవలన నగుఁబాట్లపాలైతిని ఆచార్యునివలన రాజు ప్రత్యుత్తరము పడయలేఁడయ్యెనని నలువురలోఁ దేలవంపుగూడ గలిగినది'అని తలపోసి, దుర్యోధనుఁడు తనభయంబును స్వజనస్తుతి కారణంబునఁ గప్పిపుచ్చుటకు గురుముఖంబునఁ బ్రియవచనంబుఁ బడయుటకు యత్నించి వానిని స్తుతించుచు నిట్లనియెను.

ద్విజోత్తమా! పాండవసైన్యంబును వింటివి ఇఁక మనసైన్యమందలి నాయకశ్రేష్ఠులను మీకుసంజ్ఞార్థము చెప్పెదను వినుము 7

బ్రహ్మబలమునకు సాటిబలములేదు, అట్టిది నీయూపంబు మూర్తీభవించియున్నది, నీవొక్కండవే నాకుఁజాలు, నీకుఁదోడుగా స్వచ్ఛందమరణశీలియగు భీష్ముఁడు, కర్ణుఁడు, కృపాచార్యుఁడు, అశ్వత్థామ, నాతమ్ముఁడు వికర్ణుఁడు, భూరిశ్రవస్సు—వీరుగలరు. 8

వీరేగాదు, ఇంతటివారెందరోయున్నారు, వారిని లెక్కింపఁ దరముగాదు. శస్త్రవిద్యయందుఁగానీ యుద్ధకౌశలమందుఁగానీ మనవీరులు మహాదక్షులు. మనవారియందు గుణాతిశయము మఱియొకటిగలదు స్వామిపని యందెట్లో యితరులపనియందుఁగూడ మనవారు వెనుదీయరు కూలికి యుద్ధము చేయువారివలెఁగాక మనవీరులు నాకై తమప్రాణంబులనుగూడ త్యజించియున్నారు. 9

యోధులనుబట్టిగానీ సంఖ్యనుబట్టిగానీ మనబలమే యధికము మన సేనానాయకుఁడన్ననో పరశురామునకుఁగూడ నోడనివాఁడు, స్వేచ్ఛామరణశీలుఁడునగు భీష్ముఁడు కావున మనబలము సర్వవిధములఁ జాలియున్నది. పాండవులపక్షమున మనట్టిశూరులు లేరు, లెక్కకుఁగూడ వారిబలము చాల తక్కువ, వారి సేనాపతియగు భీముఁడన్ననో మన భీష్మునకు సాటిగాఁడు. ఎట్లు విచారించినను వారిబలము తక్కువయనక తీఱదు 10

ఇట్లు దుర్యోధనుఁడు ఆచార్యుని స్తుతించినట్లు స్వబలమును బ్రదర్శించి నట్లుగాఁ బలికెను 'పరబలమునకుభయపడి నీయొద్దకు వచ్చితినను కొంటివిగాఁ బోలు అట్టి తలంపుతో రాలేదు, గురువగుటంజేసి దర్శింపవచ్చితిని, బదులాడకుండుట తగదు' అనుభావము దుర్యోధనునకుండుటచూచి వాని యందలి కాపట్యంబునుగ్రహించి 'ఇప్పటికిఁగూడ నితఁడింత మర్యాదమాని భాషించుచున్నాఁడుగదా' యని ద్రోణాచార్యుఁడు మిన్నకుండెను అందులకు దుర్యోధనుఁడు మిక్కిలికోపపడి యాచార్యతిరస్కారముగా నిట్లనియెను

శిఖండిమీఁద బాణమువేయనని భీష్మునివ్రతము, శిఖండిని మున్నిడుకొని పాండవులు యుద్ధమునకు వత్తురు శిఖండిని గాంచినంత భీష్ముఁడు శస్త్రసన్యాసమొనర్చును. అదిసమయముగాఁ బాండవులు భీష్మునకు నపకారము మొ

సర్వవచ్చును భీష్ముఁడొక్కఁడు సుఖమున్న నాకుఁజాలు. అతఁడే నాకు
రక్షకుఁడు. కాఁబట్టి మీరెల్లరు మీమీవ్యూహప్రవేశమార్గములందు జాగరూ
కులైయుండి సర్వవిధముల భీష్మునే రక్షింపుఁడు 11

ద్రోణుఁడు, భీష్ముఁడు ఏకభావముతోనుందురు గావున ద్రోణుఁడు తిరస్కరించినాఁడన్న భీష్ముఁడుగూడ తిరస్కరించినట్లేయనియు, ఆ కారణంబున స్వకులమెల్ల నశించినట్లేయనియు, ధృతరాష్ట్రుఁడు వ్యాకులపడసాగెను అదిగాంచి సంజయుఁడిట్లనియెను

దుర్యోధనుఁడట్లు గురుతిరస్కారదుఃఖితుఁడు కాఁగా భీష్ముఁడు గ్ర
హించి 'ఈసమయంబున నితఁడిట్లగుట మేలుగాదనియెంచి వానికి ధైర్యసం
తోషములు గూర్చువాఁడై సింహగర్జనమొనర్చి శంఖంబును గట్టిగాఁ బూరిం
చెను. 12

పరబలభయగురుతిరస్కారంబులవలన గతప్రాణుఁడైయున్న దుర్యోధనునకు భీష్మశంఖారావము తత్కాలప్రాణప్రతిష్ఠాపనార్థమేగాని పరబలనిరసనార్థముగాదనియు భీష్ముఁడంతకన్న శక్తుఁడుగాఁడనియు 'కురువృద్ధపితామహ' శబ్దంబులు సూచించును

సేనాపతియగు భీష్ముఁడు శంఖారావము గావించినంతనే కౌరవసైన్య
మందు శంఖంబులు భేరులు హుడుక్కలు తప్పెటలు గోముఖములను వాద్యం
బులు పెల్లునమ్రోగి మహాశబ్దముగావించెను. 13

రాజా! కౌరవవృత్తాంతమును జెప్పితిని, ఇఁక పాండవులవృత్తాంతము
వినుము ఖాండవదహన సమయంబున అగ్నిదేవుఁడు అర్జునునకు మెచ్చి శ్వే
తాశ్వరథంబులిచ్చెనుగదా ఆశ్వేతాశ్వములుగట్టిన యారథముమీఁద లక్ష్మీ
పతియగు శ్రీకృష్ణుఁడును అర్జునుఁడు నుండిరి కౌరవుల శంఖారావములు విన్నం
తనే శ్రీకృష్ణార్జునులు తమ శంఖంబులను గట్టిగానూదిరి. 14

హృషీకేశుఁడు (అనఁగా సర్వేంద్రియములకు అధిపతియైన శ్రీకృష్ణభగవానుఁడు)
పాంచజన్యమను శంఖంబును, అర్జునుఁడు దేవదత్తమను శంఖంబును, భయంకర
కర్ముఁడైన భీముఁడు పౌండ్రమను మహాశంఖంబును, 15 కుంతీనందనుఁడగు
ధర్మరాజు అనంతవిజయమను శంఖంబును, నకులుఁడు సుఘోషమను శంఖంబును

సహదేవుఁడు మణిపుష్పకమను శంఖంబును, 16 మేటివిలుకాఁడగు కా
శీరాజు, మహారథుఁడగు శిఖండి, ధృష్టద్యుమ్నుఁడు, విరాటుఁడు, పరాజయ
మెఱుంగని సాత్యకి 17 ద్రుపదుఁడు ద్రౌపదిపుత్రులు మొదలగు ఉపపాండ
వులు విక్రమశాలియగు అభిమన్యుఁడు నానాదిక్కులనుండి తమతమశంఖంబు
లను గట్టిగాఁ బూరించిరి 18

ఆశంఖారావము భూమ్యాకాశంబులనిండి మాఱుమ్రోఁగి కౌరవుల మనస్సులనుబగిల్చి గుండెలు చీల్చినది. మనస్సులు పగులుటవలనఁ గౌరవులకుఁ బ్రజ్ఞతప్పినది, కోరికలు నశించినవి, ధైర్యము ఉత్సాహము తొలఁగినవి; గుండెలు చీలుటవలన మహాభయముగలిగినది. స్వయముగాఁదాను యుద్ధము చేయకయే పాండవులయుద్ధమును నెఱవేర్తునని శ్రీకృష్ణభగవానుఁడు ప్రతిజ్ఞ చేసియున్నాఁడు శంఖధ్వనివలననే శ్రీకృష్ణుఁడు ఆమాటను నిర్గించుకొనినాఁడు 19

'శంఖనాదమువలననే (అనఁగా యుద్ధమనుమాటలేకయే) కౌరవులెల్ల సని చెడిరి, నా కులమెల్ల ఇప్పుడే చచ్చినట్లాయెను, కటా! ఎంతకష్టమువచ్చినది!' అని ధృతరాష్ట్రుఁడు చింతపడసాగెను. అతనితో సంజయుడిట్లనియెను

రాజా! అర్జునుఁడు కౌరవులను జయించెననుఖ్యాతి వానికిరావలయునని భగవత్సంకల్పము. అందువలన శ్రీకృష్ణుఁడు కౌరవులను గొనయూపిరితో నుంచినాఁడు. శ్రీకృష్ణభగవానుఁడు ఇంక కొంచెము గట్టిగాఁ దనశంఖంబు నూఁదియున్నచోఁ గౌరవులు చచ్చియేయుందురు, యుద్ధమనుమాటయే సున్నయై యుండును అట్లు కౌరవులు చావఁజిక్కి కొనప్రాణములతో యుద్ధమునకుఁబూనిరి. హనుమంతుఁడు కేతువునందుఁగల యర్జునుఁడు బాణప్రయోగమునకు సమయమగుటగాంచి విల్లువైకెత్తి శ్రీకృష్ణునితో నిట్లనియెను 20

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు

అచ్యుతా! ఈరణంబున ఎవ్వరెవ్వరితో నేను పోరవలయునో, దుర్బుద్ధియగు దుర్యోధనునకు యుద్ధంబునఁ బ్రియముసేయుటకై ఎవరెవరువచ్చిరో చూడఁగోరెదను యుద్ధకాములై వచ్చిన వీరిని నేనుచూచుటకు వీలగునట్లుగా ఉభయసేనలమధ్య నాతేరును నిలుపుము. 21-23

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ధృతరాష్ట్రా! అర్జునుఁడట్లు చెప్పినంతనే శ్రీకృష్ణుఁడు రథమును దోలుకొనిపోయి భీష్మద్రోణాదులకు ఎల్లరాజులకు నెదురుగా ఉభయసేనలమధ్య నిల్పి 'అర్జునా! యుద్ధమునకువచ్చిన కౌరవులు వీరుగో చూడు' మనెను 24-25

భూరిశ్రవస్సు మున్నగు తండ్రితోఁబుట్టువులను, భీష్ముఁడు సోమదత్తుఁడు మొదలగు తాతలను, ద్రోణుఁడు కృపుఁడు మున్నగు గురువులను, శకుని మున్నగు మేనమామలను, దుర్యోధనుఁడు మున్నగు సోదరులను, లక్ష్మణుఁడు మున్నగు కుమారులను, మనుమలను, అశ్వత్థామాదిసఖులను, మామలను వైరిసేనలోఁ జేరియుఁ దనకుఁ బక్షపాతులుగానున్న శల్యుఁడు మున్నగు స్నేహితులను, ఉభయపక్షములవారియందు సమానభావముగల మిత్రులను సేనలో నర్జునుఁడు చూచెను వారినిజూచినంతనే అసాధారణమైన మోహము వానికిఁ గలిగినది. అట్టిమోహమునకు జిక్కి యర్జునుఁడు పిశాచముపట్టినవాఁడువలె విషాదపడుచు నిట్లనియెను 26-27

కృష్ణా! యుద్ధమునకై నాయెదుటనున్న యీమావారిని జూచినంతనే
నాకుఁ గాళ్ళుచేతులు మున్నగునవి సడలుచున్నవి. కావున యుద్ధము జేయఁ
జాలను 'కాలుసేతులాడకున్నచో కాయికకర్మమగు బాణప్రయోగము
మాని వాచికకర్మమగు దూషణాదులు చేయరాదా'యనియందువా? అదియు
సాధ్యముగాదు. ఏలయందువా? నోరుతడియారుచున్నది, మాటవెలువడదు
28 'అట్లనుటకు నిదిసమయముగాదనియు శోకవికారముల నడంచిపెట్టి
ధైర్యమవలంబింపు'మని చెప్పెదవా?' అదియు సాధ్యముగాదు ఏలయందు
వా? నిలువెల్ల వడఁకుచున్నది, ఆఁపినను అణఁగదు, 29 గాండీవము
చేతినుండి జారిపోవుచున్నది ఈలక్షణములవలననే నాయంతస్సారమైన ధై
ర్యము నశించినదని స్పష్టమగుచు ధైర్యముపోవుటవలన నిలువెల్లమండుచు
న్నది, రోమములు నిక్కపొడుచుచున్నవి 'ఏదియెట్లున్నను ఊరకనిలిచి
యుండరాదా'యని యందువా? అదియు సాధ్యముగాదు ఏలయనగా
నామనస్సు చక్రమువలె గిర్రునతిరుగుచున్నది. ఈమనోభ్రమణము మూర్ఛ
కు మొదటిలక్షణము కావున నిలచియుండుటకు గూడ శక్తిలేదు 'ఎట్లయి

నను సహించి శత్రువులను జంపినయెడల సామ్రాజ్యము వచ్చు'నందువా ?
అదియు నమ్మఁజాల ఏలయనఁగా అవిగో చూడుము. 30 దివ్యశకునములు
గానీ అంతరిక్షశకునములుగానీ భూమిసంబంధములగు శకునములు గానీ ప్రతి
కూలములుగాఁ దోఁచుచున్నవి నాకు జయమగుననుటెట్లు ? మఱియు స్వజన
మును యుద్ధమందు జంపుటవలనఁ గలుగుశ్రేయము నాకేదియుగాన్పింపదు. 31

(ఇవి శోకలక్షణములు ఇఁక మోహలక్షణములు చెప్పఁబడును)

ప్రతికర్మమునకు దృష్టములని అదృష్టములని ఫలములు రెండువిధములు
అందుఁగంటికి నగపడునవి దృష్టఫలములు యుద్ధమువలన జయము, దానివలన
రాజ్యము, దానివలన సుఖముగలుగవచ్చును ఈమూడు దృష్టఫలములు
విజయాపేక్ష నాకులేదు, నాకు రాజ్యమువలదు, సుఖమునుగూడ గోరుట
లేదు కావున దృష్టఫలములేవియు నాకక్కఱలేదు ఏలయందువా ? ఏది
యైనను స్వార్థమో స్వజనార్థమో జనులుకోరుదురు అట్లె నేను నామేలు
కొఱకో నాజనులమేలుకొఱకో కోరవలయునుగదా ఇప్పుడీరణరంగంబున
నున్నవారెల్ల మావారేగాని యన్యులుగారు వీరిని జంపినఁగాని రాజ్యము
నాకు రాదు వీరిఁజంపినతర్వాత నేను జీవించుటెట్లు బ్రతికియున్నఁగదా
నాకీరాజ్యాదులు కావలసియుండును కావున స్వార్థమునుగూర్చిన తలంపే
మఱచిపొమ్ము. 'నాకుఁగాకున్నను మావారికిఁగాఁగోరరాదా'యని యందువా ?
32 ఎవరికొఱకు నేనీరాజ్యాదులను ఉపభోగములను సుఖమును గోరవలయు
నో వారే తమప్రాణధనములనుత్యజించి యుద్ధార్థమువచ్చియున్నారు వీరిని
జంపినఁగాని రాజ్యము నాకుస్వాధీనపడదు వీరు చచ్చినతర్వాత రాజ్యము
వీరికేల ? ఎట్లు విచారించినను రాజ్యాదులు స్వార్థమునకుగాని స్వజనార్థమున
కుగానీ రెంటికిఁగావు 33

వారెవ్వరనగా గురువులు, పినతండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామ
లు, మామలు, మనుమలు, బావమఱఁదులు, సంబంధులు—ఇట్టివారుగా
నున్నారు 34 వీరిచావుగూడ కోరరాదు. అట్టివారిని జంపుటెట్లు? 'వారు
నన్నుఁ జంపుదు'రందువా ? చంపినఁ జంపుదురుగాక కౌరవరాజ్యమే

గాదు ముల్లోకముల రాజ్యాధిపత్యము రానున్నను వారిని నేనెంతమాత్రము చంప నొల్లను గురువధ మహాపాతకమని శాస్త్రము. కాబట్టి యీయుద్ధమువలన వచ్చు అదృష్టఫలమేమియుఁ గానరాదు, మీఁదుమిక్కిలి విపరీతఫలముమాత్రము తప్పునట్లులేదు 35

జనార్దనా ? ధార్తరాష్ట్రులను జంపుటవలన మనకేమిప్రీతియగును ? ప్రీతి కలుఁగకపోవుటయేగాక పాపము సంభవింపకమానదు 'వీరుఆతతాయులనియు, ఆతతాయులను వధించుట శాస్త్రసమ్మతమనియుఁ బాపమురాదనియుఁ' జెప్పుదువా ? ఇల్లుగాల్చువాఁడు, విషముపెట్టువాఁడు, నిరాయుధుని శస్త్రపాణియైవచ్చి చంపువాఁడు, ధనము హరించువాఁడు, భూమి హరించువాఁడు, భార్యను హరించువాఁడు—ఈయార్గురు ఆతతాయులని శాస్త్రముచెప్పుట నిజమే ధార్తరాష్ట్రులు ఈయాఱుపనులు చేసిరనుటయు నిజమే. అయినను వీరు మనవారేగదా. 36

ధార్తరాష్ట్రులు మనకు బాంధవులు, బంధువులనుజంపినచోఁ బాపము తప్పదు, కావున వీరినిజంపుట మనకుఁదగదు. మాధవా ! మనవారినిజంపి మనమెట్లు సుఖింతుము ? స్వజనఘాతకులకు సుఖమెక్కడిది ? తినుటకుఁగూడు ఉండుటకు నిల్లు, లేనిమేము ఎట్లయినను యుద్ధముచేసి రాజ్యముసంపాదించి సుఖపడవలసియుండఁగా, ఇట్లు మీనమేషములెంచుట తగదనియు, ఊరకున్నచో దేహయాత్రగూడ జరుగదనియుఁ జెప్పుదువా ? లక్ష్మీపతిని నిన్ను ఆశ్రయించితిమి. మాకుఁగొదువయేమి ? 37

స్వజనవధ మీకు దోషమైనచోఁ గౌరవులకుఁగూడ దోషముకావలదాయనియు, ఆసంగతివారు దలంపనప్పుడు మీరుమాత్రము తలంపనేలయనియు నందువుగాఁబోలు దుర్యోధనాదులు రాజ్యలోభంబున వివేకముచెడియున్నారు అందువలన వారు కులక్షయమువలనఁగలుగు వర్ణసాంకర్యరూపదోషమును స్వజనులను వధించుటవలనఁ గలుగు పాపంబును గానరు. 38

మనకన్ననో ఆరెండుదోషములు ముంజేతికంకణమువలె స్పష్టము. ఇట్లుతెలిసియు ఆపాపమునుండి మానుటకు నేరమేల ? భ్రాంతులవలె భ్రాంతిలేనివారు చేయరాదుగదా ? 39

రక్షించుదు గావున వానికి నరకభయమేలయనియు నందువా ? వర్ణసంకరకారులు పాపిష్ఠులు, పాపిష్ఠులు నీయాజ్ఞారూపములైన శ్రుతిస్మృతుల నుల్లంఘింతురు అట్టివారిని నరకయాతనాములందు నీవేద్రోసి తపింప జేతువు అంటువలననేగదా నీకు 'జనార్దను'డను పేరువచ్చుట. నన్నుమాత్రము ఉపేక్షింతువా ? 44

స్వజనవధయే పాపము, దానికిఁదోడుగా కులక్షయదోషము దాపరింపనున్నది, దీనికంతయు రాజ్యసుఖలోభముగదా కారణము అహో! కటా! తుచ్ఛమునకాసించి యెంతపాపము నొడిగట్టనున్నాము! 45

నేను శస్త్రసన్యాసమొనర్చి యూరకున్నచో ధార్తరాష్ట్రులు శస్త్రపాణులై రణములో నన్నుఁజంపరాయని శంకింపవచ్చును. ప్రాణికిఁ జావు తప్పదు స్వజనులనుజంపి దెబ్బతిని చచ్చుటకన్న శస్త్రసన్యాసమొనర్చి శత్రువులచేతులనుఁ దలయిచ్చి చచ్చుటమేలు వీలయందువా ? స్వజనులను జంపుటవలనఁ బాపమగును; రెండవపక్షమున ఎట్టిపాపమునకు నవకాశము లేదు. కాఁబట్టి పాపరహితమైన మరణము నాకుఁ బ్రశస్తతరమగును 46

అర్జునుఁడిట్లుచెప్పి శరచాపంబులువదలి శోకమలినచిత్తుఁడై రణరంగంబున రథముమీఁద గూలఁబడెను 47

ప్రథమాధ్యాయము సమాప్తము



కులక్షయమువలనఁ గలుగుదోషమేమందువా ? కులక్షయమైనప్పుడు
కులధర్మముల నాచరించువారుండరు. కులధర్మముల నెప్పుడాచరింపరో య
ప్పుడే యవి నశించును. ఈకులధర్మములు నిన్న నేఁడు వచ్చినవిగావు. పెద్ద
కాలమునుండి పరంపరగా వచ్చుచుండును. ధర్మమెప్పుడు నశించునో య
ప్పుడే యధర్మము తలయెత్తి చావగా మిగిలినవారినెల్ల నాక్రమించును 40

కృష్ణా ! అధర్మమెప్పుడు వ్యాపించునో యప్పుడె కట్టుబాట్లు నశిం
చును. కట్టుబాట్లు ఎప్పుడులేవో యప్పుడే స్త్రీలు హద్దుమీఱి వర్తించి చె
డుదురు. స్త్రీలు చెనటులగుదురేని వర్ణసాంకర్యము తప్పదు. కురువంశము
నకు వృష్ణివంశమునకు పరస్పరసంబంధ బాంధవ్యముగలదు. వృష్ణివంశంబున
నీవుపుట్టితివి. కావుననే నిన్ను వార్ష్ణేయుఁడందురు. కురుకులమునకుఁ
దలవంపు గల్గించ నీవుమాత్రము సహింతువా ? 41

వర్ణసాంకర్యమువలన నరకమగును. ఈనరకపాతము కులము చెఱచినవా
రికేయనిగాని చెడినకులమునకేయనిగానీ నియమింపరాదు. చెఱచినవారి పి
తరులకుఁ జెడినవారి పితరులకుఁగూడ సంక్రమించును. ఏలయందువా ?
చెఱచినవారుగాని చెడినవారుగాని చేయు పిండోదకక్రియలు వారిపితరులు గ్ర
హింపరు. పిండోదకక్రియలు జరుగకపోవుటవలన పితరులకు అధోగతి సం
భవించును. 42

సాంకర్యదోషమువలనఁ గులమునకు నరకముగలిగినఁ గలుగుగాక, కు
లమును చెఱచినవారికి నరకమేల యగునందువా ? వర్ణసంకరకారకులైన కుల
ఘ్నుల దోషఫలముగా శాశ్వతములైన వర్ణాశ్రమధర్మములు లోపించును.
వర్ణసాంకర్యంబునకు వర్ణాశ్రమాదిధర్మనాశనమునకుఁ గారణభూతులగుట
వలనఁ గులఘ్నులు నరకము పాలగుదురు. 43

కులఘ్నులకు నరకముగలుగుట యుక్తమేగాని కులమునకు నరకము
గలుగుట న్యాయ్యముగాదందువా? కులధర్మములు జాతిధర్మములు నాశముగా
వించినవారికి నరకవాసము తప్పదు. ఇట్లు నేను కల్పించిచెప్పుటగాదు, శాస్త్రము
లే చెప్పుచున్నవి. వర్ణసంకరకారుని వానికులము రక్షించునదియు, కులము

# గీతాహృదయము.

## రెండవ యధ్యాయము.

అర్జునుని శోకమోహములు మొదటియధ్యాయములోఁ జెప్పఁబడినవి ఆశోకమోహములను బోఁగొట్టునట్టి బ్రహ్మాత్మతత్త్వజ్ఞానము రెండవయధ్యాయములోఁ జెప్పఁబడుచున్నది అర్జునుఁడు శరచాపంబులువదలి రథముమీఁదఁ గూలఁబడెనని మొదటియధ్యాయాంతమునఁ జెప్పఁగా విని 'అర్జునుఁడు యుద్ధమునకు వెఱచెననియు, వాని సారథియైన శ్రీకృష్ణుఁడు తాఁగూడ అందులకు సమ్మతించువాఁడననునిష్కసిద్ధియగుననియు ధృతరాష్ట్రుఁడు తలంచెను వెలిచూపువలె లోచూపుగూడలేక పరమాంధుఁడైన ధృతరాష్ట్రుఁడట్లు భావించుట సంజయుఁడు గ్రహించి వాని చెడ్డతలంపును బాపుటకై చెప్పిన సంగతి వ్యాసమహర్షి చెప్పుచున్నాఁడు

కృపయనునది దీనులయెడఁగలుగుట సహజము ధార్తరాష్ట్రులు దీనులుగారు వారియెడ అర్జునునకుఁ గృపగలిగినది ఇదియెట్లు న్యాయమని శంకింపవచ్చును. అర్జునునికృప లోకసామాన్యమైనదిగాదు, అది కేవలము వ్యామోహరూపమైనది ఈమోహమన్నదో పిశాచమువలె హఠాత్తుగా వానిని పట్టినది కావున దానిని వదలించుట సులభసాధ్యముగాదు ఈకృపాపిశాచముపట్టినందున, పిశాచావేశలక్షణములైన కన్నీరుగార్చుట, దిక్కులేమిగాఁ జూచుట, నిష్కారణముగా దుఃఖించుట మున్నగు వికారములు వానికిఁ గలిగినవి ఇట్లు కృపాపిశాచగ్రస్తుఁడై దుఃఖించుచున్న యర్జునునితోఁ బిశాచోచ్చాటనసిద్ధమంత్రరూపమైన యీ క్రిందివాక్యములు శ్రీకృష్ణుఁడు వచించెను. 1

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! నీవుచెప్పినదెల్ల మోహఫలమేగాని వేఱుగాదు పేరుపొట్టి నీవు శుద్ధస్వభావుఁడవు శుద్ధస్వభావమునకు మోహముగలుగుట వెలుతురునకు చీఁకటి దాపరించుటగదా ఎట్లో నీకిదివచ్చెనో దానికిని సమయాసమయములు వలదా? సమయముగానిసమయమున ఇదిగలిగెను నీకుఁగా

శోకింపవలయునేగాని, నీవన్న స్వజనవధకు శోకింపఁబనిలేదు. మఱియుఁ గరచరణాదులు స్వాధీనము తప్పుట నోరెండుట దేహము వడఁకుట—ఇవి భయ లక్షణములు ఇట్టివి నీచపురుషునకుఁదగును గాని శూరునకుఁ దగవు భయమువలనఁగాదనియు స్వజనులను జంపవలసివచ్చుటకు శోకించుచుంటి మోహగ్రస్తుఁడను గాదనియు నందువా? విద్వాంసులు నీమాట మెచ్చరు ధార్తరాష్ట్రులు ఆతతాయులు, ఆతతాయులను జంపుట ధర్మము క్షత్రియుఁడు ధర్మము తప్పరాదు ధర్మమువలన స్వర్గము, ధర్మము తప్పిన స్వర్గము దూరమగును. స్వర్గము మాట యటుండనిమ్ము కీర్తియైన నగునాయనిన నదియు నున్న కీర్తియుఁ బోయినఁ బోవుఁగాక, అపకీర్తి వచ్చుచున్నది ముక్కంటిని మెప్పించి పాశుపతాస్త్రంబును గొంటివి, నివాతకవచులను బరిమార్చితివి అట్టి నీవు నేఁడు రణమునకు భయపడుట యపకీర్తి గాదా? మోహమెన్ని కడగండ్లు తెచ్చెనో చూడుము 2 పార్థా! వీర్యమును గోల్పోయిన నపుంసకుఁడవు గావలదు దేవతావరప్రసాదంబున జనించిన నీకిది తగదు అనివార్యమందువా? ఆమాట చెల్లదు హృదయదౌర్బల్యరూపమైన యీ యవివేకము కేవలము క్షుద్రమైనది వీరాధివీరులను జయించిన పరంతపుఁడవు నీవు ఈక్షుద్రమును జయింపలేవా? ఉపాయమెఱుంగవా? గుణసందర్శనంబు రాగమునకు, దోషసందర్శనంబు ద్వేషమునకు, హేతువులగును కౌరవులు నీకెన్నో యపకారములొనర్చిరి అవి సారెసారెకుఁ దలపోయుము, వారిపై నీకు ద్వేషము నాటును, మమకారము నశించును 3

కృష్ణా! తండ్రిచని దిక్కులేకున్న మమ్ము భీష్ముఁడు పెంచి పెద్దచేసెను, ద్రోణుఁడు తనకొడుకైన యశ్వత్థామకన్న మమ్ము మిక్కుటముగాఁ బ్రేమించి ధనుర్వేదము గఱపెను కావున వారిరువురు నాకు పూజ్యులు గురువులను బూలతోఁ బూజింపవలయును వినోదార్థముగూడ వారితో వాగ్వాదమే కారాదన రణరంగంబున వారి నెదిర్చి బాణములు విసురుటెట్లు? మఱియు ద్రోణుఁడు బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణవధ మహాపాపము 4

స్వేచ్ఛామరణము యావజ్జీవ నైష్ఠికబ్రహ్మచర్యము సర్వధర్మపరిజ్ఞానము సర్వశాస్త్రపారసంపత్తి అధ్యయనతపోనిష్ఠలుగల గురువులు మహానుభావులుగాని వేఱుగాదు వారిని జంపుట ధర్మమగునా? కాదని వారిని జ[illegible]కు

ఇహలోకభోగములు రావచ్చును అవియు అర్థకామాత్మకములే గాని ధర్మమోక్షములనిచ్చునవి గావు అందుచే బ్రాహ్మణులు అవి నెత్తుటమాగినవే గాని పరిశుద్ధములు గావు కావున యుద్ధముచేయుట అస్వర్గ్యమో కాదో యోచింపుము ఇట్టి నెత్తురుగూడుదినుటకన్న రాజనిషిద్ధమైన భిక్షాన్నముతో జీవించుట మేలుగాదా 5

ఈ నెత్తురుకూడైనను జయింతుమేని మనకు లభించును జయాపజయములు నిశ్చయింపరాదు మఱియు మనము జయించుటో వారు జయించుటో యీ రెంటిలో నేది మనకు మేలో తెలియరాదు ఇవన్నియుం బర్యాలోచింపంగా గురువులతోడి యుద్ధము అనార్యజుష్టమనియు వారిని జంపుట అస్వర్గ్యమనియు, లోకనిందంబడయుట అపకీర్తికరమనియు నా నిశ్చయము గురువులను వదలి తక్కిన ధార్తరాష్ట్రులతో యుద్ధము చేయరాదాయన్న భీష్మద్రోణులను ముందుంచియున్నారు ముందున్న వారిని వదలి వెనుకనున్న వారితో యుద్ధము చేయ సాధ్యముగాదు భీష్మద్రోణులను జంపుదుమేని తర్వాత మనము జీవింపనొల్లము. చచ్చిన తర్వాత రాజ్యాదులేల ? 6

దైన్యము పైకొనుటంజేసి శౌర్యోత్సాహాదిరూపమైన నా క్షత్రియస్వభావము పసిచెడినది దానంజేసి ధర్మమని నీవుచెప్పునది అధర్మముగా నాకుందోఁచుచున్నది. మోహమునకు జిక్కితిని, ఏమియుందోఁపక నిన్నడుగుచున్నాను ఏదినాకు శ్రేయమైన ధర్మమో చెప్పుము ఇదివఱకు నీవుచెప్పిన దానివలన నాకు నిశ్చితముగలుగదు సందేహములు వీడునట్లుచెప్పవలయును చెప్పినది వినలేదని యుపేక్షింపవలదు, నీకు శిష్యుఁడను, శిష్యుని మూఢభావముమాన్పుట గురుధర్మము భీష్మద్రోణులకన్న నిన్ను బరమగురునిగా భావించి 'త్వామేవశరణ'మ్మని శరణుజొచ్చితిని, నాకుం మఱెవ్వరు దిక్కులేరు 7

నా శోకమును మాన్పుటకు నీకన్న సమర్థుఁలేరు యుద్ధము ముగిసిన తర్వాత యీ విచారము చేయవచ్చునందువు గాంబోలు శోకమువలన నా యింద్రియములు ఉడుకుచున్నవి, ఏపనికి శక్తిచాలదు 'జయించినచో సార్వభౌమపదము, చచ్చినచో ఇంద్రపదము వచ్చును, ఎట్లయినను బరమానందము

తప్పను, యుద్ధమే శోకనివర్తకము' అనియందువా ? ఆరెంట నాశోకము తీఱునట్లు లేదు. 8

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

అర్జునుఁడు శ్రీకృష్ణునితో నిట్లుపలికి యుద్ధముచేయుటలేదని తనసిద్ధాంతంబును తెలిపి యూఱకుండెను శ్రీకృష్ణభగవానుఁడు ఎన్నివిధముల బోధించినను అర్జునుఁడు తనమోహమును బాఁయడుగదా ఏమి యాశ్చర్యము ! 9

రాజా ! అర్జునునిమోహము శోకరూపముగా మాఱినది శోకము కొంచెముసేపుండిపోవుట లోకసహజము అర్జునిశోకమట్టిదిగాక మొదటయెన్నోకడఁటఱు న్నైయుండెను ఈశోకము వానికి స్వసేనలోనేయున్నప్పుడు గలిగియుండినచో నెమ్మదిగా దానినిమాన్ప వీలుండియుండును అట్లుగాక శత్రువులమ్రోలనిలిచి యుద్ధమారంభింపఁబోవునప్పుడు హఠాత్తుగా నదిగలిగినది. ఇట్టి సంకటకాలంబున సామాన్యులు చీకాకుపడకమానరు చెంతనున్నది భగవంతుఁడు గావున వానికిది యొకవిషయముగాఁదోఁపలేదు ఆయన అర్జునునిజూచి నవ్వువాఁడువలె నిట్లనియెను నవ్వుటకు సమయమాయని శంకింపవలదు. భగవంతుఁడు నవ్వుటనఁగా దీనులయెడ ప్రసన్నుఁడగుటగదా 10

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా ! ధార్తరాష్ట్రులు ఆతతాయులు గావునఁ జంపఁదగును అట్టివారినిగూర్చి శోకముకూడదు. వారినిగూర్చి శోకింతువు వివేకి యిట్లుచేయఁడు అజ్ఞానివై శోకించుచున్నావనుకొనుటకుఁ బెద్దపండితునివలె వాగింతువు అంతతోనుండక 'ధర్మసంమూఢుఁడను, శిష్యుఁడను ప్రపత్తిచేసితి'నంటివి సరే యని తలంచితిని వెనువెంటనే 'యుద్ధముచేయుటలేదు' అని స్వసిద్ధాంతమును దెలిపితివి నీచర్యలు పరస్పరవిరుద్ధములై నవ్వుపుట్టించును పండితులు చచ్చినవారినిగూర్చిగాని చావుసిద్ధమైయున్నవారిని గూర్చిగాని శోకింపరు అనఁగా జననమరణవిషయిక శోకము జ్ఞానులకుండదు ఏలశోకింపరందువా ? శోచనీయపదార్థమేది ? ఆత్మా ? లేక దేహమా? ఆత్మయందువేని వినుము 11

జరిగినకాలమని జరుగుచున్నకాలమని రాఁబోవుకాలమని కాలము మూఁడువిధములు ఈమూఁడుకాలములందు నశింపక యేదియుండునో యది

శాశ్వతమైనదియగును ఈప్రమాణమునుబట్టి విచారింతము. నేను భూతకాలమున లేనివాఁడనుగాను, నీవును అట్టివాఁడవే, ఈభీష్మాదులును అట్టివారే ఇప్పుడు మనముండుటస్పష్టము ఉత్తరకాలమున నేను నీవు ఈరాజులు మనమెల్లరము నుండక పోనివారముగాము మనము అనఁగా మనయాత్మయని గ్రహింపుము. ఈయాత్మ మూఁడుకాలములందుఁగూడ నశింపకుండును గావున ఇది నిత్యము. నిత్యమైనదానికిఁ జావులేదు చావులేనిదానినిగూర్చి శోకింపుట వెఱ్ఱితనముగదా 12

నేఁడున్నవాఁడు రేపులేకపోవుచుండుటవలన ఆత్మకు జననమరణములు గలవని తలంతువుగాఁబోలు

ఈజననమరణములు దేహమునకేగాని యాత్మకుఁగలుగవు దేహధారులకెల్ల బాల్యము యౌవనము ముదిమి గలుగుచున్నవి ఈయవస్థలెల్ల దేహమునకేగాని దేహములోనుండునట్టి యాత్మకుగాదు దేహమేయాత్మయను భ్రమవలన దేహసంబంధమైన వానిని ఆత్మసంబంధములుగాభావించుక దేహమునకువలె నాత్మకుఁగూడ అవస్థాభేదముమాత్రము గలదు దేహమునకు బాల్యము గడచినతర్వాత యౌవనము, అదిగడచినతర్వాత ముదిమి వచ్చినట్లు ఆత్మకు ఈదేహము పోయినతర్వాత మఱియొకదేహమువచ్చుచుండు. అంతేగాని ఆత్మకు చావులేదు బాల్యముపోయినప్పుడు దేహము నశించుచున్నదా? యౌవనమువచ్చినప్పుడు దేహము మఱల పుట్టివచ్చుచున్నదా? అట్లే ఆత్మకూడ ఈదేహమును వదలునప్పుడు చచ్చుటలేదు ఇంకొకదేహమును పొందినప్పుడు మఱల పుట్టుటలేదు అవస్థలు మాఱుచున్నను దేహమెట్లు నశింపకుండునో ఒకదేహమునువదలి మఱియొక దేహమును పొందినను ఆత్మనశింపకుండును జ్ఞానులకు ఈరహస్యము స్పష్టము గావున వారు జననమరణవిషయమునఁ బ్రమాదముచెందరు 13

నాదుఃఖము ఆత్మనశించునని కాదనియు, బాణమువేసినప్పుడు దెబ్బతగిలి ఆత్మకు బాధకలుగుననియు, భీష్మాదుల యాత్మకు అట్టిదుఃఖము గలిగింపరాదనియు శోకించుచుంటివా? సుఖదుఃఖముల నిత్యత్వమును ముందుగ్రహింపుము.

కన్నులు మొదలగు జ్ఞానేంద్రియములు, చేతులు కాళ్ళు మొదలగు కర్మేంద్రియములు ఈదేహమునందుఁగలవు. కర్మేంద్రియములకు స్వాతంత్రి శక్తిలేదు, జ్ఞానేంద్రియము లెట్లునడపిన అవియట్లు నడచును సుఖదుఃఖములు జ్ఞానేంద్రియసంబంధములు కన్నులు చూచును, చెవులు వినును, ఇట్లు ఒక్కొక్కయింద్రియమునకు ఒక్కొక్క యధికారముగలదు ఒక్కొక్కయింద్రియమునకు దానికిసంబంధించిన వస్తువునకుఁ బరస్పరసంయోగము గలిగినప్పుడు సుఖదుఃఖాములు పొడముచున్నవి. దృష్టాంతము వినుము చెవులకు శబ్దగ్రహణశక్తిగలదు భేరిని వాయించినప్పుడు శబ్దముపుట్టును శబ్దమునకు చెవికి సంబంధము గావున దానిని చెవ్వుగ్రహించును భేరీశబ్దము కటువు గావున వినుటకుఁ గష్టమగును వీణాశబ్దము సుఖమునిచ్చును. ఇట్లు ఇంద్రియములకు వానికిసంబంధించినవిషయములకు సంయోగముగలిగినప్పుడు ఆవిషయముల స్వభావమునుబట్టి సుఖదుఃఖములు గలుగును. ఈసుఖదుఃఖములు వచ్చుచుఁ బోవుచుండునేగాని సదా యట్లేయుండవు భేరీశబ్దమున్నప్పుడు చెవికిఁ గష్టముగానుండును అది నిలిచినప్పుడు ఆకష్టము చెవికుండదు గదా దేహమున్నంతకాలము ఇంద్రియములుండును, ఇంద్రియములున్నంత కాలము విషయములతోడ వానికి సంబంధముతప్పదు, అట్టి సంబంధముగలిగినప్పుడు విషయస్వభావప్రకారము సుఖదుఃఖములు గలుగుచుఁ బోవుచునుండును ఇది సహింపకతీఱదు. అంతేగాని యీసుఖదుఃఖములు ఆత్మసంబంధములని యెన్నడు భ్రమపడవలదు. 14

'సుఖదుఃఖాదు లట్టివేయగుఁగాక, యుద్ధము విరమించినచో భీష్మాదులకు ఎట్టిబాధ గలుగదుగదా' యనియందువా ? ఇప్పుడు నీకు ముఖ్యమైనది మనశ్శాంతిగాని యుద్ధముగాదు మనశ్శాంతిగలిగినయెడల ఏపనిచేసినను తొందరలేదు ఈశాంతి గలుగు టెట్లందువా ? వినుము —

శీతోష్ణములు సుఖదుఃఖములు మున్నగువానిని ద్వంద్వములందురు ఈ ద్వంద్వములెల్ల ఇంద్రియసంబంధములనియు, అవి వచ్చుచుఁ బోవుచునుండుననియు గ్రహించి సహించువేని అవినిన్ను బాధింపఁజాలవు ఇట్టిబాధ నిన్నెప్పుడు కలవరపెట్టఁజాలదో యప్పుడు నీకు మనశ్శాంతిగలుగును. శాంతిగలిగి

నప్పుడు జ్ఞానాధికారివగుదువు జ్ఞానమువలన మోక్షమునకు యోగ్యుఁడవగుదువు. కావున సుఖదుఃఖాదులు మిథ్యలని గ్రహించి వర్తింపుము. 15

మిథ్య అనఁగాఁ గుందేటికొమ్మువలె బొత్తుగానుండనిదని తలంపవలదు ఈలోకములో సత్తు అని అసత్తు అని రెండుగలవు ఎప్పుడు ఎక్కడ చెడక యుండునది సత్తు అనఁబడును ఎప్పుడు ఎక్కడనుండనిది అసత్తు అనఁబడును సత్తు అనునది సర్వకాల సర్వావస్థలయందునుండుఁ గావున దానికి ఉత్పత్తినాశములు గలుగవు అసత్తు అనునది ఎన్నడు ఎచ్చటనుండనిది గావున దానికి ఉత్పత్తియేలేదు. సుఖదుఃఖములు సత్తునకు సంబంధించినవనియందుమా యన్నచో అవి సర్వదా యుండునవిగావు ఇప్పుడు సుఖము, మఱికొంతసేపటికి అదిపోయి దుఃఖము, వచ్చుచుండును అవి అసత్తునకు సంబంధించినవేయని యనుటకు అవి బొత్తుగాలేనివిగావు, వానిని ప్రతిదినము అనుభవించుచున్నాము. కావున సుఖదుఃఖాదులు కుందేటికొమ్మువలె బొత్తుగాలేనివిగావు, సర్వదా యుండునవిగావు. ఇట్టి సందిగ్ధావస్థను మిథ్యయని చెప్పుదుము సుఖదుఃఖాదులట్టి మిథ్యలని యెఱుంగుము సత్తు అసత్తు వీని స్వభావము వట్టి తర్కములవలనఁదెలియదు తత్త్వము (అనఁగా వస్తువులయొక్క నిజస్థితి) యెఱింగిన వారికే యిది గోచరించును 16

' జగత్తత్త్వమునుగూర్చి 'ఆరంభవాదము, పరిణామవాదము, వివర్తవాదము, అని మూఁడువాదములుగలవు '. ఆరంభవాదమును పరమాణువాదమని గూడఁ జెప్పుదురు తార్కికులు ఆరంభవాదులు సాంఖ్యులు పరిణామవాదులు వేదాంతులు వివర్తవాదులు పరమాణువులు పరస్పరము గూడుటవలన జగత్తు ఏర్పడుచున్నదనియు, ఈపరమాణువులు నిత్యములైనవనియు ఆరంభవాదుల వాదము ఈపరమాణువులు అవయవములుగలవియా ? అవయవములు లేనివా ? అని యీవాదముమీఁదఁ బూర్వపక్షము గలుగును పరమాణువులు అవయవము గలవనియందుమేని అవయవముగలవానికి నాశనము తప్పదు గనుక అవి నిత్యములుగా నేరవు నిత్యములుగానివానికలయికవలన నేర్పడిన జగత్తుగూడ నిత్యముగా నేరదు కావునఁ బరమాణువులకు అవయవములుగలవని చెప్పుటకు వలనుపడదు వానికి అవయవములు లేవను పక్షమునఁ

గూడ నాక్షేపముగలదు. వస్తువు లొండొంటితోఁ గలయుటకు అవయవము
లుండవలయును. అవయవములు లేనివానికిఁ గలయిక దుర్ఘటము ఎట్లో కల
యిక గలదందుమపో, ఈకలయిక పూసకుఁ బూసకంటించినట్లుగా నేకదేశి
కమా? పాలలోఁ బాలుకలసినట్లుగా సర్వాత్మకమా? ఎట్లయినను దొల్లిటి
పరిమాణముకన్న వృద్ధియగుచున్నది వృద్ధియనునది షడ్భావ వికారములలో
నొకటి, వికారముగల దానికి నాశనముగలదు కావున జగత్తునకు నాశనము
స్వతస్సిద్ధమగుచున్నది ఎట్లు విచారించినను జగత్తునకు నాశనము తప్పకు
న్నది గావున జగత్తు నిత్యమనెడి ఆరంభవాదము నిలువదు

బ్రహ్మము జగత్తుగాఁ బరిణమించినదని పరిణామవాదము పరిణామ
ముగూడ షడ్భావవికారములలో నొకటిగావునను, వికారముగల వస్తువునకు
నాశనము స్వతస్సిద్ధముగావునను, బ్రహ్మము జగత్తుగాఁ బరిణమించినదని చె
ప్పినప్పుడు బ్రహ్మమునకుఁగూడ వికారముగలుగునని యొప్పుకొనవలసివచ్చును.
అపక్షమున బ్రహ్మమునకుఁగూడ నాశమున్నట్లుగా నేర్పడును బ్రహ్మ
మునకు నాశము పరిణామవాదు లంగీకరింపరు కావున పరిణామవాదుల
వాదము పరస్పర విరుద్ధమగుచున్నది

బ్రహ్మముమాత్రమే సత్యమనియు, జగత్తు మిథ్యయనియు, భ్రాంతివలన
బ్రహ్మము జగత్తుగా వ్యావర్తమైనట్లు తలంతురనియు వేదాంతులవాదము.
చీఁకటిలోఁ ద్రాఁడొకటి పడియుండఁగా దానిఁ ద్రొక్కి పాముగాఁ దలంతుము.
వాస్తవముగా అదిపాముగాదు అది పాముగాదను జ్ఞానములేనందునఁ బాము
గానిదానిని బాముగాఁ దలంచుటయే భ్రాంతియనఁబడును ఈభ్రాంతికి అజ్ఞా
నము కారణము ఈభ్రాంతివలన దేహకంపాదులు జనించుటయు విషమెక్కి
నట్లుండుటయుఁ గలుగుచున్నది నిక్కముగాఁ బాముకఱచి విషమెక్కినచో
వేపాకు తీయగానుండుట మిరియాలు కారములేకుండుట మొదలగు గుణములు
గలుగుచున్నవి త్రాఁటిని ద్రొక్కి పామును ద్రొక్కినట్లు భావించువానికి అది
కఱచినట్లు విషమెక్కినట్లు భావించుచున్నప్పుడు అట్టిభావమున్నంత కాలము
వానికి వేపాకు తియగా మిరియాలు కారములేకుండ అనఁగా నిక్కముగాఁ
బాముకఱచినవానికెట్లో యట్లేయుండును దీపముపట్టిచూడఁగా అది పాము

గాదనియు వట్టి త్రాడనియు నేర్పడినప్పుడు నిజము తెలియుటవలన భ్రాంతిపోవును. భ్రాంతి యెప్పుడు పోవునో అప్పుడు మఱల వేపాకు చేదుగా మిరియాలు కారముగా నుండును దేహకంపాదులు శమించును అనఁగా జ్ఞానమువలన అజ్ఞానము నశించునప్పుడు వస్తుస్వరూపము స్పష్టమగును త్రాడు, భ్రాంతిసర్పము— ఈ రెండింటిలో సర్పభ్రాంతియున్నంతకాలము త్రాడను తలంపే లేదు భ్రాంతి నశించినప్పుడు త్రాడుమాత్రమే సత్యమై శేషించియుండునుగాని సర్పమను సంగతియే యుండదు అనఁగా నెప్పుడుగానీ రెంటనొకటి మిగిలియుండునుగాని రెండు నేకకాలంబుననే యుండఁజాలవు అట్లే జగత్తు సత్యమను భ్రాంతిగలంతకాలము బ్రహ్మమునకు నవకాశములేదు భ్రాంతిదీఱి జగత్తు మిధ్యయని యేర్పడినప్పుడు బ్రహ్మముమాత్రముండునేగాని జగత్తుండుటకు నవకాశములేదు త్రాటికన్న భిన్నమైనది సర్పముగాకున్నను భ్రాంతివలన రజ్జుభిన్నముగా సర్పమును భావించునట్లు బ్రహ్మమునకన్న భిన్నమైనది జగత్తుగాకున్నను అజ్ఞానంబున బ్రహ్మభిన్నంబుగా దానిని భావింతురనియు, జ్ఞానముదయించినప్పుడు భ్రాంతివ్యావర్తకఫలమగు సర్పము తుదకు రజ్జువుగా నేర్పడునట్లు భ్రాంతివ్యావర్తకమగు జగత్తు తుదకు బ్రహ్మముగా నేర్పడుననియు 'ఏకమేవ అద్వితీయ' మనువాక్యంబునకు నిదేయర్థమనియు వివర్తవాదుల వాదము

'సుఖదుఃఖాదులు మిధ్యలగుఁగాక, సత్పదార్థమేది? దానిస్వరూపమెమి?' అని యందువా?

ఆత్మయొక్కటే సత్పదార్థము అది సర్వప్రపంచమును వ్యాపించియుండును ఆత్మవ్యాపనము అధిష్ఠానస్వరూపము, అనఁగా తేనెయందు తీపు వ్యాపించియుండునట్లు సర్వప్రపంచమును ఆత్మ వ్యాపించియుండును. ఆత్మకు నాశమెన్నడు లేదు, అది సర్వకాలసర్వావస్థలయందు నుండును అది అధిష్ఠించియున్న ప్రపంచమునకు మాత్రము వినాశముగలదు ఆత్మకు నాశమేల లేదందువా? అది అవ్యయమైనది, అనఁగా ఎన్నడు తఱుగునదిగాదు
అవ్యయమైన దానికి నాశంబుగల్గింప నెవరి సాధ్యము? 17

ర్జునా ! ఆత్మకెన్నడు చావుపుట్టుకలు లేవు గావున భీష్మాదుల యా
చునని శోకించుట వెఱ్ఱితనమగుట స్పష్టమయ్యెఁగదా ఇక భీష్మాదుల
ు నశించునని దుఃఖింతునందువేని వినుము. ఈ దేహములు ఆత్మకుఁ
బురఖాలువంటివి ఈబురఖాలకు నాశనము స్వభావము నశ్యస్వభావ
దాఁచి పెట్టినను ఎల్లకాలముండవు భీష్మాదుల దేహములను నీవు తాక
తాగిననే అవి యట్టే శాశ్వతముగా నుండఁబోవు అవి నిత్యములనుట
కావున దేహనిమిత్తకమైన శోకము వలదు కొట్టినందున వారికి
రణము గల్గునని శోకింతువా ! స్వధర్మ మాచరించునప్పుడు పరులకు
నఁ గలుగుఁగాక అందులకై శోకింపరాదు. నీవు క్షత్రియుఁడవు,
నీకు స్వధర్మము. స్వధర్మాచరణంబున ఏదిగలిగినను పాపకరము
శోకకరము గానిగాదు. కావున నీకు స్వధర్మమైన యుద్ధమునకు గడం 18

సమస్తక్రియలకుఁ ఆత్మయే కర్తయని అనఁగా ఎల్లపనులను ఆత్మ
ని తార్కికులు చెప్పుదురు ఆత్మయే ఎల్లక్రియలకు గర్మభూతమని
కాదులు వాదింతురు ఒకరిని కొట్టుట తిట్టుట చంపుట మొదలగు
సేయుఁనదిగానీ, వకరివలనఁ గొట్టఁబడుట తిట్టబడుట చంపబడుట మొద
ర్మము లనుభవించునదిగానీ ఆత్మయేయని ఆయుభయుల మతము. ఈ
గలవారు కేవలము అజ్ఞానులు ఆత్మ ఒకరిని జంపదు, ఒకరివలనఁ
డదు, అనఁగా ఏపనిచేయదు, ఏఫలము అనుభవించదు. 19

శరీరముతోడ ఆత్మ పుట్టుటలేదు, ఏలయందువా ! ఆత్మ అజము
పుట్టుకయే లేనిది శరీరముతోడ ఆత్మ చచ్చుటలేదు ఏలయందువా!
త్యము. అనఁగా నాశములేనిది కల్పాదియందేని పుట్టినాయనిన అదియును
కల్పాంతమందైనను అదినశింపదాయనిన అదియును లేదు ఏలయందువా?
శాశ్వతమైనది శరీరము చచ్చినప్పుడు అదిచావకపోయినదో దానిగతి
దువా ! అది పురాణమైనది. అనఁగా ఒకదేహమునువిడిచి మఱియొక
మును పొందుచుండును 20

పుట్టుట, ఉండుట, పెరుగుట, మాఱుట, తఱుఁగుట నశించుట—
కారములు ఆఱుగలవు. ఇందులో ఏదిగలిగినను ఆవస్తువు నిత్యమైన

కానేరదు ఆత్మ అజము అనఁగా దానికి జననవికారములేదు ఎప్పుడుపుట్టు
ట లేదో యప్పుడేడుండుట గూడలేదని స్పష్టము అనఁగా ఆత్మకు స్థితియను
రెండవ వికారములేదు. ఆత్మ నిత్యమైనది, అనఁగా ఏకరూపమునను౦గున
కాఁబట్టి పెరుగుట మారుట లనుమూడవ నాల్గవవికారములు దీనికిలేవు.
ఆత్మ అవ్యయము, అనఁగా క్షయ మను అయిదవవికారము దీనికిలేదు ఆత్మ
అవినాశి అనఁగా నశించుస్వభావమైన ఆఱవవికారము దీనికిలేదు ఇట్లు ఆ
త్మకుఁ పైనఁజెప్పిన వికారములులేవనియు అది కర్తగాదు భోక్తగాదనియు,
అది సర్వసృష్టిని అధిష్ఠించియుండునవియు ఎవఁడెఱుంగునో యతఁడే విద్వాం
సుఁడు సర్వము ఆత్మయైనప్పుడు, చంపునది చంపఁబడునది అను రెండు
పదార్థములే లేనప్పుడు, చంపుట చంపఁబడుట యెట్లు జరుగును ? 21

ఆత్మ నశించునని శోకించుటలేదనియు, కర్మఫలమనుభవించుటకై శరీ
రములు వచ్చుచున్నవనియు, అనుభవింపవలసిన కర్మఫలము పూర్తికాకమును
పే శరీరముపోయినచో శేషించిన కర్మఫలము ననుభవించుటకై మఱల శరీర
ధారణము తప్పదనియు, భీష్మాదు లేయేకర్మఫలము లె కాలమనుభవింపవల
సియున్నదో తెలియదనియు, వారు వారికర్మఫలమును పూర్తిగా అనుభవిం
పకపూర్వమే వారికి శరీరవియోగమును గల్పించుటవలన వారు మఱల గర్భ
వాసాది క్లేశములపాలగుదురనియు, అట్టిక్లేశము నావలన వారికిఁ గలుగనున్నది
గదాయనియు శోకింతునందువా ?

అర్జునా ! ఏకర్మఫలమును అనుభవించుటకై శరీరముపుట్టెనో ఆకర్మ
ఫలమును పూర్తిగా అనుభవించునందాఁక ఆశరీరము తుపాకితో కాల్చినను
నశింపదు అనుభవింపవలసిన కర్మఫలము పూర్తియైన తర్వాత ఆశరీరమును
అమృతములో దాచినను అది ఒక్కనిముసముగూడ ఉండదు. భోగింపవలసిన
కర్మఫలము సమాప్తమైనతర్వాత ఆశరీరముతో ప్రయోజనములేదు, గావున
ఆత్మ దానిని స్వయముగావదలి మఱియొక శరీరమును ఒడయును జీర్ణించిన
వస్త్రంబులనువదలివైచి క్రొత్తవస్త్రంబులను నరులు ధరించునట్లు, జీర్ణశరీరము
లను త్యజించి నూతన శరీరంబులను ఆత్మ దాల్చుచుండును ప్రతిజీవుఁడు
ఎన్నో కర్మములుచేసియు చేయుచునుండును. ఈకర్మములఫలములనెల్ల నిత్యే

వముగా ననుభవించునందాఁక శరీరములు తప్పవు 'శరీరములు వస్త్రముల వంటివగునేని, వస్త్రము తగులఁబడినప్పుడు శరీరముగూడ తగులఁబడి నశించును అదేప్రకారము శరీరమును దగులబెట్టినప్పుడు దానితోఁగూడ ఆత్మ నశింప దా'యని యందువా ? 22

ఆత్మను ఖడ్గాదులు ఖండింపఁజాలవు , అగ్ని కాల్పఁజాలదు , నీరు తగపసేరదు , గాలి శుష్కింపఁజేయఁజాలదు. 23

ఏలయందువా ? ఆత్మ నిత్యము అనఁగా సర్వదా ఏకరూపమునయుండు ను , సర్వగతము అనఁగా ఆకాశమువలె ఎల్లెడల వ్యాపించియుండును , స్థాణువు అనఁగా ఎట్టి వికారమును బొందునదిగాదు , అచలము—ఒకచోటనుం డి మఱియొకచోటికిఁ గదలునదిగాదు , సనాతనము—అనాదినుండి యున్నది ఈగుణములలో ఏయొక్కగుణమున్నను దానిని ఖండించుటకుఁగాని, దహించు టకుఁగాని, నానపెట్టుటకుఁగాని, శుష్కించుటకుఁగాని సాధ్యముగాదు. ఈ యన్నిగుణములు ఒకదానియందే చేరినప్పుడు దానిసంగతి చెప్పవలయునా ? 24

మఱియొక కారణముగూడ వినుము ఏదియైనను గంటికిఁ గనఁబడునేని దానిని ఖండించుటకు దహించుటకు తడుపుటకు ఎండపెట్టుటకు సాధ్యమగు ను ఆత్మ అవ్యక్తము అనఁగా కంటికిఁ గాన్పించునదిగాదు అట్టిదానిని ఖండిం చుట దహించుట యెట్లు ? ఆత్మ కంటికిఁ గాన్పింపకున్నను మనస్సుతో నిట్టిదని చింతించుదమన్న అది మనస్సునకుఁగూడ అందదు. కంటికిఁ గాన్పిం పనిదానినే ఖండింప సాధ్యముగాదనఁగాఁ జింతించుటకుఁగూడ సాధ్యముగాని దాని సంగతి చెప్పవలయునా ? ఆత్మ అవికార్యమైనది అనఁగా అవయవము లు లేనిది అవయవములున్న ఖండింపనగును అవయవములే లేనిదానిని ఖం డించుటెట్లు ? ఇట్లు ఆత్మ నిత్యము, సర్వగతము, స్థాణువు, అచలము, సనా తనము, అవ్యక్తము, అచింత్యము, అవికార్యము గావున ఛేదించుటకు దహిం చుటకు మఱియేమిచేయుటకుఁగూడ సాధ్యముగాదు దేహమునకు ఏమిసం భవించినను ఆత్మకుఁ గించిన్మాత్రముగూడ తగులదు. కావున ఆత్మనుగూర్చి శోకింపఁ గారణములేదు. 25

అర్జునా ! ఆస్తికబుద్ధిగలవారెవ్వరును ఆత్మకు జననమరణాదులున్నవని తలంపరు ఒకవేళ లోకవాసనవలన అట్టి తలంపుగలిగినను అంతమాత్రముననే నీవిట్లు శరచాపంబులు విసర్జించి దుఃఖింపఁదగదు. 26

ఆత్మకు జననమరణములున్నవను పక్షమునఁగూడఁ దన్నాశనంబునకై యేలదుఃఖింపరాదందువా ? పుట్టుట గిట్టుటకే యన్నట్లు పుట్టుకగలదానికి మరణము తప్పదు కావున జననమరణంబులను దప్పింప సాధ్యము గాదు చచ్చినవాఁడు మఱలఁ బుట్టక మానఁడు. ఏలయందువా ? కర్మము చేయని ప్రాణియుండఁడు చేసిన కర్మములను అనుభవింపక తీఱదు. కర్మానుభవార్థము శరీరములు వలయును. కావున మఱలజన్మము వచ్చియేతీఱును కర్మము నిశ్శేషమైనగాని యవి మానవు గావునన్ని అందాక యవి చక్రము వలెఁ దిరుగుచు ననివార్యములై యుండు గావునను అసాధ్యమైనదానికి శోకించుట వ్యర్థముగదా ఆత్మ నిత్యమన్నను అనిత్యమన్నను ఉభయపక్షము లందును శోకింపఁ గారణములేదని యిప్పుడేని స్పష్టమా ? 27

శరీరములు పంచభూతసమ్మేళనంబునఁ గలుగుచున్నవి ఈసమ్మేళనమునకుఁబూర్వము శరీరమనునదే లేదు ఈపంచభూత సమ్మేళనమునే ఉత్పత్తి యందురు. ఉత్పత్తియైన తర్వాత మరణపర్యంతముగల యీమధ్యకాలములో శరీరములు గానవచ్చుచుండును మరణము అనగా పంచభూతములు మఱల విడివడి తమతమ స్థానములఁ జేరుట అట్లు మరణము గలిగినతర్వాత శరీరములు మనకుఁ గాన్పింపవు ఈశరీరముల స్థితిగతులు స్వప్నములోఁ గాంచిన వస్తువుల స్థితిగతులవలెనుండును స్వప్నములో ఒకవస్తువునుజూచి మేల్కాన్నతర్వాత అది గానరానందున దానికై శోకింతుమా ? అట్లే యస్థిరములైన యీశరీరములను గూర్చిగూడశోకింపరాదు 28

'ఆత్మనుగూర్చి యేలశోకింతురందువా ? అజ్ఞానంబువలన శోకింతురు. అజ్ఞానమెట్టిదియందువా ? 'నేను' అనునది యాత్మగాదు ఆత్మగాని దానిని ఆత్మగాభావించుటయే యజ్ఞానము. ఆత్మనెఱుంగు టెట్లందువా ?' ఆత్మకు రూపములేదు, వికారములేదు. అది కంటికి గోచరింపదు ; మనస్సునకు అందదు. శ్రుతులవలనను గురూపదేశమువలనను దాని నెఱుంగ

నగుచు ఎవఁడు తనకర్మములనెల్ల నశింపఁజేసి ముక్తావస్థకువచ్చునో వానికిమాత్రమే ఆత్మ గోచరించును అతఁడుగూడ ఆత్మను గొప్పవింతగాఁ జూచునేగాని వేఱుగాదు ఆత్మ యిట్టిదనిచెప్పుటకు మాటలుచాలవు. కాఁబట్టి ఆత్మను జూచినవాఁడుగూడ దానినిగూర్చి చెప్పునప్పుడు వింతవింతగాఁ జెప్పునేగాని యిది యిట్టిదని చెప్పనేరఁడు ఆత్మనుగూర్చి చెప్పువాఁడెవఁడో యొకఁడు పుణ్యవశంబున తటస్థించినను, చెప్పువాఁడెంత వింతగాఁజెప్పునో వినువాఁడుగూడ అంత వింతగానే వినును ఎవరెంతజెప్పినను ఎవరెంత విన్నను ఆత్మ తత్త్వమును సమగ్రముగా గ్రహింపలేరు ఏలయందువా? చూచుట చెప్పుట వినుట—ఇవియెల్ల ఇంద్రియముల కార్యములు ఆత్మ ఇంద్రియములకు అతీతమైనది కావున ఆత్మవిషయమున ఇంద్రియములుపయోగింపవు. అట్లయినచో ఆత్మనుజూచు టెట్లందువా? ఆత్మదర్శనమునకు ధ్యానమొక్కటే సాదనము అదితప్ప మఱియొకటిలేదు 29

అర్జునా! సమస్తప్రాణుల దేహములను వధింపవచ్చునుగాని, ఆ దేహముల నధిష్ఠించియుండునట్టి ఆత్మనువధింప సాధ్యముగాదు. ఏలయందువా? ఆత్మ నిత్యమైనది, నిత్యమైనదానికి నాశనములేదని పైన నిరూపించితిని కాఁబట్టి, యేప్రాణినిగూర్చియైనను నీవు శోకించుటకు ఎట్టికారణమును లేదు సుమా. 30

‘శోకింపరానివారినిగూర్చి శోకించుచున్నావు’ అని శ్రీభగవానుఁడు 11-వ శ్లోకములోఁజెప్పినాఁడు అందులకుఁగల కారణంబులను పై ఇరువది శ్లోకములలో నిరూపించినాఁడు ‘ప్రజ్ఞావాదములను భాషించుచున్నావు’ అనునది భగవంతుని రెండవ యాక్షేపము అందులకుఁగల కారణములను ఈ క్రింది ఎనిమిది శ్లోకములలో నిరూపించుచున్నాఁడు

అర్జునా! నీశంకను తత్త్వదృష్టితో విమర్శించి నిరసించితిని. లౌకిక దృష్టితో విమర్శించినచో నీసందేహము ఎంతమాత్రము నిల్చునో చూతము నీవు క్షత్రియవంశంబున జన్మించితివి రాజ్యము సంపాదించుట పరిపాలించుట శత్రువులను వధించుట క్షత్రియులకు స్వధర్మము నీధర్మమును సేవచేయక

తెలుదు అందులకు భయపడెదవేల ? ధర్మ్యమగు యుద్ధముకన్న శ్రేయ
స్కరమైనది క్షత్రియునకు మఱొక్కటిగలదా ? 31

అర్జునా ! ధర్మశాస్త్రమునుబట్టియేగాక శిష్టాచారమునుబట్టిగూడ నీకు యుద్ధము కర్తవ్యము యుద్ధమును నీవు కోరలేదు అది యప్రార్థితముగా వచ్చినది. మఱియు ఈయుద్ధము నీగురువులగు భీష్మ ద్రోణాదుల కొఱకు వచ్చినదిగాదు, దుర్యోధనాదుల నుద్దేశించివచ్చినది దుర్యోధనాదులు ఆతతాయులు ఆతతాయులు వధ్యులు, అట్టివారితో భీష్మద్రోణులు చేరిరి సర్వశాస్త్రములెఱింగియు నిట్లు చేయుటవలన భీష్ముఁడు ద్రోణుఁడు ధర్మము నతిక్రమించినవారైరి. ధర్మమునెవరుల్లంఘించినను వారువీరనక శిక్షించుట రాజధర్మము ఇదియునుంగాక ధర్మ్యమైన యుద్ధము క్షత్రియులకు తలుపుతెఱచిన స్వర్గద్వారమువంటిది అనఁగా ఇట్టి యుద్ధములలోఁ జచ్చినవారు నిరాటంకముగా స్వర్గమునకుఁ జనుదురు ఇట్టి యుద్ధములు పుణ్యాత్ములకుఁదప్ప అందఱకు లభింపవు 32

ధర్మ్యమైన ఈయుద్ధమును నీవుచేయనిచో ధర్మము నుల్లంఘించినవాఁడవగుదువు, అది నీకు పాతకమగును కర్మములు నిత్యములు నైమిత్తికములు అని రెండు విధములనియు, ఈనిత్యనైమిత్తికకర్మములను జేయకున్నచో పాపము గలుగుననియు, యుద్ధము సంధ్యావందనాదులవంటి నిత్యకర్మముగాదు, నైమిత్తిక కర్మమునుగాదనియు, రాజ్యలాభమునగోరి చెయవలసిన కర్మముగానున్నందున అది కేవల కామ్యకర్మమగుననియు కామ్యకర్మములను జేయకున్నచో పాపముగలుగదనియు వాదింతువా ? కామ్యకర్మమైనను ప్రారబ్ధమగునేని నిత్యకర్మమేయగును యుద్ధమును నీవు కోరి తెచ్చికొనియున్న యెడల అది కామ్యకర్మమగును. నీవు దానిని కోరలేదు, కాలవిశేషంబున అది సంభవించినది ప్రారబ్ధమైన కర్మమును పరిసమాప్తముచేయుట ధర్మము ధర్మమును మానుట పాపముకదా కావున నీవిప్పుడు నీకు ధర్మమగు యుద్ధముచేయకని నీవు సంపాదించిన కీర్తియెల్ల నశించును స్వధర్మహానికీర్తి నాశనములకుఁ దోడగా పాపమును గూడ పొందుదువు 33

యుద్ధమునుమానుటవలన నీకున్న కీర్తిపోవుటయే కాక, 'అర్జునుఁడు పిఱికి

పందె' అను నపకీర్తివచ్చును. ఈయపకీర్తి యొకనాఁటితోఁ బోవునదిగాదు, కలకాలముండును. సమయమువచ్చినప్పుడెల్ల తరతరములవారు నీసంగతి చెప్పుచుందురు అంతియగాదు, పరలోకములోఁగూడ నిన్ను దేవర్షులు నిరసింతురు. యుద్ధములోఁ జత్తువేని నీచావువలని దుఃఖము కొన్నినాళ్ళలోనే మాసిపోవును. ఉభయలోకములలో నిట్టి తీఱని యపకీర్తి నొడికట్టుటకన్న సంభావితుఁడు అనఁగా ఆత్మగౌరవము గలవాఁడు మరణమే మేలని గ్రహించును　　34

దుర్యోధనాదులమీఁదఁ గలిగిన కృపవలన యుద్ధము మానితినేగాని భయపడిగాదందువా? అర్జునా! దుర్యోధనాది మహారథులట్లు తలంపరు భయమువలననే యుద్ధముమానితివని వారు తప్పక భావింతురు. కృపగలవాఁడవేని యుద్ధమే తలపెట్టరాదు ఉభయసేనలు సమావేశమై యుద్ధమారంభము కాఁబోవుచుండఁగా ఇప్పుడు నీవు యుద్ధమువూనినచో (అర్జునుఁడు దుర్యోధనాదులపై కృపగలిగి యుద్ధము చాలించెనని వెఱ్ఱివారైనను దలంతురా? 'ఘోషయాత్రా గోగ్రహణాదులందు నాపరాక్రమెఱుంగరా? ఇప్పుడు వారు నన్ను చుల్కనగాఁ బల్కినంతనే నేను పరాక్రమహీనుఁడనగుదునా?' అనియందువా? ఏనోట నీవు నాఁడు బహూకరింపఁబడితివో యానోటనే నేఁడు నీవు పరిహసింపఁబడుదువు, వూలయంగడియందు కట్టెలు విక్రయించుటగును　　35

మహారథులలోఁ గొందఱు మధ్యస్థులు కొందఱు శత్రువులున్నారనియు, మధ్యస్థులు నిందించిన నిందింపవచ్చుఁగాని శత్రువులుమాత్రము నిందింపరనియు, నేను యుద్ధముచాలించుట ధార్తరాష్ట్రులకు మేలేగాని కీడుగాదనియు, మేలు చేసినను నిందింతురాయనియు తలంతువుగాఁబోలు మధ్యస్థులు లోలోన నిందింతురు, శత్రువులు పలుకరాని బూతులు తిట్టుదురు 'తొల్లిఁటి నా సామర్థ్యమెఱుఁగరా'యని యందువా? దానిని గప్పివుచ్చుటకుఁగూడ లేని కథల కల్పించి చెప్పుదురు. 'యుద్ధముమానిన అపకీర్తి తప్పదు, యుద్ధము చేసినచో గురువధదోషము తప్పదు ఒకవేళ నోడిపోతినా ఛీ! అర్జునుఁడెంతమూఢుఁడు. పరశక్తితలంపక మిడుతవలె మిట్టిపడి చచ్చినాఁడు' అని

యందును నీమిచేయవలయునందువా ? ఈటిందాదుఃఖములకన్న మహత్తర మైనది మఱియొకటిగలదు ప్రతిపురుషునకు స్వధర్మాచరణము ప్రధానము. ధర్మమును తప్పినచో పరలోక హానియగును ఏదియైనను సహింపవచ్చుంగాని పరలోకహాని సహింపరాదు అంతకన్న దుఃఖతరమైనది మఱియొకటిలేదు. ఆసంగతి మఱువవలదు. 36

అర్జునా ! 'ఏదినాకు మేలో తెలియకున్నా' నంటివి అందులకు సమాధానము వినుము యుద్ధమునఁజచ్చితివేని స్వర్గమునొందుదువు , జయింతు వేని రాజ్యభోగంబులను బడయుదువు ఎట్లు విచారించినను యుద్ధమే నీకు శ్రేయస్కరముగానున్నది. కాఁబట్టి మనస్సును నిశ్చయముచేసికొని యుద్ధమారంభింపుము 37

'సకామునకు అనఁగా కోరికగలవానికి యుద్ధముచేయుట రాజ్యాదులనుభవించుట కర్తవ్యమనుట సమంజసమేయనియు, నిష్కామునకు అనఁగా ఎట్టి కోరికలేనివానికి అనఁగా మోక్షము నే యపేక్షించువానికి యుద్ధమెట్లు కర్తవ్యమనియు'నందువా ? మోక్షము సంపాదించుటకు వైరాగ్యము ప్రధాన మనుట నిజమే కాని ఆవైరాగ్యము సోపాధికముగా అనఁగా ఏదోయొకనిమిత్తమునఁ గలిగినదిగా నుండరాదు , నిరుపాధికముగా స్వతముగాఁ బుట్టినది గానుండవలయును సోపాధిక వైరాగ్యమైనచో ఉపాధి అనఁగా కారణము నశించినంతనే వైరాగ్యముగూడ నశించును నిరుపాధిక వైరాగ్యము హఠాత్తుగాఁ గలుగదు ఎంతో యభ్యాసమువలన దానిని సాధింపవలయును ఈయభ్యాసమువలన మొట్టమొదట బుద్ధిసమత్వము సిద్ధించును. బుద్ధిసమత్వమనఁగా మంచిగలిగినప్పుడు సంతోషముగానీ చెడ్డగలిగినప్పుడు దుఃఖముగానీ లేకుండుట. జయము, దానివలనలాభము, దానివలన సుఖము గలుగును అట్లే అపజయము, దానివలననష్టము దానివలన దుఃఖముగలుగును జయాపజయములు లాభాలాభములు సుఖదుఃఖములు వీనియందుమనస్సునుంచక స్వధర్మమునందే దృష్టి నిలిపి ప్రాప్తమగుకర్మమును చేయుము. అట్లుచేయుదువో నీకుబుద్ధిసమత్వము సిద్ధించును; సుఖదుఃఖాది ద్వంద్వములను దాఁటినవాఁడవగుదువు , నీవైరాగ్యము నిరుపాధికమగును , కామమేయుండదు. కామము (అనఁగా కోరిక) లేనినాఁడు నీవు

చేయు కర్మముయొక్క ఫలము నీకుఁ దగులదు ; కర్మఫలమంటనినాఁడు ఫలానుభవమునకే అవకాశములేదు , అనుభవింపవలసిన ఫలములేనినాఁడు జన్మమెత్తవలసిన కారణములేదు ఇదే మోక్షము కర్మతత్త్వముయొక్క యీ పరమరహస్యమును గ్రహించి నీధర్మమును అనఁగా యుద్ధమునుచేయుటకు పనికట్టుము కర్మరహస్యమెఱిఁగి వర్తించువానికిఁ బాపముగలుగదు , కలుగుట కవకాశములేదు 38

శ్రీకృష్ణభగవానుఁడు 11-వ శ్లోకము మొదలు 38-వ శ్లోకము వఱకు ఆత్మతత్త్వజ్ఞానము నుపదేశించినాఁడు ఆత్మతత్త్వజ్ఞానమునకుఁ గర్మయోగము సాధనభూతము గానున్నది. ఆకర్మయోగము నిఁక నుపదేశింపఁబోవుచు, తన యుపదేశమును వినునట్టి జనులకు మనస్సు కలవరమొందక సమాధానపడుటకై చెప్పినదానిని జ్ఞాపకార్థము పల్కరించుచుఁ జెప్పనున్నదానిని ప్రారంభించుచున్నాఁడు

అర్జునా ! ఉపనిషత్తుల ప్రకారము ఆత్మతత్త్వమును జెప్పితిని ఆత్మతత్త్వమును గ్రహించుటకు బుద్ధిసమత్వము ముఖ్యమని తెలిపితిని. దీనినే సాంఖ్యయోగమందురు. ఆత్మతత్త్వజ్ఞానమునకు పరమేశ్వరారాధన రూపమైన కర్మయోగము ఉపాయభూతముగానున్నది అట్టి కర్మయోగమును గూర్చి చెప్పెదు వినుము సుఖదుఃఖాది ద్వంద్వములను దాఁటవలయును ; బుద్ధిసమత్వమును సాధింపవలయును , చేయుకర్మములెల్లఁ పరమేశ్వరారాధనము కొఱకేగాని స్వలాభార్థముగాదని నిశ్చయించుకొనవలయును ఇట్లు ఏకర్మము చేసినను అది నిష్కామకర్మము అనఁగా ఫలాభిలాషలేని కర్మమగును కర్మములకు ఫలము స్వతస్సిద్ధమైనను ఆఫలమును కర్త కోరనప్పుడు అది వానికి సంక్రమింపదు , పరార్థమగును ఫలము కర్తకుఁ జెందనినాఁడు కర్మములు బంధకములు గావు , అనఁగా ఆకర్మములవలనఁ గలుగుఫలముల ననుభవించుటకై కర్త జన్మములెత్తవలసిన యావశ్యకముండదు. 39

"కర్మములకు లెక్కలేదు , వేనవేలున్నవి , ఆయుష్కాలమెల్ల వినియోగించినను ఎల్లకర్మములను జేయుటకు సాధ్యముగాదు , ఎల్లకర్మములు నిష్కామబుద్ధితో ననుష్ఠింపనిదే కర్మయోగము పూర్ణముగాదు , పూర్ణము

కాని కర్మయోగమువలన జననమరణరూపమైన బంధము నశించుననుట సరిగాదు' అని యందువా ? అట్లయిన వినుము

కర్మయోగమనఁగా పరమేశ్వరారాధనార్థమైనట్టియు నిష్కామ కర్మానుష్ఠానరూపమైనట్టియు పరమధర్మముగాని మఱియొకటిగాదను సంగతి మొట్టమొదట స్పష్టముగా గ్రహింపుము కర్మయోగము మోక్షార్థముగాని భోగార్థముగాదు. మోక్షార్థమైన యీకర్మయోగమును ప్రారంభించినంతనే యది ఫలమిచ్చును. మఱియు తుదివఱకు నిర్విఘ్నముగానిది జరుగకపోయినచో నిష్ఫలమగునను భయము వలదు ఎంతచేసిన అంత ఫలమిచ్చును స్వర్గాదులనుగోరి చేయు కర్మములు లౌకికములైన కృషి మొదలగు కర్మములు వైదికములైన యాగాది కర్మములు అట్టివిగావు ఈకర్మములను సమగ్రముగాఁ జేయనిచో అవి ఫలమునీయవు ఇట్టికర్మములం జేయుటయందు అంగలోప మేమాత్రముగల్గినను పాపముగూడ సంభవించును కర్మయోగమునకుఁ గామ్యకర్మములకుగల తారతమ్య మిదేసుమా నీవుచెప్పినట్టి వేనవేలఁ కర్మములు కామ్యకర్మములు. అవియన్ని చేయుటకు ఒకజన్మమే గాదు , వేనవేలు జన్మములైనను జాలవు చేయుకొలఁది అవి పెచ్చుపెరుగుచుండును వానిననుభవించుటకై జన్మము లావశ్యకములగుచుండును కాఁబట్టి వానినిబట్టి ప్రాకులాడిన ఫలములేదు ఆకర్మములవలన మోక్షము సిద్ధింపదు. యథాశక్తి యీశ్వరారాధనభావముతో అంతగాని కొంతగాని చేయుకర్మము మోక్షదాయకమగును 40

సాంఖ్యబుద్ధియని యోగబుద్ధియని 38-వ శ్లోకములోఁ జెప్పితిని అందు సాంఖ్యబుద్ధివలనఁదప్ప మఱియొకదానివలన మోక్షముగలుగదని శాస్త్రసిద్ధమంటిని ఇప్పుడు యోగబుద్ధివలన మోక్షముగలుగునని చెప్పుచున్నాను దానంజేసి మోక్షసంపాదనమునకు ప్రత్యేకమైన మార్గములు రెండున్నవని భ్రమింపవలదు. సాంఖ్యబుద్ధి యనగా బుద్ధిసమత్వమని గ్రహింపుము బుద్ధిసమత్వముగలుగుటకు మొట్టమొదట చిత్తము శుద్ధికావలయును ఈచిత్తశుద్ధి యోగబుద్ధివలన అనగా నిష్కామకర్మమువలనఁ గలుగును కావున యోగబుద్ధి అనగా నిష్కామ కర్మయోగము, సాంఖ్యబుద్ధికి అనఁగా సాంఖ్యయోగ

షునకు సాధనమై తదంతర్భావముగానున్నది మోక్షమునకు సాంఖ్యబుద్ధియే కారణము అంతేగాని సాంఖ్యబుద్ధియని యోగబుద్ధియని మోక్షమునకు రెండు స్వతంత్రమార్గములు లేవు వ్యవసాయమనగా 'సాధింపవలసిన వస్తువు ఇది, ఈవస్తువును సాధించుటకు ఇది సాధనమగును' అనెడి నిశ్చయము మోక్షశాస్త్రమందు సాధింపవలసిన విషయమేది యన్నచో సమబుద్ధి యని యెఱుంగుము, దీనిని సాధించుటకు సాధనమేదియన్నచో యోగబుద్ధియని గ్రహింపుము అనగా సాంఖ్యయోగము సాధ్యము, దానికి కర్మయోగము సాధనము ఇట్టి సాధ్యసాధన నిశ్చయముగల బుద్ధి యిట్లునట్లు చలింపక ఏకాగ్రముగానుండును, వెడత్రోవలకు బోదు ఇట్టి నిశ్చయము లేని బుద్ధిని అవ్యవసాయాత్మికబుద్ధి యందురు ఆబుద్ధికి నిలుకడలేదు, కోరికలవెంటఁ బరుగెత్తుచుండును. వ్యవసాయాత్మికబుద్ధి మోక్షమునకు హేతువగును; అవ్యవసాయాత్మికబుద్ధి కోరికల ఫలములనుభవించుటకుగా పెక్కుజన్మములకుఁ గారణమగును వ్యవసాయాత్మికబుద్ధిగలవారు నిష్కామకర్మము ననుష్ఠించి దానిమూలకముగ జ్ఞానమును, జ్ఞానమువలన మోక్షమును బడయుదురు అవ్యవసాయాత్మిక బుద్ధిగలవారు సకామకర్మములననుష్ఠించుచు తత్ఫలమనుభవించుటకై పుట్టుచు జచ్చుచునుందురు 41

అర్జునా! వేదములలో ఏకదేశీయములగు కొన్ని బుక్కులుగలవు ఆబుక్కులను ఆధారపఱచికొని భోగభాగ్యములను సంపాదించి యనుభవింపవలసినదనియు, ఇంతకుమించినది మఱేదిలేదనియు, ఈసంగతిని ప్రమాణభూతములైన వేదములే చెప్పుచున్నవనియు, స్వర్గమే పరమపురుషార్థమనియు కొందఱు గట్టిగా వాదింతురు ఇట్లు వాగునట్టివారి మాటలు నమ్మి జనులు మోసపోదురు 42

భోగైశ్వర్యములే పరమార్థమని శ్రుతితాత్పర్యముగాదు. కొందఱట్లేల చెప్పుదురందువా? అట్లు చెప్పువారు కామాత్ములు అనఁగా కోరికలకు లోబడినవారు అందువలన వారు తమమతమునకు సరిగా శ్రుతులకిట్లు అపార్థమును సాధింతురు కామపరతంత్రములగు కర్మముల నొనర్చినప్పుడు తత్ఫలమును కర్త అనుభవింపక తీఱదు, ఫలానుభవమునకు జననమరణములు తప్పవు

మఱియు భోగైశ్వర్యములకై చేయు కర్మములు పెక్కువిధములు, కర్మము
లనుబట్టి ఫలములును పెక్కువిధములుగానుండును ఈకర్మములొనర్చు
టకు ద్రవ్యసంపత్తి యెంతో కావలయును, అది సంపాదించుటకెంతో కష్ట
పడవలయును. కోరికలకు అంతములేదు, గావున ఒకరొకటిచేసి యొకఫల
మును సంపాదించినప్పుడు రెండవవాఁడు అంతకన్న మిక్కిలియైన ఫలమును
సంపాదింప యత్నించును మొదటివాఁడు రెండవవానికి అసూయపడును
అట్లు వారికి పరస్పరద్వేష మారంభమగును ఈద్వేషమువలన లేని దుఃఖములు
వచ్చును. 43

భోగైశ్వర్యంబులందు లంపటులై యవే పరమార్థముగా భావించి యా
దోరణిలోఁబడి పోవువారికి పరమేశ్వరునియందు ఏకనిష్ఠ అనగా చిత్తైకాగ్ర్య
ము కుదురదు ఏలయందువా? వారిబుద్ధి కోరికలవెంట తత్ఫలములవెంట
పరుగిడుచుండును, దానంజేసి పరమాత్మునింగూర్చి విస్మృతినొందును 44

అర్జునా! సత్త్వము రజస్సు తమస్సు అని గుణములు మూడుగలవు
ఈమూఁడు గుణములవలన సమస్త సృష్టియేర్పడుచున్నది సత్త్వము ఉత్తమ
మైన గుణము, రజస్సు మధ్యమము, తమస్సు అధమము తమోగుణవం
తులు రజోగుణవంతులుగా రజోగుణవంతులు సత్త్వగుణవంతులుగా మాఱవల
యును కర్మములు నాచరించినగాని యీమార్పుగలుగదు అట్లు మాఱుటకు
వారివారికి అనుకూలములగు కర్మములుగలవు అట్టి కర్మములను వేదము
బోధించును రజోగుణము రాగమునకు మూలము, తమోగుణము ద్వేష
మునకు మూలము ఈరాగద్వేషములను జయించినగాని శుద్ధసత్త్వము గలు
గదు వానిని జయించుటెట్లనగా? ప్రతిప్రాణియందు ఈమూఁడు గుణ
ములు మిశ్రమైయుండును ఒక్కొక్కగుణమునకు ఒక్కొక్కవిధమైన
ఆహారము వ్యవహారము ఉద్దీపకముగానుండును ఏగుణమును తగ్గింప తలంతు
రో యాగుణమునకు ఉద్దీపకములైన (అనగా అతిశయముచేయునట్టి) ఆహార
వ్యవహారములను వర్జింపవలెను, ఏగుణమును వృద్ధిచేయఁదలంతురో దానికి అను
కూలమగు ఆహారవ్యవహారములు గ్రహించుచున్నచోఁ గాలక్రమమునఁ దలఁ
చిన ఫలము సిద్ధించును మనుష్యులకు మోక్షము పరమార్థము మోక్షమునకు

సత్త్వగుణము ప్రధానము. సత్త్వగుణమును పైనఁజెప్పినట్లు ఆహార వ్యవహార నియతివలన అభివృద్ధిపఱచుకొనలదిఁ రజస్తమోగుణములు తగ్గి పాముపడగక్రింద గప్పవలెనుండును కావున రాగద్వేషాది ద్వంద్వముల జయించి శుద్ధసత్త్వ గుణముగలిగి యోగక్షేమముల సంగతిగూడ మఱచి పరమేశ్వరుఁడే సమస్తము చేయునను విశ్వాసముతోనుండును పూర్వము లేనివస్తువు లభించుట యోగ మందురు, ప్రాప్తమైనదానిని రక్షించుకొనుట క్షేమమందురు. ఈయోగక్షే మములవంక మనస్సు ద్రిప్పితివేని రాగద్వేషములకు అవకాశమిత్తువు, తుట్ట తుదకు అధోగతిపాలగుదువు యోగక్షేమములను వదలినయెడల జీవయాత్ర జరుగుట యెట్లుండువా ? ఆభారమును భగవంతుఁడు వహించును అభయ ము వలదు. 45

ఎల్లవిషయములకుఁ బ్రమాణభూతమ్మైయుండియు వేదములిట్లు బహు విధమ్మైన యర్థములకుఁ ధర్మములకు నవకాశమిచ్చుట తగునాయని యడుగు దువా ? లోకములో బావులు నడబావులు తటాకములు నదులు మున్నగు జలాశయము లెన్నోగలవు. దప్పిగొన్నవాఁడు వాని యాతురతనుబట్టి యేది చేరువగానుండునో దాని నియదాప్రగి దప్పతీర్చికొనును అట్లె వేదములలో సత్త్వరజస్తమోగుణములకు మూడింటికిఁ దగిన కర్మములు చెప్పఁబడియున్నవి. వ్యవసాయాత్మికబుద్ధిగలిగి మోక్షాపేక్షతోనుండువాఁడు అందుకుఁదగిన యీశ్వరారాధనరూపమైన నిష్కామకర్మములనే వేదములనుండి గ్రహించును ఇతరులు వారివారి గుణములకు ననుకూలములైన కర్మములను గ్రహింతురు ఈకర్మముచేసినచో ఈఫలమగుననిమాత్రము వేదములు చెప్పును. అంతేగాని యీకర్మములనే చేయవలయుననియవి నిశ్చయింపవు జనులు వారివారి గుణ ములనుబట్టికర్మములను స్వీకరింతురు 'ఎల్లరు వేదములలోఁజెప్పిన సమస్తకర్మ ములు చేయక యందుఁ గొన్నిమాత్రమే చేసినయెడ, తక్కినకర్మములను బరిత్య జించినట్లు కాదాయనియు, అపకృమునఁ గర్మములెల్లజేయనివారికి వేదనిందా దోషము రాదాయనియు' శంకింతువుగాఁబోలు అంగడిలో విక్రయార్థము నాలుగురకముల పండ్లనుంతురు ప్రతిపురుషుఁడు నాల్గురకముల పండ్లను గొన వలయునని నియమములేదు ఎవరికిచ్చవచ్చినపండ్లు వారుకొందురు. అందఱు

అన్ని రకముల పండ్లను గొనలేదని యాయంగడికి బహిష్కార దోషము వచ్చునా ? 46

'సర్వమయమైన జలముతో బ్రహ్మానందము సాటిచేసితివి. అట్టి బ్రహ్మానందమునందు ధర్మానందము అంతర్భావముగానున్నది బ్రహ్మానంద ప్రాప్తికి సాంఖ్యబుద్ధి మూలమంటివి అసాంఖ్యబుద్ధియందే నిష్ఠచేయవలయునుగదా ? అదివదలి కర్మయోగబుద్ధిని ఉపదేశింతువేల ?' అని శంకింతువా ? వినుము.

అర్జునా ! వ్యవసాయాత్మికబుద్ధి నీకింకను సమగ్రముగా సిద్ధింపలేదు అందువలన కర్మమును సన్యసించుటకు జ్ఞాననిష్ఠ నవలంబించుటకు నీవధికారివి గావు కాదని జ్ఞాననిష్ఠ నవలంబింతువేని పచ్చికాయను ఎండవేయుటగును జ్ఞానము పరోక్షమని అపరోక్షమని రెండు విధములు శ్రుతులు మున్నగు నవి జదువుటవలనను పెద్దలవు వినుటవలనను గలుగు జ్ఞానము పరోక్షజ్ఞానమనంబడును విన్నది తెలిసికొన్నది స్వానుభవమునకు వచ్చుటవలనం గలుగు జ్ఞానము అపరోక్షజ్ఞానమనంబడును అపరోక్షజ్ఞానము గలిగిన తర్వాత బుద్ధి చలింపదు. అప్పుడు కర్మసన్యాసమునకు అధికారియగును. ఇప్పటి నీజ్ఞానము పరోక్షమేగాని అపరోక్షముగాదు నిత్యనైమిత్తికములైన కర్మములను ఫలాపేక్షమాని చేయుచుండినచోఁ గాలక్రమమున బుద్ధి పరిపక్వమై యపరోక్షజ్ఞానముదయించును అప్పుడు కర్మములు సన్యసింపవచ్చును, జన్మసాఫల్యమునందుదువు. ఇదియే కర్మయోగరహస్యము ప్రతికర్మమునకు ఫలము వెనువెంటనుండుననియు, కర్మములను జేయుచు ఫలమునుగోరకుంటే మాత్రాననే కర్మఫలమేమగుననియు శంకింతువ గాబోలు ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మములను చేయుదువు కావున కర్మఫలముకూడ ఈశ్వరార్పణమేయగును నీకుం దగులదు, నీవు ఫలానుభవమునకు జన్మమెత్తవలసిన యవసరముండదు. 'ఒకప్రక్క కర్మములను చేయుట ఒకప్రక్క తత్ఫలమును గోరకుండుట—ఇట్టి త్రిశంకునియవస్థకన్న కర్మములనే పూర్తిగా వదలుట మేలుగదా' యనియందువా? అట్లు తలంపవలదు ; కర్మములను వదలుట నీపరము గాదు 47

మోక్షసంపాదమునకు యోగబుద్ధి ముఖ్యమనియు, అట్టిబుద్ధి నిష్కామకర్మమువలన సిద్ధించుననియు నిష్కామకర్మమునకు సుఖదుఃఖాది ద్వంద్వములను సహించుటయే బీజమనియు, ఈసహనము సత్త్వైక్యనిష్ఠవలన లభించుననియు, అట్టి నిష్ఠాపరులు తమ యోగక్షేమములకై చింతింపఁబనిలేదనియు, ఆభారమును భగవంతుఁడే వహించుననియు సూచించుటవలన సత్త్వైకనిష్ఠ, ద్వంద్వసహిష్ణుత్వము, నిష్కామకర్మము, యోగబుద్ధి, భరన్యాసము అనునట్టి యోగాంగము లైదుఁదెల్పఁబడినవి అనఁగా పైనఁజెప్పిన అయిదు యోగాంగములుగలవాఁడే జ్ఞానోపదేశమునకు అధికారియని భావము. అర్జునుడంతమాత్రపువాఁడేయనియు, దానంజేసి జ్ఞానోపదేశమునకు అధికారియనియు శ్రీభగవంతుని భావము. అందువలననే వానికి జ్ఞానోపదేశము చేయుచున్నాఁడు.

అర్జునా ! కర్మములను త్యజింప శక్యముగాదంటివి అట్లయిన నేమి చేయవలయునందువా ? ఫలమాసింపక నీకు స్వధర్మమగు కర్మమును సాత్త్వికమేగానీ రాజసికమేగానీ తామసికమెగాని యేదైనను వదలక చేయుము. నీ చేయుకర్మములెల్లను పరమేశ్వరుని బూజించుటగా భావించి చేయుము నీవు చేయు కర్మములకు ఫలముగలిగినదా లేదాయని తలంపే నికువలదు , సిద్ధించినప్పుడెట్లో సిద్ధింపనప్పుడుకూడ నట్లేయుండుము ఫలాఫలములు నీమనస్సునకు సంతోష దుఃఖముల గలిగింపరాదు ఎప్పుడు నీకు ఫలమందభిలాష లేదో ఫలాఫలములసంగతి నీకేల ? ఫలాపలములందుఁ జిత్తము చలింపక సమముగానుండుటనే యోగమందురు ఇట్లుచేయువాఁడె యోగియగును 48

అర్జునా ! కర్మయోగమునందు బుద్ధి ప్రధానముగాని కర్మము ప్రధానముగాద కావున సమత్వబుద్ధిని సాధించుకొని వర్తింపుము బుద్ధిసమత్వము లేక కామ్యకర్మముల ననుష్ఠించువారు తత్ఫలమనుభవించుటకు జననమరణరూపమైన ఘటీ యంత్రమునఁ జిక్కి తిరుగు మందురు వారు మహాదీనులు సుమా 49

సమబుద్ధితోఁ గర్మములాచరించినను అవి బంధకములుగావని 39-వ శ్లోకములో సూచించితిని. అది వివరింతు వినుము ఫలాపేక్షతో మంచి

కర్మముచేసినను చెడుకర్మముచేసినను ఆయాఫలమనుభవింపకతీఱదు. ఫలాపేక్షవదలి చేసితివేని యీకర్మమును నీకు బంధకముగాదు. కావున ఫలాపేక్షమాని సమబుద్ధితో నీకర్మము లొనర్పుము. కర్మములు బంధకములుగానట్లుచేయు నేర్పునే యోగమందురు. ఇదేసంగతి 38-వ శ్లోకములోఁగూడ చెప్పియున్నాను. 50

సమత్వబుద్ధి సంపాదించుకొని ఫలమపేక్షింపక కేవలము పరమేశ్వరారాధనముగా నిండుకష్టపడి కర్మములొనర్చినచోఁ గలుగు ఫలమేమందువా? చిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధి గల్గినతర్వాత 'తత్త్వమసి' అనుమహావాక్యములు తెలిసికొని మననము చేయవలయును, మననము చేయఁగాఁజేయఁగా బ్రహ్మతత్త్వము ఆత్మతత్త్వము ఒక్కటే యని స్పష్టమగును. దీనినే అద్వైతబ్రహ్మాత్మతత్త్వసాక్షాత్కారమందురు. ఈసాక్షాత్కార మెప్పుడుగలుగునో యప్పటితో జననమరణములు నశించును. అనంతరము పరమానందస్వరూపుఁడగును. అర్జునా! నీవుగూడ అట్లేమొనర్చి యాస్థితిని బొందుము 51

ఈబ్రహ్మాత్మతత్త్వసాక్షాత్కారము గలుగుటకు కర్మయోగమెంతకాల మనుష్ఠింపవలయునందువా? ఇంతకాలమని నియతిలేదు. మనలో అంతఃకరణమను నొక యింద్రియముగలదు. అద్దమునుసాధనముగా నుపయోగించి నక్షత్రాదులనుజూచునట్లు, ఈయంతఃకరణమును సాధనముగా నుపయోగించి బ్రహ్మాత్మతత్త్వమును జూడవలయును. ఈయంతఃకరణమును అజ్ఞానమను మాలిన్యము సాధారణముగాఁ గప్పియుండును. అద్దమునకు మురికిచుట్టుకొన్నప్పుడు వస్తువెట్లు ప్రతిఫలింపదో యట్లే అంతఃకరణమునకు అజ్ఞానము చుట్టుకొనియున్నందున బ్రహ్మస్వతత్త్వజ్ఞానము గోచరింపదు. ఈయజ్ఞానమాలిన్యంబును మొట్టమొదట బోఁగొట్టవలయును. ఇది పోవుటెట్లందువా? పైనఁజెప్పినప్రకారము కర్మయోగము ననుష్ఠించుచు రాఁగా రాఁగాఁ బరమేశ్వరానుగ్రహము గలుగును. ఆయనుగ్రహప్రభావంబున మలినముతొలఁగి యంతఃకరణము శుద్ధమగును. అప్పుడు పరవైరాగ్యము గలుగును. వైరాగ్యము అపరము పరము అని రెండువిధములు. భోగద్రవ్యములందు స్వర్గాదులందు ఆసలేకుండుట అపరవైరాగ్యమనఁబడును. సమస్త ప్రపంచ వ్యవహారవిష

యములందుగూడ బొత్తుగా తలంపే లేకుండుట పరవైరాగ్య మనఁబడును అపరవైరాగ్యము లేనివాఁడు నిష్కామ కర్మయోగి కానేరఁడు. నీకింతవఱకది సిద్ధము , ఇఁక నీవు పరవైరాగ్యమును సంపాదింపవలసియున్నది 52

పరవైరాగ్యము గల్గినతర్వాత యెంతకాలమునకు బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారమగునందువా? సాంఖ్యబుద్ధినిగూర్చి నీకుపదేశించితిని అదివిన్నది మొదలు నీమనస్సు కలవరపొందియున్నది ఆకలవరముపోయి వివరముఁదెలిసి నా యను నిశ్చయము గలిగి బుద్ధి యెప్పుడు చాంచల్యంబును మానునో యప్పుడు పరోక్షజ్ఞానముదయించును పరోక్షజ్ఞానము గలిగినతర్వాత నిదిధ్యాసను చేయవలయును బుద్ధిని ఏకాగ్రముగానుంచి గాలి లేనిచోట నుంచబడిన దీపము వలె యీమాత్రము చలింపకుండునట్లుచేసి పరబ్రహ్మమును ధ్యానించుట నిదిధ్యాసమనఁబడును నిదిధ్యాసమెప్పుడు స్థిరమగునో యప్పుడు అపరోక్షజ్ఞానము గలుగును ఇట్టి జ్ఞానిని స్థితప్రజ్ఞుఁడందురు 53

అర్జునుఁడు అడుగుచున్నాఁడు

కృష్ణా! స్థితప్రజ్ఞుఁడు సమాధిలోనున్నప్పుడు అనఁగా ఏకాగ్రస్థితిలోనున్నప్పుడు వాని లక్షణములేమి? అతఁడు సమాధి వదలినప్పుడు వాని మాటలు కూర్చుండుట పోవుట మొదలగు వ్యవహారము లెట్లుండును? అనఁగా వాని చర్యలు పిచ్చివాని చర్యలవలెనుండునా సామాన్యజనుల చర్యలుగా నుండునా? 54

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! స్థితప్రజ్ఞుఁడు సమాధిలోనున్నప్పుడు వాని మనస్సు మహా నిర్మలమైయుండును కోరికయను మాటే వానికుండదు, మనోవృత్తులుగూడ నుండవు లోకవ్యవహారము సంగతియే వానికి తెలియకుండును తన్నుతానే చూచుచు అఖండానందమయుఁడై యుండును 55

సమాధియోగమునకు ఏడుభూమికలు గలవు నిత్యానిత్యవస్తువివేక పూర్వకమైన మోక్షేచ్ఛ ప్రథమభూమిక గురువును సమీపించి శ్రీగు

మననాదిరూపమైన వేదాంతవిచారముచేయుట రెండవ భూమిక. నిదిధ్యాస నభ్యసింపుటవలన మనస్సునకు ఏకాగ్రతవచ్చుటయు ఆకారణంబున సూక్ష్మ వస్తుదర్శన యోగ్యతగలుగుట మూడవ భూమిక. వేదాంత వాక్యంబువలన అపరోక్ష బ్రహ్మ సాక్షాత్కారమగుట నాల్గవ భూమిక. సవికల్పకసమాధి నభ్యసించుటవలన నిరుద్ధమగు మనస్సునకు నిర్వికల్పక సమాధ్యవస్థవచ్చుట అయిదవ భూమిక. అభ్యాసాతిశయంబునఁ జిరకాలమట్లే నిర్వికల్పక సమాధిలోనుండుట ఆఱవ భూమిక. అందుఁ బరిపాకవశంబున నిరంతరము స్వప్రకాశ చిదానందైక రసమను బ్రహ్మమందు మగ్నుఁడై సముద్ర మధ్యస్థాపిత కుంభమువలె అంతర్బహిఃపూర్ణుఁడైయుండుట ఏడవ భూమిక. ఇందు మొదటి మూడు భూమికల సాధనము జాగ్రదవస్థ యనఁబడును, ఏలయందువా ? జాగ్రదవస్థయందువలె నిందు ద్వైతప్రపంచ సత్యత్వ ప్రతిభాసయుండును నాల్గవ భూమికాఫలము స్వప్నావస్థ యనఁబడును. ఏలయనఁగా స్వప్నమునందువలె నిందుఁగూడ ద్వైతము బాధితమైనను తత్ప్రతిభాసమాత్రముండును నాల్గవ భూమికు వచ్చినయోగి బ్రహ్మవేత్తయనఁబడును. అయిదాఱవ భూమికలు జీవన్ముక్తియొక్క యవాంతర భేదములు. నిర్వికల్పక సమాధి నభ్యసించునప్పుడు గల్గు తారతమ్యమునుఁబట్టి యివియుండును. అందు అయిదవ భూమికను సుషుప్తియందురు. ఏలయనఁగా నిద్రయందువలె నిందుగూడ ద్వైతభాసయుండదు. ఈభూమికకు వచ్చినయోగి వికల్పముగలిగినప్పుడు స్వయముగా వ్యుత్థానుఁడగును. ఇట్టియోగిని బ్రహ్మవిద్వరుఁడందురు. ఆఱవ భూమికను గాఢసుషుప్తియందురు. ఈభూమికకువచ్చినయోగికిఁ బరప్రయత్నమువలననే వ్యుత్థానముగాని స్వయముగా వ్యుత్థానములేదు. ఇతనిని బ్రహ్మవిద్వరీయుఁడందురు. ఏడవభూమికను తురీయావస్థయందురు. ఈ భూమికనున్నయోగికి స్వతముగాఁగానీ పరప్రయత్నమునగాని వ్యుత్థానమే లేదు జగత్ప్రతిభాస యెత్తుగానుండదు గావున నితఁడు సర్వదా తన్మయుఁడైయుండును. వానికి దేహనిర్వాహకమన్ననో స్వప్రయత్నములేకయే పరమేశ్వరప్రేరిత ప్రాణవాయువువలన జరుగుచుండును. ఆలవార్చినయెద్దు బండికిఁగట్టి కదలించి విడిచినతర్వాత సారథిప్రయత్నము వఱల లేకయే మజిలీవఱకు నెట్లుపోవునో యట్లే యతని స్థితియుండును. ఈస్థితికివచ్చినవానిని బ్రహ్మ

విద్వాంసుడందురు సారాయికై పువలన మైమఱచినవానికి గట్టుకట్టియుం
డుట తొలగుట యెట్లు తెలియదో యట్టే స్వరూపమును బొందినవానికి దేహ
మున్నది పోయినదిగూడ దెలియదు. అయిదు ఆఱు ఏడు అవస్థలు పరస్పర
తారతమ్యముగల అసంప్రజ్ఞాత సమాధులు ఈ మూడవస్థల లక్షణము శ్లోక
ములోఁ జెప్పఁబడినది ఎట్లనిన—ఎప్పుడు సర్వకామములను త్యజించునో
యప్పుడు సమాధిస్థ స్థితప్రజ్ఞుఁడనఁబడును సర్వకామములనుటవలన ప్రత్యం
చన వనితాదులయందువలె బ్రహ్మలోకాదులందును అణిమాది సిద్ధులందునుగూడ
వైరాగ్యము వివక్షితము, అందువలన నిషిద్ధకర్మములనుమాత్రమే స్థితప్రజ్ఞుడు
త్యజింపవలయుననెడి వామాచార్యవాదము నిరస్తము కామాదివృత్తులు మనోగతము
లేగాని యాత్మగతములుకావు గావున వీనిఁ ద్యజింపనగును అవి యాత్మ
గతములగునేని ధర్మిత్యాగమునగాని ధర్మత్యాగము గాదను న్యాయప్రకారము
ఆత్మ నశింపనిదే యవి నశింపవు ఆత్మకు నాశములేదు కావున ఈవృత్తులకు
గూడ నాశములేదనుట యగును. ఇది యనిర్మోక్షమగును. మనోవృత్తి
లేకుండుటయే సమాధి యని దీనివలన స్వప్నము సర్వవృత్తిత్యాగము
సుషుప్తికిఁగూడ గలదందమా ? సుషుప్తియందు వృత్తి బీజముగ నణఁగియుండును
గాని నశింపదు అందువలననే సుషుప్తియందు అనావృతమైన యఖండానంద
స్ఫురణము గలుగదు ఈరెండవస్థలకుగల భేదమిదేయని గ్రహింపనగును.
సర్వకామప్రహాణమెట్లంగురా ? నిరతిశయానందరూపమైన స్వాత్మయందె సం
తుష్టిచెందుచో సర్వకామప్రహాణమగును సంప్రజ్ఞాత సమాధియందు ఆత్మా
నందము మనోవృత్తిగా నుండును అసంప్రజ్ఞాత సమాధియందు ఆనందము
వృత్తిగాదు ఆత్మప్రకాశమే తదానందమగును

ఈసమాధివిషయమై శ్రీరామకృష్ణ పరమహంసగారు స్వానుభవము
నిట్లు వివరించిరి. 'వెన్నెముకలోపల సుషుమ్నము అను మహానాళ
మొకటి గలదు, అది బ్రహ్మరంధ్రము మొదలు మూలాధారమువఱకు వ్యా
పించియుండును ఈనాళములోపల ఆఱు స్థానములు గలవు వానిని చక్ర
ములందురు అందు మూలాధారమనునది గుదస్థానమున నుండును స్వా
ధిష్ఠానమనునది మూలాధారముపైన లింగస్థానము అవర భాగమునఁగలదు

మణిపూరకమనునది స్వాధిష్ఠానముపైన నాభికొద్దనుండును అనాహతమనునది మణిపూరకముపైన హృదయము సమీపమునందుండును విశుద్ధమనునది కంఠప్రదేశంబుననుండును ఆజ్ఞయనునది కనుబొమల మధ్యభాగంబుననుండును

కుండలిని యనుశక్తి మనలో నొకటిగలదు. అనేక జన్మసంకల్ప పరంపర లేకీభవించి యీశక్తిరూపమున నుండునందురు బద్ధజీవులందీశక్తి నిద్రావస్థలోనుండును జ్ఞాపకము వివిధభావనలు దీనివలనఁ గలుగుచుండును పరబ్రహ్మము బ్రహ్మరంధ్రంబున నుండును కుండలిని పరబ్రహ్మము సర్వదా ఆకర్షించుచుండును అయినను అది నిద్రావస్థలోనున్నప్పు డీయాకర్షణమును గ్రహింపజాలదు. ఎప్పుడు నిద్రావివశత్వము నుండి తొలఁగునో అప్పుడది పరబ్రహ్మాకర్షణంబును గ్రహించి యావంకకుఁబోవ యత్నించును ఇది పోవుమార్గమునే సుషుమ్న నందురు దీనినే Canal Centralis అని ఆంగ్లభాషలోఁ జెప్పుదురు ఈసుషుమ్న నాళముయొక్క ప్రయోజన మిట్టిదని పాశ్చాత్యుల కింతవరకు గోచరింపదు ఈకుండలినీశక్తి మూలాధారము వెడలి యొక్కొక్క చక్రమునకు వచ్చునప్పుడు వింతవింతలనుభవమగుచుండును ఈశక్తి అనాహతచక్రమునకుగాని లేక విశుద్ధచక్రమునకుగాని వచ్చినంతనే మాటాడుశక్తి నిలిచిపోవును అది బ్రహ్మరంధ్రమును చేరినంతనే చూచుటలు వినుటలుగూడ నుండవు, భేదభావము సంపూర్ణముగా నశించును, అద్వైతసిద్ధి సంపూర్ణమగును. దీనినే నిర్వికల్పక సమాధియందురు ఈస్థితిలోనుండువానికిఁ ప్రపంచజ్ఞానమే యుండదు అతఁడు వ్యుత్థానదశకు వచ్చినప్పుడుగూడ వాని చిత్తవృత్తియంతగా మాఱదు అతఁడు క్రమక్రమముగా నొక్కొక చక్రమునుండి దిగి క్రిందికవచ్చినప్పుడు మనతో మాట్లాడుట మొదలగు కార్యములు చేయనోపును. నిర్వికల్పక సమాధిలో దాననుభవించిన బ్రహ్మానందము మనోవాక్కులకుఁగూడ నతీతము గావున అది యిట్టిదని యతఁడుగూడ వర్ణింపఁజాలఁడు,

స్థితప్రజ్ఞుఁడు సమాధి వదలినప్పు డెట్లుండునంటివి వినుము సమాధి వదలినను వానికి మనోవృత్తియుండదు మనోవృత్తి యెప్పుడులేదో యప్పుడే కోరికగాని, భయముగాని, క్రోధముగాని యుండదు. ప్రారబ్ధకర్మమువలన

సుఖములుగాని దుఃఖములుగాని గలుగుచున్నవి సుఖదుఃఖాదులు దేహ
సంబంధములుగావునను దేహమునందెట్టి మమకారము వానికిలేదు గావునను,
దేహముపడునట్టి పాట్లే యతనికిఁ దెలియవు అతఁడు సర్వదా తన్మయుఁడై
యుండును. అతఁడు గూర్చుండినను నడచినను, వేయేల ! వానివ్యవహారము
లెల్ల అప్రయత్న పూర్వకములు గానుండును. సామాన్యుల వ్యవహారములు
ప్రయత్నపూర్వకములు. 56

వానికి నిజదేహమందుఁగాని జీవితమునందుగాని, మఱిదేనియందుఁగాని
అభిలాషయుండదు ప్రారబ్ధవశంబున శుభముగానీ అశుభముగానీ వచ్చినప్పుడు
ఉదాసీనుఁడైయుండును , శుభముగలిగినదని సంతోషింపఁడు , అశుభము
వచ్చెనని ద్వేషింపఁడు. ఏలయందువా ? వాని మనస్సు ఇట్టివానియందే
తగులదు , ఇదివచ్చెను ఇది పోయె నను తలంపే వానికి లేదు మనస్సు
ఇంద్రియపరము గానప్పు డిట్టివికారములుండవని భావము 57

అతఁడెట్లు కూర్చుండునో వినుము. తాఁబేలు తన కరచరణాదీంద్రి
యముల నెట్లు అప్రయత్నముగా ముడిచికొనునో యట్లే యతని యింద్రియ
ములు ఇంద్రియార్థములనుండి యప్రయత్నముగా నుపసంహారమగుచుండును.
సామాన్యజనుల యింద్రియములు బుద్ధిప్రేరణవలన వర్తించుచుండును. ఇతని
యింద్రియములకు బుద్ధిప్రేరణలేదు ప్రతియింద్రియము దాని స్వభావము
ప్రకారము వర్తించును 58

శ్రవణేంద్రియమునకు శబ్దము ఘ్రాణేంద్రియమునకు వాసన—ఇట్లు
ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక్కవిషయము ఆహారముగానుండును.
దానికిదానికిఁ దగిన ఆహారములేనప్పుడు ఆయాయింద్రియము శుష్కించి మొద్దు
వాఱిపోవును. మాటాడక యేండ్లు పూండ్లు ఉన్నయెడల వాగింద్రియము
దానిబలమును గోల్పోయి నిరుపయోగమగును , ఇట్లె ప్రతి యింద్రియము
సంగతి స్థితప్రజ్ఞుని సంగతి సయితమంతేయని తలంతువు గాఁబోలు. సామా
న్యుల యింద్రియములు పైనఁజెప్పినట్లు తగిన యాహారములేనప్పుడు సొమ్మసిలి
యుండునేగాని విషయాభిలాషను మాత్రము వదలవు స్థితప్రజ్ఞుని యింద్రి
యములన్నియో విషయాభిలాషనే మఱచియుండును. కారణమేమందువా ?

ఇంద్రియములకు విషయసంయోగంబున నొకవిధమైన యానందముగలుగుచు ఈవిషయానందము స్థిరమైనదిగాని, ఉత్కృష్టమైనదిగాని గాదు స్థితప్రజ్ఞుడు పరబ్రహ్మసాక్షాత్కారంబున బ్రహ్మానందమును బొందియుండును అందు వలన వాని మనస్సు ఇట్టి స్వల్పానందములవంక మఱలదు. ఆనందానుభవార్థము మనస్సు విషయపరమగుననియు, విషయానందమునకన్న బ్రహ్మానందము స్థిరము నుత్కృష్టము నగుటంజేసి యట్టియానందము నొకసారి చవిచూచెనేని మనస్సు మఱల విషయానందములవంకః దిరుగదనియు భావము 59

విషయములవంకనుండి మనస్సు మఱలవలెనన్నచో ఆవిషయములయం గల దోషములను సర్వదా తలపోయుచుండవలయును అట్లు చేయుచుండిన చో మనస్సునకు వానియందు అసహ్యము తోఁచి యది ఆవంకకు మఱలకుం డును విషయవైముఖ్యమునకు ఇది ముఖ్యమైన సాధనము పండితులిట్లు చెయుచుందురు మనమిట్టి ప్రయత్నము లెన్ని చేసినను ఇంద్రియములు వాని స్వభావము మానవు, అగఁగా మనస్సును తమవంకకు బలాత్కారముగా నిడ్చుచునేయుండును ఇంద్రియములను జయించుట అంతకష్టము కావున నేగదా ఇంద్రియములను జయించినవాఁడు ముల్లోకములను జయించినవాఁడే యనియందురు. 60

'ఇంద్రియములను జయించినఁగాని ఆత్మదర్శనము గాదంటివి, ఇంద్రియములను జయించుట మహాకష్టమంటివి పిచ్చికుదిరినగాని పెండ్లిగాదు; పెండ్లియైనఁగాని పిచ్చికుదురదన్నట్లున్నది. ఇఁక గత్యంతరమేమని శంకింతువా? దొంగలకు మల్లుఁడెట్లో యింద్రియములకు మనస్సు అట్టిది మనస్సు యొక్క యనుమతిలేక యేయింద్రియము వ్యవహరింపదు కాఁబట్టి మనస్సును మొట్టమొదట చిక్కించుకొనవలయును మనస్సును జిక్కించుకొనుటెట్లం టువా? మనస్సు కోరిక లనుపాశములతో ఇంద్రియములను గట్టివైచి యాడించుచుండును ఇట్లాడించుటయెల్ల ఆనందముకొరకేగాని వేఱుగాదు ఆశాపాశములను తెగ గొట్టుము అంత మనస్సు తనవ్యాపారమును మానును అప్పుడు మనస్సును పరమేశ్వరుఁడనైన నావంకఁద్రిప్పుము నేను పరమానంది స్వరూపుఁడను గావున ఒకసారి యది నాయానందమును చవిచూచెనేని మఱల

నన్ను వదలడు. ఇంద్రియనిగ్రహమునకు నిదె పరమసాధనము. స్థితప్రజ్ఞు
నకు ఇంద్రియములిట్లు వశమైయుండును 61

కన్నులు చెవులు ముక్కు మొదలగు ద్వారములగుండా లోపలనుండు నట్టి ఇంద్రియములకు వెలుపటిపదార్థములకు సంబంధము గలుగుచుండుననియు ఆద్వారములనుమూసి దొంగలనువలె ఇంద్రియములను లోపలనే బంధించి వైచినయెడల అవి స్వాధీనము గావాయనియు నందువా? దొంగలకు ఖయిదు చేసినప్పుడు వారు దొంగిలించుటకుమాత్రము వీలుండదుగాని వారి దొంగబుద్ధి మానదుగదా. అట్లే బాహ్యగోళకములను మూసినంతనే ఇంద్రియములకు బాహ్యపదార్థములందలి యాస మానదు ఈయాస నశించినగాని అవి యూరకుండవు ఈయాస నశించు టెట్లందువా? విషయములను కోరుట అనుభవించుట యీశక్తి యింద్రియములకు లేదు. మనస్సు సంకల్పించుచుండును. ఆసంకల్పములను ఇంద్రియములు చేయుచుండును మనస్సంకల్పములేని యెడల ఇంద్రియము లేపనిచేయక యూరకుండును. అన్నిటికి మనస్సే ముఖ్యము దానిని మొదట గట్టివేయవలెను మనస్సునకు ఈసంకల్పశక్తి స్వాభావికము అనాదివాసనలవలన ఆశక్తి గలుగుచున్నది అందువలన మనస్సు సదా యేదోయొకటి ధ్యానించుచుండునేగాని యూరకుండదు ఆ ధ్యానమును భగవంతునివంకకు త్రిప్పినయెడల అందున్న రుచిని మఱగి మనస్సు అదే లోకములోనుండును, బాహ్యవిషయములకు మఱలదు, అప్పుడు ఇంద్రియములెల్ల నాయకుడులేని సేనవలె నూరకుండును మనస్సు సదా యేదో యొకటి తలంచుట దాని స్వభావమని చెప్పితిని అట్లు మనస్సు సదా దేనిని తలంచునో దానితోడ సంబంధముగలుగును సంబంధమువలన దానిని పడయవలయునని కోరిక పుట్టును కోరికప్రకారము దానిని సాధించుటకు ప్రయత్నించును ఆప్రయత్నమునకు ఏదైనను అడ్డమువచ్చినయెడల, అడ్డమువచ్చినదానిమీద కోపముకలిగి దానినెట్లయినను హతముచేయవలయునను పట్టు
దల గలుగును 62

ఈక్రోధమెప్పుడు గలిగెనో యప్పుడే ఇది మంచి ఇదిచెడ్డయని విమర్శించుజ్ఞానము నశించును ఈహితాహితజ్ఞానము నశించినంతనే మోహము

పైకోనను మోహమనగా చెడ్డను మంచిగా తలంచుట. మోహమునకు ఎప్పుడు చిక్కునో యప్పుడే ఇతరవిషయములు తలంపునకుఁగూడ రావు. అందువలన ఇంద్రియములనునవి యుండుట, వానిని జయింపవలయుననుట—ఈ సంగతియే జ్ఞాపకమునకు రాదు. ఇట్టి జ్ఞాపక మెప్పుడు నశించునో యప్పుడే బుద్ధి నశించును. బుద్ధి నశించుటవలన నరుఁడు తన కర్తవ్యాంశమును మాని మఱల జననమరణరూపమైన సంసారమునందు మునుఁగుచున్నాఁడు. అర్జునా! స్థితప్రజ్ఞుఁడెట్లు కూర్చుండునని నీవడిగిన ప్రశ్నకు జవాబుగా పైసంగతులు చెప్పితిని. అతఁడు జితేంద్రియుఁడైయుండునని నేను చెప్పిన దానిసారాంశము.

స్థితప్రజ్ఞుఁడు ఎట్లు వ్యవహరించునని యడిగితివి. ఎల్లవ్యవహారములకు జీవనమాత్ర మొకటిగలదు. దానిని గ్రహించి వర్తింతుమేని ఎట్టి సంకటములు గలుగవు. ఆసూత్రమేదియందువా? రాగము ద్వేషము అను శత్రువులు రెండు గలవు. ఈరాగద్వేషముల తత్త్వము పైఁజెప్పియున్నాను. వానికి లోఁబడి యవియాడ్చినట్లు వర్తించువాఁడు చెడును. వానికి లోఁబడనివాఁడు శుభమునొందును. ఈరాగద్వేషముల ప్రోత్సాహములేక ఇంద్రియములకు తత్తత్సంబంధములైన వస్తువులతో సంబంధముగలిగినను హానిలేదు. ఉదాహరణము వినుము. మనము దారినిఁ బోవునప్పుడు అనేకవస్తువులు కంటికి గోచరించుచుండును. ఆవస్తువులెల్ల అగపడుచు పోవుచునుండునేగాని వానియందు మనస్సు తగులదు. ఏలయందువా? ఆవస్తువులమీఁద రాగము మన మనస్సులో లేదు. స్థితప్రజ్ఞునిమనస్సు ఇట్లు రాగద్వేష రహితమైయుండును గావున వాని యింద్రియములకు ఇంద్రియార్థములతో సంబంధము గలిగినను గలుఁగుఁగాక. వానికిఁ దెలియకుండను, కన్నులు చూచియుఁ జూడనట్లే యగును, చెవులు వినియు విననట్లేయగును. అనఁగా ఇది నేను చూచుచున్నాననిగాని ఇది నేను వినుచున్నాననిగాని, ఇది నేను చేయుచున్నాననిగాని వానికి ఎఱుకయేయుండదు. వాని మనస్సు ఇంద్రియ వ్యాపారముల యందు లేకపోవుటయే ఇందులకు కారణము. మనస్సు రాగద్వేషములకుఁ జిక్కకుండవలయునన్నచో దానిని భగవంతునకు అర్పించుటయే యుపాయము; అర్పణము సంపూర్ణముగానుండవలయును. అట్లు అర్పింతుమేని అది

ప్రసాదమునొందును; అనఁగా స్వచ్ఛమగును; రాగద్వేషాది మలినములు అంటుకొనుటకు ఎడముండదు. స్థితప్రజ్ఞుని యింద్రియ వ్యవహారము పై విధముగానుండును. 64

మనఃప్రసాదమువలన అనఁగా మనస్సు స్వచ్ఛమగుటవలన ఫలమేమందువా? శుద్ధమైన మనస్సు బ్రహ్మాత్మ తత్త్వవిషయమునందు స్థిరముగా నిలుచును. అట్లు మనస్సు స్థిరమైనప్పుడు జ్ఞానముదయించును. జ్ఞానికి ఎట్టి దుఃఖములుఁ దగులవు ఇదే ఫలము. కాఁబట్టి ఇంద్రియనిగ్రహమే తత్త్వజ్ఞానమునకుఁ బరమసాధనమని గ్రహింపుము 65

ఇంద్రియనిగ్రహమనెడి ఈయుపాయమును సాధింపక వేదాంతము ఎంతవిన్నను తత్త్వవిషయమునందు బుద్ధి నిలువదు, అది యటునిటుఁ జలించుచుండును, తత్త్వబుద్ధి లేనివానికి నిదిధ్యాసము అనఁగా తదేకధ్యాననిష్ఠ గలుగదు అట్టి నిష్ఠ లేనివానికి తత్త్వము తెలియదు, తత్త్వము తెలియనినాఁడు శాంతి గలుగదు, శాంతి గలుగనివానికి మోక్షానందము దొరకదు 56

ఇంద్రియములు తమ యిచ్చవచ్చినట్లు విహరింతురేని, మనస్సునకు నిలుకడ చిక్కదు ఏయింద్రియము బలముతో లాగునో దానివంక మనస్సు మరలును అన్నియింద్రియములు కలిసిలాగసాగినచో ఇఁక చెప్పవలయునా? మనస్సునకు చలనముగలిగెనేని తత్త్వము తెలియవలయుననెడి పట్టుదల పోవును మనస్సు అనునావికుఁడు ప్రజ్ఞయను నోడనెక్కి సంసారమనెడి సముద్రమును దాఁటఁజూచినప్పుడు ఇంద్రియములనెడి ప్రతికూలవాయువు వీవఁగా, వాఁడప్పుడు పరమేశ్వరభక్తియను లంగరువేసి ఓడను నిలుపక గాలి వీచినట్లు పోనిచ్చినచో అది కొట్టుకొనిపోయి విషయసుఖమను సుడిలోఁబడి నశించును కావున సంసారసాగరంబును తరింపఁదలఁచిన మనోనావికుఁడు జాగరూకుఁడై ఇంద్రియములను ప్రతికూలవాయువు గొట్టినప్పుడు పరమేశ్వరభక్తియను లంగరునైచి రక్షించుకొనవలయును అనఁగా తత్త్వబుద్ధి దృఢమగుకొలఁది ఇంద్రియముల హడావుడి తొలఁగునని భావము 67

అర్జునా ! పైనఁ జెప్పినదానినిబట్టి యింద్రియనిగ్రహ మెంత కష్టమో తెలిసినదిగదా ఎంతకష్టమైనను సరే ఇంద్రియములను ఇంద్రియార్థముల నుండి నిగ్రహింపనిదే ప్రజ్ఞ గలుగదు 68

అర్జునా ! స్థితప్రజ్ఞుఁడు సమాధిలోనున్నప్పు డెట్లుండునది సమాధివదలి నప్పు డెట్లుండునది వివరించితిని. స్థితప్రజ్ఞునకును సామాన్యులకుఁగల ముఖ్య భేద మొకటిగలదు ఏదియనిన—సామాన్యులకు పగలుగానుండునది స్థితప్రజ్ఞునకు రాత్రిగానుండును, సామాన్యులకు రాత్రిగానుండునది వానికి పగలుగా నుండును అనఁగా సామాన్యులు సుఖదుఃఖములు సిరిసంపదలు మొదలైనవి సత్యములనియు నిత్యములనియు నమ్మి వ్యవహరింతురు ఇవన్నియు సత్యములు గావు నిత్యములుగావు అని స్థితప్రజ్ఞుఁడు వీనితట్టై చూడక సత్యము నిత్యమునైన బ్రహ్మానందానుభవములో నుండును 69

స్థితప్రజ్ఞుని లక్షణము మఱియొకటిగూడఁగలదు స్థితప్రజ్ఞుఁడు నిరతి శయమైన తనయాత్మానందముతో నిండియుండును అందువలన ఇతరములైన క్షుద్ర విషయానందములకు అవకాశమే గలుగదు అందువలన నతఁడట్టి వానిని గోరుటగాని, ఆకారణంబున వికారముపొందుటగాని లేదు. ప్రపం చములోని సమస్త విషయములు వానియింద్రియములకు గోచరించుచున్నను అవి వానికెంతమాత్రము వికారము గల్పింపఁజాలవు అనఁగా కోరికలవలన వికారము పొందకుండుట స్థితప్రజ్ఞుని లక్షణమని భావము ఇట్టివాఁడు మోక్ష మును బడయును ఇంద్రియములకు విషయములతో సంబంధముగలిగినప్పుడు వికార మెట్లు గలుగకుండునందువా ? సముద్రము ఇందులకు దృష్టాంతము. సముద్రము సర్వదా నిండి గట్లమీఁదికి నుబికియుండును అట్లున్నను ఆ సముద్రములోనికి లెక్కలేనన్ని నదులు ప్రవహించుచున్నవి ఎన్ని నదులు వచ్చి పడినను అది కించిన్మాత్రమైనను వికారము చెందుచున్నదా ? 70

కామములు అనగాఁ గోరికలు అవి బాహ్యములని ఆంతరములని వాసనారూపములని మూఁడువిధములు. ఇండ్లు భూములు పెండ్లాము బిడ్డలు ధనధాన్యములు మున్నగు బాహ్యవిషయములనుగూర్చిన కోరికలు బాహ్యము లనఁబడును మనోరాజ్యాదులు అనగా గొంతెమకోరికలు అంతర కామము

లనఁబడును దారిలో గడ్డిపఱకలవలె తలవని తలంపుగా పుట్టివచ్చు కోరికలు వాసనారూపములు మూఁడువిధములైన యీకోరికలను వదలవలయును. అన్ని కోరికలను వదలినచో శరీరయాత్ర జరుగుటెట్లందువుగాఁబోలు జీవనము నందుఁగూడ అట్టివారికి కోరికయుండదు. అప్రార్థితముగా దొరకినదానితోఁ దృప్తిపడుదురు లేదా, జీవయాత్రకు ఎంతమాత్రము వలయునో యంతమాత్రమే చేయుచు దిరుగుచుందురు ఇట్లుండుటకుఁ గారణమేమందువా ? మమకారము లేకపోవుటయే కారణము. జీవనార్థము భిక్షమెత్తుటో యేదో చేయునప్పుడు భిక్షార్థము జోలియో చెంబో కావలయునుగదా. అట్టివాని యందుఁగూడ ఇవినావి, ఇవిపోయినచో కష్టమగునను తలంపే వానికిఁ గలుగదు. ఇంతమాత్రపు మమకారముగూడ లేకపోవుటకుఁ గారణమేమందువా? అహంకారము లేకపోవుటయే కారణము అహంకారమనగా 'నేను' అనుభావము 'నేను' అనుభావమే లేనప్పుడు 'నాది' అనుభావమెక్కడిది ? సర్వకామములను త్యజించి అహంకారమమకారములులేక దేహాదిస్పృహవదలి యెవడుండునో యతఁడు శాంతిని బడయును 71

అర్జునా ! బ్రహ్మనిష్ఠ యనఁగా జ్ఞానమును నీకుపదేశించితిని. ఈ జ్ఞానమును బడసినవాఁడు గాని ననుభవమునకుఁదెచ్చుకొని ముక్తిపొందుటకు యత్నించువేగాని మఱల సంసారమోహములోఁ జిక్కడు అర్జునా ! నీ ముఖలక్షణములనుజూడ నీకేదో చింతగలిగినట్లున్నది 'వయస్సు చెల్లినది ; ఇప్పటివఱకు బ్రహ్మనిష్ఠకు యత్నింపనైతిని, ఇఁకనాకు మోక్షమెక్కడిది?, అని చింతింతువా ? అట్టి చింతవలదు. ఈబ్రహ్మజ్ఞాననిష్ఠ మరణకాలమందు వచ్చినను చాలు , మోక్షము తప్పక వచ్చును. కాఁబట్టి యిప్పుడు మీఱిపోయినదేమియు లేదు పరమేశ్వరారాధనము మననము నిదిధ్యాసనము ఇవి పరిపక్వమైనప్పుడు బ్రహ్మనిష్ఠ వచ్చితీఱును ఆనిష్ఠ యెప్పుడుగల్గునో యప్పుడే మోక్షము వచ్చినట్లెయని గ్రహింపుము. 72

---

# గీతాహృదయము.

## మూఁడవ యధ్యాయము.

జ్ఞానమునకు కర్మయోగము సాధనమని రెండవ యధ్యాయములోఁ జెప్పఁబడినది. ఆకర్మయోగము ఈయధ్యాయములో విస్తరించి చెప్పఁబడు చున్నది. జ్ఞానయోగ మిట్టిదని సవిస్తరముగా అర్జునునకు రెండవ యధ్యాయములో ఉపదేశించి 'ఆత్మ నిత్యమైనది ఖండించుటకు దహించుటకు సాధ్యముగానిది గావున ఆవిషయమైన సందేహము మానుము దానిగూర్చి శోకము వలదు' అని 25-వ శ్లోకములో శ్రీభగవానుఁడు సూచించి అంతతో నూఱకుండక మఱల 'యోగబుద్ధినిగూర్చి చెప్పెద వినుము' అని 39-వ శ్లోకములో కర్మయోగమును ప్రస్తుతించి 'కర్మము చేయుటకే నీవు అధికారివి ;' 'కర్మము చేయకుండుటను కోరిక గూడ నీకుతగదు' అని 47-వ శ్లోకములోఁ జెప్పెను అట్లు చెప్పుటవలన కర్మమును తప్పక చేయవలసినట్లు ఉపదేశించుటగుచున్నది మొదట అట్లు ఇప్పుడిట్లు చెప్పుటవలన విభ్రాంతుఁడై అర్జునుఁడు అడుగుచున్నాఁడు

కృష్ణా! జ్ఞానయోగము కర్మయోగము రెంటి నుపదేశించితివి ఈరెండు యోగములను ఒక్కఁడే యనుష్ఠింపవచ్చునా? లేక వేఱువేఱు పురుషులనుష్ఠింపవలయునా ? రెంటిని ఒక్కఁడే యనుష్ఠింపనగునేని, మోక్షమిచ్చు విషయమునఁ గర్మయోగమునకన్న జ్ఞానయోగము మేలా? లేక రెండును సమానములా ? కర్మయోగమునకన్న జ్ఞానయోగమే మేలని నీమతమేని, జ్ఞానయోగము ననుష్ఠింపుమని నాకు చెప్పుటమాని, తక్కువదైన కర్మయోగమును జేయుమని నన్ను నియోగించు టేల ? రెండును సమములేయని నీమతమేని, సౌమ్యమైనది జ్ఞానయోగముండఁగా దానినివదలి గురువులను బంధువులను వధించుటయను మహాక్రూరముతోఁ గూడిన యుద్ధరూపమైన కర్మయోగమునందు నన్ను నియో
గించు టేల ? 1

జ్ఞానయోగమునకుఁ గర్మయోగమునకు ఒక్కఁడే యధికారిగాఁడనియు వేఱువేఱుపురుషులు అధికారులగుదురనియు నీమతమేని, రెండింటిని నాకే యుపదేశించితివి అందువలన నీభావమిదియని గ్రహింపఁజాలకున్నాను నీమాటలు మందబుద్ధినగునాకు లేనిభ్రమను గలిగించుచున్నవి కావున నా యధికారమునుబట్టి జ్ఞానయోగమో లేక కర్మయోగమో యేదోయొకటి నిశ్చయించి చెప్పుము నాయధికారమునుబట్టి నీవు నిశ్చయించి చెప్పుదాని ననుష్ఠించి మోక్షమును బడయుదును 2

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు

అనఘా ! నేనుచెప్పినది నీవు సరిగా గ్రహింపలేదు మోక్షమునకు జ్ఞానయోగము కర్మయోగము అను స్వతంత్ర సాధనములు రెండున్నవని నేను చెప్పలేదు మోక్షమునకు జ్ఞానయోగమే సాధనము జ్ఞానమునకుఁ జిత్తశుద్ధి వలయును , చిత్తశుద్ధి కర్మయోగమువలనఁ గలుగుచున్నవి కాఁబట్టి కర్మ యోగము జ్ఞానయోగమునకు అంగభూతమేగాని వేఱుగాదు అట్లని ప్రతి పురుషుఁడు మొట్టమొదటనే జ్ఞానయోగ మారంభింపరాదు. జ్ఞానయోగ మనుష్ఠించుటకుఁ గొంతయోగ్యత అనఁగా అంతఃకరణశుద్ధి కావలయును. జన్మాంతర సుకృతివశంబునఁ గొందఱకీ యంతఃకరణశుద్ధి పుట్టువుతోడనే యుండును వారుమాత్రమే జ్ఞానయోగమనుష్ఠింపఁదగుదురు అట్టి యంతః కరణశుద్ధిలేనివారు చిత్తశుద్ధిగలుగు పర్యంతము కర్మయోగము ననుష్ఠించి, చిత్తశుద్ధి గల్గినతర్వాత జ్ఞానయోగమనుష్ఠింపవలయును ఈరెండు నిష్ఠలను గూర్చి రెండవ యధ్యాయములోఁ జెప్పియున్నాను చిత్తశుద్ధిగలిగి జ్ఞాన భూమిక నారోహించినవారికి అనఁగా సాంఖ్యులకు జ్ఞానయోగము మోక్ష ప్రాప్తికి సాధనమగును చిత్తశుద్ధిలేనివారికి అనఁగా యోగులకు కర్మ యోగము మోక్షప్రాప్తికి సాధనమగును అనఁగా కర్మయోగమువలనఁ జిత్త శుద్ధియగును. అనంతరము వారు జ్ఞానయోగము ననుష్ఠించి మోక్షమును బడయుదురు ఇరుతెగలవారికి నుపయోగించుటకై రెండునిష్ఠలను జెప్పితిని నీకిప్పుడు జ్ఞానముపదేశించుటకుఁ దగినంతమాత్రము చిత్తశుద్ధిగలదు. అందు వలన జ్ఞానయోగమిట్టిదని చెప్పితిని. అంతమాత్రాననే నీవు జ్ఞానయోగ

మనష్టింపుటకుఁదగవు. ఇంకను నీచిత్తము పరిశుద్ధము కావలసియున్నది, అంత పర్యంతము నీవు నీవర్ణాశ్రమములకుఁ దగిన కర్మము చేయవలయును. అందువలన నిన్ను నీక్షత్రియధర్మమునందు నియోజించితిని. 3

చిత్తశుద్ధిలేనివాఁడు జ్ఞానోత్పత్తిపర్యంతము కర్మములుచేయవలయునని యిందుఁ జెప్పబడును

సర్వకర్మసన్యాసము జ్ఞానమునకుఁ గారణభూతమనియు, జ్ఞానార్థము చేయవలసిన కర్మములు చేయక కరచరణాదులు బిగించి కూర్చుండుటయును నైష్కర్మ్యము అనఁగా ఎట్టికర్మములు చేయకుండుట యనుకొనియుఁ దలఁప వలదు. కాలుసేతులు బిగించి కూర్చుండినంతమాత్రమున నైష్కర్మ్యము గాదు. మఱియు కర్మసన్యాసమనఁగా కర్మములను మొట్టమొదటనే వదలుటగాదు. కర్మములొనర్చుచున్న చిత్తశుద్ధి గలకేగాని వీలుగాదు. చిత్తశుద్ధిపడసిన తర్వాత కర్మములవలనఁ బడయవలసినది మఱియొకటిలేదు. అప్పుడు కర్మములతో నవసరములేకపోవును. అప్పుడు కర్మములను వదలనగును. అది కర్మసన్యాసమగును. చిత్తశుద్ధి పడయకమున్నె కర్మములను సన్యసించుటకు సాధ్యముగాదు, సన్యసించినను జ్ఞానముదయింపదు. 4

సర్వకర్మములను సన్యసించినచో జ్ఞానముదయించునను భ్రమగలదు. సర్వకర్మసన్యాసమనఁగానేమి? కర్మములను బొత్తుగాఁ జేయకుండుటా? లేక కర్మేంద్రియములనెల్ల నిగ్రహించుటా? ఏయవస్థలోనైనను ఎవఁడుగాని అట్లో యిట్లో కర్మము సేయక యుండఁజాలఁడు. నిద్రావస్థలోఁ గూడ ప్రతిప్రాణియు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసరూపమైన కర్మము చేయుచునే యుండును. కావునఁ గర్మములను బొత్తుగాఁ జేయకుండుట సాధ్యముగాదు, సర్వకర్మసన్యాసము ఆరూపమైనదిగా నుండదు. ఏమిపని చేయుటలేదని కన్నులు మూసికొని కూర్చుండుట సర్వకర్మసన్యాసమనఁ జాలిన అదియుఁ గాదు. ఏలయందువా? ప్రకృతి సంబంధములైన సత్త్వరజస్తమోగుణములు ప్రతి జంతువునందుఁ గలవు. ఈ గుణములు సముద్రతరంగములవలె నొకదానినొకటి యతిక్రమించుటకుగా వృద్ధియగుచుండును. అట్లగుటలో ఆయా గుణములకుఁ దగినకర్మము జరుగుచునేయుండును. ప్రాణి యాకర్మములను

నిలుపఁజాలఁడు   కావున కర్మముల స్వరూపత్యాగము అసాధ్యము , కర్మ సన్యాసమనఁగా నట్టిది గానేరదు   5

ఇఁక రెండవపక్షము అనఁగా సర్వకర్మేంద్రియనిరోధము కర్మసన్యాసమగునాయను సంగతి విచారింతము. ఎవ్వఁడో ప్రయత్నించి కాలుసేతులు నోరు మొదలగు కర్మేంద్రియములను గట్టిపెట్టి యింద్రియార్థములైన రూపరసాదులను మనస్సులోఁ దలంచుచుండునో యది కర్మసన్యాసము గానేరదు. రూపరసాదులను లోలోపల దలంచుచు బయటికి కర్మము చేయనివాఁడువలె కాలుసేతులు బిగించియుండుట వట్టిబూటకమగును కాఁబట్టి ఇదియు కర్మసన్యాసము కానేరదు. అట్లయిన కర్మసన్యాసమెట్టిదందువా? వినుము. సర్వకర్మ ఫలత్యాగమని, సర్వకర్మ స్వరూపత్యాగమని సన్యాసము రెండు విధములు ఫలాభిసంధిలేక ఎల్లకర్మములుచేయుచు ఫలమును భగవదర్పణము చేయుట సర్వకర్మఫలత్యాగ సన్యాసమగును. ఈవిధ సన్యాస మనుష్ఠించుటకు కర్మయోగులకు గృహస్థులకు అధికారము గలదు సర్వకర్మ స్వరూపత్యాగమనునట్టి కర్మసన్యాసమునుగూర్చి 17-వ శ్లోకములో వివరింపఁబడును. ఇట్టి సన్యాసమునకు జ్ఞాననిష్ఠులుమాత్రమే యధికారులు ఈవిషయమై శ్రీపరమహంసగారిట్లు నుడివిరి

తాను అనుమాటయే మఱచి భగవదాజ్ఞయెట్టిదోయెఱిఁగి యాయాజ్ఞప్రకారమువర్తించుట సర్వకర్మ స్వరూపత్యాగ సన్యాసమగును భగవదాజ్ఞ యెఱుంగుటకై జ్ఞానసిద్ధివలయును. గోరంత పనియైనను స్వతంత్రించి చేయుట తనభగవచ్ఛక్తికి లోపమని యతఁడుభావించును ఈశ్వరప్రేరణము లేనిది యిట్టివాఁడేమియుఁ జేయఁడు. ఈశ్వరప్రేరణము గలుగుటకై యిట్టివాఁడు దాను సర్వదా ఈశ్వరునికర్పించుకొని వాని కార్యనిర్వాహకమునకు తానొక సాధనమాత్రుఁడై యుండును ఈస్థితికివచ్చుట యంత సులభముగాదు , ఎంతో శ్రమింపవలసియున్నది ఇతని పరిశ్రమతో సరిపోల్చినచో లౌకిక వ్యవహారమగ్నుని శ్రమ సహస్రాంశముగూడ నుండదు సుఖదుఃఖము లెన్ని పైకొన్నను నిస్తరంగ సముద్రమువలెనుండుట సామాన్యమైనదిగాదు. ఇట్టిస్థితికి గల కారణంబులను 17-వ శ్లోకములో వివరింపఁబడినవి సర్వకర్మ స్వరూపత్యాగ

మిట్టిదిగాని యీకర్మములు చేయకుండుటగాదు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అను శ్లోకముయొక్క సారాంశ మిదేయని గ్రహింపుము పనికిదొంగలై కర్మ సన్యాసులమనివచించు మిథ్యాచార్యులమాటలు నమ్మవలదనియు సన్యసింప వలసినది కర్మమును గాదనియు భావము పరమేశ్వరప్రేర జ్ఞానరూపముగాఁ జేసి తదాజ్ఞప్త కర్మములొనర్చుటకుఁ దానొక సాధనమాత్రుఁడై యుండు వాఁడుమాత్రమే సర్వకర్మ స్వరూపత్యాగ సన్యాసియనియు (శంకరుఁడు, రామానుజుఁడు, గురునానక్, చైతన్యుఁడు మున్నగు మతకర్త లీకోటిలో వారనియు) ప్రతిపురుషుఁడు నిట్టిస్థితికివచ్చుటకై యత్నింపవలసినదనియు దీని భావము 6

అర్జునా! ఈశరీరమందు నేత్రములు మొదలగు జ్ఞానేంద్రియములు, చేతులు కాళ్ళు మొదలగు కర్మేంద్రియములు గలవు జ్ఞానేంద్రియములకు మూలవిరాట్టు మనస్సు అది సుముఖముగానప్పుడు జ్ఞానేంద్రియములకు విషయములకు సంబంధము గలిగినను ఫలములేదు ఉదాహరణము వినుము మనస్సు పరధ్యానముననున్నప్పుడు కంటియెదుట రేమిజరిగినను జరిగినదెల్ల కన్ను చూచుచుండినను మనకు తెలియుటలేదుగదా కన్ను మొదలైనవి జ్ఞానేంద్రియములైనను, జ్ఞానేంద్రియములకు విషయములకు సంబంధముగలిగి నను మనస్సు అచ్చటలేనిచో ఫలములేదు కాఁబట్టి నేత్రాది జ్ఞానేంద్రి యములకు తత్తద్విషయములందు ఆసక్తిలేకుండునట్లుగా మనస్సుచేత వివేక పూర్వకముగా వానిని నియమించి చేతులు మున్నగు కర్మేంద్రియములతో కర్మ యోగము నొనర్చుము కర్మములాచరించునప్పుడు ఫలాసక్తి యుండరాదు ఫలాసక్తిమాని చేసిన కర్మములే చిత్తశుద్ధి నిచ్చును ఆసక్తిలేని యట్టి కర్మ యోగము మేలు ఏలయందువా? ఒక్కరాతితో రెండు పిట్టలనుగొట్టినట్లు ఇట్టి కర్మయోగము నాచరించుటవలన కర్మయోగము కర్మసన్యాసము రెండు చేసినవాఁడవగుదువు ఎట్లనఁగా—చేయఁగలసిన కర్మము దానివాటికి జరుగు చున్నది ఆసక్తి లేనందున కర్మ ఫలమును సన్యసించినవాఁడవగుదువు కర్మేంద్రియములను నియమించి జ్ఞానేంద్రియ వ్యాపారము సాఁగనిచ్చుటవలన అధర్మము, జ్ఞానేంద్రియములను నియమించి కర్మేంద్రియ వ్యాపారము సాఁగ నిచ్చుటవలన శుభము గలుగుట చూచితివా?

చిత్తశుద్ధిశూన్యమైన సర్వకర్మ సన్న్యాసములకన్న చిత్తశుద్ధికొఱకు కర్మానుష్ఠానమే మేలు గావున నీవు నియతమైన కర్మమును అనఁగా నీవర్ణాశ్రమములకుఁ దగినట్టి వైదిక లౌకిక కర్మములను యథావిధిచేయుము అది యునుగాక సర్వకర్మసన్న్యాసము చేసితివేని నీకు జవయాత్రగూడ జరుగదు భిక్షమెత్తి బ్రదుకలేనాయని యందువు గాఁబోలు భిక్షమెత్తుటగూడ ఒక కర్మమేయగును అది సర్వకర్మసన్న్యాసముగాదు దేహముగూడవలదందువు గాఁబోలు నీవు సర్వకర్మసన్న్యాస మొనర్చుటేల? జ్ఞాననిష్ఠను సాధించుటకుఁగదా ? జ్ఞానోదయము కానిది జ్ఞాననిష్ఠ యెట్లుగలుగును జ్ఞానోదయమగుటకుఁ జిత్తశుద్ధివలదా ? చిత్తశుద్ధికొఱకు కర్మములుచలదా ? కర్మములు చేయుటకు దేహమువలదా ? కావున జ్ఞానోదయపర్యంతము దేహమావశ్యకమగుటంజేసి దేహధారణమును జవయాత్రయుఁ దప్పవు. 8

కర్మమువలన బంధకమనియు, జ్ఞానమువలన మోక్షమనియు, స్మృతులు చెప్పుటలేదాయని యందువా ? అట్లు చెప్పు స్మృతుల తాత్పర్యము వేఱు పరమేశ్వరారాధనార్థముగాని కర్మములు అనఁగా సకామకర్మములు బంధకములు, పరమేశ్వరారాధనార్థమైన కర్మములు బాధకములుగావు కావున ఈశ్వరప్రీత్యర్థము ఫలాభిసంధివదలి కర్మములొనర్పుము. అనఁగా నిష్కామ కర్మము చేయుము 9

జ్ఞానసాధనమగుటంజేసి కర్మము కర్తవ్యమని చెప్పితిని కర్మము కర్తవ్యమనుటకు మఱియొక కారణముగూడ గలదు కర్మాధికారులెల్లరు యజ్ఞముచేసి (యజ్ఞహుతశేషమును) మిగిలినదానిని భుజించి శరీరధారణము చేయవలసినట్లు విధివిధానము ఆ కారణమునుబట్టికూడ కర్మము కర్తవ్యమగుచున్నది. బ్రహ్మ ప్రజలను సృష్టించునప్పుడు వారిని కర్మాధికారులనుగా సృష్టించి 'ఈకర్మముల మూలమున వృద్ధిపొందుడు, ఇవిమీకు ఇష్టార్థముల నిచ్చు'నని యాజ్ఞాపించినాఁడు 10

కర్మములెట్లు ఇష్టార్థముల నిచ్చునందువా ? వినుము మనుష్యులు చేయు యజ్ఞాది కర్మముల హవిర్భాగము ఇంద్రాదిదేవతలకుఁ జెందును వారు దానితోఁ బెంపొందుదురు అందుకు మాఱుగా వారు మనుష్యులకుఁ

[illegible]పు కల్గింతురు. ఇట్లు దేవతలు మనుష్యులు పరస్పరము సంపొందించుకొనుచు శ్రేయమును బడయుదురు. 11

'ఇట్టి యేర్పాటు దేవతలకు మేలైనదగుఁగాక, దేవతలవలన మనుష్యుల కెట్టి మేలగు'నందువా? మనుష్యులుచేయు యజ్ఞాదులవలన దేవతలు తృప్తులై మనుష్యులకు పశుపుత్రాదు లిత్తురు. వైప్రకారము బ్రహ్మవిధించి మఱియొక శాసనముకూడ చేసినాడు. ఏదందువా? దేవతలిచ్చు భోగములను మఱల దేవతలకు నర్పింపక ఎవఁడు స్వయముగా అనుభవించునో వాఁడు దేవతల సొమ్ము హరించిన దొంగ యగునని శాసించినాఁడు. 12

అట్లగుచోనీ లోకములో గాన్పించు వస్తుజాలమెల్ల దేవతలిచ్చినదే యగుననియు, అది సమస్తము మఱల దేవతలకర్పించినచో మనుష్యులకు దేహధారణ మెట్లగుననియు శంకింతువు గాఁబోలు.

దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము అని మహాయజ్ఞము లైదుగలవు. ఈ యైదు యజ్ఞములను మనుష్యుఁడు ప్రతిదినము చేయవలయును, అనఁగా మనుష్యుఁడు తాను వండుకొను పదార్థములలో దేవతాదులకు అయినగునంతవఱకు పెట్టవలయును. అట్లు పెట్టఁగా మిగిలినది అమృతమనఁబడును. దానిని దిని జీవింపవలయును. సత్పురుషులిట్లు గావించి ఎల్లపాపములనుండి ముక్తులగుదురు. ప్రతి గృహస్థుఁడు ప్రతిదినము పంచసూనములను పాపముల జేయుచున్నాఁడు, (1) కూరగాయలు తరుగునప్పుడు అందులోని పురుగులు చచ్చును, (2) పచ్చడి నూఱునప్పుడు బండక్రిందపడి పురుగులుచచ్చును, (3) ప్రొయ్యి అంటించునప్పుడు చీమలు మొదలగునవి చచ్చును (4) నీళ్ళు చల్లినప్పుడు పురుగులుచచ్చును (5) దిమ్మెనప్పుడు పురుగులు చచ్చును. ఇవి పంచసూనములు. ఇవిచేయకతప్పదు, చేసినప్పుడు తెలిసియో తెలియకయో సూక్ష్మములగు జీవరాసులెన్నో నశించుచున్నవి. అందులకుఁ బ్రాయశ్చిత్తముగా పైనజెప్పఁబడిన పంచమహాయజ్ఞము లాచరింపవలయును. దేవతాదులకుఁ బెట్టక తన యుదరనిమిత్తమే వండుకొని తిను దురాచారుఁడు పాపమును దినుచున్నాఁడేగాని భోజనమును దినుటలేదు.

ఇట్లు బ్రహ్మ శాసించియున్నాఁడు గావున అశాసనమును బాటించుటకుఁ గూడ కర్మమావశ్యకమగుచున్నది 13

కర్మము కర్తవ్యమనుటకు మఱియొక కారణముఁగూడ గలదు జగచ్చక్రము నడుపవలయును, అది నడచుటకు కర్మము ముఖ్యసాధనము. ఆ కారణమువలనఁగూడ కర్మము కర్తవ్యము అదియెట్లనిన—ప్రాణులు భుజించు భోజనము పురుషులయందు శుక్లముగా స్త్రీలయందు శోణితముగా మాఱును ఈ శుక్ల శోణితములు మేళనమై సంతానమునకు దేహము నిచ్చుచున్నది. అనఁగాఁ పిండోత్పత్తి యగును ఈ భోజనము సూర్యునివలనఁ గలుగుచున్నది అనఁగా సూర్యుఁడు తన కిరణములవలన నీరు గ్రహించి మఱల వర్షింపఁగా సస్యాదులు మొలచి యాహారపదార్థముల నిచ్చుచున్నవని భావము సూర్యుని వృష్టికి యజ్ఞాహుతులు కారణమగుచున్నవి యజ్ఞములకుఁ గర్మములు కారణములు 14

కర్మములకు ప్రవృత్తి కారణము, ప్రవృత్తికి వేదములు కారణములు, అనఁగా వేదములలో ఇట్టికర్మముల విధానము గలదనియు ఆప్రకారము చేయఁగా పైరీతిగా ఫలము గలుగుననియు భావము వేదములు ప్రణవము అనఁగా ఓంకారమువలనఁ బుట్టినవి పైనఁజెప్పిన దానినిఁబట్టి జగచ్చక్రము నడచుటకు ప్రవృత్తియే కారణమని యేర్పడుచున్నదనియు అన్నము సూర్యుఁడు మొదలగువానివలెనె కర్మముగూడ న్యాయముగా జగచ్చక్రమును నడపునది గాదనియు, దానింబట్టి కర్మమెంత యవశ్యకర్తవ్యముగాదనియు శంకింతువు గాఁబోలు సృష్టి మహావిచిత్రకరమైనదగుట స్పష్టము ఈవైచిత్ర్యము కర్మవైచిత్ర్యమునుబట్టి గలుగుచున్నది మఱియొకదానివలనఁ గలుగనేరదు పరంబ్రహ్మము అన్నాదులందు వ్యాపించియున్నను వీనికెల్ల మూలమైన కర్మమునే సర్వదా యధిష్ఠించియుండును. 15

ఇట్లు బ్రహ్మము, దానివలన వేదము, దానివలన ప్రవృత్తి, దానివలన కర్మము, కర్మమువలన వర్షము వర్షమువలన అన్నము, అన్నమువలన భూతములు భూతములయుచ్చారణమువలన ప్రణవము, ప్రణవమువలన వేదములు. ఇట్లు

ఒకదానికొకటి కారణమగుచుఁ జక్రమువలెఁ బరమేశ్వరునివలన తిరుగుచుండు నట్టి యీజగచ్చక్రమునకు కర్మ యొక లంకెయైయున్నది కర్మమునుచేయనిచో ఈగొలుసు తెగిపోవును కర్మమును చేయనివాఁడు జగచ్చక్రమునకు భంగము గలిగించినవాఁడై మహాపాపాత్ముఁడగును అట్టివాఁడు జీవించియు వ్యర్థము అంతకన్న మరణమేమేలు చచ్చిపోయినచో జన్మాంతరమందేని కర్మాను ష్ఠానము నొనర్చును అట్లగుచో, తత్త్వజ్ఞానికిఁగూడ కర్మానుష్ఠానము తప్పనిది కాదాయనియు అతఁడు కర్మముచేయనిచో బ్రతికియు వ్యర్థమేగదాయనియు శంకింతువుగాఁబోలు కర్మకాండమెల్ల ఇంద్రియారాములకు అనఁగా బాహ్యేం ద్రియ వ్యాపారములతో సంతోషించువారికేగాని, ఆత్మారాములకు అనఁగా ఆత్మతో సంతోషించువారికిఁగాదు తత్త్వజ్ఞానులు రెండవకోటిలోఁ జేరిన వారు గావున వారికిఁ గర్మ మావశ్యకముగాదు 16

జ్ఞానులకుఁ గర్మము కర్తవ్యముగాదని యీక్రింది శ్లోకములలోఁ జెప్పఁ బడినది.

ఆత్మరతులనఁగా ఆత్మతోనే క్రీడించువారు ; వారికి విషయములతో నెట్టి సంబంధము గలుగదు అనగా విషయ సుఖంబులు వారికి రుచింపవు ఆత్మరతికిఁ గారణమేమంగవా ? ఆత్మతోనే వారికి తృప్తి గలుగుచుండుట వలన వారు ఆత్మరతులు గానుందురు ఆత్మతృప్తికిఁ గారణమేమందువా ? ఆత్మ సంతుష్టియే కారణము అందువలన వారికిఁజేయవలసిన కర్మములు గాని పడయవలసిన విషయానందములు గాని లేవు విషయారాములకన్నచో విషయ ములవలననే వారికిసంతోషముగలుగుచుండును,సంతోషమనఁగా అభిలాషము ఈయభిలాషము అనుభవించినగాని తీఱదు. అందువలన వారికిఁ గర్మము తప్పనిదగుచున్నది రతి-తృప్తి-సంతోషము ఇవి విషయలంపటులందు మనో వృత్తులై యుండును , జ్ఞానియందు ఆత్మరూపములై యుండును ఇట్టివాఁడే కృతకృత్యుఁడగునుగాని బ్రాహ్మణాదిజాతులందు పుట్టినంతనే కృతకృత్యుఁడు గాడు ఇట్లుండుటయే సర్వకర్మస్వరూప త్యాగరూపమైన సన్యాసమనఁ బడును. 17

తత్త్వజ్ఞానికిఁ జేయవలసిన కర్మము లేదంటివి కారణమేమందువా ? స్వర్గమునో పశుపుత్త్రాదిసంపదలనో కోరి కర్మములుచేయుదురు జ్ఞానికట్టి కోరికలేమియు లేవు కావున అతఁడు కర్మములుచేసి పొందవలసిన ఫలమేదియులేదు కర్మములు చేయనందున జ్ఞానికిఁ బ్రత్యవాయము అనఁగా లోకనిందయు లేదు విధినిషేధశాస్త్రములను అతఁడు నిర్లక్ష్యముచేసినట్లు గాదాయనియందువా ? విధినిషేధశాస్త్రములు కర్త్రాత్మదర్శికి అనఁగా అన్నిటికి ఆత్మయే కర్తయనుభావము గలవానికేగాని అకర్త్రాత్మదర్శికి అనఁగా ఆత్మ యేమిచేయదను భావముగలవానికిఁగావు జ్ఞాని యాకోటిలోఁ జేరిన వాఁడు కర్మములుచేసి దేవతలను ప్రీతిచేయవలయునని చెప్పియున్నాను కాఁబట్టి జ్ఞానులుగూడ దేవతారాధనార్థమేని కర్మములు చేయవలదా ? అట్లు చేయకున్నచో దేవప్రాతికూల్యమును అందువలన సర్వపురుషార్థ విరోధము గలుగదా యని శంకింతువు గాఁబోలు బ్రహ్మమొదలు స్థావరపర్యంతము గలవానిలో ఎవనివలనగాని ఆత్మవేత్త పొందదగిన ఫలమేదియులేదు ఆత్మవేత్తకు విరోధముచేయుటకు దేవతలకుఁగూడ సాధ్యముగాదు కాబట్టి దేవతలను ప్రీతిచేయవలసినది దేవతలవలన లాభముపొందదలఁచిన కర్మాధికారులకే విధిగాని ఆత్మదర్శికిగాదు ఆత్మదర్శి జ్ఞానము గోరును , జ్ఞానమును దేవతలీయఁజాలరు 18

అర్జునునకుఁ గర్మమే కర్తవ్యమని సకారణంబుగా 19 మొదలు 31-వ శ్లోకమువఱకు నుపదేశింపఁబడుచున్నది

అర్జునా ! కర్మయోగతత్త్వమును జ్ఞానయోగతత్త్వమును జెప్పితిని ఆ యోగములను నేర్పుతోఁ జేయు విధానమును వివరించితిని నీకింకను జ్ఞానయోగనిష్ఠకు యోగ్యత కలుగలేదని తెలిపితిని. కాఁబట్టి నీవు ఫలాభిసంధిమాని నీ వర్ణాశ్రమధర్మమునకుఁ దగినకర్మములను ఈశ్వరారాధనబుద్ధితోఁ జేయుము. ఫలాభిసంధిలేక ఈశ్వరారాధనబుద్ధితో కర్మముచేయువాఁడు చిత్తశుద్ధిని దానివలన జ్ఞానమునుబొంది తుదకు మోక్షమును బడయును. 19

సత్పురుషుల యాచారమునుబట్టిగూడ కర్మము కర్తవ్యమని స్పష్టము ఎట్లందువా ? జనకుఁడు అజాతశత్రువు మున్నగు తొల్లిఁటి రాజర్షులు కర్మము

లొనర్చి శుద్ధచిత్తులై జ్ఞానమునుబొందిరని వినవా ? ఏదియెట్లున్నను, లోక సంగ్రహార్థము అనఁగా లోకులు తమతమ ధర్మములాచరించునట్లు చేయుటకై నను నీకు కర్మము కర్తవ్యమగుచున్నది 20

నేను కర్మముచేసినయెడల లోకసంగ్రహ మెట్లగునందువా ? పెద్దలు అనఁగా సర్వశాస్త్రములెఱిఁగి అందుఁజెప్పినట్లు చేయువారు ఏపనిచేయుదురో జనులాపనినేచేయుదురు పెద్దలకుఁగూడ శాస్త్రమే ప్రమాణమగుచుండఁగా తక్కినవారికి మాత్రము శాస్త్రమే యేల ప్రమాణముగాగూడదు ? పెద్దలను జూచి తక్కినవారు నడువనేల' యని యందువా ? శాస్త్రములు చదువుటకు గ్రహించుటకు విమర్శించుకొనుటకు అందఱకుఁ దెలివితేఁటలుండవు ప్రతి వ్యక్తియుఁ దనకు మేలునుగోరి వర్తించుట లోకసహజము పెద్దలుగూడ తమమేలునేగోరి వర్తింతురనియు వారి ప్రవర్తనమునే తమకుగూడ ప్రమాణముగా నంగీకరించి వర్తించుట సౌకర్యముగాగూడ నుండుననియు, తామెంత శ్రమించి నిర్ధరించినను పెద్దలుదేల్చినదేగాని వేఱుగానుండదనియు జనుల భావము ఆకారణమువలన వారట్లు పెద్దల మార్గమును ద్రొక్కుదురు నీవును పెద్దలలోఁజేరినవాఁడవేగాని వేఱుగాదు నీవు నీవర్ణాశ్రమ ధర్మములను జేయునిచో నీమార్గమునే యితరులు ద్రొక్కుదురు, కాఁబట్టి యీకారణమునఁ గూడ నీకు కర్మము కర్తవ్యమగుచున్నది 21

అర్జునా ! సర్వలోకేశ్వరుఁడనైన నాకుఁ గర్మము చేయవలసిన కారణమేలేదు ఏలయందువా ? ఏదో యొక లాభమునుబొందుటకుఁ గర్మములుచేయుదురు ముల్లోకములలోఁగల విశేషములెల్ల నాకుఁగలవు ఇంకేదెనిఁ బొందవలసినది లేదాయందువా ? ఏదియులేక అట్లుండియు లోకసంగ్రహార్థము కర్మములు చేయుచున్నాను నేనే యిట్లుచేయుచుండఁగా నీకొఁట్లసంగతి చెప్పవలయునా ? 22

'ఫలము లేనిపని పామకూడ చేయఁదను సామెతగలదు నీవుమాత్రము ప్రయోజనకారిగాని పనిచేయుటేల ? అనియందువా ? నేను కర్మములు చేయకుందునేని నామార్గమునే మనుష్యులెల్లరు అనుష్ఠింతురు జనులకుస్వధర్మ మార్గ దర్శకుడనగుటకై ప్రాల్మాలక నిరంతరము పాటుపడుచుందును 23

నేను కర్మము చేయకున్న దోషమేమందువా ? లోకమెల్ల ధర్మముపై నాధారపడియున్నది. ధర్మము కర్మాయత్తము. ఈధర్మమును మానితేని లోకులెల్ల నశింతురు. నేను కర్మము చేయనిచో ధర్మవిరుద్ధమొనర్చుటకు దారి చూపినవాఁడనగుదును. ధర్మనాశనమువలన వర్ణసాంకర్యము గలుగును. ఈ సాంకర్యమును గలిగించి ప్రజలనెల్ల నాశనము పాలుచేసినవాఁడనగుదును. ప్రజారక్షణార్థ మవతరించితిని. అట్టినాకుఁ బ్రజావినాశము తగునా ? పరమేశ్వరుఁడవు గావున నీవు లోకసంరక్షణార్థము కర్మములు చేసినను దోషము లేదనియు, నేను జీవమాత్రుఁడననియు, జీవము కర్మబద్ధస్వభావమైనది గావున కర్మములొనర్చినచో నాకు ముక్తియే గలుగదనియు, నీదృష్టాంతము నాకు సరిపోవదనియు వచింతువా ? 24

కర్తృత్వము అభిమానము ఫలాసక్తి యివిగలిగి అజ్ఞానులు కర్మములు చేసి కర్మబద్ధులగుచున్నారు. జ్ఞానులు కర్తృత్వము అభిమానము ఫలాసక్తి లేక లోకసంగ్రహార్థము కర్మములొనర్చియుఁ గర్మబద్ధులుగారు. జ్ఞానికి అజ్ఞానికి కర్మములు చేయు విధానమందెట్టి భేదములేదు. కర్మబంధమునకు కర్మములు కారణము గాదనియు కర్తృత్వాభిమాన ఫలాసక్తులు గారణమనియు గ్రహింపవలయును. జ్ఞానియగువాఁడు పైమూఁడు విషయములు వదలి యజ్ఞానుల ప్రేరణార్థము కర్మము లొనర్పవలయును. 25

జ్ఞానమువలన మోక్షమని చెప్పుచో లోకరక్షార్థము జ్ఞానమునే యుపదేశింపవలయును గదా యని యందువా ? ఆత్మతత్త్వజ్ఞానము పరమపురుషార్థమనుట సత్యము. ఆత్మతత్త్వజ్ఞానమునకు మొట్టమొదటనే యందఱు అధికారులుగారు. అధికారులు గానివారికి తత్త్వజ్ఞాన ముపదేశించినచో వారి బుద్ధికిఁ గలవరపాటు గలుగును. ఎట్లనిన వారిస్వభావము వారిని కర్మము వంకకు లాగుచుండును, జ్ఞానోపదేశము కర్మమునకుఁ బ్రతిబంధకమైయుండును, తుట్టతుదకు వారు రెంటఁ జెడిన రేవఁడువలె ఉభయభ్రష్టులై చెడుదురు. చిత్తశుద్ధిగలిగి వైరాగ్యము తనంతట తానుదయించినప్పుడు కర్మత్యాగమునకు నవకాశము గల్గుననియు, చిత్తశుద్ధి పర్యంతము నిష్కామకర్మ మావశ్యకమనియు, నిష్కామకర్మముగూడ మొట్టమొదటనే సాధ్యము

గాదనియు సకామకర్మము ననుష్ఠించుచు శ్రవణమననాదులవలన క్రమక్రమముగాఁ బరిపక్వస్థితిని బడయుచు నిష్కామకర్మమునకు నర్హుఁడగుననియు మున్నుఁ జెప్పియున్నాను. ఏదియైనను క్రమక్రమాభివృద్ధి గాంచవలయును, హఠాత్తుగా బలవంతముగాఁ జేయునది వికమించును, కర్తకు సుఖముగాని లాభముగాని గలుగదు. వైకారణములవలన అజ్ఞానులకుఁ బరిపక్వదశకును మున్నే జ్ఞానముపదేశింపరాదు. 'పచ్చికాయఁదెచ్చి పడవేయ ఫలమౌనె' అనవినవా ? అజ్ఞానుల ప్రీతికై జ్ఞానులుగూడ కర్మములు చేసినట్లయినచో ఆకర్మములు జ్ఞానులను బద్ధగింపవా ? యనియు, అజ్ఞానులు చేయువిధముననే జ్ఞానులుగూడ కర్మములొనర్పనిచో అజ్ఞానులకెట్లు ప్రీతియగుననియు నడుగుదువా ? వినుము 26

ప్రకృతి అజ్ఞానము, అవిద్య, మాయ, అను యీనాల్గుపదములు పరమేశ్వర శక్తికి పర్యాయపదములు. ఈప్రకృతికి సత్త్వము రజస్సు తమస్సు అను మూఁడుగుణములుగలవు. సత్త్వగుణమువలన జ్ఞానము, రజోగుణమువలనఁ బ్రవృత్తి అనఁగా వ్యవహారము, తమోగుణమువలన మోహము గలుగును. ఈ మూఁడు గుణములు మనస్సునందు గానవచ్చుచున్నవి గావునఁ మనస్సు ప్రకృత్యాత్మకమందురు. లౌకికములు వైదికములునైన సమస్తకర్మములు మనస్సు చేతనే చేయఁబడుచున్నవి. ఇట్లు మనస్సుచేయు కర్మములన్నెల్ల తానే (అనఁగా ఆత్మ) చేయుచున్నట్లు మనుష్యుఁడు భావించును. ఇట్లు భావించుటకుఁ గారణమేమందువా ? మనస్సువేఱు ఆత్మవేఱు అని తెలియక మనస్సే ఆత్మయని తలంచుటవలన నిట్టి భ్రాంతి కలుగుచున్నది 27

జ్ఞానియన్నవో గుణవిభాగము కర్మవిభాగము నెఱింగియుండును. గుణములు అంతఃకరణసంబంధములేగాని యాత్మసంబంధములుగావని వేఱు చేయుట గుణవిభాగమగును. దేనినిగాని తెలిసికొనుట, తెలిసికొనినదానిని కోరుట కోరినదానిని బడయుటకు యత్నించుట—ఇది కర్మమగును. ఈకర్మమునకు సంబంధించిన మూఁడుకార్యములు ఆత్మసంబంధములుగావని గ్రహించుట కర్మవిభాగమగును. ఈగుణకర్మ విభాగమెఱింగినవాఁడు, సత్త్వగుణము జ్ఞానముగా రజోగుణము ఇచ్ఛగా తమోగుణము క్రియగా మాఱుచుండుననియు, అట్టిమార్పే కర్మమనియు, ఈ గుణములతోఁ గాని యీమార్పు

తోఁగాని ఆత్మకు సంబంధములేదనియు గ్రహించి కర్తృత్వాభిమానము ఆసక్తి నుంచఁడు. జ్ఞానికి అజ్ఞానికిఁ గర్మాచరణమందు భేదములేదు, కర్తృత్వాభిమానాదులందు మాత్రము భేదముగలదని మున్నే చెప్పియున్నాను. ఇదే దాని భావము. 28

ఈగుణములు సామాన్యులందు సముద్ర తరంగములవలె నిరంతరముఁ బుట్టుచుండును. తరంగములలోఁ జిక్కినవాఁడు అందే కొట్టుకొనునట్లు ఈ గుణకార్యములకుఁ జిక్కినవాఁడు అందె దవిలియుండును. చిత్తశుద్ధియను తెప్ప దొరికినచో వాఁడు బయటఁబడును. తెప్ప దొరకనంతవరకు వాఁడు కొట్టుకొనుచుండవలయును. ఆపనిగూడ చేయవలదని చెప్పినచో వాఁడు మునిఁగిపోవును. అట్లే జనులు సామాన్యముగా లోకాచారములచే జిక్కి ఫలాభిసంధితోఁ గర్మములాచరించుచుందురు. వారికి వారికర్మములవలననే క్రమక్రమముగా చిత్తశుద్ధియు నైష్కర్మ్యసిద్ధియు గలుగునట్లు చేయవలయునేగాని కర్మములను బొత్తుగా వదలుమని వారికి నుపదేశింపరాదు. 29

అర్జునా! కర్మము కర్తవ్యమనుటకు కారణము స్పష్టముగా చెప్పెదను. మనుష్యుఁడు స్వతంత్రించి సుకర్మకుఁగాని అధర్మమునకుఁగాని పూనుటకు సమర్థుఁడుగాఁడు. రాజాజ్ఞను భృత్యుఁడువలె లోకమునందు పరమేశ్వరుని యాజ్ఞను బుద్ధిచేయుచున్నది. సమస్తకర్మములనుఁ బరమేశ్వరునకైన నాకు సమర్పింపుము. నీవుచేయు కర్మములెల్ల నాయారాధనరూపములే యనుకొని జేసి వానిఫలము నభిలషింపవలదు. అభిలాష యేలయుండవలదనవా? మమకారము అనఁగా నాదియిది యను బుద్ధి, అదియున్నయెడల అభిలాషయుండును. సర్వముఁ బరమేశ్వరునకు నర్పించునప్పుడు నీదియేముండును? ఏదియుండదు. గాఁబట్టి నీకు మమకారముండుటకు నవకాశములేదు. మఱియు నింకొకటి గలదు. 'నేనిట్లారాధించుచున్న యాపరమేశ్వరుఁడే నాకు దిక్కు, ఆయన నీయుఁడే నాకు బంధవిమోచనము చేయునను దృఢవిశ్వాసముండవలయును.' ఇట్టి నిశ్చయముతో సంసారశోకమును వదలి యుద్ధమను కర్మము నాచరింపుము. 30

ఫలాసక్తి మమకారములులేక కర్మములెల్లఁ బరమేశ్వరారాధనములుగా

జేయవలసినదని చెప్పితిని. సర్వజ్ఞుఁడను సర్వలోకమిత్రుఁడను ఎల్లరకు గురువునునైన నా యీచెప్పినప్రకారము ఎవఁడు చేయునో, అట్లు చేయలేక పోయినను నేను చెప్పినది సత్యమను విశ్వాసమైనను ఎవనికినుండునో, ఒకవేళ విశ్వాసముగూడ లేకున్నను ఎవఁడు నామతమును నాక్షేపింపఁడో యీముగ్గురును పుణ్యపాపరూపములై బంధకారణములగుచున్న కర్మములనుండి విమోచనమును బడయుదురు "నీమార్గము ననుష్ఠించువారు విమోచనమునుబొందుట యుక్తమే గాని లక్కిన యిద్దరుగూడ విమోచనమును బడయుదురనుట యెట్లు సరిపోవు నందువా ? శ్రద్ధావంతుఁడు క్రమక్రమముగా ననుష్ఠించి కడతేఱును ద్వేషబుద్ధిలేనివానికి నేఁడుగాకున్నను రేపేనియు శ్రద్ధజనించును, ఆశ్రద్ధయే వానిని అనుష్ఠానమునకు బలవంతపెట్టును. దానివలన యట్టివాఁడును విమోచనము నొందుచున్నాఁడు. నామతము ననుష్ఠించినందువలన గలుగు ఫలమును జెప్పితిని. 31

నేను చెప్పినట్లు చేయనివాఁడును, చేయకపోవుటయేగాక యాక్షేపించు వాఁడును, చేయకపోవుట ఆక్షేపించుటలు లేకపోయినను శ్రద్ధగూడ లేని వాఁడును—ఈమూఁడురకములవారు చెడిపోవుదురు. చెప్పినట్లు చేయనివాఁడు తరణోపాయములైనట్టి కర్మజ్ఞానమార్గములు రెండుఁ దెలియనివాఁడై యెడతెగని సంసారములో మునుగుచుండుఁ దేలుచునుండును ఆక్షేపించువాఁడు పాపిష్ఠుఁడై నరకముపాలగును, శ్రద్ధలేనివాఁడు వివేకములేని జడుఁడగును. 32

"అట్లయినచో ఎల్లరు నీవుచెప్పినట్లు చేయరేలో"యని యందువా ? జ్ఞానిగాని అజ్ఞానిగానీ వానివాని పూర్వకర్మ సంస్కారరూపమైన స్వభావము గలిగియుండును. ఆస్వభావమునకుఁ దగినట్లు వర్తింతురు జ్ఞానిసంస్కారము మంచిదగుటం జేసి, అనఁగా సత్త్వగుణ ప్రధానముగానుండును గావున, సత్త్వగుణ కర్మములే నామతముగూడ ఉపదేశించును గావున, జ్ఞాని నామతము నవలంబించినవాఁడగుచున్నాఁడు. అజ్ఞానిస్వభావ మట్టిదిగాదు గావున వాని కర్మములు నామతమునకు విరుద్ధముగానుండును ప్రాణులు చెడ్డమార్గము ద్రొక్కకుండునట్లు నీవుచేసినచో వారట్లుచేయుఁగలరోయనియందువా ? నేను నిగ్రహించినను వారు వారిమార్గమును మానరు కావున నానిగ్రహము ఫలము

లేదు. దృష్టాంతము వినుము. అపథ్యముచేయుట, హింసించుట, పరస్త్రీల బొందుట, మొదలగునవి దోషములని నేను శాస్త్రములందుఁ బ్రకటించి యున్నాను ఈసంగతి తెలిసియు స్వభావ ప్రవశులై జనులాపనులు చేయుచున్నారుగదా. కావున స్వభావమును మార్చుటకు ఎవ్వఁడు [illegible] సమర్థుఁడుగాఁడు. ఏలయందువా? ప్రాచీనకర్మమునుబట్టి వాసన అట్టిది అనుభవించి తీఱవలసియున్నది ప్రాచీనకర్మము సామాన్యులకేగాదు [illegible] శ్రీరాముఁడు మొన్నగువారికిఁగూడ తప్పినదా? ప్రబలతరమైన ప్రాచీనకర్మ వాసనవలనఁ జెడ్డగారి నడతలు అట్లు నడచుట [illegible] గాదని తెలిసియు మానఁజాలరు. 'స్వభావము ఈశ్వరునకుఁగూడ మిక్కిలి దుర్నిగ్రహమైన దగునో ఈశ్వరుఁడుండియు ఫలమేమి'యని యందువా? స్వభావమునకు [illegible] బలము ఈశ్వరునివలననే గలిగినది స్వభావకార్యమైనది లోకములో నెట్లన, 'స్వభావమంత దుర్నిగ్రహమైన దంటివి ప్రాణుల మంచిచెడ్డపనులకు స్వభావమే కారణమంటివి. ప్రతిప్రాణి స్వభావము ప్రకారము నడచుట తప్పనప్పుడు, ఇది చేయనగును, ఇదిచేయరాదు అను విధినిషేధశాస్త్రము లుండియు ఫలమేమి? శాస్త్రప్రకారము నడచుటకు [illegible] గాదుగదా?' అనియందువా?

జ్ఞానేంద్రియములు అనఁగా శ్రోత్రాదులు, కర్మేంద్రియములు అనఁగా వాక్కు మొదలగునవి శరీరమునందున్నవి శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియములకు శబ్దము మొదలగునవి, వాక్కు మొదలగువానికి మాటలు మొదలగునవి అనుకూలములైనప్పుడు రాగము ప్రతికూలమైనప్పుడు ద్వేషము కలుగుచుండును ఆ రాగద్వేషములవలన స్వభావము ప్రకారము ప్రవృత్తి నివృత్తులను గలిగించుచున్నది కాబట్టి యీరాగద్వేషములు [illegible] వులు. రాగద్వేషములకుఁ లోఁబడవలదని శాస్త్రము విధించును ఏలన ప్రబలమైన యనిష్టముతోఁ గూడియున్నను అది యిష్టమను జ్ఞానము [illegible] వలన వాస్తవముగా అనిష్టరూపమైనదే యిష్టసాధనమను [illegible] వలనఁ గలుగును ఆరాగమును బురస్కరించుకొని శాస్త్రనిషేధమైన పరదారగమనాదులను స్వభావము చేయించును ఏలన [illegible] అది యట్టిదను జ్ఞానము లేకపోవుటవలన వాస్తవముగా [illegible]

సాధనమని ద్వేషమువలనఁ గలుగును. ఆద్వేషమును బురస్కరించుకొని శాస్త్రవిహితములైన సంధ్యావందనాదులనుఁగూడ స్వభావము చేయనీయదు. ఏకార్యమునైనను చేయుటకుఁ జేయకపోవుటకు ఈరాగద్వేషములే కారణములు. ఇట్టి సందర్భములలో నిషేధశాస్త్రము ఇష్టసాధనములని రాగమువలనఁ భావించు గార్యముల తత్త్వము విమర్శించి యాపనులు చేయుటవలనఁ గిష్టములువచ్చును గావున దానిని చేయరాదని చెప్పును, విధిశాస్త్రము అనిష్టసాదనములని ద్వేషమువలన భావించు కార్యముల తత్త్వమును విమర్శించి యాపనులు చేయుటవలన శ్రేయము, చేయకపోవుటవలనఁ గష్టమువచ్చునని బోధించును విధినిషేధశాస్త్రములు ఇట్లు బోధించునప్పుడు శాస్త్రబోధను వినువారు మేలుపడయుదురు. కావున శాస్త్రము నిష్ప్రయోజనముగాదు శాస్త్రము బోధించినను జనులు చేయరానిది చేయుట చేయవలసినది మానుట గలదు కారణమేమందువా? సంస్కారవాసన ప్రబలముగానున్నప్పుడు హితోపదేశములు సాగవు అందువలన నట్లుసేయుదురు అట్టి వాసనాజన్య కర్మముల నాపుటకుఁ దరముగాదు 34

శాస్త్రములలో ననేకకర్మములు చెప్పఁబడియుండును ఆకర్మము లెల్ల ప్రతిపురుషుఁడు చేయవలయునాయని యందువా? ప్రతిపురుషుఁడు వానివాని వర్ణాశ్రమధర్మములగు కర్మములనే చేయవలయును, తన వర్ణాశ్రమ దర్మములకు అనుకూలింపని కర్మములను జేయరాదు. పరులకు ధర్మములగు కర్మములను సాంగోపాంగముగా నొనర్చుటకన్న తనకు దర్మములగుకర్మములను అంగహీనముగా నొనర్చినను మేలేయగును, తనధర్మమాచరించుటలోఁ జావు వచ్చినను మేలేయగునుమా పరధర్మము నరకకారణమగును, తనతల్లి కురూపియైనను ఆమెకు మహారూపవతియగు పరుని తల్లి సాటియగునా? 35

అర్జునుఁడు అడుగుచున్నాఁడు

పురుషునిట్లు సర్వకర్మములకుఁ బ్రేరింపునది రాగద్వేషములేనా? మఱి వేఱొకటియైనను న్నదా? రాగము కారణముగునేని తానుచేయుపనియందు పురుషునకు ఇష్టముండి తీఱును ఇచ్ఛలేకున్నను రాజాజ్ఞను భృత్యుఁడువలె కొన్నిపనుల పురుషుఁడు చేయుచుండను ఇట్టి సందర్భములలో రాగమే

కారణమనుపట్లు? దీనింబట్టిచూడ కార్యప్రేరణమునకు రాగాదులకన్న నితరమైనది మఱియొకటియున్నట్లు భావింపకతీఱదు. ఈపాపప్రేరకములలో బలవత్తరమైనదియేది? దేనిని మొట్టమొదట జయించినచో తక్కినవి స్వయముగానే పరాజితములగునో దానిని చెప్పుము. 36

అర్జునా! సర్వానర్థములకు మూలమైనది యొకటిగలదు. దానిని కామమందురు. ఈకామమునకు ఏదేని అడ్డపడునేని అప్పుడీకామమే క్రోధముగా మాఱుచున్నది. ప్రధానశత్రువైన యీకామమును మొట్టమొదట జయింపవలయును. దానిని జయించినచో సర్వజయమగును. శత్రువులను జయించుటకు సామము దానము భేదము దండము అను నాలుగుపాయములు చెప్పఁబడినవి. అందేయుపాయంబునఁ గామమును జయింపనగునని యడుగుదువా? ఈకామము మహాపాపము లొనర్చునదిగానున్నది. అనఁగా అత్యుగ్రమైనది, కావున సామము పనికిరాదు. ఈకామమునకుఁగల యాస యింతనగాదు నెట్టినకొలఁది పెరుఁగుచుండునేగాని తగ్గదు. కావున దానమువలన దీనిని వశపఱచుకొన సాధ్యముగాదు. ఈకామము రజోగుణమువలనఁ బుట్టినది. రజోగుణమునకుఁ బోరాటమన్న మహాప్రియము. కావున భేదోపాయము పొసఁగదు. 37

కామము ఏవిధమునఁ బురుషునకు అపకారమొనర్చునందువా? వినుము సూక్ష్మావస్థయని, స్థూలావస్థయని అతిస్థూలావస్థయని కామమునకు మూఁడు అవస్థలు గలవు. సూక్ష్మావస్థయందుఁ గామమునకుఁ దాఁగోరుచున్న విషయముయొక్క తత్త్వము తెలియదు, అందువలనఁ దానియందు పట్టుదల యంతగానుండదు. ఈయవస్థయందలి కామమును ధూమమునకుఁబోల్పవచ్చును. ధూమము గప్పియున్నప్పుడు అగ్ని కాల్చుశక్తి గలిగియుండియుఁ బ్రకాశమును గలిగింపఁజాలనట్లు సూక్ష్మరూపమైన కామముచేత గప్పఁబడియున్నప్పుడు మనస్సు వస్తుజ్ఞానమును గలిగించుశక్తి గలిగియుండియు తత్స్వప్రకాశమును గలిగింపఁజాలదు. రెండవయవస్థకు దృష్టాంతము మలినము గప్పియున్న యద్దము ప్రతిబింబము నేమాత్రముగూడ గ్రహింపఁజాలనట్లు స్థూలరూపమైన కామముచేత గప్పఁబడియున్నప్పుడు మనస్సు మోహగ్రస్తమై యుండునేగాని

శివు యజ్ఞానమునుగూడ గలిగింప జాలదు. మూఁడవ యవస్థకు దృష్టాంతము మాయు గప్పియున్న శిశువు కాలు సేతులు గదలింపఁజాలదు, దాని స్వరూపము గూడ గాన్పింపదు. అట్లే అతిస్థూలమైన కామము గప్పియున్నప్పుడు మనస్సు ఏపని చేయజాలదు, దాని స్వరూపముగూడ తెలియరాదు. 38

పైనఁజెప్పినట్లు కామము జ్ఞానమును అనఁగా వివేకజ్ఞానాత్మకమైన యంతఃకరణమును గప్పియుండును. అందువలనఁ గామము మనుష్యునకు వైరిగానున్నది. పరిణామమున దుఃఖకారణమైనను భోగకాలమున సుఖమును గలిగించును గావున కామము నిత్యవైరి యనుట చెల్లునాయని శంకింతువు గాఁబోలు. నీవుచెప్పినది మూర్ఖునకు అన్వయింపవచ్చును. కామము అనర్థముతోఁ గూడియున్నదను సంగతి వివేకికి భోగకాలమునఁగూడ తెలిసియే యుండును. కావున వానికది భోగపరిణామకాలంబుల రెంట దుఃఖహేతు వే యగుచున్నది. లోతునకు దిగి విచారించితి మేని కామము మూర్ఖునకుఁగూడ నిత్యవైరియేయగుచున్నది. ఎట్లనిన కోరికలు సుఖముగా లభింపవు, ఎంతో కష్టసాధ్యములు. కావున సాధనావస్థయందుఁగూడ దుఃఖముగలదు. భోగావస్థ యందన్ననో నిప్పునకుఁ గట్టెలు వేయుకొలఁది ప్రజ్వరిల్లునట్లు కామము అనుభవించుకొలఁది పెరుగుచుండునేగాని తగ్గదు. స్వల్పభోగము ననుభవించునప్పుడు అంతతోఁదృప్తిపడదు, అంతకన్న అధికమైనభోగము కావలయునను దుఃఖము గలుగుచుండును. అది పడసినప్పుడు అంతకు మించినది కావలయునని కోరుచుండును. కావున కామము వివేకికి అవివేకికి ఇద్దఱకు నిరంతర దుఃఖమును గలిగించుచున్నది. అందువలన నిది ఎల్లరకు నిత్యవైరియైయుండును. 39

కామము అనన్యసాహాయ్యముగా నింతపని చేయునాయని యందువు గాఁబోలు. జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు, సంకల్పాత్మకమైన మనస్సు, వ్యవసాయాత్మకమైన బుద్ధి—ఇవి కామమునకు ఉపకరణములు. ఈయింద్రియాదులను ఉపకరణములుగాఁ జేసికొని కామము జ్ఞానమును గప్పి జీవుని మోహావశము చేయుచున్నది. నేత్రములు మొదలగు ఇంద్రియములవలన మొదట విషయములనుబొంది ఆవిషయములు సుఖమును గలిగించునని మనస్సులో సంకల్పించుకొని వానిని తప్పక అనుభవింపవలయు

సని మనుష్యుఁడు నిశ్చయించుకొనును. ఈనిశ్చయము మ్రింగుటవలన వివేకము నశించుచున్నది 40

కామమంత దురత్యయమగుచో దానిని జయించు ప్రయత్నమే వదలవలయునుగదా యనియందువా? ప్రయత్నము వదలరాదు కామమునకు ఉపకరణములైన మనస్సు బుద్ధి మొదలగు నింద్రియములను మొట్టమొదట నిగ్రహింపుము. ఇంద్రియములను నిగ్రహింతువేని సర్వపాపమూలభూతమైన కామము సేనయెల్ల పరవశమైనప్పుడు రాజువలె ఏకాకిగా దొరకును. అప్పుడు దానిని సులభముగా గెలువవచ్చును జ్ఞానముదయించెనేని కామము తనంతట తానే నశించుచుండగా, జ్ఞానసంపాదనమునకు ప్రయత్నింపక కామమును జయించు ప్రయత్నము చేయుటేలయందువా? జ్ఞానము అనఁగా శాస్త్రీయమైన పరోక్షజ్ఞానము, విజ్ఞానమనఁగా అపరోక్షజ్ఞానము ఇవిరెండును గామమును జయింపనిదే కలుగవు ఒకవేళ జ్ఞానముదయించినను పరోక్షజ్ఞాన ముదయించునేగాని అపరోక్షజ్ఞాన ముదయింపదు అపరోక్షజ్ఞానోదయమునకుఁ గామమును జయింపక తప్పదు ఎట్లుచూచినను కామజయమే మొదట ముఖ్యము 41

అర్జునా! నామతము ననుష్ఠించుటకుఁ గామజయము ముఖ్యమనియు, కామమును జయించుటకు ఇంద్రియనిగ్రహము పరమోపాయమనియు వివరించితిని కామముయొక్క వాసనగూడ నుండరాదు అంతపూర్తిగాఁ గామమును జయించినఁగాని మోక్షము లభింపదు ఈవిషయము రెండవయధ్యాయము 59-వశ్లోకములో సూచించియున్నాను కామము నట్లు నిర్వాసనగాఁ జేయుటకు మార్గము చెప్పెద వినుము నేత్రాదులైన యింద్రియములు దేహాద్యర్థములకన్న నుత్కృష్టములు, ఇంద్రియములకన్న సంకల్పాత్మకమైన మనస్సు ఉత్కృష్టమైనది, ఏలయందువా? ఇంద్రియములనెల్ల మనస్సు నడిపించుచున్నది మనస్సునకన్న నిశ్చయాత్మకమైనబుద్ధి యుత్కృష్టమైనది ఏలయందువా? వట్టిసంకల్పము ఏమిచేయఁజాలదు, సంకల్పమున నిశ్చయించి యాజ్ఞయిచ్చునది బుద్ధియైయున్నది బుద్ధికిఁ దర్వాత దానికి సాక్షిభూతమై యాత్మయున్నది. ఇంద్రియాదులకు అధిష్ఠానమైన కామము వివేకమును కప్పి

పుచ్చుటవలన ఆయాత్మకు మోహము గల్గించుచున్నది. ఈయాత్మ
సర్వాంతర్యామియైయున్నది, దానికి మించినది మఱియొకటి లేదు. ప్రతి
మనుష్యునిబుద్ధి వ్యష్టిబుద్ధి యగును, ఈవ్యష్టిబుద్ధికన్న సమష్టిబుద్ధి అధికతర
మైనది. ఈసమష్టిబుద్ధి హిరణ్యగర్భుని బుద్ధియగును. ఈ సమష్టిబుద్ధినే
మహత్తు అని చెప్పుదురు, ఈమహత్తునకు తర్వాత అవ్యక్తమనునది గలదు,
అవ్యక్తమునకన్న ఆత్మ పరమైనదిగా నున్నదని భావము. 42

'ఆత్మ యన్నిటికన్న నుత్కృష్టమైనదే యగుఁగాక నీవుచెప్పునదేమి?'
అని యడుగుదువుగాఁబోలు. రెండవ యధ్యాయము 59-వ శ్లోకములో
నేనుసూచించినట్లు, ఈయాత్మను నిరతిశయానంద రూపముననుండు దానినిసాక్షా
త్కరించుకొనవలయును. ఆత్మ సాక్షాత్కారమునకు సాధనమేదందువా?
మనస్సును సంస్కరింతువేని ఆమనస్సు నీకు సాధనమగును. అంతకన్న మఱి
యొక సాధనములేదు. ఆత్మ సాక్షాత్కారమై మనస్సు దానియందెప్పుడు
స్థిరముగా నిల్చునో యప్పుడు కామము తనపోకల్లమాని నిర్బీజమగును.
కామమెప్పుడు నిర్బీజమగునో (అనగా వేయించినగింజవలె లోనిసత్తా ఎప్పుడు
లేనిదగునో) యప్పుడే దానివాసన మాయమగును. కామమెప్పుడట్లు సవా
సనగా నశించునో యప్పుడు అపరోక్షజ్ఞానము నిర్వికల్పకమగును. కామము
నిర్బీజమగుటకు నిదే మార్గము 43

---

# గీతాహృదయము.

## నాల్గవ యధ్యాయము.

జ్ఞానయోగమునకు కర్మయోగము ఉపాయము ఈకర్మయోగము మూఁడవ యధ్యాయములోఁ జెప్పఁబడినది దానినే నాల్గవ యధ్యాయములోఁ గూడ విస్తరించి చెప్పుచున్నాఁడు ఈకర్మయోగము నిన్న నేఁడు పుట్టినది గాదనియు అనాదినుండి సంప్రదాయముగా వచ్చుచున్నదనియు దానం జేసి గూడ అది తప్పక యనుష్ఠింపవలసినదిగా నున్నదనియు క్రిందిమూఁడు శ్లోకములలో శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు.

కర్మనిష్ఠను ఉపాయముగాఁ జేసికొని తత్త్వజ్ఞాననిష్ఠను బొందుట అనెడి యోగమును నీకుఁ జెప్పితినిగదా యుద్ధమువలదని శోకమోహములను జిక్కి యున్న నీవు ఆశోకమోహములు తొలఁగుకొఱకు క్రొత్తగా నిప్పుడు చెప్పితినని తలంపవలదు మోక్షఫలకమైన యీయోగమును నిఖిలజగదుద్ధారార్థము మన్వంతరమప్పుడే సకలక్షత్రియవంశమునకు బీజమైన సూర్యునకుఁ జెప్పితిని సూర్యుఁడు తనపుత్త్రుఁడైన వైవస్వతమనువునకు నుపదేశించెను వైవస్వతమనువు తనపుత్త్రుఁడును మొట్టమొదటి రాజునైన ఇక్ష్వాకువునకు నుపదేశించెను 1

అర్జునా, ఈయోగమిట్లు మన్వాదిపరంపరగా వచ్చుచున్నది వీని నితరరాజర్షులుగూడ ఎఱుంగుదురు 'అట్లయినచో నిప్పటి రాజులేల ఎఱుంగ' రందువా? ఆయోగము కాలక్రమంబున మందమతులు అజితేంద్రియులు అనధికారులునైన వారిని బొందినది వారు కామక్రోధములకుఁ జిక్కినవారగుటం జేసి యీయోగమును జక్కఁగా నెఱవేర్పలేరైరి అందువలన సంప్రదాయమునకు భంగము గలిగినది, యోగమును మఱచిరి. 2

ఈయోగమును నేను నీకిప్పుడు స్వస్వరూపముగా నుపదేశించితిని నీకే

చెప్ప వలయుందువా? నీవు నాకు భక్తుఁడవు సఖుడవు, దానం జేసి నీకుఁ జెప్పి తిని కేవలము భక్తుఁడు కేవలము సఖుఁడుగాక రెండునైనవానికన్నఁ బ్రియుఁ డెవఁడగును ? అట్టి ప్రియునకు దాఁపఁదగిన దేమండును ? కావున నీకిట్టి రహస్యమునుగూడ జెప్పితిని నేను జెప్పినది సమస్తశ్రుతిస్మృతిపురాణేతి హాసములందలి రహస్యముగాని వేఱుగాదు నేనుదక్క మఱియొకరు దీని నెఱుంగుటకు గాని చెప్పుటకుఁగాని సమర్థులుగారు 3

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

నీవు దీనిని మొదట సూర్యునకుఁ జెప్పితినంటివి ఈదేహము ధరించిన తర్వాత చెప్పితివా? దేహాంతరముతోనున్నప్పుడు చెప్పితివా? ఈదేహము ధరించినతర్వాతఁ జెప్పితినందువేని, నీవు వసుదేవుని గృహమందు ఈదేహముతో నిటీవల జనించితివి సూర్యుఁడు నీకన్న నెంతో ముందుజనించెను అట్టి సూర్యునకు నీవుదీనినిఁజెప్పితివనుట బోధపడదు ఈజన్మములోగాక పూర్వము మఱియొక జన్మమెత్తినప్పుడు చెప్పితినందువా? మఱియొక జన్మములో జరిగిన సంగతి జన్మాంతరమున జ్ఞప్తియుండునా? జ్ఞప్తియుండునేని నాకుఁగూడ నట్లే జ్ఞప్తియుండవలదా? దేహాంతర వృత్తాంతము మహనీయులకు జ్ఞప్తి యుండునని చెప్పుట నిజమే నీవట్టి దివ్యపురుషుఁడవా? లేక సాక్షాత్పర బ్రహ్మవా? దివ్యపురుషుఁడవేని సూర్యుఁడుగూడ దివ్యపురుషుఁడేగాని సామాన్యుఁడుగాఁడు నీకు జ్ఞప్తియున్నప్పుడు సూర్యునకుఁగూడ జ్ఞప్తియుండి తీఱవలయును మఱియు దివ్యత్వంబున నీవునుసూర్యుఁడును సమానులైనప్పుడు సమానులొకరికొక రుపదేశించుట యెట్లుసాధ్యమగును? కావున కేవల దివ్య పురుష ప్రభావంబున నీవు సూర్యునకు బోధించుట జెల్లదు పరమేశ్వరుఁడ నందువేని, పరమేశ్వరునకుఁ గర్మపరవశములైన మనుష్య జన్మాదులు గలుగుట యసంభవము. ఎట్లు విచారించినను నీభావము స్పష్టముగాదు 4

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! నేను నిత్యసర్వజ్ఞుఁడను ఈనిత్యసర్వజ్ఞత్వము నాకుఁదప్ప యన్యులకు గలుగదు కావున నాకు జన్మాంతరమునందు జరిగినవి జ్ఞప్తి యుండును, నీకట్లు జ్ఞప్తియుండదు నాకు నీకుఁగల తారతమ్యమిది ఈ

రహస్య మెఱుంగక యిట్లనుచున్నావు. నిజమటె నాకుఁగూడ ఎన్నో జన్మములు గడచి వి ఏయేజన్మములో నేనేమేమిచెసినది నాకు జ్ఞప్తియున్నది, నీకు జ్ఞప్తిలేదు. జ్ఞప్తియుండదు కతము హేపద్యము స్మరించుట గొప్ప వింతగా సామాన్యులు దలంతురు ఇందు వింతయేమియు లేదు వ్యవహార మెల్లఁ గారణకార్య పరంపరారూపంబునమన్నది కారణమువలనఁ గార్యము గలుగుచున్నది ఈకార్యము మఱియొక కార్యమునకుఁ గారణమగుచున్నది కారణము తెలిసినప్పుడు తత్కార్యము తెలిసినట్లెయగును ఆత్మ నిత్యము దప్పియుండె యుండును గావున దానికి కారణకార్యపరంపరలు స్వప్నము జ్ఞానులాత్మజ్ఞులగుటంజేసి వారికి భూతవర్తమాన భవిష్యదర్థంబులు కరతలామలకములుగానుండును. జ్ఞానులలో నేను నిత్యసర్వజ్ఞుఁడ నగుటంజేసి నాకుఁ దెలియనిది యుండదు

'సంకల్పము శుద్ధముగానీ దుష్టముగానీ ఒకసారి యుదయించినతర్వాత దానికి నాశనములేదు ఆసంకల్పములు పరమాణుస్వరూపంబుతో నాకాశమందుండును దీనినేచిత్రగుప్తుఁడు ఎప్పటిసంగతులప్పుడే వ్రాసిపెట్టుచుండునని మనవారు చెప్పుదురు యోగశక్తి సమగ్రముగాఁ గలవారు తమ మనశ్శక్తిని ఆకాశముతో సంధించినచో ఆ దు పరమాణుస్వరూపంబుననుండు సంకల్పంబులు బోధపడుచుండును ఇప్పుడు మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్న నిస్తంత్రీవార్త (Wireless telegraph) ఈమూలసూత్రము ననుసరించియే జరుగుచున్నది. సంకల్పములెట్లో యట్లే భూతవర్తమాన భవిష్యజ్జన్మ కర్మంబులుగూడ నీసూత్రాధారంబున నెఱుంగనగును. బాహ్య ప్రపంచములోనున్న సమస్తశక్తులు శరీరములో దాఁగియున్నవనియు వానికి నుద్బోధ గలిగినప్పుడవి ప్రకటితములగుచుండుననియు, యోగశక్తివలన నిట్టి యుద్బోధము గలుగుననియు, ఈరహస్యము నెఱుంగని సామాన్యు లిట్టిసిద్ధులు మహాద్భుతంబులుగా గణించుచుందురనియు' యోగిరామచరకగారు నుడివిరి

'పరమేశ్వరునకు జన్మములేల ? ఎట్లు ?' అని యడిగితివి వినుము

నాకు జన్మముగాని నాశముగాని లేవనుట సత్యమే , బ్రహ్మమొదలు పిపీలికాంతము సర్వభూతములకు నేను ఈశ్వరుఁడనగుటయు సత్యమే

జీవునకుఁగూడ జననమరణములు లేవంటివి, జీవునకన్న నీకాధిక్య మెట్లువచ్చెనందువా? జీవుఁడు ప్రకృతికి లోఁబడియుండును ప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మకమైయుండును. దీనినే మాయయనికూడ నందురు. జీవుఁడీ మూఁడు గుణములకు లోఁబడియుండును గావునను గుణములు కర్మపరతంత్రములు గావునను, జీవునకు ఆయాగుణములబట్టి జన్మము గలుగుచున్నది. పరమేశ్వరుఁడు మాయకు లోఁబడఁడు, మీఁదుమిక్కిలి మాయయే వాని యాధీనమై యుండును. దానంజేసి పరమేశ్వరుని జన్మము జీవుని జన్మమువలెఁ గర్మాయత్తముగాదు, స్వేచ్ఛాయత్తమైయుండును. కాఁబట్టి నాజన్మమే మాయగాని వేఱుగాదు.

జీవుఁడు కర్మపరతంత్రుఁడు గావున నేయేకర్మఫల మెప్పుడెప్పుడు భోగింపవలయునో యాయాకర్మఫలము ననుభవించుటకై యాయాకాలమందు దానికనుగుణమైన జన్మ మెత్తుచుండును. పరమేశ్వరుఁడు కర్మాధీనుఁడు గాదంటివి. ఎప్పుడు కర్మకాధీనుఁడు కాఁడో యప్పుడే కర్మానుభవముగాని తదర్థము జన్మములుగాని లేవని స్పష్టము. సంగతి యిట్లుండఁగా, నీకువలె నాకుఁగూడ పెక్కుజన్మములు గడచినవంటివి. నీజన్మములకుఁ గారణమేమి? అనియందువా? వినుము. జీవునకువలె నాయవతారములకుఁ గాలనియతిలేదు. ధర్మమున కెప్పుడెప్పుడు హానికలుగునో అధర్మ మెప్పుడెప్పుడు వృద్ధిచెందునో అప్పుడెల్ల నేను స్వేచ్ఛాపూర్వకముగా దేహధారణ మొనర్తును. జీవుఁడు తనకర్మము పరిపక్వమైనప్పుడు దేహ మెత్తక తప్పదు. మాయిరువురి దేహధారణమునకుఁగల తారతమ్య మిదియని స్పష్టముగా గ్రహింపుము 7

ధర్మమునకు హాని అధర్మమునకు వృద్ధి గలిగినప్పుడెల్ల జన్మించెదనంటివి, అట్టికాలము నీకు సంతోషకరమగుటంజేసి జన్మింతువా? యని శంకింతువు గాఁబోలు. అట్టికాలము సంతోషకరమగుటంజేసి నేను జన్మించుటగాదు. ధర్మసంస్థాపనార్థము జన్మింతును. ధర్మమనునది కొయ్యయో రాలయో యైనచో గట్టిగా బాదవచ్చును, అది యట్టిదిగాదు. దానికి రూపమే లేదు, రూపము లేనిదానిని నిలుపుటెట్లందువా? సాధువులు ధర్మవర్తనులై యుందురు. సాధువులను రక్షించుటయే ధర్మసంస్థాపనమగును. సాధువులను రక్షించుటకుఁగా

నేమి యనియందువా ? దుష్టులవలన సాధువులకు బాధగలుగకుండునట్లు దుష్టులను వధించుటవలన సాధువులను రక్షించుటయగును. ఇదే నాయవతార ప్రయోజనము దుష్టశిక్షణ సాధురక్షణము ప్రతియుగమందు జరుగుచుండును అట్టి యవసరమువచ్చినప్పుడెల్ల నాయవతారము గలుగుచుండును. 8

'భగవంతుని యవతారతత్త్వమును జెప్పితివి ఆసంగతి తెలియుటవలన ఫలమేమి ?' యని యడుగవచ్చును. అర్జునా ! నాజననము లౌకికసహజమైనది గాదనియు అది విశుద్ధసత్త్వమయము స్వేచ్ఛాకృతము దివ్యమంగళ శరీరగ్రహణరూపమైనదనియు, నాకర్మము దుష్టశిక్షణ సాధురక్షణరూపమైనదనియు, నాయవతార ప్రయోజనము ధర్మసంస్థాపనరూపమైనదనియు ఎవడు గ్రహించునో వాడు మఱల జన్మింపడు, నన్ను పొందును. అనఁగా నాకు సమాశ్రయణము చేయుటకుఁ బాప మడ్డుపడుచుండును, నాతత్త్వమెఱుంగునేని అట్టిపాపము పరాపంచమై నశించును పాపము నశించినంతనే ఈజన్మమందే నన్ను ఆశ్రయించును. నన్ను ఆశ్రయించినవానికి విజ్ఞానము ననుగ్రహింతును దానివలన నన్నుపొంది జన్మరాహిత్యమును బడయుచున్నాఁడు. 9

అఖిలలోకముల యనుగ్రహార్థము లీలామానుషదేహమును దాల్చి యవతరించినట్టియు, ఆశ్రయించినవారికి ముంగొంగు బంగారమైనట్టియు, పరమదయాస్వరూపుఁడనైనట్టియు నన్ను ఏకాంతప్రేమ రూపమైన భక్తితోఁగొల్చువారు నన్నువిడిచి క్షణమాత్రముగూడ జవింపనొల్లకుందురు ఎవరు నాయందట్టి ప్రేమనుంతురో వారు బ్రహ్మదులువచ్చి తమ పదవులిత్తుమని యాసపుట్టించినను నిరాకరింతురేగాని యాసింపరు అనఁగా రాగరహితులగుదురు అస యెప్పుడు లేదో యప్పుడే వారికి భయముండదు, అనఁగా ఫలము నపేక్షింపనప్పుడు ఎవరేమనుకొన్నను జంకుగలుగదు రాగభయములు లేనప్పుడు క్రోధముండదు కీమూఁడు నొకదానికొకటి పూర్వాపూర్వము కారణములు. రాగభయక్రోధములు లేనివారు నాకు మిక్కిలి ప్రియులు అనఁగా సత్త్వగుణప్రధానులైయుందురు గావున వారికి ఆత్మతత్త్వజ్ఞానమిత్తును ఈజ్ఞానమువలన వారి యజ్ఞానమును తత్కార్యమైన మలినము తొలఁగును ; వారు పరిశుద్ధులగుదురు, తుదకు వారు నారూపమును బొందుదురు, అనఁగా నా

భావమును పొందుదురు ఈనాభక్తిమార్గము క్రొత్తదిగాదు ఈమార్గమనుష్ఠించి కడతేరినవారు ఎందఱోగలరు 10

'రాగభయక్రోధములు లేనివారు నీభావమును బొందుదురని చెప్పుట వలన తదితరులకు అట్టిఫలములేదని స్పష్టముగదా అట్లగునేని ఫలదానవిషయమున నీకు పక్షపాతమున్నదనుటకు సందేహములేదని శంకింతువు గాఁబోలు కుమస్తఫలములను సర్వేశ్వరుఁడనైన నేనే యిత్తుననుట నిర్వివాదాంశము అయినను, ఎవరు దేనినిగోరి నన్నాశ్రియింతురో వారికాఫలము ననుగ్రహింతును కావున నిష్కామముతో భజించువారికి మోక్షము, సకామముతో భజించువారికి ఐశ్వర్యాదులునిత్తును కోరినది ఇచ్చునప్పుడు పక్షపాతమేమి గలదు ? ఏవిత్తుచల్లిన అపంటనిచ్చునేగాని వేఱుపంటనిచ్చునా ? 'నిన్నాశ్రియించినవారికి కోరిన ఫలము నిచ్చునప్పుడు నీకు పక్షపాతము గలుగదనుట యొప్పుకొందుము నిన్నువదలి ఇతరదేవతలను గొల్చువారికి వారు కోరినఫలము నీవీయవుగదా అది పక్షపాతముగాదా ?' యనియందువా ? కర్మాధికారులుగానివారు మనుష్యజన్మమెత్తరు మనుష్య జన్మమెత్తినప్పుడు కర్మములు తప్పవు వారుచేయు కర్మములు ఇతరదేవతల నుద్దేశించి చేయఁబడునవియైనను, ఎల్లదేవతలు నా విభూతులే గావున, తుట్టతుదకు వారికర్మములెల్ల నన్నే చెందుచున్నవి కావున ఏదేవతను భజించినను ఆయా దేవతారూపంబునఁ దద్భక్తులకు ఫలమును నేనేయిచ్చుచున్నాను దానంజేసి నీవన్న యాక్షేపము నకు నవకాశములేదు. 11

ఎల్లరకుఁ గోరిన ఫలములిచ్చునది పరమేశ్వరుఁడవగు నీవేయైనచో, ఎల్లప్రాణులయందు నీయనుగ్రహము సమానమగుచో, అందఱు మోక్షార్థమే నిన్నేల యాశ్రియింపరందువా ? మనుష్యులు తమతమ కర్మఫలములను గోరుదురు అందువలన వారు తత్ఫలదాతలగు ఇంద్రాదిదేవతలను భజింతురు ఫలాపేక్షమాని నిఖిల దేవతాత్మకుఁడనైన నన్ను భజించువారు మిక్కిలి యరుదు. మనుష్యులట్లేల చేయుదురందువా ? పూర్వకాలసంచితములైన దురితములవలన వారి మనస్సులు కళంకితములై యుండునేగాని శుద్ధములుగా

నుండవు. అందువలన వారికి సద్యఃఫలములందె దృష్టియుండును. అట్టి ఫలములను ఇంద్రాది దేవతలు శీఘ్రముగా నిత్తురు దానంజేసి వారు అట్టి దేవతలను భజింతురు సంసారరూపమైన జననమరణములనుండి తప్పించుకొనవలయునను సంకల్పమే వారికి నుండదు అందువలన మోక్షార్థము యత్నింపరు, మోక్షదేవతను నన్ను భజింపరు, 12

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాల్గువర్ణములను అనఁగా బ్రహ్మాది పిపీలికాంతము వరకుఁగల సర్వసృష్టిని నేను సృజించితిని ఏప్రకారమందువా? గుణవిభాగమునుబట్టి కర్మవిభాగమునుబట్టి సృజించితిని ఎట్లనిన- సత్త్వగుణప్రధానులు బ్రాహ్మణులు, వారికి శమదమాదులు కర్మములు సత్త్వగుణము అప్రధానము రజోగుణము ప్రధానముగాఁ గలవారు క్షత్రియులు, వారికి శౌర్యము యుద్ధము మున్నగునవి కర్మములు, రజస్తమోగుణములు ప్రధానముగాఁగలవారు వైశ్యులు, వారికిఁ గృషిమున్నగునవి కర్మములు; తమోగుణము ప్రధానముగాఁగలవారు శూద్రులు, వారికి త్రైవర్ణములవారిని శుశ్రూషించుట మున్నగునవి కర్మములు. ఇట్లే సమస్త జీవకోటిని సృజించితిని జగమెల్ల ఒక్క స్వభావమేగలిగియుండక ఇట్లు విషమమైన స్వభావము గలిగియుండునట్లు సృష్టిచేయుటవలన నీయందు వైషమ్యము దయారాహిత్యము గాన్పించుచున్నవిగదా యనియందువా? జగమెల్ల విషమస్వభావము గలిగియుండుట సత్యమేగాని ఈజగత్సృష్టికి వ్యవహారదృష్టితోఁజూచినప్పుడు నేను కర్తనగుదునేగాని పరమార్థదృష్టితోఁ జూచినప్పుడు కర్తను గాను ఏలయందువా? నేను అవ్యయుఁడను అనఁగా త్రివిధపరిచ్ఛేదరహితుఁడను అట్టి నేను సృష్టించుటయే నిజమైనచో నీవన్న వైషమ్య నైర్ఘృణ్యములు నాకున్నట్లు భావింపవచ్చును నేను సృష్టికర్తననుటయే మిథ్య కావున నాకు వైషమ్యాదులున్నవనుట చెల్లదు. పరమార్థదృష్టితో విచారించినప్పుడు సృష్టికర్తవుగాకున్నను వ్యవహారదృష్టితోఁ జూచినప్పుడైనను సృష్టికర్తవగుదువుగదా యనియు, వైషమ్యాదులు వ్యవహారమునకైన నీయందున్నట్లుఁ ఏర్పడునుగదా యనియు, శంకింతువుగాఁబోలు ఈవైషమ్యాదులు నేను సృష్టింపలేదు, వారివారి ప్రాచీన గుణకర్మవిభాగముననే గలుగుచున్నవి.

వ్యవహారదృష్టిని బట్టిగూడ వైషమ్యాగులను నాయందారోపించుట న్యాయము గాదు 13

నేను సృష్టికర్తను గాదనుటకు మఱియొక కారణముగూడఁ గలదు అహంకార ఫలాపేక్షలతో లోకమునందుఁ గర్మములాచరింతురు, అందువలన గర్మములు బంధకములగుచున్నవి అవి రెండును నాకు లేవు గావున కర్మములు నాకు బంధకములుగావు కర్మములు బంధకములుగానప్పుడు వాస్తవమైన కర్తృత్వముండదు ఈరహస్యమెఱింగినవాఁడు కర్మబద్ధుఁడుగాడు అనఁగా అహంకారము స్పృహ ఇవిమాని చేయుకర్మములు బంధకములుగావని యెఱింగి అహంకారస్పృహాలువదలి కర్మములాచరించి తత్త్వార్థజ్ఞానమును బడసి ముక్తుఁడగును 14

అర్జునా! ప్రస్తావవశంబునవచ్చిన అవతారతత్త్వమునుగూర్చియు తత్సంబంధ విషయములనుగూర్చియుఁ జెప్పితిని పైనఁజెప్పినట్లు అహంకార స్పృహాలులేని కర్మములు బంధకములు గావనుట గ్రహించి జనకాదులగు తొల్లిటి మోక్షార్థులు కర్మములొనర్చిరి కావున నీవునట్లే కర్మములాచరింపుము, కర్మము చేయననిగాని కర్మసన్యాస మొనర్తుననిగాని చెప్పఁదగదు ఇట్లు కర్మములాచరించి మోక్షమునొందినది జనకాదులేగాకనుమా, అంతకు ముందటివారగు మన్వాదులుగూడ నట్లే చేసిరి ఇట్టి యనాది పరంపరా ప్రాప్తమైన కర్మయోగమును నీవు త్యజింపనగునా? 15

కర్మము చేయుమంటిని. ఎట్టికర్మము చేయవలయుననదువా? కర్మమనఁగా నెట్టిదో, అకర్మమనఁగా నెట్టిదోయను విషయమున మేధావంతులుగూడ భ్రమపడుదురు కావున కర్మము సంగతి నీకు వివరింతును వివరము విని కర్మతత్త్వమెఱిగి చేయఁదగిన కర్మము ననుష్ఠించితివేని సంసారమునుండి ముక్తుఁడవగుదువు. 16

'విహితమైన చేష్ట కర్మయనియు, నిషిద్ధమైనచేష్ట వికర్మమనియు, ఎట్టిచేష్ట లేకుండట అకర్మమనియు లోకప్రసిద్ధమైయుండఁగా నీవు విశేషించి చెప్పునదేమందువా? అర్జునా! అంతమాత్రాననే కర్మతత్త్వము పూర్తిగాఁ

దెలిసినట్లు భావింపవలదు కర్మ వికర్మాకర్మముల తత్త్వము సామాన్యముగా బోధపడునదిగాదు ఆతత్త్వమును సమగ్రముగా నెఱింగినగాని కర్మయోగి గాఁజాలఁడు. 17

కర్మతత్త్వమును జెప్పెదు వినుము. నదిలో నావయెక్కి పోవునప్పుడు తీరమందలి వృక్షములు వాస్తవముగా గదలకున్నను నావపోకడనుబట్టి ఆవృక్షములుగూడ గ ) తోడవచ్చుచున్నట్లు తోఁచును. అట్లే అంతఃకరణము కర్మముచేయుచున్నను అకర్మములను ఆత్మ చేయుచున్నట్లు భావింతురు అందువలననే 'నేను చేయుచున్నాను' అని చెప్పుదురు పోవునది అనఁగా కర్మముచేయునది నావ, ఎట్టికర్మము చేయకుండునది తీరవృక్షములు అట్లే కర్మముచేయునది అంతఃకరణము, కర్మము చేయకుండునది ఆత్మ కర్మము చేయకుండినట్టి ఆత్మ కర్మముచేయుచున్నట్లు భ్రాంతివలన భావింతురు ఇట్టి భ్రాంతిమాని ఆత్మ అకర్తయని గ్రహించుట కర్మమును గర్మాభావముగా గ్రహించుటగును అనఁగా నిజమును గ్రహించుటగును ఇదే సాదృశ్యము నిషిద్ధకర్మ విషయంబునఁగూడ నన్వయించును కావున కర్మ వికర్మములను అకర్మముగాఁజూచుట యెట్లను సంగతి వివరించితిని అకర్మమును కర్మముగాఁ జూచు ట్లెట్లో వినుము చాలదూరమున నొకనిఁజూచినప్పుడు అతఁడు పోవుచున్నను నిలిచియున్నట్లే మనకుఁ దోఁచును అట్లే దేహేంద్రియములు సర్వదా కర్మముచేయుచున్నను అవి యెట్టి కర్మముచేయుటలేనట్లు మనకుఁ దోఁచును దూరమునఁ బోవువాని విషయమున అతఁడు పోవుచుండుట నిజమైనను భ్రాంతివలన నిలిచియున్నట్లు తలఁచుటమాని నిజస్థితి గ్రహించునట్లు అనఁగా అతఁడుపోవుట గ్రహించునట్లు, దేహేంద్రియములు కర్మముచేయుట లేదను భ్రాంతినిమాని నిజముగా అవి కర్మముచేయుచున్నవని గ్రహించుట అకర్మమును కర్మముగా గ్రహించుట యగును మొదట ఏది కర్మము చేయుదానినిగా దలంచితిమో, అది నిజముగాఁ గర్మము చేయుటలేదనియు, మొదట ఏది కర్మము చేయుటలేదని తలంచితిమో అది కర్మము చేయుచున్నదనియు నెఱుంగుట వాస్తవస్థితి గ్రహించుటయని తాత్పర్యము ఇట్లు కర్మవికర్మాకర్మముల నిజస్వరూపమెఱిఁగినవాఁడు కర్మాధికారులగు మనుష్యులలో బుద్ధి

మంతుడగును. అట్టివాఁడు వికర్మాకర్మములను రెంటిని త్యజించి కర్తృత్వము అభిమానము ఫలాభిసంధి ఇవి మూఁడుమాని కర్మ మనుష్ఠించును. అట్టివాఁడే పూర్వాధ్యాయములోఁ జెప్పిన కర్మయోగి యగునుగాని తక్కినవారు గారు. అట్టియోగి కర్మతత్త్వ మెఱిఁగినవాఁడగును. 18

ఇట్టి కర్మయోగిని గ్రింది యైదుశ్లోకములలో వర్ణించుచున్నాఁడు

కర్మాకర్మ తత్త్వజ్ఞులు ఆరురుక్షువులని ఆరూఢులని రెండు విధములు. ఆరురుక్షువనఁగా మోక్షమును బడయఁగోరువాఁడు. ఆరురుక్షువుచేయు కర్మములెల్ల ఫలేచ్ఛ లేనివిగా నుండును, ఏలయందువా? వాని యారంభములెల్ల జ్ఞానమనెడి అగ్నివలన దగ్ధములై యుండును, కావున ఫలమును గలిగింపఁజాలవు. ఆరూఢుఁడు అనఁగా తత్త్వార్థదర్శి, అతనికి ఫలేచ్ఛయేగాక సంకల్పముగూడ లేదు. ఆరురుక్షువునకు సంకల్పము మాత్రముండును. వీరిరువురకుఁగల తారతమ్య మిదియని గ్రహింపుము. ఆరూఢుఁడు జేయు పనులెల్ల వృథాచేష్టామాత్రములుగా నుండును. ఇట్టిజ్ఞాని ప్రవృత్తిమార్గ మనుసరించుచో అది లోకసంగ్రహార్థ మగును, నివృత్తిమార్గ మనుసరించునేని జీవనార్థము చేయువాఁడగును. 19

'కర్మము కామసంకల్పవర్జితమైన నగుగాక, స్వభావమునుబట్టి యది బంధకమగును గదా' యని యందువా? కర్మము కామసంకల్పముతోఁ గూడినప్పుడే బంధకమగునుగాని స్వభావముగా నెన్నఁడు బంధకము గాదు. జ్ఞాని నిరాశ్రయుఁడు అనఁగా దేహాదులందెట్టి యభిమానము లేనివాఁడు గావున అభిమానరూపమైన కర్మముతోడి సంగము వానికి గలుగదు. అతఁడు నిత్యతృప్తుఁడు అనఁగా నిజానందలాభమునఁ దృప్తిఁ జెందియుండుఁగావున మఱిదేనియందు వానికి నిచ్ఛయుండదు. దానంజేసి ఫలాభిలాష యుండదు. అతఁడిట్లు కర్మమందుఁ దత్ఫలమునందు సంగములేకుండు గావున లోకసంగ్రహార్థమో లోకనిందా పరిహారార్థమో చేయఁబడు వాని కర్మములెల్ల వానిదృష్టికి అకర్మములే యగును. అనఁగాఁ గర్మములు చేసియుఁ జేయనివాఁడే యగును. అందువలనఁ గర్మమునకుఁ గలదని ప్రవచించు స్వాభావ్య బంధకత్వము వానికిఁ గలుగదు. 20

జ్ఞానికైనను జన్మము వచ్చినతర్వాత వానికి స్వశరీరపోషణము తప్ప

సనియు, తదర్థము భిక్షాటనాదికర్మమేనియు నతఁడు చేసితీఱవలయుననియు, అట్టి కర్మముగూడ సంకల్పసహితముగానుండక మానదనియు, ఎప్పుడు సంకల్పముండునో యప్పుడే యాకర్మము బద్ధకమగుననియు శంకింతువా ? జ్ఞానిభిక్షాటనము కామవశంబున జేయఁబడుటలేదు, ప్రారబ్ధదేహవాసనామాత్రమున జరుగుచున్నది ఏలయందువా ? అతఁడు నిరాశి అనఁగా సర్వకామములను వర్జించియుండును ? కామములను వర్జించుటకు హేతువేమందువా ? యతచిత్తాత్మతయే కారణము. యతచిత్తాత్మతయనఁగా మనస్సు దేహము రెండు స్వాధీనములై యుండుట చపలచిత్తునకు మనస్సు దేనియందు నిలువదు, చూచినదియెల్ల కావలయునని కోరుచుండును. చిత్తము నిగ్రహముచెందియున్నప్పుడు ఇట్టి చాపల్యమునకు అవకాశములేదు జ్ఞాని యేదివొసకిన దానిని భుజించును, ఇదియిష్టము యిదికాదు అనుభావమే వానికిలేదు, అతఁడు సత్యముతప్ప మఱియొకటి పలుకఁడు అదియు హితమైనప్పుడు వచించును గాని హితముగానప్పుడు వచింపఁడు, వానిమాటలు మిక్కిలి మితముగానుండును. దీనింబట్టి వానికి జిహ్వాచాపల్యము లేదని స్పష్టము, నేడు పుట్టిన ఆడుబిడ్డను జూచినప్పుడెట్లు మనోవికారము జనింపదో నిండు జవరాలినిజూచినప్పుడుగూడ వానికి మనోవికారము గలుగదు అతఁడు భిక్షాటనమునకు విణ్మూత్రవిసర్జనములకుఁదప్ప మఱియెందులకు సంచరింపఁడు, అదియు భోజనమునకుఁబూర్వమె గాని భోజనానంతరము కదలడు, కదలవలసిన యవసరములేదు కూర్చుండి యున్నను దిరుగుచున్నను వాని నేత్రదృష్టి అధ్యాత్మయందె యుండునుగాని లౌకికవిషయంబులఁ దగులదు వాని మనస్సు ఆత్మాధీనమై యుండును గావున శ్రవణేంద్రియము లేమివిన్నను దానికిఁ దెలియదు విషయములు దగ్గరనున్నను వాని యింద్రియములు చలింపవు, నిద్రించువానిమాడ్కి నుండును ఇట్టివాఁ డగుటంజేసి వానికి స్వార్థమైన కోరికయే గలుగదు స్వార్థముగాకున్నను స్వపరిగ్రహార్థ ముండరాదాయనిన అతఁడు ఆత్మారాముఁడైయుండును, తనవారు మనవారను తలంపే వానికిలేదు అట్టి అద్వైతదర్శికి స్వపరిగ్రహార్థమైన కోరిక యుండఁజాలదు అతని కర్మములెల్ల పరాధ్యారోపితములుగానుండునేగాని అభిమాన పురస్సరములుగానుండవు మఱియు నవి కేవల శారీరకమాత్రములుగా నుండును జ్ఞానియెట్లు నిరాశియు యతచిత్తాత్ముఁడ త్యక్తసర్వపరిగ్రహుఁడై

కేవల శారీరమాత్రి కర్మము నాచరించును గావున వానికిఁ గర్మములు బంధకములుగావు 21

శరీరధారణమునకు అన్నాదులు సంపాదించు విషయమునఁగూడ వానికి నియమముగలదు ఎట్లనిన—అన్నాదులకై యతఁడొకరినిఁ బ్రార్థింపఁడు అప్రార్థితముగా నేది దొరకునో యంతతోనే తనివిచెందును అనఁగా శాస్త్రనిషిద్ధమైన యాచనావృత్తి ననుష్ఠింపఁడు అన్నాదులవిషయమై శాస్త్రనిషిద్ధకార్యములు చేయకపోవుఁగాక, శీతోష్ణాది పీడగలిగినప్పుడేమిచేయునందువా? అతఁడు ద్వంద్వాతీతుఁడు. కావున శీతోష్ణములు క్షుత్పిపాసలు మున్నగువాని స్పృహయే వానికిఁ గలుగఁదు సమాధిలోనున్నప్పుడు శీతోష్ణాదుల స్పృహ గలుగకున్న నుండుగాక, బహిర్గతుఁడైనప్పు డవియుండునుగదా యని యందువా? బహిర్గతుఁడైనప్పుడవి గానవచ్చినను వానిని మిథ్యలుగా (అనఁగా స్వప్నములో జరిగినవానికై జాగ్రద్దశయందువలెఁ దలంచి యందులకై క్షోభ చెందఁడు ద్వంద్వాతీతత్వమునకు హేతు వేమందువా? విమత్సరత్వము అనఁగా సుఖదుఃఖాదులు ప్రారబ్ధ కర్మవశంబునఁ గలుగుచున్నవనియు, అవి యనుభవింపక తీఱదనియు, వానియెడ మత్సరముంచియు ఫలములేదనియు వానికి దృఢ విశ్వాసముండును అందువలన ద్వంద్వములకు లోఁబడఁడు. 'అప్రార్థితముగా దొరకునట్టి యన్నాదులతో శరీరధారణము నతఁడు చేయు నంటివి, అట్లు దొరకనినాఁడతఁడేమి సేయు'నందువా? దొరకినప్పుడెట్లో దొరకనప్పుడుగూడ అట్లే క్షోభ చెందఁడు. ఇట్టివాఁడు గావున వానికర్మములు బంధకములుగావు. 22

జ్ఞాని కర్మఫలాసంగములేక వర్తించునని చెప్పితిని దానినే కొంచెము వివరింతును జ్ఞాననిష్ఠనుండు వానికి నేనుచేయుచున్నాననెడి భావముండదు. అట్టి భావమెప్పుడు లేదో యప్పుడే ఫలాపేక్షయుండదు అట్టివాఁడు లోకసంగ్రహార్థముచేయు కర్మము లెట్టివైనను సమగ్రముగా నశించును, అనఁగా ఫలమునిచ్చి బంధింపవు. 23

ఏకర్మముచేసినను దానికి ఇంతో యంతో ఫలముగలుగుట స్వాభావికమైయుండఁగా జ్ఞానిచేయు కర్మములకు ఫలమే గలుగదనుట యెట్లందువా?

పరబ్రహ్మమునకు భిన్నమైనది మఱియొకటిలేదనియు సర్వము బ్రహ్మమే యనియు జ్ఞానినిశ్చయము అందువలనఁజేయువాఁడు, చేయఁబడుపని, చేయుట, దానికి సాధనములు తత్ఫలము, ఫలభోక్త సర్వము బ్రహ్మమేయగునప్పుడు అట్టి కర్మముల ఫలము బ్రహ్మప్రాప్తిగాక మఱేమగును ? అనఁగా జ్ఞానిచేయు కర్మములకు బ్రహ్మప్రాప్తి ఫలమగునేగాని భోగములుఁ దదనుగుణమగు జననమరణములు ఫలముగావు 24

ఇఁక యజ్ఞభేదములను వివరించుచున్నాఁడు.

యజ్ఞములు అనఁగా ధర్మములు, ఇవి పెక్కువిధములు దర్శపౌర్ణమాస జ్యోతిష్టోమాది యజ్ఞములు ఇంద్రాదిదేవతలనుగూర్చి చేయఁబడును గావున ఇట్టివానిని దైవయజ్ఞములందురు. ఈదైవయజ్ఞములను కర్మపరులు కొందఱు మహాశ్రద్ధతో ననుష్ఠింతురు తత్త్వజ్ఞాననిష్ఠులు బ్రహ్మయజ్ఞమను దాని ననుష్ఠింతురు. ఆత్మయుపాధితోఁ గూడియుండుటంజేసి యది బ్రహ్మమునకన్న భిన్నముగా భావింపఁబడుచుండుట గ్రహించి, ఉపాధిని వేఱుచేసి ఆత్మయే బ్రహ్మముగాఁజూచుట బ్రహ్మయజ్ఞమగును. ఆత్మకు ఉపాధి శరీరము, ఈశరీరము పూర్వకర్మానుబంధము. 25

కొందఱు సంయమమను యజ్ఞము ననుష్ఠింతురు ధారణ ధ్యానము సమాధి అనుమూఁడు కలసి సంయమమగును మనఃకమలమునందో, భ్రూమధ్యమునసో, మఱియొండేని నొకచోట మనస్సును చిరకాలము నిలుపుట ధారణయగును నీవు మనస్సును దేనియందు నిల్పుదువో దానివంకకే నీమనోవృత్తిని ప్రవాహరూపమున ఎడతెంపులేక మఱియొకవంకకు మఱలకఁ బఱతెంచునట్లు చేయుట ధ్యానమగును నీవు ధ్యానించు వస్తువుదక్క మఱియొకటి స్ఫురింపకుండుట సమాధియగును ఉదాహరణము వినుము భగవంతుఁడనైన నేను శ్రీకృష్ణరూపమున నవతరించియున్నానుగదా. నాయందే మనస్సునిలుపుట ధారణయగును, నాయందు నిలిచిన నీమనస్సు ద్రవీభూతమై యటునిటు మఱలక ప్రవాహరూపంబున నావంకకుఁ బ్రవహించుట ధ్యానమగును నాయీరూపము దప్ప మఱియొకరూపము నీకు స్ఫురింపకుండుట సమాధియగును ఈమూఁడు చేరినచో సంయమమగును. ఇట్లు చేయుటకు

శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియములను తత్తద్విషయముల వంకకుఁబోకుండునట్లు నియమింపవలయును గావున దీనికి సంయమమను పేరువచ్చినది. దీని నే లయపూర్వక సమాధియందురు రాగద్వేషములు లేనిబుద్ధితో విషయములను భోగించుటఁ గలదు ఇదియు నొకయజ్ఞమగును ఇది వ్యుత్థాన దశయందు అనఁగా సమాధి వదలినప్పుడుమాత్రము సాధ్యమగును ఇట్టి యజ్ఞమును గొంద అనుష్ఠింతురు. దీనిని వ్యుత్థానపూర్వక సమాధియందురు　26

పైనఁజెప్పిన యజ్ఞములేగాక, బ్రహ్మవాదిమతము ప్రకారము మఱి యొక యజ్ఞముగలదు దానిని బాధపూర్వక సమాధి యజ్ఞమందరు. బాధ పూర్వక సమాధిని వివరింతు వినుము పృధివి వాయువు జలము అగ్ని ఆకా శము అనునవి పంచ మహాభూతములు ఈభూతముల సమ్మేళనంబున సృష్టి యేర్పడుచున్నది. ఈపంచమహాభూతములకు పంచతన్మాత్రలు కారణములు. ఈతన్మాత్రలకు అహంకారము గారణము, అహంకారమునకు మహత్తు కార ణము, మహత్తునకు ప్రకృతి కారణము ఇది సృష్టిక్రమము ఈప్రకృతి గూడ చైతన్యమునందు అధ్యస్తమేగాని చైతన్యమునకు భిన్నమైనదిగాదని యెఱింగి, చైతన్యమునుమాత్రము చింతించుట లయపూర్వకసమాధియగును ఇట్లు చింతించునప్పుడు సయితము 'తత్త్వమసి' అను మహావాక్యార్థము సాక్షా త్కారముగాదు ఏలయందురా? అవిద్య క్షయింపలేదు అందువలన ఈ సమాధియందు గాఢనిద్రయందువలె ప్రపంచస్ఫురణముండును దానంజేసి యిది సబీజ సమాధియగును ఇదియంత ముఖ్యమైనదిగాదు. బాధపూర్వక సమాధియందన్ననో తత్త్వార్థ సాక్షాత్కారంబున అవిద్యపూర్ణముగా నశించి యుండును గావునఁ బ్రపంచస్ఫురణయే యుండదు దానంజేసి యిది నిర్బీజ సమాధియగును ఈనిర్బీజసమాధినిగూర్చి యీశ్లోకము చెప్పుచున్నది ఎట్లని—శ్రోత్రాదులైన యింద్రియములకు శ్రవణదర్శనాదులు కర్మములగును మనస్సునకు సంకల్పము బుద్ధికి వ్యవసాయము కర్మములగును ప్రాణమునకు ఊపరి వెలికిపుచ్చుట కర్మమగును, అపానమునకు అధోద్వారముగుండా దానిని వెడలించుట కర్మమగును, ఇట్లే వ్యానసమానాదులకుఁ గర్మములు గలవు ఇందు జ్ఞానేంద్రియములు అయిదు కర్మేంద్రియములు అయిదు, ప్రాణాదివాయువులు అయిదు మనస్సు బుద్ధి—ఈపదునేడుఁగలసి లింగ

రమగును ఈయింద్రియ ప్రాణముల కర్మములనెల్ల కొందఱు నియమింతురు. మొట్టమొదట ఇది సంప్రజ్ఞాత సమాధిరూపమునసుండి క్రమక్రమముగాఁ బరిపక్వమై అసంప్రజ్ఞాత సమాధియగును. అసంప్రజ్ఞాత సమాధినే బాధపూర్వక సమాధి యందురు అవిద్య పూర్ణముగా బాధితమగునంగాఁ బోఁగొట్టఁబడునది యగును గావున ఇది బాధపూర్వక మనఁబడును. ఈసమాధియందు ప్రపంచస్ఫురణమే యుండదు 27

పై మూఁడు శ్లోకములలో అయిదు యజ్ఞములనుఁ జెప్పితిని ఇవిగాక ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయయజ్ఞము, జ్ఞానయజ్ఞము, వ్రతయజ్ఞము అని యాఱు యజ్ఞములు గలవు యజ్ఞముచేయుచున్నానను బుద్ధితో ద్రవ్యత్యాగము చేయుట ద్రవ్యయజ్ఞమగును, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములనుష్ఠించుట తపోయజ్ఞమగును, యమము నియమము ఆసనము ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అని యోగాంగము లెనిమిదిగలవు ఈయెనిమిదింటి ననుష్ఠించుటవలనఁ జిత్తవృత్తికి నిరోధము గలుగును, అనఁగా చిత్తము విచ్చలవిడిగాఁ బరుగెత్తక ఎందునిలిపిన నందే యుండును, దీనిని యోగయజ్ఞమందురు వేదములను విధిగా నభ్యసించుట స్వాధ్యాయయజ్ఞమగును, వేదార్థమును విధిగా నెఱుంగుట జ్ఞానయజ్ఞమగును ఇవిగాక వ్రతయజ్ఞమనునది మఱియొకటిగలదు. సంకల్పము పూర్తియగువఱకు నిద్రాహారములు మానియైనను తీవ్రముగా పాటుపడుట వ్రతయజ్ఞమగును 28

యోగశాస్త్రప్రకారము ప్రాణాయామమనఁగా నెట్టిదో వినుము. ప్రాణము అపానము ఈరెంటివృత్తిని నిరోధించుట ప్రాణాయామమనఁబడును. ప్రాణాయామము రేచకము పూరకము కుంభకము అని మూఁడు విధములు శరీరములోపలనుండు వాయువును వెలుపటికి వదలుట రేచకమనఁబడును, బయటివాయువును లోపలికి బీల్చుకొనుట పూరకమనఁబడును ఊపిరి విడుచుటగానీ పీల్చుటగాని మాని ఊఱకయుండుట కుంభకమనఁబడును. ఈకుంభకము అంతరకుంభకమని బాహ్యకుంభకమని రెండు విధములు ఊపిరి పీల్చుకొన్నతర్వాత మఱల దానిని విడవక యట్లేయుండుట

అంతరకుంభకమనఁబడును, ఊపిరి విడిచినతర్వాత మఱల పీల్చుకొనక యట్లే యుండుట బాహ్యకుంభకమనఁబడును సహజముగా ఊపిరి హృదయస్థానము నుండి వెడలి నాసికాగ్రమునకు పండ్రెండు అంగుళముల దూరమువఱకుఁ బ్రసరించును, ఊపిరి పీల్చుకొనునప్పుడు అట్లే నాసికాగ్రమునకుఁ బండ్రెండు అంగుళముల దూరమునునుండు గాలిని పీల్చుకొందురు, అది హృదయస్థానము వఱకుపోయి నిలుచును, మఱల అచ్చటనుండి వెలుపలికి విడుతురు ఇది స్వాభావికమైన ప్రాణాయామముగతి అభ్యాసమువలన దీనిని క్రమక్రమముగా వృద్ధిచేసి నాభియొద్దనుండిగాని మూలాధారమునొద్దనుండిగాని ఊపిరిని విడచుట మఱల అంతవఱకుఁ పీల్చుట సాధింపవచ్చును నాభియొద్దనుండి ఊపిరిని విడుచునప్పుడు అది నాసికాగ్రమునుండి ఇరువదినాలుగు అంగుళముల పర్యంతము, మూలాధారమునుండి విడుచునప్పుడు నాసికాగ్రమునుండి ముప్పదియాఱుఅంగుళముల పర్యంతము ప్రసరించును మఱల ఊపిరి పీల్చుకొనునప్పుడు అంతిదూరమునునుండు గాలి లోపలికి నాభిగఱకో మూలాధారమువఱకో పోవుచుండును నాభివఱకుగానీ మూలాధారమువఱకుగానీ పీల్చునప్పుడు, అచ్చటనుండి విడుచునప్పుడు, పిండిముద్దను దారముగాఁ జేసినప్పుడెట్లు అది దీర్ఘము సూక్ష్మమునైయుండునో యట్లు ఊపిరి దీర్ఘము సూక్ష్మమునైయుండును ఈయూపిరి వెలుపల నెంతవఱకుఁ బోవుచున్నది కనిపెట్టవలయునన్నచో సన్నదూదిని ముక్కునకు ఎదురుగా పట్టుకొనిచూతుమేని ఊపిరి యెంతదూరమువఱకుఁ దగులునది స్పష్టమగును లోపల ఎంతవఱకు పోవునది తెలిసికొనవలయునన్నచో నిదానముగాఁ బరీక్షింతుమేని ఊపిరి లోననెంతదూరముపోవునో యంతవఱకు చీవలుపాఱుకాడినట్లు దోఁచుచుండును ఆగుర్తునుబట్టి ఊపిరి శరీరములో ఎంతవఱకుఁ బోవుచున్నది నిశ్చయింపవచ్చును ఊపిరి రాకపోకల దూరము దేశపరీక్ష యనఁబడును ఈయూపిరి రాకపోకలకు కాలపరీక్ష గూడగలదు ఎట్లనిన, ఊపిరి విడుచునప్పుడుగాని పీల్చుకొనునప్పుడుగాని కుంభించునప్పుడుగాని పదియో యిరువదియో ముప్పదియో ప్రణవములు అనఁగా ఓంకారములు లెక్కపెట్టుదురు ఇట్లు ప్రణవముల లెక్క కాలపరీక్షయందురు ఈమాసములో ప్రతిదినము పదిరేచకములు, పైమాసములోఁ బ్రతిదినము ఇరువదిరేచకములు, మూఁడవ

మాసములోఁ బ్రతిదినము ముప్పది రేచకములు—ఇట్లుచేయుట సంఖ్యాపరీక్ష యందురు. రేచకవిషయమెట్లో పూరకవిషయముగూడ అట్లేయని గ్రహింపవలయును. కుంభకవిషయములో దేశపరీక్షకు అవకాశములేదు గాని కాలపరీక్షకు సంఖ్యాపరీక్షకు అవకాశముగలదు. ఆపరీక్షలు పైనఁ జెప్పినట్లే యని తెలిసికొనవలయును. రేచకము పూరకము కుంభకము అను భేదములతోఁ జెప్పిన మూఁడువిధములైన ప్రాణాయామముగాక మఱియొక విధమైన ప్రాణాయామముగలదు. దానినిఁగూడ కుంభకమనియే చెప్పుదురు. మొదట చెప్పిన కుంభకము ఊపిరి పీల్చుకొన్నతర్వాతనో ఊపిరి విడిచిపెట్టినతర్వాతనో సాధ్యమగును. రెండవకుంభకమునకు రేచకపూరకములతో సంబంధములేదు. సామాన్యకుంభకమును అభ్యసింపగా అభ్యసింపఁగా గలుగు నేర్పువలన నిది లభించును. ఆనేర్పును ధారణయని యందురు. రేచక పూరక కుంభకములకు నిద్రామాంద్యములవలన మార్పు గలుగుచుండును. ఈకుంభకమునకు నిద్రామాంద్యాదులవలని మార్పుగూడ గలుగదు. ఈనాల్గువిధములైన ప్రాణాయామములనుగూర్చి యీశ్లోకము చెప్పుచున్నది 29

ప్రాణాయామము చేయునప్పుడు ఆహారనియతిగలదు. ఎట్లనిన—ఉదరకోశములో రెండుపాళ్ళుమాత్రము అన్నముతో ఒక్కపాలు నీటితో నిండించి గాలిప్రచారార్థము ఒక్కపాలు ఖాళీగానుంచవలయును. ఇట్లు నియతాహారులై రేచక పూరక కుంభకములను ప్రాణాయామములొనర్తురు. పైనఁ జెప్పిన మూడువిధములైన ప్రాణాయామముల నభ్యసించుటయేగాక కొందఱు ప్రాణములందు ప్రాణములను హోమముచేయుదురు. అనగా, ఇంద్రియములెల్ల ప్రాణాధీనములై యుండును. సారథి కళ్లెమును బిగబట్టినచో గుఱ్ఱములెట్లు కదలకనిల్చునో యట్లే ప్రాణములను బిగబట్టినచో ఇంద్రియములు కదలక నిలుచును. ఇంద్రియములు నిల్చినప్పుడు వాని చేష్టలుగూడ నడఁగును. ఆవిధముగా సర్వేంద్రియ నిగ్రహమునను రేచకమందుఁగల నిశ్వాసగతి పూరకమందుఁగల ఉచ్ఛ్వాసగతి కుంభకమందుఁగల ఉభయవిధగతి నిరోధించి, అనఁగా రేచక పూరక కుంభకములుమాని ధారణయను యోగము నభ్యసింతురని దీనిభావము. 30

అర్జునా! పండ్రెండువిధములైన యజ్ఞములనుం జెప్పితిని. ఇవి తెలిసి చేయుటవలన ఫలమేమనియు, అట్లుచేయనియెడల దోషమేమనియు నడుగుదువు కాఁబోలు. ఈయజ్ఞములను తెలిసికొని యనుష్ఠించువారు పాపరహితులగుదురు. మఱియు నిట్లు యజ్ఞములు చేయుటవలనఁ జిత్తశుద్ధియు దానివలనఁ జ్ఞానముగలుగును, తుదకు బ్రహ్మప్రాప్తిని బడయుదురు. ఇందొక్కటియేని జేయనివానిని శిష్టులు గర్హింతురు. అందువలన వానికి సర్వప్రాణిసాధారణమైనట్టియు అత్యల్పసుఖదమైనట్టియు మనుష్యలోకముగూడ గలుగదనఁగా అనేకసాధనసాధ్యమైన పరలోకముగలుగదని వేఱచెప్పవలయునా? 31

ఇందులకుఁ బ్రమాణమేమందువా? వేదములే ప్రమాణము. వేదములందు బహువిధములైన యిట్టి యజ్ఞములు వివరింపఁబడియున్నవి. ఈయజ్ఞములెల్ల కాయికకర్మములవలననో వాచికకర్మములవలననో మానసికకర్మములవలననో యేర్పడుచున్నవి. అనఁగా ఇవి కర్మసంబంధములేగాని ఆత్మసంబంధములుగావు. ఆత్మ సర్వదా ఎట్టిది యంటించుకొనక యుదాసీనముగా నుండును గావున అది ఎట్టికర్మము చేయదు. ఆత్మ యిట్లు అకర్తయని యెఱుంగువాఁడు కర్మబంధమును బొందఁడు. 32

పైనఁజెప్పిన యజ్ఞములలో నేది శ్రేష్ఠమందువా? కర్మయజ్ఞములకన్న జ్ఞానయజ్ఞము ప్రశస్తతరము. ఏలయందువా? అగ్నిహోత్రాదులైన శ్రౌతయజ్ఞములుగానీ ఉపాసనాదికములైన స్మార్తయజ్ఞములుగానీ ఇవియెల్ల కర్మసంబంధములు. ఈయజ్ఞములవలనఁ జిత్తశుద్ధిమాత్రము గలుగును. అందువలన నివి జ్ఞానమునకు అంగభూతములుగా నున్నవి. తుదకు జ్ఞానమువలననే మోక్షము. కావున జ్ఞానయజ్ఞము ప్రధానము. 33

ఇట్టి జ్ఞానప్రాప్తికి ఉపాయమేమందువా? సర్వకర్మ ఫలభూతమైన జ్ఞానమును బడయఁగోరువాఁడు గురువు నొద్దకుఁజని దీర్ఘ నమస్కారమొనర్చి అవసరముచూచి బంధమనఁగానేమి? మోక్షమనఁగానేమి? విద్య యనఁగానేమి? అవిద్యయనఁగానేమి? అతివినయముతో అడిగిఆయన యనుగ్రహించి యుపదేశించునట్లు వర్తింపవలయును. ఆగురువు శాస్త్రానుగుణముగాఁ దత్త్వదర్శియై ఉపదేశించుటకు దగినంత యనుభవసంపన్నుఁగా నుండవలయును.

అట్లాశ్రయింపఁగా గురువుపదేశించును అనుభవనిష్ఠగలవాని యుపదేశమే ఫలవంతమగునుగాని వట్టి శాస్త్రజ్ఞానముగలవాని యుపదేశము ఫలవంతము గాదు. 34

ఇట్టి జ్ఞానముగలుగుటవలన ఫలమేమందువా? ఇట్టిజ్ఞానము గలుగునేని బంధువధాది నిమిత్తమైన భ్రమయుండదు అనఁగా సర్వభ్రాంతులు నశించును ఏలయందువా? జ్ఞానముగలిగినచో భీష్మాదులేగాదు సమస్త ప్రపంచముగూడ అవిద్యాకల్పితమనియు పరమేశ్వరునికన్న భిన్నమైనది ఏదియు లేదనియు స్పష్టమగును పరబ్రహ్మమే నీయాత్మ గావున నీయాత్మకన్న భిన్నమైనది మఱియొకటిలేదని వెనువెంటనే విశదమగును 35

పాప ప్రతిబంధమున్నప్పుడు తత్త్వదర్శనమగునా యని శంకింతువా? పాపాత్ములలో మహాపాపాత్ముఁడైనను జ్ఞానమనెడి తెప్పచిక్కెనేని పాప సాగరమును దాఁటి తత్త్వదర్శనము నొందును. 36

తెప్పవలన సముద్రమును దాఁటినప్పుడు సముద్ర మట్లేయుండునట్లు జ్ఞానమువలనఁ బాపమును దాఁటినను పాపము నశింపక యట్లే యుండునుగదా యని యందువా? మండు నగ్నిహోత్రుఁడు పచ్చికట్టెలను ఎండుకట్టెలను అన్నిటిని కాల్చి బూడిదచేయునట్లు జ్ఞానము పాపపుణ్యముల రెంటిని పాప పుణ్యములకుఁ గారణమైన యజ్ఞానమును నిర్బీజమొనర్చును పాపపుణ్యములు సంచితములు, ప్రారబ్ధములు ఆగామికులు అని మూఁడు విధములు సంచిత ములో ఏకొంతభాగ మనుభవించుటకో యొక్కొక్క జన్మము వచ్చుచుండును మిగిలినది అట్లే మూలధనముగానుండును దానిని ఉత్తరోత్తర జన్మలలో ననుభవింపవలసి యుండును ప్రతి జన్మమునందు అనుభవింపవలసి నట్లు ఏర్పడునది ఆజన్మమునకు ప్రారబ్ధ మనఁబడును. ప్రతిజన్మమునందు మఱలఁ జేయఁబడునది సంచితశేషముతోఁజేరి ఉత్తరోత్తర జన్మములకు మూల మగుచుండును ప్రారబ్ధమును అనుభవించియే తీఱవలయును సంగతి యిట్లుండఁగా, జ్ఞానాగ్నివలన సంచితము ఆగామికములైనవి నశించిన నశింపవచ్చును గాని అనుభవించితీఱవలసిన ప్రారబ్ధము నశించుననుట యెట్లుచెల్లునని శంకింప

వచ్చిన ప్రారబ్ధము అనుభవించి తీఱవలయుననుట సత్యమే గాని, జ్ఞానోదయమైనప్పుడు ప్రారబ్ధసుఖదుఃఖములు దగ్ధపటమువలె నిర్బీజములై యుండును గావున వాని స్ఫురణయే జ్ఞానికి నుండదు. అందువలనఁ బ్రారబ్ధముగూడ నశించినదానితో సాటియగును 37

జ్ఞానమువలన నెట్లో కర్మములవలనఁగూడ నట్టె పాపక్షయమగునని శ్రుతులు చెప్పుచున్నవి యిట్టి, దానంజేసి కర్మములకన్న జ్ఞానమెట్లు అతిశయమనియెద వందువా? కర్మములు తెప్పవలెఁ బాపములనుండి దాటించునేగాని పాపమును నశింపఁజేయఁజాలవు. జ్ఞానమన్ననో కర్మములకు మూలభూతమైన యజ్ఞానమునే నాశముచేసి కర్మములనెల్ల నిర్బీజత్వమొనర్చును. సమూల పాపనివర్తకమైన ప్రభావము జ్ఞానమునకువలె కర్మములకు లేదు 38

జ్ఞానమింతపవిత్రమైనదియగుచో అదియెల్లరకు శీఘ్రముగానేల గలుగ దందువా? పైనఁజెప్పిన కర్మయోగము నొనర్చినఁగాని యోగ్యత గలుగదు. యోగ్యత కలిగిన తర్వాత జ్ఞానము కాలక్రమమున స్వయముగానే అనాయాసముగా నుదయించును. కర్మయోగ మనుష్ఠింపనిదే జ్ఞానము ఎంత మాత్రము గలుగదు. మఱియొక రహస్యముగూడఁ గలదు. కర్మయోగ మనుష్ఠించినను శ్రద్ధలేనిచో జ్ఞానము జనింపదు. కావున శ్రద్ధ ముఖ్యము. శ్రద్ధయనఁగా నేమియందువా? గురువుపదేశించుదానిని బుద్ధికి నమ్ముట శ్రద్ధయగును. వట్టి శ్రద్ధయుండియు ఫలము లేదు. శ్రద్ధతోఁగూడ అనుష్ఠానముండవలయును. శ్రద్ధానిష్ఠులున్నను ప్రమాదవశమున ఇంద్రియములకు లోఁబడి నశించుట గలదు. కావున ఇంద్రియనిగ్రహము సంయతము మిక్కిలి యవసరము. ఇట్టివాఁడు తప్పక జ్ఞానమును బడయును. జ్ఞానసాధనమైన కర్మము ననుష్ఠించినతర్వాత కొంతకాలమునకు జ్ఞానముదయించునంటిరి. 'జ్ఞానము మోక్షసాధనముగదా? జ్ఞానోదయానంతరము మోక్షముగలుగుటకు వ్యవధి యుండునా'యని శంకింతువుగాఁబోలు. జ్ఞానోదయము గలిగినతర్వాత అవ్యవధానముగా మోక్షము సిద్ధించును. దీపము వెలిగించినంతనే యంధకారము తొలఁగునుగదా? 39

ఆత్మజ్ఞానము లేనివాఁడు, గురువుపదేశించినది నమ్మనివాఁడు, ఇది మో కాదోయని సంశయించువాఁడు—ఈముగ్గురు భ్రష్టులై నశింతురు ముగ్గురలో సంశయించువాఁడు అత్యంతము నశించును వానికి ఇహపర కములు రెండుఁగలుగవు, కావున వానికి సుఖమనుమాట గలుగదు. శ్రద్ధ వానికి ఆముష్మిక సుఖము లేకున్నను భోజినాదికమైన ఐహికసుఖమైనను గును సంశయాత్ముఁడు సంసారసుఖమునకుఁ బ్రయత్నింపఁబోవునప్పుడు ఇందేమి సుఖమున్నది ? మోక్షమును సాధింతుగాక అని భావించి సం యమును వదలును మోక్షప్రయత్నమునకుఁ దొడగి 'ఇంతకష్టపడినను క్షము వచ్చునోరాదో, మోక్షమనునది నిజమో కాదోయని దానిని విర చును. ఇట్లతఁడు రెంటికిఁ జెడి నశించును 40

అర్జునా ! రెండవ మూఁడవ యధ్యాయములలోఁ గర్మయోగమును ర్చి జ్ఞానయోగమునుగూర్చి చెప్పిన విషయమే నాల్గవ యధ్యాయములో రింపఁబడినది ఈశ్వరారాధనార్థము కర్మములనుష్ఠించి తత్ఫలమును ్వరునకే యర్పించుట కర్మసన్యాసమగును ఈసంగతి మూఁడవ యధ్యా ములోఁ జెప్పితిని కర్మయోగ మనుష్ఠించినందునఁ దత్ఫలముగా జ్ఞానము గా తత్త్వంపదార్థములు రెండు ఒకటేగాని వేఱయినవిగావనుట స్ఫురి ను. అందుమీఁద ఎల్లసందేహములు పటాపంచలైపోవును ఇట్లు కర్మయోగ ర్చి తత్ఫలమగు జ్ఞానమువలన సంశయములెల్ల వీఁడినవాఁడు ఆత్మవంతుఁడు గా తత్త్వజ్ఞానియగును అట్టిముక్తుని కర్మములు బంధింపవు 41

అర్జునా ! కర్మయోగమనుష్ఠించి దానివలన జ్ఞానమును బడసినయోగి ్తుఁడగును గావునను, సంశయము ఎల్లపాపములకు మూలము గావునను, వేకమువలన జనించి నీహృదయముననిల్చి నీకు శోకమును గూర్చుచున్న శయమును జ్ఞానమనెడి కత్తితో ఖండించివైచి నావచించిన కర్మజ్ఞానరూప న యోగము నాశ్రయింపుము జ్ఞానయోగమునకు నిష్కామకర్మయోగము దటి మెట్టు గావున, నీవు నీధర్మమైన యుద్ధమును నిష్కామయోగిరూప న నాచరింపుము 42

---

# గీతా హృదయము.

## అయిదవ యధ్యాయము.

నాల్గవ యధ్యాయములోఁ గర్మయోగము జ్ఞానయోగము వివరింపఁబడినవి అయిదవ యధ్యాయములో సన్న్యాసమనఁగా నెట్టిదో నిరూపించుచు దానివలనగూడ కర్మజ్ఞానయోగములను విస్తరించి చెప్పుచున్నాఁడు నాల్గవ యధ్యాయములో 'కేవలము శరీరముతోఁ గర్మముచేసినను బంధకముగాదు' అను వాక్యములవలనఁ గర్మసన్న్యాసము చెప్పఁబడినది. ఆయధ్యాయము కడపట 'కర్మయోగము ననుష్ఠింపుము' అని కర్మయోగముగూడ చెప్పఁబడినది ఈరెంటిలో నేది ప్రశస్తమో దానినే యనుష్ఠింపనెంచి ఆసంగతి దెలిసికొనఁదలఁచి,

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

కృష్ణా! సన్న్యాసము కర్మయోగము రెండుఁ జెప్పితివి ఈరెంటిటి నొకఁడే యాచరింపవలయునా? వేఱువేఱు పురుషు లాచరింపవలయునా? రెంటి నొకఁడే యనుష్ఠింపవలయునందువే, నడుచుట కూర్చుండుట అను కార్యముల రెంటి నొక్కఁడే యేకకాలమునఁ జేయుట యెట్లు అసాధ్యమో యట్లె కర్మసన్న్యాసముల రెంటి నొక్కఁడే యేక కాలమున ననుష్ఠించుట యసాధ్యముగదా రెంటి నేకకాలమున గాకున్నను ఒకటిచేసి తర్వాతమఱియొకటి చేయవచ్చును అనఁగా జ్ఞానోదయమునకుఁ బూర్వము కర్మయోగము, తదనంతరము సన్న్యాసము అనిగానీ, వైరాగ్యమునకుఁ బూర్వము కర్మయోగము తత్పరము సన్న్యాసము అనిగానీ యందువేని అదియును నసంగతమేయని భావింతును ఏమందువా? ఇచ్చటఁ జెప్పఁబడిన సన్న్యాసము జ్ఞానార్థమైనదిగా నున్నది జ్ఞానోదయమైన తర్వాత చేయఁబడు సన్న్యాసము జ్ఞానార్థము గాదుగదా? కావున అట్టి సన్న్యాసము జ్ఞానాంగముగదు వైరాగ్యము

కర్మయోగమునకు జ్ఞానయోగమునకు రెంటికి అవసరమైయుండఁగా వైరాగ్యమునకుఁ బూర్వము కర్మయోగము తత్పరము జ్ఞానయోగము తగుననుటయు నసంభవముగానున్నది ఎట్లు విచారించినను ఈరెండుయోగములు ఏకపురుషుఁడు ఏకకాలమందుఁగాని భిన్నకాలములందుగాని అనుష్ఠింపరానివై యున్నవి దీనింబట్టిచూడ కర్మయోగ జ్ఞానయోగములు వేఱువేఱుపురుషులు అనుష్ఠింపఁదగినవని యేర్పడుచున్నది ఈయూహ సరియేని ఈరెంటిలో నాకేది యుక్తమో యదే చెప్పుము, రెంటిలో సన్యాసము సులభమని తోఁచును అట్టిదానిని వదలి కర్మయోగము నే ననుష్ఠింపుమని నాకుపదేశించుట భ్రాంతికరముగానున్నది కావున నేదో యొకటి నిశ్చయించి చెప్పుము 1

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! కర్మయోగసన్యాసములలో నేది శ్రేయమో చెప్పుమంటివి కర్మయోగము సన్యాసము రెండును జ్ఞానమునుగలిగించి దానివలన మోక్షము నిచ్చును అయినను నీవట్టి అవిద్వాంసులగు ముముక్షువులకుఁ గర్మసన్యాసమునకన్న కర్మయోగమే ప్రశస్తతరము. 2

ఏలయందువా? ఎవఁడు కర్మముల ఫలమును గోరఁడో ఫలముఁగోరని కర్మములఁ జేయుచేలయను ద్వేషబుద్ధి నెవఁడు వహింపఁడో తనకు ధర్మములగు కర్మములనెల్లఁ బరమేశ్వరార్పణబుద్ధితో నెవఁడు చేయునో యతఁడు నిత్యసన్యాసియగును అనఁగా కర్మములుచేయుచున్నను రాగద్వేషములు లేనిచో నతఁడు కర్మములను సన్యసించినవాఁడే యగును ఇట్టి కర్మయోగము సన్యాసమునకు అంతర్భూతము ఇట్లాచరించుట ప్రవాహానుగుణేననుసరించి యీదుటవలె సులభముగానుండును తుట్టతుదకు సన్యాసఫలముగూడ గలుగుచున్నది 3

ఒకప్రశ్న కర్మముచేయుచుఁ గర్మసన్యాసి యెట్లగుననియు, కర్మయోగమునకు సన్యాసమునకు స్వరూపవిరోధము గాదాయనియు శంకింతువు గాఁబోలు సన్యాసము కర్మయోగము ఇవి వేఱనియు విరుద్ధఫలము లిచ్చునవియనియు అజ్ఞులు తలంతురే గాని జ్ఞానవంతులు తలంపరు ఈవిషయమై జ్ఞానులమతమేమందువా? ఈరెంటిలో అధికారానురూపముగా నేదినను ష్ఠించి

నను రెంటికి తుట్టతుదకు జ్ఞానమే ఫలమగుననియు, జ్ఞానమువలన మోక్షము గలుగుననియు జ్ఞానులమతము 4

రెండిటిలో దేనిననుష్ఠించినను రెండిటిఫల మెట్లువచ్చునందువా? సన్న్యాసులు పడయునది మోక్షము. ఆమోక్షమునే కర్మయోగులుగూడ తుట్టతుదకు పడయుదురు సన్న్యాసము కర్మయోగము రెండు నొక్కఫలమునే యిచ్చును గావున రెండు నొక్కటేయని ఎవఁడు గ్రహించునో వాఁడే వివేకి అనఁగాఁ కర్మయోగమందు సన్న్యాసముగూడ గర్భితమైయున్నదని భావము 5

నిత్యసన్న్యాసమనఁగా నెట్టిదో వివరించితివి కర్మయోగము సన్న్యాసము ఇవిరెంటిని ఒక్కడేచేయవలయునా? వేఱువేఱువారు చేయవలయునా? అని అడిగితివి ఆసంగతి చెప్పెద వినుము కర్మయోగము ననుష్ఠింపకయే తొలుదొల్తచే సన్న్యాసము ననుష్ఠించుటకు సాధ్యము గాదు సన్న్యసించుటకుఁ బూర్వము చిత్తశుద్ధిని సంపాదించియుండవలయును, చిత్తశుద్ధి కర్మయోగము వలనఁగాని గలుగదు కర్మయోగము ననుష్ఠింపక సన్న్యసించుట చిత్తశుద్ధిలేని సన్న్యాసమగును అట్టివాఁడు కర్మబ్రహ్మముల రెంట భ్రష్టుఁడై నశించును కర్మయోగము ననుష్ఠించువాఁడు చిత్తశుద్ధిని వైరాగ్యమును సంపాదించి తుదకు సన్న్యాసియై సత్యజ్ఞానానందాత్మకమును అచిరకాలములోఁ బడయును దీనిం బట్టి చూడఁగా కర్మసన్న్యాసములు రెండు కాలభేదముతో నేకపురుషుఁ డనుష్ఠింపవలసినవై స్పష్టముగదా కర్మయోగమునకు సన్న్యాసమునకు రెంటికిఁ వైరాగ్యము ముఖ్యసాధనము వాస్తవము అందు వైరాగ్యము తీవ్రతరమైనప్పుడు సన్న్యాసము, సామాన్యముగా నుండునప్పుడు కర్మయోగమునగును 6

కర్మయోగ మనుష్ఠించువాఁడు అచిరకాలముననె బ్రహ్మమును బొందు నంటివి కర్మయోగము బంధహేతువనియు, బంధవిమోచనమైనగాని బ్రహ్మప్రాప్తి కలుగదనియు, కావునఁ గర్మయోగంబున బ్రహ్మప్రాప్తి యగుననుట యెట్లు చెల్లుననియు శంకింతువా? నిష్కామముగా ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయునది కర్మయోగమగును అట్టియోగ మనుష్ఠించువాఁడు చిత్తశుద్ధిని బడయును, చిత్తశుద్ధితోడ దేహేంద్రియములు వశమగును, అతఁడు అద్వితీయాత్మ తత్త్వదర్శియగును. అట్టివాఁడు లోకానుగ్రహార్థముగానీ స్వాభావికముగాఁగానీ చేయు కర్మము బంధకము గాదు 7

కర్మముతోడ ఫలము, ఫలముతోడ బంధకత్వము గలుగుచుండఁగా, కర్మముచే ను బంధకత్వము గాదనుట యెట్లుందువో ? కర్మమనఁగా నేమి? నేత్రములు మున్నగు జ్ఞానేంద్రియములు, వాక్కు మొదలగు కర్మేంద్రియములు, ప్రాణవాయువులు, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అంతఃకరణములు నాలుగు—ఇవి తమతమ సంబంధవిషయములందు వ్యవహరించుట కర్మమనఁబడును. ఎట్లనిన, నేత్రములు చూచుట, చెవులువినుట, చర్మము స్పృశించుట, ముక్కు ఆఘ్రాణించుట, నాలుక తినుట అనువ్యాపారములు చేయును, కాళ్ళునడచుట, వాక్కు మాటాడుట, పాయూపస్థులు మలమూత్రంబుల విసర్జించుట, చేతులుపట్టుకొనుట అను వ్యాపారములుచేయును ప్రాణాదులయిదు ఊపిరిపిల్చుట విడుచుట మొదలగు వ్యాపారములుచేయును, కన్నువిప్పుట మూయుట మొదలగునవి నాగకూర్మాదులగు నైదువాయువుల అంతరవ్యాపారములగును నిద్రించుట అంతఃకరణ చతుష్టముయొక్క వ్యాపారము ఇట్లు సర్వేంద్రియములు వానివాని వ్యాపారములు చేయుటయే కర్మమగుచున్నదనియు, ఆత్మస్వరూపుఁడనైన తాను ఏమియుఁ జేయుటలేదనియు తత్త్వవేత్త భావించును. తాను కర్తయను భావమున్నయెడఁ కర్మఫలాభిసంధి వెంటనెయుండును, ఫలాభిసంగముతోడ బంధకమేర్పడును. అట్టిభావమే లేనివాఁడు కర్మఫలాభిసంధిగాని బద్ధబంధకముగాని యెట్లు గలుగును ? 8-9

'తత్త్వదర్శి కర్తృత్వాభిమానములులేక కర్మములుచేయును గావున వాని కయ్యవి యంటవనుట యుక్తమగును గాక, కర్మయోగియన్ననో కర్తృత్వాభిమానములు గలిగియుండును, కావున వానిని దత్కర్మములు బంధింపక మానవందువా ? భృత్యుఁడు తన యజమానునికొఱకెట్లో యట్లే కర్మయోగి పరమేశ్వరార్థము కర్మములు చేయుచున్నానను బుద్ధితోఁ దనధర్మము లొనర్చును వానికి ఫలాఫలమంగు అభిలాష లేదు. అందువలనఁ బాపపుణ్యాత్మకములైన కర్మఫలములు వానినంటవు. తామరాకుమీఁద నీటిబిందువువలెఁ గర్మయోగి వర్తించును 10

మఱియు శిష్టాచారము కూడ నిందులకు ప్రమాణము. శిష్టులు అనఁగా కర్మయోగులు వచనాదికాయిక కర్మములుగానీ, ధ్యానాది మానసకర్మములు

గానీ, తత్త్వనిశ్చయాది బుద్ధికర్మములుగానీ, శ్రవణకీర్తనాదులగు నింద్రియ కర్మములుగానీ ఫలేచ్ఛ వదలి ఆత్మశుద్ధికొఱకు చేయుదురు ఎల్లకర్మములు ఈశ్వరార్థమేగాని స్వఫలార్థముగాదను తలంపుతో వారొనర్తురు. 11

ఒక్కకర్మమునే యిరువురు చేయునప్పుడు, అదేకర్మము ఒకనికి విమోచనము రెండవవానికి బంధకమునగుటకుఁ గారణమేమని శంకింతువా? మోక్షమిచ్చుటగానీ బంధకమగుటగానీ కర్మమునందులేదు, ఈభేదము కర్త యొక్క బుద్ధియందున్నది నాచేయు కర్మములెల్ల ఈశ్వరార్థమేగాని నాకొఱకుగాదను నిశ్చయముతో ఫలము నాశ్రయింపక కర్మములుచేయువాఁడు జ్ఞానమువలన మోక్షమును బొందుచున్నాఁడు అట్టి నిశ్చయములేక ఫలమును గోరి, అట్టికోరికతోఁ గర్మము లాచరించువాఁడు బద్ధుఁడగుచున్నాఁడు 12

చిత్తశుద్ధిలేనివానికి సన్న్యాసమునకన్నఁ గర్మయోగమే శ్రేష్ఠమని పైన నిరూపించితిని శుద్ధచిత్తునకు సన్న్యాసము శ్రేష్ఠము ఆసంగతి చెప్పెదను వినుము శుద్ధచిత్తునకు సర్వేంద్రియములు వశమైయుండును అందువలన నతఁడు నిత్యనైమిత్తికకర్మములు కామ్యప్రతిషిద్ధకర్మములు సర్వము వివేకబుద్ధితోఁ ద్యజించి అనఁగా కర్మాదులందు అకర్మదర్శనము గలిగి జీవన్ముక్తుఁడై అనఁగా వాఙ్మనఃకాయచేష్టలు పరమేశ్వరునకర్పించి ప్రసన్నచిత్తుఁడైయుండును ఇందులకు జితేంద్రియత్వమే కారణము. 'శరీరము ప్రకృతికి అధీనమైయుండును, ప్రకృతి నిరంతరము ఏదోనొకటి చేయించుచుండునేగాని ఊఱకుండనీయదు ఈసంగతి నీవే చెప్పియున్నావు సంగతి యిట్లుండ సర్వకర్మసన్న్యాసమెట్లు సాధ్యమగు'నని వాదింతువా? వినుము రెండు నేత్రములు, రెండు చెవులు, రెండు ముక్కులు, నోరు—ఈయేడును శిరస్సునందుండు ద్వారములు, పాయూపస్థలు రెండు అధోద్వారములు దేహమునకిట్లు తొమ్మిది ద్వారములుగలవు పొరుగూరివాఁడు ఒకయూరికి చుట్టముగా వచ్చునప్పుడు ఆయూరిలోని పూజా పరిభవములకెట్లు సుఖదుఃఖములు పడయఁడో చుట్టమింటిలోఁ దానొకపని చేయుటగాని చేయించుటగాని లేక తటస్థుఁడుగా నెట్లుండునో అట్లే జీవాత్మ నవద్వారములుగల యీ దేహమను పురములో వలసకాపురము చేయుచుండుటంజేసి, దేహసంబంధము

గల సుఖదుఃఖములకు దాను చలింపదు, తానెట్టి పనియుఁ జేయఁడు. చేయింపఁడు

దేహేంద్రియాదులు వానివానిపనులు చేయుచుండఁగా, దేహేంద్రియాదులు ఆత్మయను భ్రమవలన, నేను పనిచేయుచున్నానని యజ్ఞుఁడు భావించును, భార్యాపుత్త్రులయందలి మమకారంబున, వారి దేహేంద్రియాదులు చేయుపనులు తన ప్రేరణమువలన జరుగుచున్నవని యతఁడు తలంచును. అనగా అహంకారమమకారములు వానికట్టి యధ్యాస గలిగించుచున్నవి. జ్ఞాని యన్నను అహంకార మమకారములు లేనివాఁడు గావున ఉన్నదియున్నట్లు గ్రహించును. దేహేంద్రియాది వ్యాపారము అధ్యాసవలన ఆత్మవ్యాపారముగాఁ దలంపఁబడుచున్నదనియు, నిజము విచారించినచో ఆత్మ ఎట్టిపని చేయదనియు నెఱుంగుట, అనఁగా జ్ఞానమువలన అజ్ఞానమును బోగొట్టుటయే సర్వకర్మసన్యాసము 13

ఒకపని చేయుటగాని చేయించుటగాని ఆత్మకు స్వాభావికమా? కాదా? అనియు, స్వాభావికమైనచో వానిని మాను టెట్లనియు నందువా? జవాత్మ దేహేంద్రియాదులను ఈపనిచేయుమని నియోగింపదు, దేహేంద్రియాదులకుఁ బ్రియతమములైన వస్తుసామగ్రిని సృజింపదు, దెహేంద్రియాదు లొనర్చు కర్మములకు ఫలసంబంధముగూడ గలిగింపదు అనఁగా జీవాత్మ కర్తగాదు, భోక్తగాదు ఇవియెల్ల స్వభావమువలన జరుగుచున్నవి స్వభావ మనఁగా మాయావిద్యా ప్రకృతిరూపము 14

పరమార్థదృష్టితో విచారించినచో, కాయిక వాచిక మానసికములైన పుణ్యాపాపకర్మముల ఫలము జీవాత్మకు నంటవు ఇతఁడు పుణ్యాత్ముఁడు ఇతఁడు పాపాత్ముఁడు అను లోకవ్యవహారముగలదు అందులకుఁ గారణమే మందువా? జ్ఞానమును అజ్ఞానము గప్పియుండుటవలన, ఒకదానిని మఱి యొకటిగా భావించుచుందురు లోకవ్యవహారమట్లు అజ్ఞానమూలకమే గాని వేఱుగాదు 15

ఇట్టి యజ్ఞానవిమూఢులకు విమోక్షమెట్లందువా? అజ్ఞానంబువలన

భ్రమగలుగుట జ్ఞానము ప్రకాశింపకుండుట ఇవి రెండు సంభవించుచున్నవి గురూపదేశము ప్రకారము అనుష్ఠించి వేదాంత మహావాక్యమును మననము చేయఁగా ఆత్మ అద్వితీయమైనదను జ్ఞానము సిద్ధించును ఇట్టిజ్ఞాన మెప్పుడుద యించునో అప్పుడే అజ్ఞానము నశించును సూర్యోదయంబున సమస్త వస్తు జాతంబువలె జ్ఞానోదయంబున బ్రహ్మాత్మతత్త్వము స్పష్టమగును 16

పైనఁజెప్పిన జ్ఞానముగలుగుటకుఁ గారణము, తత్ఫలము వినుము జ్ఞానము గలుగవలయునన్నఁ దత్పరాయణత్వముండవలయును ఆత్మతత్త్వమే ప్రాప్యమనునట్టి తదేకనిశ్చయము తత్పరాయణమనఁబడును, అనఁగా ఎల్ల విషయములందు విరక్తిగలిగి పొందఁదలచినదానినే సదావినుచుండుట యనెడి శ్రవణము ఇందు సూచితము ఎప్పుడు తత్పరాయణత్వము గల్గునో యప్పుడే తన్నిష్ఠ జనించును ఇందువలన మననము సూచితము శ్రవణమననములు పరిపక్వమైనప్పుడు తాదాత్మ్యము అనఁగా నిదిధ్యాసము వచ్చును. శ్రవణమనన నిదిధ్యాసములవలనఁ బ్రాప్యవస్తువు సాక్షాత్కరించును ఈ సాక్షాత్కారంబున మఱల దేహము దాల్పవలసిన యవసరము తొలఁగును ఇదియే ముక్తి మఱల దేహధారణమునకుఁ బుణ్యపాపరూపమైన కర్మము కారణమగుచున్నది జ్ఞానమువలన నట్టికర్మము సమూలముగా నాశమగుచున్నది గావునపునర్దేహప్రాప్తికిఁగారణము తొలగుచున్నదని భావము 17

జ్ఞానమువలన విదేహముక్తి జీవన్ముక్తి యను రెండుఫలములు గలుగును. దేహపాతానంతరము గలుగునది విదేహముక్తియగును దేహముండఁగానే గలుగునది జీవన్ముక్తి యగును విదేహముక్తినిగూర్చి చెప్పియున్నాను జీవన్ముక్తియన నెట్టిదో వినుము జీవన్ముక్తుఁడు విద్యావినయములుగల బ్రాహ్మణుని కుక్కమాంసముతినువాని నొక్కటిగాఁ జూచును అనఁగా గర్మవైషమ్యము నతఁడుపాటింపఁడు, గోవును గజమును కుక్కను వీనినెల్ల నొక్కటిగానే భావించును, అనఁగా జాతివైషమ్యము చెందఁడు ఇట్లు బాహ్యదృష్టికి విషమములుగాఁ దోఁచునవియెల్ల వికారములులేనట్టియు ఏకరూపమైనట్టియు బ్రహ్మమేయని అన్నిటియందు సమదృష్టి గలిగియుండును సూర్యుఁడు ఇది గంగోదకమనియు, ఇది తటాకజలమనియు, ఇది మద్యమనియు, ఇది

మాత్రమనియు భేదభావమును బాటింపక అన్నింటియందు నేకవిధముగా నెట్లు ప్రకాశించునో, గంగోదకాదుల గుణదోషములతో సూర్యునకెట్లు సంబంధము లేదో, అట్లే బ్రహ్మము అన్నిటియందు నుండునదియు ఉపాధుల గుణదోషములతోడ వానికి సంబంధములేదనియు జీవన్ముక్తుఁడు భావించును రాగద్వేషములులేక పరమానందస్థితితో నిరంతరము నుండుటయే జీవన్ముక్తి యగును 18

విషమములందు సమదర్శనము ధర్మశాస్త్ర విరుద్ధమనియు, శాస్త్ర విరుద్ధముగా నడచువాఁడు పండితుఁడెట్లగుననియు శంకింతువా ? దుష్టత్వము మూత్రాదులయందువలె స్వతస్సిద్ధమో, గంగోదకమునకు మూత్రసంబంధమున వలె దుష్టసంబంధమువలననో గలుగును ఆత్మ నిర్దోషమైనది, కావున స్వతస్సిద్ధదుష్టత్వము దానికి లేదు, ఆత్మ అసంగము, అనఁగా నొకదానితో సంబంధపడునది గాదు ! కావున సంబంధ దుష్టత్వముగూడ దానికిఁ గలుగదు జ్ఞాని సమస్త పదార్థములందున్న యీయాత్మనే చూచునుగాని ఉపాధులను జూడఁడు దానంజేసి యతఁడు జయించియుండఁగానే సంసారప్రపంచమును దాటియుండును ధర్మశాస్త్రాదులెల్ల అవిద్యాదశయందుండు గృహస్థులను నన్వయించునేగాని అతీతులను నన్వయింపవు 19

బ్రహ్మస్థితుఁడైన స్థితప్రజ్ఞుని లక్షణము లీక్రింది రెండుశ్లోకములలోఁ జెప్పఁబడుచున్నవి — స్థితప్రజ్ఞుఁడు ఇష్టమైనవి లభించినప్పుడు సంతోషమును గాని, అయిష్టమైనది సంభవించినప్పుడు విషాదమునుగాని పడఁడు. ఏది ముముక్షువునకుఁ బ్రయత్నపూర్వకమైనదిగా నుండునో, అది జీవన్ముక్తునకు స్వాభావికమైన చరితముగానుండును వారిరువురకుఁగల తారతమ్య మిదే యని గ్రహింపవలయును జీవన్ముక్తునకు ఇష్టానిష్టములు గలిగినప్పుడు సంతోష విషాదము లేల యుండవందువా ? అతఁడు నిరంతరము అద్వితీయాత్మదర్శియైయుండును, ద్వైతప్రపంచముయొక్క ప్రతిభాసగూడ వానికిలేదు. ప్రియాప్రియంబులు ద్వైతభాసగలవారికేగాని అద్వైతస్థితులకుఁ గలుగవు అతఁడట్లు బ్రహ్మస్థితుఁడైయుండుటకుఁ గారణమేమందువా ? వాని బుద్ధికి అసంభావనావిపరీతభావనలు లేకుండుటయే కారణము అవి యేలయుండ

వందువా ? అసంభావనా విపరీతభావనలు మనన నిదిధ్యాసలవలన నశించి యుండును దానంజేసి నిశ్చలచిత్తుఁడై బ్రహ్మమందే యుండును 20

శబ్దాదులగు విషయములు ఆత్మధర్మములు కావు దానంజేసి వాని కట్టివానియందు ఆసక్తియుండదు బాహ్యవిషయములవలన ననుభవింపనగు సుఖమునకన్న శతగుణాధికమైన సుఖము వానికి ఆత్మయందే గలుగుచుండును దానంజేసి క్షుద్రమువంక మనస్సు దిరుగదు అనఁగా జీవన్ముక్తుఁడు అఖండ నిజానంద సుఖనిష్ఠుఁడై యుండునని భావము. ముముక్షువు అనఁగా సాధకుఁడు బాహ్యవిషయప్రీతిని పరిత్యజింపవలయునని యిందువలన సూచితము. 21

విషయప్రీతి పోవుటకు నుపాయమేదందువా ? మనుష్యులనుభవించు సుఖములెల్ల విషయములకు ఇంద్రియములకు సంబంధము గలిగినప్పుడు పుట్టుచున్నవి ఆసంబంధముతొలఁగినంతనే ఆసుఖములు మాయమగుచున్నవి కావున నిట్టి సుఖములెల్ల అస్థిరములు అంతియగాదు ఈసుఖములు రాగద్వేష స్పర్ధాదుల స్పర్శ గలిగియుండును , తుట్టతుదకు అవి దుఃఖకారణములగుచున్నవి. దానంజేసి వివేకులిట్టి సుఖములతో నానందింపరు అనఁగా విషయములందు దోషదర్శనంబునఁ దత్ప్రీతి పోవునని భావము 22

శ్రేయోమార్గమునకుఁ గామక్రోధముల వేగము పరమ విరోధము అది మనస్సు నేత్రములు మున్నగువానికి క్షోభగలిగించును వర్షాకాలము నదులకువలె విషయధ్యానకు దానినుప్పొంగించి సుళ్ళుద్రిప్పను ఆసుళ్ళలోఁ జిక్కినవాఁడు దిద్దిర తిరిగి కొట్టుకొనిపోయి సంసారార్ణవము పాలగును బహిరింద్రియ వ్యాపారమనెడి అగడ్తలోఁబడకమున్నే తప్పించుకొనవలెను. ఉపాయమేమందువా ? విషయములందలి దోషములను మననము చేయుట వలన వానియందు వైరాగ్యము జనించును ఇదే పరమోపాయము ఇట్టి దోషదర్శనము ఒకనాఁడు రెండునాళ్ళు చేసినఁ జాలదు శరీరము క్రిందపడు వఱకు నభ్యసించుచుండవలయును ఇట్టివాఁడు యోగియగును , ఇతఁడే సుఖియగు నరుఁడునగుఁగాని యన్యులుగారు వారు మనుష్యాకారపశువులు అనఁగాఁ బశువులకు వారికిఁ భేదములేదని భావము 23

విషయములందుఁగాక తనయాత్మయందే సుఖమును బడయుచు, ఆత్మ

యందే క్రీడించుచు నుండుయోగి బ్రహ్మరూపమును బొందును. సర్వసంగ పరిత్యాగియైనను యదృచ్ఛగా సంభవించునట్టి కోకిలాది మధురశబ్దములు వినుటవలనను, మందమారుతము సోకినప్పుడు, సాంద్రచంద్రికలు కాయు నప్పుడు, మొగలి పూతావులతోడి మధురమైన చల్లని గంగోదకము త్రాగు నప్పుడు బహిస్సంతోషము గలుగుట తప్పదనియు, ఆపక్షమున యోగి ఆత్మా రాముఁడు మాత్రమేయైయుండుననుట యెట్లు చెల్లుననియు శంకింపవచ్చును వానిదృష్టి యాత్మయందే లీనమైయుండును గాని బాహ్యవిషయంబులఁదగులదు. సమాధిదశయందతనిదృష్టి యంతర్లీనమైయుండిన నుండుఁగాక, వ్యుత్థానకాల మందు విషయ ప్రతిభానము ఎట్లు తప్పునందువా ? విషయప్రతిభానము మిథ్యయను నిశ్చయము వానికున్నందున వానిదృష్టి యట్టివానియందుఁ దగు లదు నాగరకుని నాగరకాంత రంజింపజేయునేగాని కుగ్రామస్త్రీ అనఁగా మోటుస్త్రీ రంజింపఁజేయునా ? అట్టియోగి బ్రహ్మరూపమును బొందును అనఁగా తాను బ్రహ్మరూపుఁడయ్యు అజ్ఞానంబునఁ గానట్లు నందాక తలంచు చుండుననియు, జ్ఞానముతోడ స్వస్వరూపము నెఱుంగుననియు భావము 24

స్థితప్రజ్ఞుని లక్షణముల చెప్పితిని. ఇఁక జ్ఞానసాధనములు వినిపింతు వినుము. ఎల్లసంశయములు నశింపవలయును, జితేంద్రియుఁడు కావలయును ఇట్లగువాఁడు కల్మషరహితుఁడగును, అంతట శ్రవణమనన నిదిధ్యాస లను ష్ఠించుటకు యోగ్యత గల్గును, దానితోడ జ్ఞానముదయించును, వెనువెంటనే తత్వార్థదర్శియగు, తుట్టతుదకు బ్రహ్మనిర్వాణము నొందును. 25

కామక్రోధములు లేనివాఁడై అనఁగా నిష్కామకర్మపరుఁడై తత్ఫల మగు నంతఃకరణశుద్ధిని బడసి, తత్ఫలభూతమగు సన్యాసమును, తత్ఫలమగు జ్ఞానమును బడసినవానికి జీవన్ముక్తి విదేహముక్తి రెండు లభించును (కర్మ జ్ఞానములు అంగాంగిభావములగుటంజేసి క్రమసముచ్చయ మీశ్లోకము ప్రతి పాదించుచున్నది) 26

జ్ఞానమునకు ధ్యానయోగము నొకసాధనమేయగును అదిసూచింతు వినుము శబ్దాదులు బాహ్యస్పర్శలనఁబడును అవి రాగవశంబున శ్రోత్రా దులవలన తత్తదాకారవృత్తులతో లోపలికిఁ బ్రవేశించుచుండును వైరాగ్యమ

వలన వానినెల్ల బహిష్కరింపవలయును అనఁగా యోగాభ్యాసమునకు వైరాగ్యము మొదటిమెట్టు ఇట్లు వైరాగ్యమునుబడసి యోగికి యోగ్యమగు ఆసనంబున శరీరము వంకరలేనట్లుగాఁ గూర్చుండి అర్ధనిమీలితలోచనుఁడై (కన్ను పూర్ణముగాఁమూసినచో నిద్రవచ్చును) నాసాగ్రమందు దృష్టినిలిపి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు బిగించిగానీ అవి మిక్కిలి తిన్నగా నాసాభ్యంతరముననే చరించునట్లు సమముగాఁజేసిగానీ, ఆయుపాయంబున ఇంద్రియ మనోబుద్ధులను నియమించి సర్వ విషయ విరక్తుఁడై ఆ కారణంబున ఇచ్ఛాభయక్రోధములు లేకయుండునట్టి యోగి ముక్తినొందును ఇట్టివాఁడు మోక్షార్థము మఱియొకటి చేయువలసిన యావసరములేదు 27

ధ్యానయోగమును సూచించితిని, తత్ఫలమేమనఁగా ? నన్నెఱుఁగుట మోక్షమునుబొందుట తత్ఫలము నన్ను ఎఱింగినంతనే ముక్తియెట్లుండునా ? ఎవఁడేఫలము ననుభవించునో వాఁడు తద్భోక్తయగును 28

ఎల్ల యజ్ఞములకుఁ దపస్సులకు భగవత్ప్రీతియే ఫలము అట్టిఫలము ననుభవింతును గావున నేను తద్భోక్తనగుదును ఇంద్రాదులగూడ వత్తద్యజ్ఞములకు భోక్తలట్లు నేనును గొన్నిటికి భోక్తనాదునందువా ? నేను సర్వలోకమహేశ్వరుఁడను ఇంద్రాదులనెల్ల నియమింతును ఇంతటి పారమ్యశాలికి నీకు నాకొక్కెట్లు ప్రీతిగూర్పఁగలదందువా ? సర్వప్రాణులకు నేను సుహృదుఁడను, ప్రత్యుపకారమపేక్షింపకయే యుపకరింతును ఇట్టివాఁడు లోకులకెంతయు సులభుఁడుగదా ఇట్టినన్ను అనఁగా సర్వఫలభోక్త, సర్వలోకేశ్వరుఁడు, జగన్మిత్రుఁడుగు భగవంతుని నాయీరూపంబున నవతరించిన వానిని ధ్యానించినచో సాక్షాత్కరించి ప్రసాదింతుననియు, ఆప్రసాదంబునఁ దత్త్వజ్ఞానము గలుగుననియు భావము 29

# గీతాహృదయము.

## ఆఱవయధ్యాయము.

సన్యాస నిరూపణముఖంబున జ్ఞానయోగము సమగ్రముగా నైదవ యధ్యాయములోఁ జెప్పఁబడినది. ఆఱవయధ్యాయమందున్నదో ధ్యానయోగ మనెడు సాధనమును నిరూపించుచు దానివలనఁగూడ జ్ఞానయోగమును జెప్పుచున్నాఁడు మోక్షార్థికి జ్ఞానసంపాదనమునకుఁ గర్మయోగము సాధనమగునని యీయధ్యాయము మూఁడవ శ్లోకములోఁ జెప్పఁబోవుచున్నాఁడు అందుకుఁ బ్రాతిపదికముగాఁ గర్మయోగులన నెట్టివారో సూచించుటకై యీ క్రింది రెండుశ్లోకములను,

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు

కర్మఫలమునందుఁ దృష్ణలేక కామ్యములుగాకట్టి అగ్నిహోత్రాది శాస్త్రవిహిత నిత్యకర్మమును ఎవఁడు చెయునో యతఁడే సన్యాసియు యోగియునగును, అనఁగా ఫలాభిసంధి ఎప్పుడులేదో యప్పుడు పరిత్యాగము చిత్తవిక్షేపరాహిత్యము నుండునని భావము అంతియగాని కర్మములను వదలిపెట్టినంతనే సన్యాసిగాదు, తపోదానాదిక్రియలను చేయకున్నంతనే యోగిగాఁడు కర్మములను వదలినవాఁడు సన్యాసియనియు, ఏపని చేయకుండువాఁడు యోగియనియు శ్రుతిస్మృతులు చెప్పచుండఁగా, కర్మములు చేయువాఁడు సన్యాసియనియు, క్రియాతత్పరుఁడు యోగియనియు నీవుచెప్పుట విపరీతముగాదాయని శంకింతువు గాఁబోలు 1

అర్జునా! దేనిని సన్యాసమందురో అదే నిష్కామకర్మానుష్ఠానమను యోగమని గ్రహింపుము. ఏలయందువా? సంకల్పమును అనఁగా ఫలాభిసంధిని వదలనిచో యోగమెప్పుడుగాదు కావున యోగులెల్లరు ఫలసంకల్పమును త్యజించి వర్తింతురు ఫలత్యాగము, తృష్ణారూప చిత్తవృత్తినిరోధము- ఇవిరెండు సన్యాసమునకును గర్మయోగమునకును సామ్యమైయున్నందున

కర్మయోగి సన్యాసి వీరువురు పరమార్థదృష్టితో విచారించినప్పుడు ఏకరాశిలోఁ జేరుదురు వట్టి నిరగ్ని గాని, వట్టి అక్రియుఁడుగాని అనఁగా పైరెండుగుణములు లేనివారు సన్యాసులుగారు యోగులుగారని భావము 2

ధ్యానయోగంబున మనస్సును బూర్ణముగా నిల్పలేనివానిని ఆరురుక్షువు అందురు అట్టివానికిఁ గర్మయోగము సాధనముగుచున్నది అనఁగా కర్మయోగంబున చిత్తశుద్ధిగల్గి ధ్యానయోగమునకు యోగ్యుఁడగుచున్నాఁడు. ధ్యానయోగంబును గొంతవఱకు సాధించినవాఁడు యోగారూఢుఁడనఁబడును. అట్టివాఁడు కర్మములను సన్యసించినఁగాని చిత్తము విక్షేపరహితమై తదేకాకృతి నిలువదు కావున వానికిఁ గర్మసన్యాసము సాధనమగును ధ్యానయోగంబునఁ జిత్తశుద్ధి వైరాగ్యము లతిశయించును, వైరాగ్యాతిశయముతోడ సర్వకర్మసన్యాసము దానివలన జ్ఞానోదయమునగునని భావము 3

యోగారూఢుఁ డెప్పుడగునందువా? వినుము ఇంద్రియార్థములైన శబ్దాదులందును, తత్సాధనములైన లౌకిక వైదికకర్మములందు గర్తవ్యతానుబంధన మెప్పుడువదలునో అప్పుడు యోగారూఢుఁడగును కర్తవ్యతానుబంధన మెప్పుడు వదలునందువా? సంకల్పము అనఁగా ఇది నేను చేయుదునుగాక అనునట్టి చిత్తవృత్తి విశేషము ఎప్పుడు నశించునో యప్పుడు కర్తవ్యతానుబంధనము వదలును సంకల్పమెప్పుడు నశించునందువా? సంకల్పమునకు కామము మూలము కామము నశించినప్పుడు సంకల్పము వెనువెంటనే నశించును, కామమన్ననో వైరాగ్యంబున నశించును 4

ఈయోగారూఢత్వమును సంపాదించుటకు మనస్సే ముఖ్యసాధనము. కావున మనస్సును సాధనముగా గ్రహించి జీవము నుద్ధరింపుము జీవము సామాన్యంబుగా సంసారసాగరంబునఁ బడియుండును దానినట్లే వదలవలదు, వదలిననో నదినశించును మనస్సు ఎట్లు జీవము నుద్ధరించునందువా? మనస్సు జీవమునకెంతయు బంధువు, సంసారముక్తికై జీవమునకు మఱియొకటి సహాయ పడునదిలేదు సంసారసాగరమును దాటుటకు మనస్సే పరమతారకముగుచో, ఈమనస్సు అందఱకుఁగలదు గావున నెల్లరుఁ దరింపరేలయందువా? మనస్సు అందఱకున్నను అది యెల్లరకు మిత్రముగాదు, అది కొందఱకు మిత్రముఁ గొందఱకు శత్రువునగుచు దానంజేసి యెల్లరుఁ దరింపరు. 5

ఎట్టివారికి మిత్రము ఎట్టివారికి శత్రువగునందువా ? ఎవని జీవము విషయప్రాబల్యమునుండి మనస్సును మరలించి వశపఱచుకొనునో యట్టివానికి అనఁగా జితేంద్రియునకు మనస్సు మిత్రమగును. మనస్సును వశపఱచు కొననివానికి అనఁగా జితేంద్రియుఁడుగానివానికి అది బాహ్యశత్రువులవలె శత్రువై వర్తించును 6

జితాత్మునకు మనోబంధుత్వ మెట్లందువా ? జితాత్మునకు రాగాదు లుండవు గావున శీతోష్ణ సుఖదుఃఖములు పూజాపరిభవములు వానినంటవు. అందువలన నతఁడు నిర్వికారుఁడై యుండును. అట్టివాఁడు యోగారూఢుఁ డగును. ఇట్టి జితేంద్రియునకుఁ బరమాత్మయే సమాధి విషయమగునని కూడ చెప్పనగును. 7

యోగారూఢుని లక్షణములు వినుము. జ్ఞానము అనఁగా శాస్త్రోక్త పదార్థ పరిజ్ఞానము, విజ్ఞానమనఁగా అపరోక్షానుభవము. అనఁగా శాస్త్ర జ్ఞాన స్వానుభవము. ఈజ్ఞానవిజ్ఞానములతో నతని మనస్సు నిండియుండును, ఒండొకతలంపునకు నందుఁ దావుండదు. అందువలన నతఁడు విషయములు దగ్గఱనున్నను వికారము చెందఁడు, ఆకారణంబున వాని యింద్రియములెల్ల వశమైయుండును. జితేంద్రియుఁడు గావున ఇది హేయము ఇది ఉపాదేయము అనుబుద్ధియే వానికిఁ గలుగదు. అన్నిటియందు వానికి సమబుద్ధియుండుటంజేసి మట్టిపెళ్ళ రాయి బంగారు సర్వము వానికి ఒక్కటిగానే యుండును. ఇట్టివాఁడు యోగారూఢుఁడని చెప్పఁబడును 8

మఱియు ప్రత్యుపకార మపేక్షింపక యెట్టి స్నేహబంధములేకున్నను ఉపకారముచేయునట్టి సుహృత్తు, స్నేహకారణమున నుపకారముచేయు మిత్రుఁడు, నిష్కారణముగా అపకారముచేయునట్టి అరి, ఉభయులు వివాదపడుచున్నను జూచుచు ఉపేక్షించియుండునట్టి ఉదాసీనుఁడు, ఉభయులకు హితముచెప్పునట్టి మధ్యస్థుఁడు, ఉపకరికిఁగూడ నపకారముచేయునట్టి ద్వేష్యుఁడు, శరీరసంబంధముగల బంధువు, ధర్మశీలుఁడగు సాధువు, పాపశీలుఁడగు పాపి—ఇట్టివారియందెల్లఁ దారతమ్యభావములేక సమబుద్ధిగలవాఁడు యోగారూఢులలో నుత్తముఁడు. అనఁగా యోగారూఢుని మనస్సు స్థిరం

తరము పరమాత్మయందు లయించియుండును గావున ఇట్టి విపరీతములింద్రియ గోచరములగుచున్నను వానికి మనోగోచరములు గావని భావము. 9

అర్జునా! ఇట్టి యుత్తమఫలప్రాప్తికి సాధనములగు యోగాంగములు చెప్పెదను వినుము. మనస్సు మిక్కిలి చంచలించుచుండును. ఈమనశ్చాంచల్యమును మాన్పుటయే యోగముయొక్క ముఖ్యోద్దేశ్యము ఇంద్రియములకు విషయములతోడ సంబంధము గలుగుచుండునేని మనశ్చాంచల్యంబునకు నుద్దీపకముగా నుండును ఈసంబంధము ఎంతవఱకు తగ్గింపనగునో యంతవఱకుఁ బ్రయత్నింపవలయును బహిప్రదేశంబున నిట్టిసంబంధంబునకు అవకాశము మిక్కుటముగా నుండును గావున యోగాభ్యాసము చేయువారు గిరిగుహాదులు రహస్యస్థానములు వరింతురు అట్టి ఏకాంతస్థానములలోగూడ ఒంటరిగానుండవలయునేగాని మఱియొకనితోఁ గూడియుండరాదు ఇద్దరున్నచో ఏదోయొక ప్రసంగము గలుగుచుండును, ఆకారణమున మనోవిక్షేపమగును రహస్యప్రదేశము ఏకాకిత్వము ఇవిరెండున్నను వాని మనోదేహములు యోగప్రతిబంధక వ్యాపారములందుఁ దగులవచ్చును అట్లు తగులకుండుటకు ఇంద్రియనిగ్రహము పరమౌషధము. ఈయింద్రియనిగ్రహంబునకు ఆశారాహిత్యము పరమసాధనము కోరిక నశించునేని శాస్త్రనిషిద్ధములైన పరిగ్రహాదులు వానితోడ మనశ్చాంచల్యము నుడుగును యోగాభ్యాసముచేయువాడిట్లు చిత్తమును సమాహితపఱచుకొనవలయును ఈవిషయమై యోగశాస్త్ర ప్రక్రియను గొంత వివరింతు జిత్తవృత్తినిరోధము యోగమనఁబడును ఈయోగమునకు యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అని ఎనిమిది యంగములుగలవు హింసచేయకుండుట, సత్యము, దొంగబుద్ధిలేకుండుట, బ్రహ్మచర్యము, ఒకరివలన నేదియుఁ బుచ్చుకొనకుండుట, ఋజుమార్గవర్తనము, ఓర్పు, ధృతి, మితాహారము, శౌచము—ఇవి యమలక్షణములు తపస్సు సంతోషము, భగవంతుఁడు గలఁడను విశ్వాసము, దానము, ఈశ్వరపూజనము, సిద్ధాంతశ్రవణము, అకార్యమునకు లజ్జించుట, మతి, జపము, వ్రతము—ఇవి నియమలక్షణములు పద్మాసనము మొదలగునవి ఆసనమనబడును, ప్రాణవృత్తి నిరోధము ప్రాణాయామమనఁబడును, ఇంద్రియములను వానివాని విషయములనుండి

మఱలించుట ప్రత్యాహారలక్షణములు. మనస్సు ఏదేనొక వస్తువునందు చిరకాలము స్థాపించుట ధారణయగును. దానినిగూర్చి ధ్యానింపఁ దలఁచుదానిలో సజాతీయ ప్రవాహరూపంబున మనస్సును బోనిచ్చుచు నడుమనడుమ ఎట్టి విజాతీయజ్ఞానమును గలిగింపక మఱియొకవంకకు దానిని మఱల్పకుండుట ధ్యానమన నగును. విజాతీయమైన స్ఫురణములేక సజాతీయ ప్రత్యయ ప్రవాహరూపము గలుగుట సమాధి యగును. ఈసమాధి సంప్రజ్ఞాతమని అసంప్రజ్ఞాతమని రెండువిధములు. చిత్తమునకు ఐయిదు అవస్థలుగలవు. వీనిని భూమికలందురు. క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అని ఇవి చెప్పఁబడును. విషయాసక్తమైన చిత్తము క్షిప్తమందురు, నిద్రాతంద్రాదిగ్రస్తమైన చిత్తమును మూఢమందురు, విషయాసక్తమయ్యు అప్పుడప్పుడు ధ్యాననిష్ఠమౌ చిత్తమును విక్షిప్తమందురు. క్షిప్తమూఢచిత్తములకు సమాధి పొసఁగదు. విక్షిప్తమునకు ఎప్పుడోయొకప్పుడు క్షణముసేపు సమాధి గలిగినను అది గాలిలోని దీపమువలె నశించును. సత్త్వగుణము వృద్ధియగుటంజేసి, తమోగుణము వలన గలుగు నిద్రాతంద్రాది రూపలయముగాని, రజోగుణమువలనఁ గలుగు చాంచల్యరూప విక్షేపముగాని లేక ఏకవిషయమునందే ధారాప్రవాహముగా నుండు మనోవృత్తి ఏకాగ్రమనఁబడును. సత్త్వము శుద్ధమైనప్పుడు మాత్రమే యిది గలుగును. ఈయవస్థయందుచిక్కినప్పుడు సంప్రజ్ఞాత సమాధియగును. ఇం ధ్యేయాకారవృత్తియొక్క భాసముండును గావున దీనిని సంప్రజ్ఞాతమందురు. ఈభాస గూడ నశించెనేని, అసంప్రజ్ఞాత సమాధియగును. 16-వ శ్లోకములో యమమునకు సంబంధించిన మితాహారము సూచింపఁబడినది. ఉదరకోశమునందు రెండుభాగము లన్నముతోను ఒకభాగము నీటితోనిండి నాల్గవభాగము గాలికొఱకు ఖాళీగానుండవలయునని యోగశాస్త్ర పరిమాణము. అట్లుగాక తక్కువభుజించినను ఎక్కువభుజించినను రోగము కలుగును. ఏలయనఁగా ఎక్కువతిన్నచో అతినిద్రవచ్చును, బొత్తుగా భుజింపనిచో అతిజాగరమగును. ఇవి రెండును యోగప్రతిబంధకములు. ఇదేవిషయమును అన్వయముఖముగా 17-వ శ్లోకములోఁ జెప్పఁబడినది. ఎట్టివని-యుక్తాహారవ్యవహార విహారములు పరిమితములుగానుండవలయును, అట్లుగాక నిద్రాజాగరములు నియమితముగా నుండును, తపస్సు మున్నగు విషయములందు గూడ

పరిమితము నవలంబింపవలయును ఇట్లాచరించినవో యోగసిద్ధి గలుగును ఆహారపరిమాణమును జెప్పితిని, నిద్రాజాగర పరిమాణమెట్లనిన—రాత్రికాల మును మూఁడుగాభాగించి, మొదటిభాగమందు నిద్రింపరాదు, రెండవభాగ మందు నిద్రింపవలయును, మూఁడవభాగమందు మఱల నిద్రింపరాదు. విహార నియమమెట్లనఁగా, దినమునకు మొత్తముమీద ఒక్కయోజనమునకన్న వి పించి నడువరాదు తపస్సు స్వాధ్యాయము క్రమక్రమముగా మెలమెల్లగా ననుష్ఠింపవలయును, బ్రహ్మచారివ్రతమనఁగా బ్రహ్మచర్యము, 'ప్రశాం తాత్మ' అనుటవలన అహింస, సత్యము, అస్తేయము, క్షమ, ఋజువర్తనము సూచితములు 'యతచిత్తాత్మ' అనుటవలన బహిరంగములైన శౌచము, అపరి గ్రహమగుటవలన ఏదిగాని గ్రహింపకుండుట, స్థితఅనుటవలన ధృతి ... అనుటవలన శాస్త్రీయ నిశ్చయ దార్ఢ్యము గలిగియుండుట, ఇట్లు యమనియ మములు సూచితములు ఆసన మెట్లన్న—కూర్చుండు ప్రదేశము శుభ్రముగా నుండవలయును అది మిక్కిలి యెత్తుగాఁగానీ మిక్కిలి తక్కువగా గాని యుండరాదు దానిమీఁద మొదట దర్భయు, దానిమీఁద వ్యాఘ్రచర్మ ము, దానిమీఁద వస్త్రము పఱవవలయును మఱియొకని యాసనంబునఁ గూర్చుండి యోగమభ్యసింపరాదు, ఆసనము, శయనము, వస్త్రము, భార్య, కమండులువు—ఇవి సొంతవిగా నుండవలయునేగాని ఇతరులవి పనికిరావని శాస్త్రము. ఇట్లు ఆసనంబున యథాసుఖము గూర్చుండి మనస్సును నేత్రా దులైన యింద్రియములను ప్రాణములను నియమించి అనఁగా ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ననుష్ఠించి, మనస్సు నేకాగ్రమొనర్చి అనఁగా ధ్యాన మనెడు నాల్గవభూమిక నధిష్ఠించి చిత్తశుద్ధికొఱకు యోగమభ్యసింపవల యును దేహమధ్యభాగము శిరస్సు మెడ అనఁగా మూలాధారము మొదలు మూర్ధపర్యంతము వంకరలేకుండునట్లు చలింపకుండునట్లుగా కూర్చుండవలెను, దిక్కులు చూడగూడదు దృష్టి నాసాగ్రమును జూచునట్లుగా నిలుపవలెను ఇట్లొనర్చి మనస్సు విషయాకారవృత్తి శూన్యము గావించి నాయందు (అనఁగా భగవంతునియందు) నిలుపుట ధ్యానమగును భగవంతుఁడు నిరాకారుఁడైన, చిత్తము నిలుచుటకు ఏదే నొకపట్టు కావలయును అందువలన సాకార బ్రహ్మమును ధ్యానింపవలయును మదనకోటిసుందరుడు, మణికిరీటు

కుండలవలయహారకేయూరముద్రికాలంకృతుఁడు, సర్వమంగళమూర్తి, మకరతిళ్యాయలాకారుఁడు మందస్మితరుచిరబింబాధరుఁడు, మధురాలాపుఁడు మహావియచరితాద్భుతుఁడునై యవతరించి నీముందున్న యీవాసుదేవుఁడే యాలంబముగాఁ గొని ధ్యానింపుము భగవదేకాకార చిత్తవృత్తి రూపధ్యానమనుష్ఠింపఁగలయును అది సంప్రజ్ఞాత సమాధినిష్ఠయగును అప్పుడు తత్త్వసాక్షాత్కారము సత్స్వరూప పరమానంద నిష్ఠయగు మోక్షము సిద్ధించును ఇట్టియోగమువలన అంతర్ధానము ఆకాశగమనము మొదలగు సిద్ధులుగూడ గలుగును గానీ, అవి మోక్షమునకుపయోగ్యములుగావు గావున ముముక్షువు వానిని గోరఁడు 10–17

ఇట్లు చేయుచుండఁగాఁ జిత్తము రజస్తమోగుణములను సమగ్రముగా వదలి స్వచ్ఛమై ఆత్మైకాకారతనుబొంది యెప్పుడు నిశ్చలమగునో అప్పుడు అసంప్రజ్ఞాత సమాధియగును ఇది సిద్ధించుటకు ఎల్లకోర్కెలు వదలవలయును యమనియమాదులెన్ని అభ్యసించినను వైరాగ్యమే ప్రధానము ఈవైరాగ్యము అపరమని పరమని రెండు విధములు అపరము మఱల యతమానము, వ్యతిరేకము, ఏకేంద్రియత్వము, వశీకారము అని నాల్గు విధములు సారాసారముల దెలియుయత్నము యతమానవైరాగ్యమగును, వివేకాభ్యాసంబున దోషము లింతమాత్రము పక్వమైనవనియు ఇంక నింతమాత్రమున్నవనియు వివేచించుట వ్యతిరేక వైరాగ్యము, విన్నట్టిగాని చూచినట్టిగాని విషయములందు ప్రవృత్తి దుఃఖాత్మకత్వమని గ్రహించి వానిని త్యజించి మనస్సునెప్పుడు సంతోషముతోనుంచుట ఏకేంద్రియత్వ వైరాగ్యము తృష్ణ బొత్తుగా లేకుండుట వశీకారవైరాగ్యము ఈ అపరవైరాగ్యము సంప్రజ్ఞాత సమాధికి అంతరంగము, అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగము నగును సకల ప్రపంచ వ్యవహారములందు ఎట్టితలంపు లేకుండుట పరవైరాగ్యమగును ఇది అసంప్రజ్ఞాతసమాధికి అంతరంగమగును. ఈశ్లోకములోని 'నిఃస్పృహః' శబ్దము ఈ పరవైరాగ్యమును దెలుపును 18

చిత్తవృత్తి నడఁచివైచి అసంప్రజ్ఞాతసమాధి ననుష్ఠించు యోగియొక్క అంతఃకరణము గాలిలేనిచోటఁబెట్టిన దీపమువలె నిశ్చలమైయుండును 19

ఈ యసంప్రజ్ఞాతసమాధిని వివరింతు వినుము యోగాభ్యాసపాటవంబున అంతఃకరణము పరిణామమొందును, చిత్తవృత్తి శమించును, అట్లు రజస్తమస్సు లంటనట్టియు కేవల సత్త్వమాత్రరూపంబున నుండునట్టియు అంతఃకరణమును సాధనముగాఁగైకొని అఖండానంద ఘనమైన ప్రత్యక్చైతన్యమును గాఁచి యందె సంతోషించును ఈయంతఃకరణ పరిణామము యోగమనఁబడును 20

అంతఃకరణమట్లు పరిణమించినంతనే ఒకవిధమైన సుఖము లభించును అనుభవము నిట్టిదని చెప్పుటకుగాని తలంచుటకుగాని సాధ్యముగాదు. అది బుద్ధికిమాత్రమే గోచరించుచుండును ఆసుఖము ఇంద్రియములకు నందదు సుషుప్తియందుఁగూడ సుఖము గల్గునుగాని, సుషుప్తియందు బుద్ధి లీనమైయుండును గావున అది బుద్ధిగ్రాహ్యము గాదు సమాధియందు బుద్ధి తనవృత్తిని మానియుండునేగాని సుషుప్తియందువలె లీనముగాదు కావున సమాధిసుఖము బుద్ధిగ్రాహ్యమైయుండును 21

నిరతిశయాత్మ సుఖవ్యంజకమైన ఇట్టి నిర్వృత్తిక చిత్తావస్థా విశేషమును బొందినవాఁడు అంతకు మించిన సుఖము మఱియొకటి లేనందున దానిని వదలఁడు దానంజేసి విషయభోగవాసనలు వానినిఁ జలింపఁజేయఁజాలవు చలి వేడిమి మశకాద్యుపద్రవములు ఇవి గలిగినను అతనికి అస్పృహాయేయుండును శస్త్రహతియేని వానిని గలంచునాయనిన అదియును లేదు 22

దుఃఖాదులు చిత్తవృత్తివిషయములు. చిత్తవృత్తినే నిరోధించినప్పుడు దుఃఖాదుల జ్ఞానమేయుండదు ఇట్టి చిత్తవృత్తినిరోధమే యోగము 23

యోగమింతటి ఫలమునిచ్చును గావున శాస్త్రములను గురూపదేశమును నమ్మి యభ్యసింపవలయును యోగాభ్యాసము చేయునప్పుడు 'ఎంతకాలము చేసినను ఫలము గలుగలేదు, ఈకష్టమేల?' అని నిరుత్సాహపడరాదు ఈజన్మములోనో జన్మాంతరమునో తప్పక అది సిద్ధించునను పట్టుదలతో ధైర్యముతో యోగము నభ్యసింపవలయును

యోగాభ్యాసప్రకారము వినుము శుభస్కారములుగాఁట్టి విషయములు శుభస్కారమనెడి అధ్యాస సంకల్పమనఁబడును ఈసంకల్పము కాను

మును గలిగించును కామమువలన స్రక్చందనవనితాదులందభిలాష గలుగు చుండును కావున సంకల్పప్రభవమైన కామములను త్యజింపవలయును కామత్యాగ మెట్లనఁగా ? కుక్కతిని కక్కిన పాయసమునందు దోషము గాంచి దానినెట్లు త్యజింతుమో యట్లె విషయములందు దోషదర్శనము గావించినచోఁ త్యాగముసిద్ధించును వనితాదులేగాదు బ్రహ్మలోకాదులును అణిమాదిసిద్ధులును సర్వము ఈస్వప్నములో జేరినవేగాని వేఱుగాదు ఈత్యాగము ఉపవాసవ్రతముచేయువాఁడు ఆపూట భోజనమును త్యజించినట్లు త్యజించుట వలన ఫలములేదు , ఉపవాసికడువాడైనను అన్నకామముగలదు అట్లుగాక మూలముట్ట పఱువవలయును కామములను త్యజించినంతనే ఇంద్రియ ప్రవృత్తి యడఁగును , వివేకముదయించును ఇంద్రియనియమంబునకు మనస్సును సాధనముగా గ్రహింపవలయును 24

యోగము నాకుఁ దప్పక సిద్ధించునను ధైర్యము ధృతియనఁబడును ఇట్టి ధైర్యమువహించి యోగమును సాధింపవలయుననెడి నిశ్చయమును గలిగి శాస్త్రములందుఁ జెప్పినప్రకారము గురువుపదేశించు మార్గమున ఒక్కొక్క భూమికను మెల్లమెల్లగా క్రమక్రమముగా దాఁటి మనోనిరోధమును సాధింపవలయును వాగ్భూమి, మనోభూమి, అహంకారభూమి, మహతత్త్వభూమి అని భూమికలు నాలుగు ఈనాల్గింటిని క్రమముగా జయించుట భూమికాజయమనఁబడును వాక్కు మొదలగు సర్వేంద్రియముల వ్యాపారమును నిరోధించినప్పుడు మనోవృత్తిమాత్రము నిలిచియుండును ఇంద్రియవ్యాపారమును కట్టిపైచి మనోవృత్తితో మాత్రముండుట వాగ్భూమి జయమనఁబడును. వాగ్భూమిని జయించినవానికి పశువులకువలె స్వాభావికముగా మాత్రము వాఙ్మౌనముండును మనోవృత్తి శేషించియున్నందున సంకల్పవికల్పములంగూఁబోడమచునేయుండును ఈసంకల్ప వికల్పాది సకలమనోవ్యాపారమును సయితము నిరోధించినప్పుడు అహంకారముమాత్రము శేషించియుండును ఈస్థితికివచ్చినవాఁడు మనోభూమిని జయించినవాఁడగును ద్వితీయ భూమిని జయించినవానికి నిర్మనస్కత్వము బాలురకు ముగ్ధులకువలె స్వాభావికమైయుండును నిర్మనస్కత్వమనగా అహంకారములేకుండుట ఈఅహంకారము 'నేను ఇతని పుత్త్రుడను, నేను ఇతని తండ్రిని' అనుచోట వృ

నగుచుండునట్టి అభిమాన్యమానత్వరూపవిశేషముగానుండును ఈయహం కారమునుగూడ జయించినచో 'ఉన్నాను' అనునంతమాత్రమే సామాన్యాహం కారము శేషించియుండును దీనినే మహత్తత్త్వమందురు ఈస్థితికి వచ్చిన వాఁడు అహంకారభూమిని జయించినవాఁడగును సూక్ష్మమైన యహంకా రమనునట్టి ఈమహత్తత్త్వమునుగూడ జయించినచో నిరుపాధికచిన్మాత్రస్థితి వచ్చును ఈస్థితికి వచ్చినవాఁడు మహత్తత్త్వభూమిని జయించినవాఁడగును అప్పుడు వానికి నిరుపాధి ము శుద్ధము త్వంపగలక్ష్యము నైన ఆత్మ సాక్షాత్కా రించును పైనఁజెప్పినప్రకారము క్రమముగా మనస్సును నిరోధించినచో అది సర్వాకారవృత్తి రహితమగును అనాత్మాకారవృత్తియున్నచో వ్యుత్థాన మగునేగాని సమాధిగాదు ఆత్మాకారవృత్తియున్నచో సంప్రజ్ఞాత సమాధి యగునేగాని అసంప్రజ్ఞాతసమాధిగాదు కావున అసంప్రజ్ఞాత సమాధికి ఎట్టి మనోవృత్తియు నుండఁగూడదు సర్వమనోవృత్తులు నశించినచో ఆత్మసాక్షా త్కార మెట్లగునందువా ? ఆత్మ చైతన్య రూపముగాఁ నుండు నేగాని వృత్తి రూపముననుండదు ఆత్మ యట్టిదైయుండగా యోగాభ్యాస వైరాగ్యము లేలయందువా ? ఆత్మను ఆవరించియున్నట్టి అనాత్మవృత్తులను నిశ్శేషమొన ర్చుటకుగా యోగాదు లవసరము పుడకలు నెయ్యి మొదలగునవి వేయుఁ కొలది అగ్ని ప్రజ్వలించుచుండును, సమిధాదులు తగ్గుకొలది మంటయుఁ దగ్గుచుండును అదేవిధమున అనాత్మవిషయసంకల్పవికల్పాదులవలన మన స్సు పెరుగుచుండును, సంకల్ప వికల్పములను నిరోధించుకొలఁది మనస్సు గూడ శాంతించుచుండును దీనినే ప్రశాంతవాహితమని యోగశాస్త్రమందు వ్యవహరింతురు ఈఅనాత్మవృత్తి జాలమును నిశ్శేషమొనర్చినచో మబ్బు విడిచినప్పుడు సూర్యప్రకాశమువలె ఆత్మప్రకాశము స్వతముగానగును వృత్తి సహాయ మక్కఱయుండదు 25

మనస్సు స్వభావముగా మహాచంచలమైనదనుట నిజము అందువలన నది నిలిపినచోట నిలువదు, విషయముల వెంట వెంటఁ బరుగెత్తుచుండును అట్టిదానినిట్టి తెచ్చి యాత్మయందు నిల్పినఁగాని యోగసిద్ధి గలుగదు ఇట్టి విషమస్థితియందేమి చేయవలయునందువా ? ఈనిగ్రహలాటు తప్పదు ఏవిష యమువంక మనస్సుపోవునో ఆవిషయమునందు దోషము లెంచుచు రాఁగా

నందుండి మనస్సు మరలుచుండును ఇట్లు తిన్నతిన్నగా మనస్సును మరలించి దానిని ఆత్మ వశముచేయవలయును 26

రజోగుణలక్షణమైన విక్షేపము తమోగుణలక్షణమైన లయమను కల్మషము—ఇవిరెండు నశించుటంజేసి వృత్తిశూన్యము అనఁగా నిర్మనస్కత్వము గలిగి 'బ్రహ్మైవ సర్వం' అను బ్రహ్మభావమును బొందిన యోగికి అనఁగాఁ జీవన్ముక్తునకు నిరతిశయమైన సుఖము గలుగును అనఁగా జీవన్ముక్తుఁడు విక్షేపలయములు లేక నిర్మనస్కుఁడై బ్రహ్మభావమునుబొంది నిరతిశయ సుఖముననుండునని భావము 27

పూర్వోక్తప్రకారము యోగాభ్యాసమువలన మనస్సును కల్మషరహిత మొనర్చినచో సంసారహేతువైన పుణ్యపాపములు రహితమై అనాయాసముగా బ్రహ్మసంబంధమైన యపరిచ్ఛిన్న సుఖంబుగలుగును 28

'తత్త్వమసి' మొదలగువేదాంత మహావాక్యార్థ జ్ఞానమువలన ఆత్యంతిక సుఖము గలుగునని శాస్త్రమైయుండఁగా యోగాభ్యాసమున నదిగలుగుననుట యెట్లనిన శంకింపవచ్చును సమాధానము వినుము యోగాభ్యాసంబున మనఃకాలుష్యము నశించినప్పుడు అవిద్య తప్పక నశించును అవిద్య నశించినవాఁడు సమదర్శనుఁడగును అనఁగా ప్రపంచమెల్ల బ్రహ్మమయమని యెఱుంగును, అనఁగా బ్రహ్మాది స్తంభపర్యంతముమందు నెల్లభూతములలో అధిష్ఠాన రూపమునున్నది ఆత్మయేయని గ్రహించును దీనినే శుద్ధత్వంపదార్థ జ్ఞానమందురు. ఇదే మహావాక్యార్థజ్ఞానము ఈజ్ఞానమనుభవసిద్ధమైనప్పుడు ఆత్యంతికసుఖము గలుగును ఈజ్ఞాన మనుభవసిద్ధమగుటకుగా యోగాభ్యాసము సాధనమగుచున్నది 29

తత్పదార్థము (అనఁగా ఈశ్వరుఁడు) ప్రపంచమెల్ల సమాప్రపంబున తేనెయందు మధురమువలె అనుస్యూతమైయున్నదనియు దేహాది పరిచ్ఛేదములు దానికి గలుగవనియు, ప్రపంచజాతమెల్ల తత్పదార్థమైన నాయందు ఆరోపితమనియు ఎవఁడు గ్రహించునో వాఁడు బ్రహ్మద్వైతదర్శియగును అట్టివానికి నాకన్నభిన్నమైన వస్తువు గలుగదు అనఁగాఁ బ్రహ్మమే నేను నేనేబ్రహ్మమనుజ్ఞానము గలుగును తత్త్వంపదార్థములు రెండును ఏకాత్మత్వ మగుట

వలనను ఆత్మకన్న ప్రియపదార్థ మొకటి యుండనందునను అట్టివాఁడు స్వాత్మహితవర్తి యగునని వేఱచెప్ప నక్కఱలేదు ఇదియె శుద్ధ తత్పదార్థజ్ఞాన మందురు 30

తత్పద లక్ష్యమైన 'నేను' (అనఁగా ఈశ్వరుఁడు) త్వంపదలక్ష్యమైన సర్వభూతములందు అధిష్ఠానరూపంబున నుండుట యెఱింగినవాఁడు జీవన్ముక్తుఁడగును వానికి విధినిషేధశాస్త్రము లన్వయింపవు అనఁగా అతఁడు లోకానుగ్రహార్థము కర్మము చేసినఁ జేయవచ్చును, కర్మముచాలిన మానవచ్చును అనఁగా ఈశ్వరేచ్ఛాప్రేరణము గలిగినప్పుడు కర్మములొనర్చును. అట్టి ప్రేరణము లేనప్పుడు మాఱకుండును స్వేచ్ఛారూపమైన కర్మము గోరంత గూడ వానికిఁ గలుగదు 31

తత్త్వజ్ఞానులైన యిట్టియోగులు పరములు అని అపరములు అని రెండువిధములు అందుపరమయోగి తనకు సుఖదుఃఖము లెట్లో యితరులకుఁగూడ సుఖదుఃఖములట్లేయని భావించును అనఁగా తనకుదుఃఖము నెట్లు సంపాదింపఁడో యట్లె పరులకుఁగూడ దుఃఖమునుగలిగింపఁడు తనకుసుఖము నెట్లు సంపాదించునో యట్లేపరులకుఁగూడ సుఖమును గలిగింపుచుండును అపరమయోగికి మనోనాశనవాసనాక్షయములు గావు, అందువలన చిత్తవిక్షేపముండును అతఁడు కేవలతత్త్వజ్ఞానమును మాత్రము గలిగియుండునేగాని జీవన్ముక్తి సుఖంబెఱుంగఁడు. సుఖదుఃఖము లనుభవించుచుండును, దేహపాతంబునఁ గైవల్యభాగ్యపరముఁడగును అనఁగా జీవన్ముక్తికి తత్త్వజ్ఞాన మనోనాశ వాసనాక్షయములు అవశ్యమని యభిప్రాయము తత్త్వజ్ఞానమనఁగా నేమందువా ? ప్రపంచమెల్ల ద్వైతబుద్ధిగలవాఁ గలుగుచున్నదనియును అద్వితీయము చిదానందరూపము అద్వయమునగు నాత్మయందు కల్పితమేగాని యొండుగాదనియును, ఆత్మయొక్కటే పరమార్థమనియును, అదే నేనుఅనియును విశ్వసించుజ్ఞానము తత్త్వజ్ఞానమనఁబడును ప్రదీపజ్వాలాపరంపరలంబోలిన వృత్తిపరంపరలతోఁగూడ మనస్సు నిరంతరము మాఱుపాటుఁ జెందుచుండగ అట్టి వృత్తిరూపపరిణామము త్యజించుటవలన నిరోధాకారమైన పరిణామము గలుగును దీని నేవరో మనోనాశమందురు ఏకారణంబున క్రోధాదివృత్తివిశేషము ముండ

గీతాహృదయము.

వెనుకలులేక హఠాత్తుగా జనించునో అట్టి చిత్తగతమగు సంస్కారము వాసన యనఁబడును పూర్వాపూర్వములైన యభ్యాసముచే చిత్తమునందు వాస్యమానము లగును గాన వాసన యనుపేరువచ్చినది వివేకజన్యమగు చిత్తప్రశమవాసన దృఢమగునేని బాహ్యనిమిత్తములున్నను క్రోధాదులు జనింపవు ఇట్లు క్రోధాదులు జనింపకుండుట వాసనాక్షయమనఁబడును తత్త్వజ్ఞానము మనోనాశము వాసనాక్షయము ఇవి పరస్పరము కార్యకారణభావమునుబొంది యుండును ఎట్లనిన-తత్త్వజ్ఞానము గలిగినప్పుడు జగత్తు మిథ్యయను భావము గలుగును. మిథ్యయగు జగత్తువలనఁ గుందేటికొమ్మువలన నెంతప్రయోజనమో యంతప్రయోజనమగును అట్టి దానిమీఁద ధీవృత్తి యుదయింపదు, వృత్తి యెప్పుడు జనింపదో యప్పుడు మనస్సుకట్టెలులేని యగ్నివలె నశించును మనస్సు నశించినంతనే సంకల్పములకు ఉద్బోధకములైన బాహ్యనిమిత్తములుండవు గావున వాసనయు నశించును వాసనాక్షయమైనప్పుడు క్రోధాదివృత్తు లుదయించుటకుఁగారణము గలుగదు గావున మనోనాశనము గలుగును మనోనాశము గలిగినంతనే శమదమాదిసంపత్తియు దానంజేసి జ్ఞాన ముదయించును తత్త్వజ్ఞానముత్పన్నమైనంతనే రాగద్వేషాది రూపములనుండి వాసన క్షీణించును వాసనాక్షయముతోడ ప్రతిబంధములు తొలఁగును గావున జ్ఞానముదయించును కావున ఈమూఁటినిఒక్కసారి నభ్యసింపవలెఁగాని ఫలముగలుగదు ఈయభ్యాసము చిరకాలము కొనసాగింపవలయును గాని కొన్నాళ్ళతో విరమింపరాదు విదేహముక్తి గోరు ముముక్షువునకు తత్త్వజ్ఞానము ప్రధానము, మనోనాశ వాసనాక్షయములు రెండవపక్షము జీవన్ముక్తి గోరుముముక్షువునకు మనోనాశ వాసనాక్షయములు ప్రధానము, తత్త్వజ్ఞానము రెండవపక్షము కావున వానివానియుద్దేశ్యముఁ బ్రకారమనుసరింతుము తత్త్వజ్ఞానమునకు శ్రవణము మననమునిదిధ్యాసనము ఉపాయములు, మనోనాశమునకు యోగాభ్యాసముపాయము వాసనాక్షయమునకు ప్రతికూలవాసనలఁ బుట్టించుట ఉపాయము ఈవాసనలు మలినములని శుద్ధములని రెండు విధములు మలినవాసనలు బాహ్యములని ఆభ్యంతరములని మఱల రెండు విధములు బాహ్యవిషయసంబంధములైన వాసనలు బాహ్యములగును, ఈబాహ్యవాసనలు లోకవాసనలని శాస్త్రవాసనలని దేహవాసనలని ఇట్లు బహువిధములు కామక్రోధాదులై [illegible]

గారూఢుఁడన్ననో అతఁడు తత్త్వదర్శియైయుండును నడుమనే యోగభ్రష్టత గల్గినచో తత్త్వదర్శనము గలుగదు గావున, వానింగూర్చియు అడుగుటలేదు యోగాభ్యాసముచేయుచుండఁగా, వైరాగ్యము చాలినంత లేమింజేసి నడుమ విషయలోలత్వము గలిగినవానింగూర్చి యడుగుచున్నానని తలంతువు గాఁబోలు విషయలోలత్వమెప్పుడు గల్గునో యప్పుడు వాఁడు యోగాభ్యాసమునకు అధికారి గాఁడు వాఁడు మరల కర్మయోగమనుష్ఠించి చిత్తశుద్ధి వైరాగ్యములు పడయవలయునని యెఱుంగుదువు కర్మయోగినిగూర్చి యడుగుచున్నానందువా ? కర్మయోగికి విషయతృష్ణ యున్నప్పుడు జ్ఞానము గలుగదే గాని, చేసినంతవఱకు కర్మముల ఫలము గలుగును గావున అతఁడు ఉభయభ్రష్టుఁడు గాఁడు. నిష్కామ కర్మయోగినిగూర్చి యడుగుదువా యనిన నదియుఁ గాదు అట్టివాఁడు ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మము చేయును ఫలార్థ మనుష్ఠించిన కర్మమునకన్న ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసిన కర్మము అతిశయ గుణవంతము గావున ఆముష్మిక సుఖము నది తప్పక గలిగించును. దానం జేసి యతఁడు ఉభయభ్రష్టుఁడు కానేరఁడు ఉత్పన్నతత్త్వజ్ఞానియై ఉత్పన్న జీవన్ముక్తుఁడగువాఁడు పరమయోగి అనియు, ఉత్పన్న తత్త్వజ్ఞానియైనను అనుత్పన్నజీవన్ముక్తుఁడగువాఁడు అపరమయోగి యనియు 32-వ శ్లోకమువలన నేర్పడుచున్నది పరమయోగికి అపరమయోగికి ఇరువురకు జ్ఞానమువలన అజ్ఞానము నశించినందున విదేహముక్తి గలదనుట నిర్వివాదము జీవన్ముక్తి విషయంబున మాత్రము తారతమ్యము గలదు కావున వారివిషయమైగూడ యడుగుటలేదు ఇఁక ఎవనిగూర్చి యడుగుదునందువా ? నిత్యానిత్య వివేకాదులు గలిగి వివిదిషాసన్న్యాసియై (జ్ఞానసంపాదన కొఱకు సన్న్యాసము తీసుకొనువాఁడై) వేదాంతశ్రవణమనన నిదిధ్యాసములుచేయుచు అవి పూర్తి గాకమున్నే చనిపోవువాఁడు జ్ఞానము పరిపక్వము గాలేదు గావున మోక్ష సుఖము ననుభవింపఁడు, సర్వకర్మ సన్న్యాసి గావున స్వర్గాదిసుఖము వానికి గలుగదు అట్టివానిగతియేమని యడిగితివి 37

సర్వకర్మములు సన్న్యసించినందునఁ గర్మరూపాశ్రయము వానికి లేదు, జ్ఞానమార్గమన్ననో అది పరిపక్వము గాలేదు కావున నతఁడుభయభ్రష్టుఁడని తలంతును గాలికి చెదరిన మబ్బు తొల్లిటి మేఘమండలమునుండి విడివడినదై మఱియొక మబ్బులో [illegible] ట్టనడుమనే యంతరించునట్లు యోగభ్రష్టుఁడు

ఘాతము కూడఁగలుగును. ఎట్లనిన—యోగమభ్యసించుచు మధ్యకాలమునఁ
మృతిచెందినవారు, అప్పటికెంతమాత్రము అనుష్ఠించియుందురో అంతమాత్రము
బ్రహ్మాత్మైక్యవిషయమై బుద్ధి పరిపక్వమై యుండును. ద్రవించినప్పుడు
బుద్ధి సూక్ష్మమైనను లేచినంతనే పూర్వజ్ఞానము స్ఫురించునట్లు, జన్మాంతర
మందు వారికి పూర్వ పరిపక్వస్థితి వచ్చియుండును. అట్టి సాధనసంపత్తితో
వారు మఱల మోక్షార్థముయత్నింతురు. వైరాగ్యవాసన దుర్బలమై ప్రార
బ్ధమువలనవచ్చిన భోగవాసన ప్రబలముగానుండఁగనే ప్రాణములు విడచునేని,
అవసానకాలంబున భోగస్పృహయుండుటంబట్టి అతఁడు భోగముల ననుభవిం
చునిమిత్తము స్వర్గాదులనుండవలసియుండును గావున, వాని పునర్జన్మమునకుఁ
గాలవ్యవధియుండును. అట్లుగాక వైరాగ్యవాసన బలవత్తరమై మహాపుణ్యా
వేశంబునఁ బరమేశ్వరప్రసాదము గలిగినయవసరంబునఁ బ్రాణములు
పోవునేని, భోగస్పృహ యన్నఁగలేమింజేసి పరలోకంబుల భోగంబు లనుభ
వింపవలసిన కారణము లేకపోవుటచే వెనువెంటనె యతఁడు
బ్రహ్మవేత్తలయింట జనించును. ఇట్టివానికి పూర్వసంస్కారముయొక్క
యభివ్యక్తి అనాయాసముగాఁగలుగును 43

బ్రహ్మవేత్తలయింట జనించువారికి ప్రాగ్భవజ్ఞానసంస్కారము
(పూర్వజన్మమందలి జ్ఞానముయొక్క సంస్కారము) అవ్యవధానముగా
ఉద్బుద్ధమగును గాన, మఱల యోగాభ్యాసమునకు వలయు బుద్ధిసంయో
గమునకై యతఁడు ప్రయత్నింపఁ బనిలేదనియు, అట్టివి వానికి సులభము
గాఁగలుగుననియు జెప్పితిని. పుణ్యలోకములకుఁ బని చనుభోగములు బహు
కాలమనుభవించి మఱల జన్మించినవారికి భోగవాసన ప్రబలమైయుండుఁ గా
వునను, పూర్వజ్ఞానసంస్కారము తిరస్కృతమైయుండుఁ గావునను, యోగా
భ్యాసమునకై వలయుప్రయత్నము మఱల నవసరమాయెను, వినుము కాల
వ్యవధియైనను భోగవాసనవలన అడఁగి మఱుఁగుపడియున్నను తొల్లిటి జ్ఞానసంస్కా
రము అకస్మాత్తుగా వానిని మోక్షసాధనార్థము ప్రేరేపించును. ఏలయం
దువా? జ్ఞానవాసన అల్పకాలాభ్యస్తమైనదయ్యును పరమార్థవస్తువిషయకత్వ
మైనదగుటంజేసి, భోగవాసనకంటెఁ బ్రబలతరమైనదిగానుండును. అర్జునా!
నీవే యిందులకు దృష్టాంతము. నీవు యుద్ధప్రవృత్తుఁడవై వచ్చితివి, జ్ఞాన
ప్రయత్నము కించిన్మాత్రమును జేయలేదు. అయినను పూర్వసంస్కార

# గీతాహృదయము.

## ఏడవ యధ్యాయము

వేదాంతమందలి 'తత్త్వమసి' అను మహావాక్యంబున నిమిడియున్న వి అందు 'త్వం'పదార్థమనఁగా నేమో మొదటి ఆఱు అధ్యాయములలో వివరింపబడినవి. 7 మొదలు 13 అధ్యాయములకు 'తత్'పదార్థమనఁగా నేమో వివరింపఁబడును. ఆఱవయధ్యాయపు కడపటిశ్లోకములో సూచించిన భక్తియోగ మెట్టిదో చెప్పుటకు ఏడవయధ్యాయమారంభింపఁబడినది. భక్తి చేయుటకు వ్యక్త స్వరూపమొకటి అవలంబనముగా నుండవలయును. ఆస్వరూప మెట్టిదిగా నుండవలయునని అర్జునుఁడు ప్రశ్నింపఁదలఁచెనని గ్రహించి అందులకు నుత్తరముగా శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు.

అర్జునా! భక్తుని మనస్సు పరమేశ్వరుఁడనైన నామీఁద ఆసక్తమై యుండవలయును. క్షణమాత్రము వియోగముగలిగినను సహింపనను స్వభావ మెట్టిదిగానుండుటే ఆసక్తమన బడును. అనఁగా నిద్రావస్థయందుఁగూడ మఱువరాదని భావము. ఎప్పుడట్టి యాసక్తి నామీఁదనుండునో యప్పుడు వాఁడు మదేకశరణుఁడైయుండును. భక్తుఁడిట్లు మదాసక్తుఁడు మదేకశరణుఁడునై పూర్వాధ్యాయములోఁ జెప్పిన ధ్యానయోగము ననుష్ఠించుచునుండునేని సర్వవిభూతిబలైశ్వర్యసంపన్నుఁడనైన నన్ను కాలక్రమంబున సమగ్రముగా గ్రహించును ఆవిధానము వినుము 1

నేను చెప్పఁబోవునది వట్టిమాటలుగాదు, అపరోక్షానుభవసహితమైన జ్ఞానము, ఇది శాస్త్రసిద్ధము దీనిని నీకు సాకల్యముగాఁ జెప్పుచున్నాను ఈజ్ఞానము కలిగినతర్వాత ఎఱుఁగవలసినది మఱియొకటి గలుగదు అనఁగా బ్రహ్మరూపాభిజ్ఞుఁడు (బ్రహ్మస్వరూపము నెఱింగినవాఁడు) సర్వజ్ఞుఁడగుననియు ఆట్టివానికి జ్ఞాతవ్యాంశ (తెలిసికోఁదగిన విషయము) ముండదనియు, అందువలన నతఁడు కృతార్థుఁడగుననియు భావము 2

జీవరాసులు కోట్లకొలఁదియున్నను, మనుష్యులకుఁ దక్కఁ దక్కినవానికి [illegible] కావున నట్టిమనుష్యజన్మముగలుగుటచే

దుర్లభము. మనుష్యజన్మము గల్గినను అందఱు జ్ఞానార్థము ప్రయత్నింపరు, వేనవేలలో నెవఁడో యొకఁడు అట్టి మహాసుకృతియుండును, కావున తత్త్వజ్ఞానసాధనము ననుష్ఠించువాఁడుండుట దుర్లభతరము అనుష్ఠించువారున్నను వారిలో నెవఁడో యొకఁడు నన్నుఁ గనుఁగొనుచున్నాఁడు కావున సిద్ధుఁడైన జ్ఞాని దుర్లభతమము అట్టిసిద్ధులలో నెవఁడో యొకఁడే నాతత్త్వమును గ్రహించుచున్నాఁడు అట్టిమహాత్ముఁడు మిక్కిలి యఱుదు జ్ఞానమాహాత్మ్యమిట్టిదైనను నీకుఁ జెప్పుచున్నాను గావున సావధానుఁడవై వినుము 3

అర్జునా! భక్తిచేయుటకు ధ్యేయ మొకటియుండవలయును ఆధ్యేయతత్త్వము సమగ్రముగా బోధపడి యదిమహోత్కృష్టమైనదని విశ్వాసము గలిగెనేని భక్తి గాఢమగును మోక్షాపేక్షగలవ్యక్తికి సర్వాద్వైతలక్షణమైన బ్రహ్మస్వరూపము తప్ప మఱియొకటి ధ్యేయముగాదు ఆస్వరూపతత్త్వమును ముందెఱుంగుము స్థావరజంగమరూపమైన సర్వప్రపంచము బ్రహ్మమాయాత్మకమే గాని వేఱుగాదు ఎట్లనఁ-సత్త్వరజస్తమోగుణాత్మకయు అనిర్వచనీయమాయాశక్తియునైన యాబ్రహ్మప్రకృతి పృథివి జలము తేజస్సు వాయువు ఆకాశము మనస్సు బుద్ధి అహంకారము అని ఎనిమిది విధములుగా భిన్నమైయున్నది అందువలననే బ్రహ్మము అష్టమూర్తి యనఁబడును అష్టవిధములైయున్న యాప్రకృతి అపర అనఁగా నికృష్ట ప్రకృతియగును ఏలయందువా? ఇది జడత్వము బంధరూపత్వము నైయుండును గావున ఇది నికృష్ట ప్రకృతియగును 4 ఇదిగాక జీవాత్మకమైన మఱియొక ప్రకృతి గలదు దానిని పరాప్రకృతి యందురు అది చేతనరూపమైయుండును. ఈపరాప్రకృతి జీవరూపమైయుండి స్వకర్మములవలన జగత్తునెల్ల ధరించుచున్నది 5 చేతనాచేతనాత్మకమైన సమస్త ప్రపంచమునకు ఘటములకు మన్నువలె నీప్రకృతి ఉపాదానకారణముగానున్నది మన్ను సంగతి మఱచి ఘటములు ప్రత్యేకములని భావించి వానికి నామరూపములిడి వ్యవహరించునట్లు ఉపాదానకారణమైన ప్రకృతిని మఱచి ప్రపంచము ప్రత్యేకమని భావించి దానికి నామరూపములిడ వ్యవహరింతురు ఈద్వైతప్రపంచ మెల్ల మాయాపరిణామఫలము ఇంద్రజాలికుఁడు కల్పించు పదార్థములవలె మిథ్యాగాని వేఱుగాదు.

ఈసమస్తజగత్తునకు ఉత్పత్తి స్థితినాశములకు మూలకారణముగా నున్నయీబ్రహ్మము నేనే కావున ప్రపంచము నాయందుఁ బుట్టుచు నాయం దుండుచు నాయందే లయించుచుండును ఆది నాకన్న భిన్నమైనదిగా నం డనేరదు. నాకన్న నదిభిన్నమనుట మిథ్యయని గ్రహింపుము 6

అర్జునా! సమస్తజగత్తు మిథ్యాభూతము అనఁగా నాకన్న భిన్నమైన దనుట యసత్యము గావున సర్వమును నేను ఆక్రమించియుంగుఁ గావునఁ బర బ్రహ్మమునైన నాకన్న భిన్నమైనదియుఁ బరమార్థదృష్టితో విచారించినచో సత్యమైనదియు నగువస్తువు గోరంతయునులేదు మణులు దారమునందువలె సమస్తము నాయందుఁ గూర్పఁబడియున్నది

ఇప్పుడు నేను చెప్పినది శుద్ధాద్వైతలక్షణమైన బ్రహ్మస్వరూపమని గ్రహింపుము వేదాంతమునందుఁ దక్క యన్యవిధంబున దీనిని గ్రహింపఁ దరము గాదు మందబుద్ధులు వంటివారికి శుద్ధాద్వైతబ్రహ్మతత్త్వము అందదు గావున వారి సౌలభ్యార్థము విభూతిలక్షణమైన బ్రహ్మస్వరూపము నిక్రింది అయిదు శ్లోకములలోఁ జెప్పఁబడుచున్నది 7

అర్జునా! పిటియందున్న సారము నావిభూతినిగా గ్రహించి ధ్యానింప వచ్చును, అదికాదేని సూర్యచంద్రులకాంతి నావిభూతిగా గ్రహించి ధ్యా నింపవచ్చును, అదియుఁగాదేని ఓంకారము నా విభూతిగాఁ దైకొని ధ్యా నింపవచ్చును లేదా, ఆకాశమందలిశబ్దమును ధ్యానింపవచ్చును మానవుల యుద్యమము నావిభూతియే గావున దానిని ధ్యానింపవచ్చును. 8

భూమి యందున్న గంధము, అగ్నియొక్క దీప్తి వాయువుయొక్క స్పర్శగుణము సర్వప్రాణులకు ఆధారమైన ఆయుస్సు, తాపసుల ద్వంద్వ సహనసామర్థ్యరూపమైన తపస్సు, చిత్తైకాగ్ర్యరూపమైన అంతర తపస్సు, జిహ్వాదినిగ్రహాలక్షణమైన బాహ్యతపస్సు—ఇవన్నియు నావిభూతులే గావున వీనిలో నేనైనను ధ్యానింపవచ్చును 9

సర్వభూతములకు మూలకారణమేదో యది నావిభూతియే గావున, దానిని భజింపవచ్చును బుద్ధిమంతుల వివేకశక్తియు నావిభూతియే, తేజో

వంతులకుఁగల తేజస్సు అనఁగా పరులను గ్రిందుపఱచు శక్తి, పరులవలన అవమానముఁ బొందకుండుశక్తి నావిభూతియే ఈవిభూతులను ధ్యానింపవచ్చును 10

లేని వస్తువును గోరుట కామమనఁబడును, ఉన్నవస్తువుచాలక అధికముగాఁగోరుట రాగ మనఁబడను ఇట్టి కామరాగములులేనట్టియు స్వధర్మానుష్ఠాన సామర్థ్యరూపమైనట్టియు సాత్త్వికబలము నావిభూతియే గావున దానిని ధ్యానింపవచ్చును కామరాగములతోఁగూడిన బలము నావిభూతి కానేరదని స్పష్టముగా గ్రహింపవలయును ధర్మమునకు విరుద్ధముకానట్టి భార్యాపుత్రధనాదులయందలి కోరికయు నావిభూతియే గావున దానిని ధ్యానింపవచ్చును

అనియువియననేల ? జగత్తునఁగల చేతనాచేతనాత్మకములైన సమస్తపదార్థములు సాత్త్వికములుగానీ రాజసములుగానీ తామసములుగానీ ఇవియెల్ల నావలనఁ గలిగినవేయని గ్రహింపుము. సర్వము నావలనఁ గలుగుటంజేసి సర్వము నారూపంబున ధ్యానింపనగును సాత్త్వికభావంబులను నారూపంబునఁ జింతించుట యుక్తమేగాని, నికృష్టములగు రాజస తామసభావములు నారూపంబులెట్లగునని, అట్టి నికృష్టరూపంబుల ధ్యానించుట యెట్లు యుక్తమగును, అట్లు ధ్యానించిన నాకును నికృష్టత్వము గలయనే యగును గదా యని శంకింతువు గాఁబోలు సర్వభావములు నాయధీనములై యుండును, నేను దేనికి అధీనుఁడనుగాను సర్వోత్కృష్టుఁడను నన్ను సర్వరూపంబులఁ జింతించినంతనే నాకు నికృష్టత్వము గలుగునని తలంచుట భ్రమాగము సర్వరూపచింతనమనఁగా నేమి ? అన్నిటియందు నన్నుఁగాంచుటయే సర్వరూపచింతనమగును రాజదృష్టిని భృత్యునందుఁ జూపినప్పుడు రాజునకుఁ గొఱఁతగలుగునా ? అట్లుచేయుట భృత్యుని పెద్దచేయుటయగుఁగదా అంగువలననే విగ్రహారాధనమునను యోగ్యతగలిగినది బ్రహ్మదృష్టి విగ్రహములందు నిలిచో, 'రాళ్ళు దేవుళ్లైన రాముఁడెంగవా' అనునది సత్యమగును 12

నేనిట్టివాఁడనగుట జనలేలరెఱుంగరదువా ? ఈజగమెల్ల సత్త్వరజస్తమోగుణకార్యములైన భావోత్కృష్టకార్యములవలన అవివేకమును బడయుచున్నది

అందువలన ఈగుణమయమునకన్నఁ బరమై వికి కల్పనాధిష్ఠానమై ఆకార
ణంబున వికారశూన్యమై యుండు నన్ను ఎఱుంగదు. ఈయవివేకలోకము
యొక్క దౌర్భాగ్యమేమనవలయును ? 13

'జగమెల్ల త్రైగుణ్యమోహితమై వివేకము దక్కియున్నచో, మోహ
రహితమైనది ఏదియు నుండఁజాలదు అట్లగునేని జంతువునకే మోక్షములేదు
గదా'యని శంకింపవచ్చును ఎట్టిభేదములేనట్టియు, ఎట్టియుపాధిలేనట్టియు
నిత్యశుద్ధబుద్ధ ముక్తమైనట్టియు ఆత్మకన్న వేఱుగానట్టియుఁ జైతన్యస్వరూపము
గలిగినట్టియు నన్ను అనఁగా బ్రహ్మమును ఎవరు సాక్షాత్కరించుకొందురో
వారు త్రిగుణాత్మకము సర్వానర్థహేతుభూతము మిథ్యాస్వరూపమునైన
మాయను దాటుదురు, అనఁగా జగత్తు బ్రహ్మాతిరిక్త మను మిథ్యాభావము
నశించునని భావము ఈమాయకు ఆశ్రయమేది ? విషయమేది ? ప్రామా
ణికమేమి ? స్వరూపమేది ? యిదియెట్లుకలిగినది ? అనియీ యిట్టిప్రశ్న లడుగ
వచ్చును ఈనామాయకు స్వప్రకాశచైతన్యమైన నేనే ఆశ్రయము విషయము
నైయున్నాను ప్రత్యక్షమే యిందులకుఁ బ్రమాణము కాలుకొలిమిలోవైచి
తీసిన యినుపముద్దను జూచి ఇనుము కాలును అని చెప్పునప్పుడు కాల్చుగుణము
ఇనుమునందులేకున్నను అధ్యాసవలన అనఁగా ఇనుపముద్ద నధ్యసించియున్న
యగ్నినే యినపముద్దయను భావముతో నట్లుచెప్పుదురు అదేవిధముగా చైత
న్యతాదాత్మ్యాధ్యాసవలన నామాయకు నేనే ఆశ్రయము విషయము నగుచు
న్నాను. ఈమాయ సత్త్వరజస్తమోగుణాత్మకముగానుండును మువ్వురిత్రాడు
ఎంతదృఢముగానుండునో త్రిగుణాత్మకయగు మాయయు అంతదృఢముగా
నుండును గావున మిక్కిలి యభేద్యము, జ్ఞానముదప్ప మఱియొకటి దీనిని భే
దింపఁజాలదు నామాయ పరమేశ్వరుఁడనైన నాయొక్క శక్తివిశేషమై యుండును
మాయ నాయధీన గావున నన్ను ప్రపత్తిచేసినవారు నామాయను దాఁటుదురు
ఎట్లు దాఁటుదురందువా ? మాయఅనఁగా అజ్ఞానము, అనఁగా లేనిదానిని
ఉన్నట్లుభావించుట నాకుఁబ్రపత్తిచేసినవారికి జ్ఞానమిత్తును ఎప్పుడు జ్ఞాన
ముగలుగునో యథార్థము బోధపడును ఎప్పుడు యథార్థము బోధపడునో
యప్పుడు భ్రమ తొలఁగును. ఇదే మాయనుదాఁటుట బ్రహ్మతత్త్వజ్ఞానంబున
అజ్ఞానము నివృత్తియగుననుట నిశ్చయమైనను బ్రహ్మతత్త్వజ్ఞానముగలుగుట

ఏదేవతలను వారారాధింపఁ దలఁతురో యాదేవతలప్రసాదంబున వారికి నాయెడ
భక్తి యేలఁ గలుగరాదందువా ? ఎవఁడు ఏదేవతామూర్తిని జన్మాంతరవాసన
వలనఁగలిగిన విశ్వాసముతో నర్చింప నిచ్ఛగించునో వానికి ఆదేవతామూర్తి
యందే భక్తి స్థిరమగునట్లు వానియంతర్యామినై విధింతును 21

వారట్లు శ్రద్ధతో దేవతామూర్తులను బూజించి వారివలన ఇష్టార్థము
లను బడయుదురు. అట్టికోర్కె సర్వకర్మములకు ఫలమునిచ్చువాఁడ నీనేయను
టకు హానిగలుగదా యని శంకింతువుగాఁబోలు. ఎవరికిఁదగినఫలము వారికి
నేనే యాదేవతామూర్తులవలననే యిత్తును. నాకును దేవతలకును తనుమాత్ర
భేదమేగాని తనుమద్భేదములేదు 22

అంతటను ఫలమునిచ్చునది నేనైనచో మద్భక్తులైనవారలు అన్య
దేవతాభక్తులకన్న నెట్లుత్తములగుదురు ? ఎందును ఫలమునిచ్చునది నేనేయై
నను అన్యదేవతాభక్తులకు తమ్ములము శాశ్వతమైనదిగాదు. ఏలయందువా ?
వారు పరిచ్ఛిన్నమైన క్షుద్రదేవతలందు బుద్ధినిలిపిరి గావున అందులకుఁ
దగిన పరిచ్ఛిన్నఫలమునే పొందుదురు. ఇంద్రాదిదేవతలు పరిచ్ఛిన్నభోగులు
పరిమితకాలవర్తులేగాని నిత్యులుగారు. అట్టివారి నాశ్రయించినప్పుడు వారిచ్చు
ఫలముగూడ నట్టిదిగానే యుండును. మతియెంతో గతియంతేయనవలెనా ?
నేనట్లుగాక అపరిచ్ఛిన్నుఁడను శాశ్వతుఁడను. నన్ను ఆశ్రయించునట్టి ఆర్తాదు
లకు నాయిచ్చు ఫలము శాశ్వతమైనదిగానుండును. ఆర్తాదులుకోరనిదే వారి
కట్టిఫలము నేనెట్లిత్తునందువా ? ఎండవేడిమికి సోర్వక గంగాజలంబులందుఁ
దూఁకినవానికి స్వాపేక్షితమైన తాపశాంతి కలుగుటయేగాక, కోరనట్టి పావన
త్వముగూడ లభించును. గంగాజలస్వభావమట్టిది. ఆవిధముగా ఆర్తి పరి
హారమునుగోరి నన్ను సేవించినను వారు కోరనిఫలమునుగాక అపునరావృత్తి
రూపమైన మోక్షమును గూడ పొందుదురు. నాస్వభావమట్టిది. కావున
నాభక్తులకు అన్యదేవతాభక్తులకు మహదంతరము గలదు 23

నాభక్తులకు అన్యదేవతాభక్తులకు ఇట్టి రెండువారికి భజనవిషయంబున
ప్రయాసము సమానమేయైనను ఫలవిషయమునమాత్రము పైనఁజెప్పినట్లు తార
తమ్యముగలదు. అట్లుండియు నన్నువదలి యన్యదేవతలను భజింతురు

ఇందులకు మౌఢ్యమే కారణము. ఆమౌఢ్యమెట్టిదనిన ఇంతకుపూర్వము నాకెట్టివ్యక్తిత్వములేదనియు ఇప్పుడు కర్మవశంబున వసుదేవునియింట జన్మవిశేషమును బొంది వ్యక్తినైతిననియు ఇతరజనులతోఁ బాటివాఁడ నేననియు వారు నన్ను భావింతురు. ఇట్టి మౌఢ్యమునకు అవివేకమె కారణము. జగత్కారణభూతము సర్వోత్కృష్టము నిత్యము నైన నాస్వరూపము నెఱుంగక ఇతరులవలె నేనును వర్తించుచున్నంతమాత్రాననే నన్నుగూడ ఒకజనమాత్రునిగా భావించుటంజేసి వారు నన్నువదలి దేవతాంతరములను భజింతురు. అందువలన వారు పడయుఫలముగూడ అంతమాత్రమే యుండును. 24

పుట్టినదిమొదలు మహాద్భుతములైన పెక్కు కార్యములొనర్చితివనియు దానింబట్టియే నీ యతిమానుషత్వము స్పష్టమగుచుండఁగా నిన్నొకసాధారణమర్త్యునిగా వారు భావించుటెట్లనియు శంకింతువా? నాభక్తులకుమాత్రమే నాస్వరూపదర్శనమగును గాని యెల్లరకుఁగాదు. ఏలయందువా? యోగమాయ నన్నావరించియుండును. యోగ మనఁగా భగవత్సంకల్పము, ఆసంకల్పమునకు వశమైవర్తించు మాయ యోగమాయ యనఁబడును. నాస్వరూపమును గానలేక మూఢులు ఆద్యంతరహితుఁడను బరమేశ్వరుఁడను నైననన్ను గూడ లోకసాధారణునిగా భావింతురు. నాభక్తులన్ననో నాయనుగ్రహంబున నామాయను దాఁటి నన్ను గాంతురు 25

గడచినట్టియు ఇప్పుడున్నట్టియు ఇకఁ రాబోవునట్టియు స్థావర జంగమాత్మక భూతకోటినెల్ల నేనెఱుంగుదును. నన్ను మాత్రమెవ్వరు నెఱుంగరు. ఇంద్రజాలికుఁడు లోకులను మోహపెట్టుచున్నాఁడు. అట్లుచేయుట యతఁడు మాత్రమెఱుంగును, లోకులెఱుంగరు. ఇది ప్రసిద్ధమేకదా. నేను గూడ సర్వజగన్మోహకుఁడనైన మహామాయావిని గావున నన్నొరులెఱుంగరు 26

అనుకూల విషయంబున ఇచ్ఛయు, ప్రతికూలవిషయంబున ద్వేషము గలుగుచుండును. పూర్వజన్మమందు ఏయేవిషయములందు ఇచ్ఛాద్వేషములుండెనో ఆయిచ్ఛాద్వేషముల వాసన మఱుజన్మంబునఁ బుట్టుకతోనే యెల్ల జంతువులకుఁ గలుగుచుండును. కావున జంతువులెల్ల నట్టిస్వభావమునే గలిగియుండును. అనఁగా పూర్వవాసననుబట్టి యీజన్మమందు వారు తత్తద్విషయేచ్ఛాద్వేషవశులై యుందురు. విషయములందలి యీయిచ్ఛాద్వేషములు

# గీతా హృదయము.

## ఎనిమిదవ యధ్యాయము

భగవంతుఁడును పరబ్రహ్మమునైన నారాయణుని తత్పదార్థమందరు అట్టి పరబ్రహ్మముయొక్క భజనము ఏడవయధ్యాయములోఁ జెప్పఁబడెనది ఆవిషయమే ఎనిమిదవయధ్యాయములో విస్తరింపఁబడును ఏడవయధ్యాయము కడపటఁ జెప్పిన ఏడు పదార్థములు అనఁగా బ్రహ్మము, అధ్యాత్మ, కర్మము అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, ప్రాయాణికము, అను ఏడింటి నిందునిరూపింపఁదలంచినాఁడు ఆవిషయమును గూర్చి యర్జునుఁడిక్రింది రెండు శ్లోకములలోఁ బ్రశ్నించుచున్నాఁడు

అర్జునుఁడు అనుచున్నాఁడు

బ్రహ్మమును ఎఱుంగుదురని 7-వ యధ్యాయము కడపటి శ్లోకములోఁ జెప్పితివి బ్రహ్మము అనఁగా నెట్టిది ? ఆ బ్రహ్మము సవిశేషమా ? నిర్విశేషమా ? దేహము నధికరించియుండునది అధ్యాత్మమగును అధ్యాత్మమనెడి వస్తువెది ? అనఁగా దేహము నధిష్ఠించి యుండు నేత్రములు మొదలగు నింద్రియములు నున్నవి ఇందులో దేనిని అధ్యాత్మమందురు ? కర్మము అనఁగా నేది ? కృషివాణిజ్యాదులందు ప్రవర్తించు బజనఫలత్వము వానికి యుక్తముగాదుగదా ? అధిభూతము అధిదైవము మున్నగు యజ్ఞములతోడ బగవచ్చింతనముచేయువారికి అంత్యకాలమందు భగవన్ముఖముండునంటివి అధిభూతాధిదైవశబ్దవాచ్యమైనదేది ? (1) అధియజ్ఞుఁడెవఁడు ? వానికి అధియజ్ఞత్వమెట్లు ? అధియజ్ఞుఁ డెందుండును ? అనఁగా ఈదేహమందుండునా ? దేహమునకు వెలుపలనుండునా ? మరణకాలమందు సకలేంద్రియములు క్షోభించియుండు గావున మనస్సు సమాధానమొంది యుండదు గదా అట్టి సందర్భమునఁ జిత్తము సమాహితము లగు, అధియజ్ఞుని తెలియఁబడుట యెట్లు ? ఇవన్నియు నాలోచించినచో నీజ్ఞానము గలుగుటయే దుర్లభమని తోఁచుచున్నది దని నెల్ల వివరింపవలెను 2

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు,

అర్జునా ! ఏదినశింపదో ఏది సర్వము వ్యాపించియుండునో యది యక్షరమనఁబడును ఈ యక్షరమునే బ్రహ్మమందురు బ్రహ్మము సవిశేషమా ? నిర్విశేషమాయని యడిగితివి సవిశేషమైనచో రూపముండును ఎప్పుడు రూపముదాల్చునో అప్పుడారూపమునకు నాశముగలదు, మఱియు రూపముదాల్చినది సర్వవ్యాపకము కాఁజాలదు నాశముగలది సర్వవ్యాపకమగానిది అక్షరము కాఁజాలదు కావున బ్రహ్మము నిర్విశేషమేయని గ్రహింపుము సవిశేషబ్రహ్మమునకుఁ గూడ స్వరూపమునుబట్టి నిత్యత్వము వ్యాప్తిత్వముగలదనియు, అక్షరశబ్దమునకుఁ బ్రణవమను నర్థము రూఢమనియుఁ గావున అక్షరమనఁగా సవిశేషబ్రహ్మమో ప్రణవమోయని చెప్పరాదాయని యీ శంకింతువుగాఁబోలు. ఇట్టి శంకను నివారించుటకై 'అక్షర'శబ్దమునకు 'పరమ'మను విశేషము ప్రయోగింపఁబడినది పరమమనఁగా నిరతిశయ మహత్త్వరూపము నిరతిశయమన్నంతనే సంకోచము అనఁగా త్రివిధపరిచ్ఛేదము లేనిదనుట స్పష్టము దీనింబట్టి అక్షరశబ్దమునకు నిర్విశేషము అద్వైతము చిదానందరూపమునైన పరంబ్రహ్మమే యర్థమని గ్రహింపుము

అధ్యాత్మమునుగూర్చి వినుము అక్షరమైన బ్రహ్మముయొక్క స్వభావము అధ్యాత్మమనఁబడును స్వభావమనఁగా స్వరూపము త్వం పదలక్ష్యమైనట్టి నిష్ప్రపంచాకార సద్ఘనచైతన్యము అధ్యాత్మమనఁబడునని భావము ఆచైతన్యము దేహము నధికరించియుండును గావున అధ్యాత్మమనఁబడుచున్నది 'తత్త్వమసి' మొదలగు శ్రుతులవలనఁ బ్రసిద్ధమైన దానిని భగవదనుగ్రహంబునఁ గలుగు చిత్తశుద్ధివలనఁ దెలిసికొనవలసియున్నది భగవదనుగ్రహంబు తద్భజనంబునఁ జేకూఱును కావున భజనమునకు అవకాశము గలుగుచున్నది

కర్మమనఁగా నేమి యనియంటివి ప్రాణుల యుత్పత్తి వృద్ధులను గలిగించునట్టి యాగహోమదానాత్మకమైనత్యాగము కర్మమనఁబడును దేవతోద్దేశముతో ద్రవ్యత్యాగముచేయుట యాగమగును, అది ప్రక్షేపాంతమగునప్పుడు హోమమగును, తనసొత్తును బరులకుఁ జెందఁజేయుట దాన

మగును. విసర్గశబ్దవాచ్యమైన త్యాగమునందీమూఁడు నిమిడియుండును. ఈ త్యాగమువలనఁ బ్రాణులయుత్పత్తి వృద్ధులెట్లుండువా? అగ్నియందు ఆహుతి చేయబడినపదార్థము సూర్యునకుఁ జేరును, సూర్యునివలన వర్షము, వర్షమువలన అన్నము, అన్నమువలనఁ బ్రజయుద్భవించును అని స్మృతిసిద్ధము. దీనింబట్టి చూచినచోఁ గర్మశబ్దమునకు వైదికకర్మమేగాని కృష్యాది లౌకికకర్మ మర్థముగాదని స్పష్టము ౩

అధిభూతమనఁగా నేమంటివి. క్షరము అనఁగా వినాశము. అట్టి క్షరభావముగలవి దేహాదిపదార్థములు. ఈ పదార్థములు భూతమును అనఁగా ప్రాణిజాతమును అధికరించియున్నవి. అనఁగా ప్రాణిజాతము నధికరించియుండు దేహాదిపదార్థము అధిభూతమనఁబడును. అధిదైవతమనఁగా పురుషుఁడు. సర్వభూతములకు అధిపతియు భగవదంశసంభూతుఁడు ఆదికర్తయు నగు హిరణ్యగర్భుఁడు ఆదిత్యాదిదైవముల నధిష్ఠించి చక్షురాదుల ననుగ్రహించుచున్నాఁడు గావున అధిదైవతమనఁబడును. అధియజ్ఞమనఁగా నేనే. ఈదేహమునందు అంతర్యామినైయుండి యజ్ఞాదులఁ బ్రవర్తింపఁజేయుదును, కావున అధియజ్ఞమనఁబడుదును. అంతర్యామినై ప్రవృత్తినివృత్తులఁ గలిగించుచుందును గావున దేహము దాల్చినవారెల్ల నన్ను ఎఱుంగశక్యమగును 4

అంతకాలమందుఁగూడ నన్నే స్మరించుచుఁ గళేబరమును వదలి చనువాఁడు నాభావమును బొందును. అంతకాలమందు సకలేంద్రియతనుక్షోభ వలన స్మరణము దుర్లభమందువా? నిరంతరము నన్ను చింతించుచున్నచో ఆ యభ్యాసమువలన మరణకాలమందుఁగూడ నాస్మరణ కారణముండును. ఇది దుర్ఘటముగాదు. అందువలననేగదా 'సర్వకాలములందు నన్ను స్మరింపుము' అని యీక్రింది 7-వ శ్లోకములోఁ జెప్పుచున్నాను. నన్నే యనియనుట యేల యందువా? అధిభూతాదులు అంశములేగాని పూర్ణములుగావు. అంశము లనుమాని నన్నే స్మరింపుమని సూచితము

'ఏస్మరణతో శరీరమును వదలుదురో తత్సమానాకారమువచ్చునని యేమి భరతుడు మృగస్మరణతోఁ దనువును వదలినందున వానికి మృగసమానాకారము పరజన్మంబునఁ గలిగినదిగదా అట్లే భగవత్స్మరణతోఁ దనువు

వదలినచో భగవత్సమానాకారము వచ్చునుగదాయనియు శంకింపవచ్చును. చనిపోవువారు పోవుటకు దేవయానము పితృయానము అని రెండుమార్గములు గలవు భగవత్స్మరణతో శరీరమువదలువారు దేవయానమార్గంబున బ్రహ్మలోకమనెడి వైకుంఠంబునకుఁ బోయి యచ్చట దివ్యభోగములనుభవించి యనంతరము లబ్ధవిజ్ఞానులై పరబ్రహ్మైక్యలక్షణమైన మోక్షమును బడయుదురు. అంతియగాని వారికి భగవత్సమానాకారము గలుగదు ఈవిషయమై సంశయము వలదు. 5

అంతకాలమందు ఏఏభావమును అనఁగా దేవతావిశేషములనుగాని మఱియొకదానినిగాని స్మరించుచుఁ గళేబరమును వదలునో ఆభావమునే పొందును గాని మఱియొకటి పొందఁడు అంతకాలమందు వివశత్వముగలిగియుండును గావున ఏభావమునైనను స్మరింప నెట్లుశక్యమని శంకింపవచ్చును అంతకు పూర్వము నిరంతరము ఏభావమును స్మరించుచుండునో అభావము చిత్తమునందు వాసనారూపముననుండును 6

పూర్వాభ్యస్తము అంత్యభావన యగుఁ గావున అంతకాలమందు నా విషయకమైనభావన కలుగవలయునన్నచో సర్వకాలములందు నన్నుఁ జింతింపవలయును. భగవదనుచింతనముతోనే యుండువారికి స్వధర్మమునుగూడ మానవలసివచ్చునందువా ? వర్ణాశ్రమకర్మముల ననుష్ఠించుచునే నిరంతరము నన్నుస్మరించిన లాభముగాని వేఱుగాదు ఒకప్రక్క భగవత్స్మరణము ఒకప్రక్క స్వధర్మానుష్ఠానము ఇవిరెండు నొక్కసారిచేయుట యెట్లుసాధ్యమందువా ? స్వవర్ణాశ్రమ ధర్మప్రకారము తానుచేయు కర్మములెల్ల పరమేశ్వర ప్రీత్యర్థమే యను సంకల్పాధ్యవసాయరూపమైనబుద్ధితో వర్తించినచో రెండుఁ గలసివచ్చును కావున నీవును విధర్మమైనయుద్ధము నట్టిబుద్ధితో నొనర్పుము. ఇట్లు చేయువానికి అంత్యకాలంబున నాస్మరణముండును, అతఁడు నన్ను పొందును. ఇది నిస్సంశయము. 7

అర్జునా ! నీవడిగిన యేడుప్రశ్నలకు జవాబుచెప్పితిని అంతకాలమందు గూడ భగవత్స్మరణముండుటకై పెక్కువిధంబుల భగవదుపాసనము చేయుదురు అవి తెలిపెద వినుము. నిత్యనైమిత్తికకర్మముల నన్ష్ఠింప

వలసినకాలమునందుఁ దప్ప తక్కినపుడెల్ల మనస్సుతో ఉపాసింపఁదలఁచిన మూర్తిని స్మరించుచుండుట అభ్యాసమనఁబడును ప్రతిదినము యోగకాలమందుమాత్రము ఉపాసింపఁదలఁచినమూర్తిని స్మరించుట యోగమనఁబడును ఇట్లు అభ్యాసయోగయుక్తముగా అనుష్ఠింపవచ్చును అట్లు అనుష్ఠించునప్పుడు మనస్సు ఎంతమాత్రము అన్యవిషయంబులను దలంపరాదు ఇట్లు నిరతిశయము దివ్యమునైన పురుషుని చింతించుచువచ్చినచో అంత్యకాలమందుఁగూడ అదేస్మరణయుండును ఆదివ్యపురుషుని బొందుదురు 8

స్మరింపఁదగిన పురుషుఁడెట్టివాఁడందువా ? సర్వజ్ఞుఁడు, ఆదిలేనివాఁడు, నిఖిలజగత్తును శాసించువాఁడు పరమాణువుకన్న సూక్ష్మమై దృష్టికిగోచరింపనివాఁడు, సమస్తమునకుఁ బోషకుఁడు, ఇంతనితలంపరాని మహిమాతిశయముగలమూర్తి, సూర్యునివలె సకలజగత్తును ప్రకాశింపఁజేయువాఁడు, అజ్ఞానమనెడి చీఁకటిని బోఁగొట్టువాఁడునైన పురుషుని స్మరింపవలయును అట్లు స్మరించినవారు తుదకాపురుషుని బొందుదురు అనఁగా, ధ్యానింపఁ దగిన మూర్తి పైనఁజెప్పిన విశేషములుగలవాఁడుగా భావించి ధ్యానింపవలయునని తాత్పర్యము 9

ఇట్లు ప్రతిదినము భక్తితో అభ్యసించుచు రాఁగా ఆ భక్తియోగము చిరకాలాభ్యాసమువలన దృఢమై మరణకాలమందుఁగూడ మనస్సు చలింపక యాపరమపురుషునియందె నిల్చియుండును పైనఁజెప్పినప్రకారము చేయునప్పుడు, మొదట హృత్పుండరీకమునందు మనస్సును వశపఱచుకొనవలయును అనంతరము దానిని సుషుమ్నా నాడిమార్గంబున గురూపదేశప్రకారము ఒక్కొక్క భూమికనుండి పైకిఁగొనిపోయి భ్రూమధ్యంబుననున్న అజ్ఞాచక్రంబున నిలుపవలయును అది యందుండి బ్రహ్మరంధ్రముగుండ నతిక్రమించి పరమపురుషుని బొందును 10

పైమూఁడు శ్లోకములలో అభ్యాసయోగయుక్తమైన ఉపాసనమును చెప్పితిని మఱియొక ఉపాసనగలదు దానిని జెప్పెదవినుము వేదవేత్తలు దేనిని అక్షరమనిచెప్పుదురో, ఊరక చెప్పుటయేగాక వారు రాగమునుమాని నియమము నాచరించి దేనిని అనుభూతమొనర్చుకొందురో, దేనినెఱుంగుటకై

సాధకులు గురుకులవాసాదిరూపమైన బ్రహ్మచర్యమున, గృహస్థులైనచో యాగదానాదులు, వానప్రస్థులైనచోఁ దపస్సు నాచరింతురో అట్టి ఓంకారబ్రహ్మోపాసనముగలదు. అది వేదానువచనయజ్ఞదానతపస్సులవలన నెఱుంగఁదగినదియు, యతులకుమాత్రమే పొందఁదగినదియు, అఖిలవేదరహస్యమైనదియు నగు నేని నాఁబోంట్లకెట్లు గ్రహింప సాధ్యమగునని శంకింపవలదు. అది యంతక్లిష్టమైనది యైనను నీకు దానిని సంగ్రహముగా స్పష్టముగా బోధపఱతు వినుము. 11

నేత్రములు మొదలగు బాహ్యేంద్రియములను గాని వానివిషయముల నుండి మఱలించి, మనస్సు విషయచింతాపరత్వమైనచో బాహ్యేంద్రియ నిరోధము నిరర్థకము గావున మనస్సునుగూడ హృదయదేశమందు నిలిపి అనఁగా వృత్తిరహితమొనర్చి ఇట్లు బహిర్ద్వారములను అంతర్ద్వారమును నిరోధించి, క్రియాద్వారమైన ప్రాణమును సయితము నిరోధించి ఒక్కొక్కభూమిని క్రమక్రమముగా జయించుచు భ్రూమధ్యమందునిలిపి, గురూపదేశప్రకారము ఆత్మవిషయక సమాధిస్థైర్యమనెడి యోగమునుబూని, బ్రహ్మవాచకత్వమును ప్రతిమాదులవలె బ్రహ్మప్రతీకత్వమునైన ఓమ్ అనుఅక్షరమును ఉచ్చరించుచు ఆయక్షరమునకు వాచ్యమైన నన్ను స్మరించుచు మూర్ధన్యనాడివలన దేహమును త్యజించి అర్చిరాదిమార్గంబున బ్రహ్మలోకమునకుఁ బోవువాఁడు అచ్చట భోగాంతంబున లబ్ధవిజ్ఞానుఁడై ముక్తినొందును. ఆప్రకారము చేయలేని వారికి పైనఁజెప్పిన ఉపాసనలు రెండు నుపయోగింపవు. ఎల్లరకు సులభముగా నుండు నుపాసన యొక్కటిగలదు. దానినిఁజెప్పెద వినుము. 12

ఎవఁడు నన్ను నిరంతరము స్మరించునో వానికి నేను సులభుఁడను. సతతము నాయనుచింతనమే నాప్రాప్తికి హేతువు, మూర్ధన్యమార్గమునఁ బ్రాణోత్క్రమమగుఁగాక, మఱియొకవిధమున నగుఁగాక. ఆవిషయమై యంతపట్టుదల వలదు. నన్ను స్మరించుచుఁ బ్రాణములు వదలినఁ జాలును. ఆతఁడు నన్ను తప్పక పొందును. ఇంద్రియములను నిరోధింపకున్నచో విషయేంద్రియసంయోగము తప్పదనియు, ఆసందర్భంబున మనస్సు విషయాసక్తమై యుండునేగాని వేఱుగాదనియు, మనస్సు అట్లున్నప్పుడు నిరంతరము నాచింతన మెట్లు ఘటించునని యు శంకింపవచ్చును. నీచిత్తమును నాయందే నిలుప

వలయునుగాని, అన్యవిషయములవంకకుఁ బోనియరాదు ఎవనన్నట్లు ని
యామచేసితివేని బాహ్యేంద్రియములకు తత్తద్విషయములతో సంబంధము
గలిగినను నీమనస్సు వానివంక దిరుగకుండును, ఎట్టి అపకారముఁ గలుగదు
ఈనిరంతరచింతనము ఒకనాడనిగాని ఒకనెలఅనిగాని, ఒకసంవత్సరమని గాని
నియమింపరాదు, యావజ్జీవము చేయవలయును ఇట్లుచేయువాఁడు నాపట్ల
యక ప్రేమతో నిండియుండును గావున నాయనుచింతనముమాని జీవింప జా
లఁడు. ఇట్టియోగికి నేను సులభుఁడను వానివియోగమును నేను సయిం
తము సహింపఁజాలను ఇట్లుచేయుట ఎల్లరకు సులభము 14

నీవింతసులభుఁడ నగుటవలన ఫలమేమందువా? నేను సులభుఁడ నగు
టవలన నన్ను సులభముగాఁ బొందవచ్చును నన్నుఁబొందినవారు ఆధ్యాత్మి
కాది సమస్తదుఃఖములకు బుట్టినిల్లయినదియు, అస్థిరమైనట్టియువగుఁ బునర్జన్మ
ముగలుగదు పునర్జన్మములేనట్టి మహాత్ములకు ముక్తి సిద్ధమని చెప్ప
నక్కఱలేదు 15

బ్రహ్మలోకము మొదలు సమస్తలోకములు పుట్టుచు గిట్టుచుండును
నన్నుఁ బొందినవారికిఁ బునర్జన్మము గలుగదు బ్రహ్మలోకమునకుఁ బోయిన
వారికిఁ బునర్జన్మములేదని శ్రుతులు చెప్పుచుండగా నీవిట్లు చెప్పుట యెట్లు
చెల్లునందువా? క్రమముక్తిఫలంబుగా బ్రహ్మలోకమునకుఁబోయి యచ్చట
ఉత్పన్నజ్ఞానులైనవారు బ్రహ్మతోడ మోక్షమునుబొందుదురు ఇట్టివారి
విషయమై నీవన్న శ్రుతిచెప్పుచున్నది పంచాగ్నివిద్యాదులైన క్రతువులనొ
నర్పక బ్రహ్మలోకమును బొందినవారి కదియన్వయింపదు అట్టివారికిఁ
బునర్జన్మము తప్పదు 16

బ్రహ్మలోకమునకుఁ బోయినవారుగూడ మరల జన్మింతురని చెప్పితివి
గదా. బ్రహ్మలోకవాసులకు నరలోకవాసులకు జీవితకాలంబున వ్యత్యా
సముగలదు అదిచెప్పెద వినుము మనుష్యులకు వేయియుగములైనచో బ్ర
హ్మకొక్కపగలగును, అట్లే వేయియుగములు బ్రహ్మకొక్కరాత్రియగు
ఇట్టి ముప్పదిదినములు ఒక్కమాసము. ఇట్టిమాసములు పండ్రెండు ఒక్కసంవ
త్సరము బ్రహ్మకగును. ఇట్టిసంవత్సరములనూఱు బ్రహ్మకుఁ బరమాయువు

బ్రహ్మగూడ యిట్లు కాలపరిచ్ఛిన్నుఁడు గావున వానికిని జననమరణములు తప్పవు. 17

మనుష్యాదులకువలె బ్రహ్మకుఁగూడ స్వాపకాలము ప్రబోధకాలము కలవు. బ్రహ్మ స్వాపావస్థవదలి ప్రబోధమొందునప్పుడు ప్రాణులు భోగ్య భోగస్థాన దేహేంద్రియరూపంబులను ధరించుచుందురు, మఱల బ్రహ్మకు స్వాపకాలమువచ్చునప్పుడు వ్యక్తిని దాల్చిన ప్రాణులెల్ల ఆబ్రహ్మయందే తిరోధానమగుచుండును. ఇది ప్రతిదినము జరుగు సృష్టిప్రళయములు. ఇట్లు సర్వప్రాణులు ప్రజాపతి రాత్రికాలంబున లీనమగునేని, సంసారక్లేశనాశమెల్లరకు అనాయాసముగా లభించియున్నదగుయు, సంసారక్లేశనాశనమే మోక్షము గావున అది అప్రయత్నలబ్ధమగుచున్నదియు దానికై ప్రయాసయేలయనియు శంకింతువు గాఁబోలు 18

ప్రాక్కల్పమందు లీనమైన భూతకోటి ఈకల్పమందు బ్రహ్మప్రబోధసమయంబున కర్మతంత్రముగను బ్రహ్మస్వాపకాలంబున మఱల లీనమగుచుండును. ఇట్లు ఎడతెగని జననమరణరూపమైన సంసారమనెడి ఘటీయంత్రంబున బరిభ్రమించుచుండును. కల్పాంతలీనంబు గలిగినంతనే వానికి మోక్షము గలిగెనని తలంపరాదు. ఎన్నడుగాని మఱల జన్మము లేకుండుట మోక్షమనఁబడును. 19

బ్రహ్మమొదలు పిపీలికమువఱకుఁ గల సమస్తభూతకోటి యిట్లు జరామరణములకు జిక్కియుండునంటివి. అట్లగునేని వీనికి జన్మరాహిత్యమెప్పుడు గలుగునని శంకింపవచ్చును. సమాధానము వినుము.

సమస్త భూతకోటికి హిరణ్యగర్భునివలెను అవ్యక్తము బీజమైయున్నది. ఆహిరణ్యగర్భాది సమస్తము దేనియందు అవ్యక్తమైయున్నదో, ఏది నిఖిల ప్రపంచమునకు సాక్షిభూతమైయున్నదో యట్టిది మఱియొకటి కలదు. దానిస్వరూపము అస్పష్టము. హిరణ్యగర్భునకుఁగూడ అధిష్ఠానమగుటంజేసి అది చిరంతనమైనదిగానున్నది. ఈసనాతనమైన పదార్థము హిరణ్యగర్భాది సమస్తప్రపంచము నశించినను తాను నశింపదు. 20

పైశ్లోకములో అవ్యక్తమని అక్షరమని యేదిచెప్పఁబడినదో అదియే పునరావృత్తిలేని పురుషార్థమని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. ఆపదార్థమును బొందినవారు మరల రారు. అదియే నాయుత్కృష్టమైన స్వరూపము. దానిఁ బొందుటెట్లందువా ?

ఏపురుషునియందు సర్వభూతములుండునో, ఎవనివలన సమస్తజగత్తు వ్యాప్తమైయున్నదో, ఆకారణమున నెవఁడు నిరతిశయమైనవాఁడో అట్టినన్ను అనన్యము ప్రేమలక్షణమునైన భక్తితోఁ బొందనగును. వేఱొకమార్గము లేదు 22

పరమేశ్వరోపాసకులు అవ్యక్తమును బొందినతర్వాత మరల జనింపరని చెప్పితిని. ఆయవ్యక్తమునకుఁబోవు మార్గమెదని యడుగవచ్చును, చెప్పెద వినుము.

అర్జునా! శరీరవియోగానంతరము ఆత్మతరలి పితృయానమనుమార్గముననో దేవయానమనుమార్గముననో చనును. ఏకాలమునవచ్చినచో పితృయానమునఁబోవునో, ఏకాలమునవచ్చినచో దేవయానమునఁబోవునో ఆకాలము వచింతు వినుము. ఇచ్చట కాలశబ్దమునకు ముఖ్యార్థమున గ్రహింపఁగూడదు, కాలాభిమాని దేవతోపలక్షితమైన మార్గమని యెఱుంగవలయును. ఏ కాలాభిమాని దేవతోపలక్షితమైన మార్గమునఁజన్నచో మఱలజననము గలుగదో ఏ కాలాభిమాని దేవతోపలక్షితమైన మార్గమునఁ జన్నచో పునరావృత్తి గలుగునో ఆవివరము వినుము. ఇందు క్రమముక్తిఫలక బ్రహ్మోపాసకులనుగూర్చి చెప్పఁబడుచున్నది 23

పైనఁజెప్పిన రెండుమార్గములలో ఉపాసకులకుఁగల అనావృత్తిమార్గమును మొదట వివరింతును. బ్రహ్మలోకాభిముఖులైచను ఉపాసకులను మొదట అర్చిరాభిమానినిదేవత అహర్దేవతాపర్యంతము గొనిపోవును, అహర్దేవత యచ్చటనుండి శుక్లపక్షదేవతాపర్యంతము గొనిపోవును, శుక్లపక్షదేవత ఉత్తరాయణదేవతాపర్యంతము గొనిపోవును. ఉత్తరాయణదేవత సంవత్సరదేవతా పర్యంతము గొనిపోవును, ఆదేవత ఆదిత్యాభిమాని దేవతాపర్యంతము, ఆదేవత చంద్రమసపర్యంతము, అది విద్యుద్దేవతాపర్యంతము, అది బ్రహ్మపర్యంతము గొనిపోవును. దీనిని దేవయానమందురు. ఇట్లుచను సగుణోపాసకులు సగుణబ్రహ్మను బొందుదురు. నిర్గుణోపాసకులకు ప్రాణముపోవుట

# గీతాహృదయము.

## తొమ్మిదవ యధ్యాయము.

భగవంతుడును పరబ్రహ్మరూపుడైన వాసుదేవుని భజనము ఎనిమిదవ అధ్యాయములోఁ జెప్పఁబడినది తొమ్మిదవ అధ్యాయములోనన్నననో బ్రహ్మతత్త్వజ్ఞాన ముపదేశింపఁబడును అజ్జ్ఞానము నీక్రింది మూఁడు శ్లోకముల లోఁ బ్రశంసించుచు

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు.

పూర్వాధ్యాయములోఁ జెప్పఁబట్టియు ఇఁకఁ జెప్పఁబోవునట్టియు బ్రహ్మతత్త్వజ్ఞానమును చక్కఁగా నాలోచించి చెప్పెదఁగాక ఎనిమిదవ యధ్యాయములో నేనుచెప్పిన భజనకన్న నిప్పుడుచెప్పఁబోవునది విలక్షణమైనదిగాను న్నది ఎట్లనిన—కర్మకాండమందుఁ జెప్పఁబడినధర్మము గుహ్యామైనది, ఉపాసనాకాండమందుఁ జెప్పఁబడిన భజనము గుహ్యతరమైనది, జ్ఞానకాండోక్తమగుజ్ఞానము గుహ్యతమమైనది ఏలయందువా ? ఇదిధర్మమువలె అతీంద్రియముగాక అపరోక్షానుభవముతోఁగూడి సాక్షి ప్రత్యక్షసిద్ధమై సార్వజనీనము దృష్ట ఫలకత్వమునగుటంజేసి గుహ్యతమము ధర్మమునకన్న జ్ఞానమధికతరమైనదనుటకు మఱియొక కారణముగూడగలదు ధర్మము సంసారహేతు వగునేగాని సంసారమోచకముగాదు, జ్ఞానమన్ననో సంసారమోచకమైనది ఆకారణమునఁగూడ నిది ధర్మమునకన్న నధికతరము ధర్మమునకన్న జ్ఞానమధికమైన నగుగాక, భజనమునకన్నఁగూడ జ్ఞానమధికమా ? అని శంకింపవచ్చును భజనము స్వయముగా మోక్షమునీయఁజాలదు, అది చిత్తశుద్ధిని గలిగించి దానివలన మోక్షమును గలిగించును జ్ఞానమన్ననో స్వయముగా మోక్షమిచ్చును కావున జ్ఞానము భజనమునకన్న నధికమైనదేసుమా ఇట్లు గుహ్యమైన ధర్మమునకన్న గుహ్యతరమైనధ్యానమునకన్న అతిశయమైన జ్ఞానమునుఁగూడ నీకుపదేశించుచున్నానుగదా ఇంతగుహ్యతమమైనది నీకేచెప్పుట

యేలయందువా ? భక్తసఖ్యాదులందు నీతోసాటియగు ప్రియుఁడు నాకు మఱియొకఁడులేదు. అంతియగాదు శిష్యగుణసంపత్తిని విచారించినను నీ వెంతయు ఉపదేశార్హుఁడవు కావున నీకుపదేశింపఁదలంచితిని గుణములంద దోషదృష్టినుంచుట అసూయయనఁబడును. అట్టిది నీకులేదు నేనునామాహా త్మ్యమును సారెసారెకుఁ జెప్పుచున్నను నన్నుగూర్చి యసూయచెందక నా నోటవచ్చినదెల్ల సత్యమని విశ్వసించుచున్నావు ఇట్టిగుణమువలననే నీవు ఆర్జవసంయమాది శిష్యగుణ సంపత్తిగలదని స్పష్టముగదా 1

ఈవిజ్ఞానము మహత్తరమైనదనుటకుఁ గారణాంతరముఁగూడఁగలదు ఇది సర్వవిద్యలలో శ్రేష్ఠమైనది, మఱియు గోప్యములకు గోప్యమైనది మనువు ఇక్ష్వాకువు జనకుఁడు మున్నగు రాజులు దీనిని పాలించుటంజేసి ఇది రాజ విద్యయనియుఁ జెప్పఁబడును అదియునుంగాక యీజ్ఞానము మహాపవిత్రమై నది ప్రాయశ్చిత్తములు తత్తత్పాపములను నివర్తింపును గాని ఎల్లపాపంబు లను నివర్తింప జాలవు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తమువలన సురాపానపాప ము నివర్తింపదుగదా మఱియు ప్రాయశ్చిత్తాదులవలన నివృత్తమైన పా పము స్వకారణంబున సూక్ష్మరూపంబున నుండునుగాని స్వరూపంబుతో నశిం పదు. జ్ఞానమన్ననో అనేక జన్మసహస్రసంచితమైన సర్వపాపముల స్థూల సూక్ష్మరూపంబులనేగాక తత్కారణమైన అజ్ఞానమునుగూడ భస్మమొనర్చు ను దానంజేసి జ్ఞానము సర్వోత్తమము పావనమునైనదిగానున్నది మఱియు జ్ఞానఫలము ప్రత్యక్షమేగాని ధర్మఫలమువలె ననుమానమైనదిగాదు దీనిని సంపాదించుటయన్ననో సద్గురూపదేశంబున మిక్కిలి సులభము ఇంతయనా యాసముగా లభించునది యేమాత్రముగానుండునని శంకింపవలదు జ్ఞానఫలము అత్యంతము 2

జ్ఞానమట్లు సుఖసంపాద్యము అక్షయఫలకమునగునో ఎల్లరు దానిని బడయుటకై యత్నింపరేలయనియందువా ?

అర్జునా ! జనులు ఈజ్ఞానమనెడి ధర్మముయొక్క స్వరూపమునందు శ్రద్ధలేమింజేసి తద్విముఖులైయుందురు ఆకారణంబున నన్నుఁబడయరు.

నన్నుఁబడయలేమిఁ జేసి జననమరణరూపమైన సంసారమునందుఁ బరిభ్రమించు చుందురు

అద్వైతబ్రహ్మజ్ఞానము స్పష్టపడవలయునన్నచో ద్వైతప్రపంచమిథ్యాత్వము బుద్ధిస్థముగావలయును కావున ఆవిషయము మొదట వినుము చేతనాచేతనాత్మకమైన యీసమస్తజగత్తు నావలన వ్యాపింపఁబడియున్నది ఏరూపంబున వ్యాపించియుండు నందువా? నాయీరూపముతోఁ గాదు, అతీంద్రియమైన సచ్చిద్రూపముతో వ్యాపించియుంటిని నాజగద్వ్యాప్తి యెట్టిదనఁగా? చరాచరాత్మకములైన సర్వభూతములు నాయందుండును, నేను మాత్రము వానియందుండను అనఁగా నాజగద్వ్యాప్తి తదధిష్ఠానస్వరూపమున నగును జగత్తుఅనునది యొకటియుండినచో తదధిష్ఠానము శక్యమగును, జగత్తు అనునదే మిథ్యయంటివి మిథ్యాజగత్తునందుఁ దదధిష్ఠానమెట్లు పొసఁగునని శంకింపవచ్చును జగత్తుమిథ్యయను పక్షమున భూతములు నాయందుండవు, అనఁగా శుక్తియందురజతత్వమువలె నాయందు భూతములారోపితములేగాని సత్యములుగావు ఒకసారి భూతములు నాయందుండునంటివి, ఒకసారిభూతములు నాయందులేవంటివి భూతములుండు నంటయో ఉండవనుటయో యొకటి సాధ్యమగునుగాని రెండునెట్లు సాధ్యమందువా? ఈశ్వరసంబంధమైన నాయీయఘటితఘటనోపాయము అనఁగా నామాయ యిదేగదా నాయీయోగమాయావైభవము అవితర్క్యము గావున పరస్పరవిరుద్ధాంశములు నాయందుండుననుటనుగూర్చి శంకవలదు ఇంద్రజాలికమాయలందు ఇట్టి పరస్పరవిరుద్ధాంశములను నేడును జూచుటలేదా? ప్రపంచము బాహ్యదృష్టితోఁ జూచినచో నాకన్నభిన్నముగాఁ గాన్పించుట పరమార్థదృష్టితోఁ జూచినచో మదభిన్నముగా నుండుట దీనిఁబట్టి ప్రపంచము మిథ్యయనబడును మిథ్యాశబ్దమునకిదేయర్థము ద్వైతప్రపంచమెల్ల నిట్టిమిథ్యాభూతమైనదని గ్రహింపుము 4

ఇట్లు చరాచరభూతములను బుట్టించుచు పోషించుచున్నను పరమార్థదృష్టితో విచారించినచో నాయాత్మ భూతసంబంధిగాదు ఏలయందువా? భూతములు కల్పితములు శుక్తియందు రజతత్వమును గల్పించినంతమాత్రాన నే శుక్తికి రజతత్వము నిశ్చయముగా సంభవించునా? అట్లే బ్రహ్మ

మంద ద్వైతప్రపంచము నారోపించినంతనే వాస్తవాద్వైత స్వరూపుఁడైన బ్రహ్మతత్త్వమునకు విరోధము గలదు 5

ద్వైతప్రపంచము మిథ్యయగుటంజేసి బ్రహ్మమునకు పారమార్థికతత్సంబంధము లేదని చెప్పితిని, ఇట్లనుటకు మఱియొక కారణముగూడ గలదు

ఆకాశములేని చోటులేక వాయువన్నచో సర్వగతమై యింతదని చెప్పరానిదిగానున్నది ఇట్లున్నను ఆకాశమునకును వాయువునకును సంశ్లేషము లేదుగదా? ఏలయందువా? అవయవములు గలవానికే సంశ్లేషముగాని అవయవములు లేనివానికి సంశ్లేషము గలుగదు ఆదేవిధముగా నేను సర్వాంతర్యామినైయున్నను సర్వభూతములు నాయందున్నను నేను అసంగస్వభావుఁడను గావున భూతములకు నాకు సంశ్లేషము లేదని గ్రహింపుము 6

అర్జునా, నాయొక్క ప్రకృతియనియు ఉపాదానకారణమనియు, త్రిగుణాత్మికయనియు, అవ్యక్తమనియు, మాయయనియు నానావిధంబులఁ జెప్పఁబడు సర్వభూతములు ప్రళయకాలంబున సూక్ష్మరూపంబుతో నాయీమాయయందు లీనమైయుండును మృత్తికలోనుండివచ్చి మఱల మృత్తికయందె లీనమగు ఘటమెల్ల మృత్తికామాత్రమో అట్లే యీమాయలోనుండివచ్చి మఱల మాయలోనే లీనమగు ప్రపంచముగూడ మాయామాత్రమేయగును మాయయే జగత్కారణమగునేని నాపనియేమందువా? మాయయందు లీనమైన భూతంబులను గల్పాదియందు విభాగించి పుట్టింతును నేను అసంగుఁడనంటివి, అట్టివాఁడు జగత్తును సృష్టించుట యెట్లు? అనఁగా సంగమున్నగాని సృష్టి గలుగదనియు, సంగము లేదని చెప్పుకొనుచు జగత్సృష్టిఁ జేయుదునని చెప్పుట విరుద్ధముగాదాయనియు శంకింపవచ్చును 7

అనిర్వచనీయ మాయాశక్తియైన యీప్రకృతి నాకు వశమైయుండును దానినధిష్ఠించి తత్పరతంత్రములైయుండు చేతనాచేతనరూపమైన భూతకోటినెల్ల సారెసారెకు విభాగించి పుట్టింతును అనఁగా ఈజగత్స్రష్టృత్వము మాయోపాధికమేగాని వేఱుగాదు అందువలన నాయసంగత్వమునకు విరోధము గాదు పారమార్థికమైన నాయసంగోదాసీనాద్వితీయబ్రహ్మతత్త్వ మెట్లందువా? మాయామాత్రప్రపంచ సృష్ట్యాదులగు కర్మములు పారమార్థికాద్వైత

స్వరూపుఁడనైన నన్ను బంధింపవు, అనఁగా నాపారమార్థికా ద్వైతస్వరూపమునకు భంగముగలిగించి సద్వితీయస్వరూపునిగాఁ నన్ను జేయఁజాలవు ఇంద్రజాలమాయాకల్పిత కరితురగాది సంపన్నుఁడు ప్రభువు కానట్లు, మాయామాత్ర ప్రపంచసృష్టివలన నేను సద్వితీయుఁడనుగాను సృష్ట్యాదికర్మములు నన్నేల బంధింపవందువా? నేను ఉదాసీనుఁడనైయుందును గావున నన్నవి బంధింపవు. ఎవరోయిద్దఱు వివాదముచేయునప్పుడు అదిచూచున్నవానికి వారి జయపరాజయములుగాని వారి హర్షవిషాదములుగాని ఎట్లు వికారమును గలిగింపవో యట్లే యుదాసీనుఁడనై యుండునాకు సృష్ట్యాదికర్మములేవియు వికారమును గలిగింపవు వికారమెప్పుడుగలుగదో యప్పుడే సృష్ట్యాదికర్మములందు 'నేను చేయుచున్నా'ననెడి ఆసక్తి అనఁగా అభిమానరూపమైన యనురక్తి నాకుఁ గలుగదు. అనఁగా కర్తృత్వాభిమాన ఫలసంగముగలవానినే కర్మములు బంధించునుగాని తద్రహితుని బంధింపవనియు, ఫలాభిసంధి యెప్పుడులేదో యప్పుడు ఉదాసీనత్వము గలుగుననియు, ఎప్పుడు ఉదాసీనత్వముఁడునో యప్పుడు ఎట్టికర్మములు బంధింపవనియు భావము

'భూతగ్రామమును బుట్టింతునంటివి', 'ఉదాసీనుఁడనై యుందునంటివి ఈరెండు కార్యములు పరస్పర విరుద్ధములుగదా యని శంకింపవచ్చును

అర్జునా! నీసందేహమునకు అవకాశములేదు నేను నిర్వికారచిన్మాత్రరూపుడననుట సత్యము దానంజేసి నేను పుట్టించుదుననుట లౌకికమే గాని పారమార్థికముగాదు అట్లుకాదేని, నానిర్వికారత్వాదులు సత్యములు గాఁజాలవు. ఇఁక సృష్టి యెట్లుగలుగుచున్నదందువా? నాయధ్యక్షతవలనఁ బ్రకృతి జగత్తును గలిగించుచున్నది. ఇంద్రజాలికాధిష్ఠితయగు మాయ గజతురగాదులను బుట్టించుచుండుటఁ గానఁవా? ప్రకృతిభాసముదక్క వఱి యొకటి నావలనఁగలుగదు నాభాసమువలన భాసితయై ప్రకృతియట్లు సమస్త ప్రపంచమును గలిగించుచున్నది నాయధ్యక్షత్వరూపకారణమున జగత్తు మాటిమాటికిఁ బుట్టుచుండును జగత్సృష్టికి నేను కారణమనఁగా నాభాసము కారణమని భావము. సూర్యునకుఁ బ్రకాశము స్వాభావికము, లోకమును వెలిగించునిమిత్తమతఁడట్లు ప్రకాశించుటలేదు, ప్రకాశఫలముగా లోకమున

కు వెలుగుగలుగుచున్నది అట్లే నేను సర్వదా భాసించుచుండుచు నాభాస
వలనఁ బ్రకృతి సృష్టించుచున్నది ప్రకృతి సృష్టించుఁగాకయని నేను భాసిం
చుటలేదు 10

ఇట్లు అసంగోదాసీనస్వభావము అద్వితీయచిదానందైక ఘనము అఖిల
భూతాంతరాత్మ భూతమునగు నాస్వరూపమును గాంచుట యెవరికి సాధ్యము
గాదని శంకింపవలదు నాస్వరూపదర్శనము సులభముగా సర్వలోకసంశ్ర
యణీయమగుటకై దివ్యమంగళవిగ్రహమును దాల్చి వసుదేవునిగృహమున అవత
రించితిని ఇట్లు అవతరించినను మూఢులు నన్ను గ్రహింపలేక మనుష్యమా
త్రునిగా భావింతురు కటా ! ఈదౌర్భాగ్యమునకేమనవలయును ? 11

ఈమోఘులు మోఘాశలని మోఘకర్మలని మోఘజ్ఞానులని మూఁడు విధములు భగవంతుని తెలియక మోక్షోపాయ జ్ఞానశూన్యులై నిత్యసంసారమగ్నులుగానుండు వారు మోఘాశులనఁబడుదురు. భగవంతుని తెలిసియు వాని ననాదరించి స్వర్గాదులఁగోరి తన్నిమిత్తము అగ్నిహోత్రాది కర్మములుచేయువారు మోఘకర్మ లనఁబడుదురు మోఘజ్ఞానులనఁగా భగవంతుని నిందించువారు అజ్ఞానులగుదురేని, జ్ఞానాభావమునంజేసి మోక్షాశయే వ్యర్థమగునుగాని స్వర్గాద్యాశ వ్యర్థముకాదు ఎఱింగియు అనాదరించువారికి స్వర్గాశగూడ ఫలింపదు భగవంతుని అనాదరించు వారికి ఆముష్మికఫలము అభావమైనను ఐహికఫలము కొంతకుఁగొంత గలుగవచ్చును భగవంతుని నిందించువారికన్ననో అదియు లభింపదు మోఘాశులు పాపిష్ఠులు, మోఘకర్మలు పాపిష్ఠతరులు, మోఘజ్ఞానులు పాపిష్ఠతములు, పైనఁజెప్పిన మూఁడురకములవారికి ఇష్టప్రాప్తి చేకూఱకపోవుట యట్లుండఁగా మీఁదుమిక్కిలి వారికి అనిష్టముగూడ సంభవించుచున్నది ఎట్లనిన, మోహినిప్రకృతియనియు ఆసురీప్రకృతియనియు, రాక్షసీప్రకృతియనియుఁ బ్రకృతి మూఁడు విధములు అందు అవిహితహింసాహేతుద్వేష ప్రధానయగు తామసీప్రకృతి రాక్షసీప్రకృతియనఁబడును శాస్త్రములుసమ్మతింపని విషయములను భోగించుటకు హేతువైనట్టిదియు రాగము ప్రధానముగాఁగలదియు నగు రాజసీప్రకృతి ఆసురీప్రకృతి యనఁబడును శాస్త్రీయజ్ఞాన భ్రంశహేతువైనది మోహినీప్రకృతియనఁబడును భగవదజ్ఞానులు అనఁగా మో

ఘాశులు మోహినీప్రకృతిని, భగవంతుని అనాదరించువారు అనఁగా మోఘకర్ములు, ఆసురీప్రకృతిని, భగవన్నిందకులు అనఁగా మోఘజ్ఞానులు రాక్షసీప్రకృతిని గలిగియుందురు. ఈమూఁడురకములవారికిఁ బ్రకృతివిషయమునఁ దారతమ్యమున్నందున నిరయప్రాపకత్వాంశంబునఁగూడ భేదముండునని భావింపవలదు ఈముగ్గురకు నరకము తప్పదు

ఇట్లగునేని, లోకమెల్ల నిట్టివారితోనే నిండియుండును గావున సమస్త జగత్తు నిమగ్నమేసుమాయని భావింతువుగాఁబోలు. అట్లు భావింపవలదు 12

లోకమెల్ల నిట్టివారితోనే నిండియుండలేదు. అనేకజన్మకృతసుకృతములవలన ఆత్మమలినమును బాసిన మహాత్ములుగూడ లోకములోఁ గలరు వారు సాత్వికులైన దైవప్రకృతిని గలిగియుందురు. అందువలన వారికి నాతత్వము స్పష్టము అనఁగా, జగత్కారణము అవ్యయము త్రివిధపరిచ్ఛేదరహితమునైన పరబ్రహ్మము లోకానుగ్రహార్థము మనుష్యరూపముదాల్చి అవతరించినాఁడని గ్రహించి అనన్యబుద్ధితో నన్ను భజింతురు. మూఢులవలె మహాత్ములుగూడ దుర్లభులు, దుర్లభతరులు, దుర్లభతములని మూడువిధములు. ఈవాసుదేవుఁడు పరబ్రహ్మముగాని వేఱుగాదనియెఱింగి బహుమానించు మహాత్ములు దుర్లభులనియు, అట్లుఎఱింగి నాయందు ప్రేమలక్షణమైన భక్తి సేయువారు దుర్లభతరులనియు, వాసుదేవుఁడే సర్వమనెడి అద్వైతజ్ఞానసంపద గలవారు దుర్లభతములనియు వివేకము. 13

ఇఁక భగవద్భజనప్రకారము వివరింతు వినుము

భగవదుపాసనము మానసికము, వాచికము, కాయికము అని మూఁడు విధములు తైలధారవలె ఎడతెంపులేక చిత్తము ధ్యేయాకారతను బడయుట నిత్యయోగమనఁబడును ఇట్టివారు నిత్యయుక్తులనఁబడుదురు ఇట్లు ధ్యేయమునంగుఁ బరినిష్ఠితమైన చిత్తమునకు విక్షేపముగలిగెనేని అది బహిరుత్థానమగును అప్పుడు నమస్కారరూపకాయికభజనమును జేయుదురు. ఈ కాయికభజనంబునఁ బరిశ్రాంతి గలిగినప్పుడు భగవన్నామసంకీర్తనరూపమైన వాచకభజనమును జేయుదురు. ఈరూపంబున విక్షిప్తచిత్తమును మఱలఁ కుదుటబఱచుకొని యథాపూర్వము భగవన్మూర్త్యైకాకారతాపత్తికి యత్నిం

తురు	ఈమహాత్ములు దృఢవ్రతులు గావున ఇట్లు సారెసారెకు వలయు నప్పుడెల్ల విక్షిప్తచిత్తమును సవరించుకొనుచు త్రికరణోపాసనమును జేయుదురు	14

ప్రేమ భక్తి భజనప్రకారమును జెప్పితిని ఇఁక అద్వైతజ్ఞానరూపమైన భజనము వివరింతు వినుము

వాసుదేవుఁడే సర్వమనెడి సర్వాత్మకత్వదర్శనము జ్ఞానమనఁబడును. అదే యజ్ఞముగా ఉపాసించువారు జ్ఞానయజ్ఞోపాసకులనఁబడుదురు పై శ్లోకములోఁ జెప్పఁబడిన భజనము జ్ఞానయజ్ఞమునకు అంగమగును. ఈజ్ఞాన యజ్ఞమందుఁగూడ భేదములు గలవు ఎట్లనిన, బ్రహ్మయే నేను అనెడి ఐక్యానుసంధానము ఏకత్వజ్ఞానయజ్ఞమగును భగవంతుఁడొక్కఁడేసూర్యుఁడు చంద్రుడు మున్నగు బహువిధరూపంబులతో నుండునని అనుసంధానము జేయుట పృథక్త్వజ్ఞానయజ్ఞమగును భగవంతుఁడు సర్వాత్మకుఁడని అనుసంధానముచేయుట విశ్వతోముఖజ్ఞానయజ్ఞమగును ఈత్రివిధజ్ఞానయజ్ఞమందు స్వరూపభేదము లేకపోయినను ముఖభేదము మాత్రము గలదు	15

నావిశ్వరూపత్వమును అనుసంధించి భజింతురంటిని ఈవిశ్వతోముఖ జ్ఞానయజ్ఞమును కొంత వివరింతు వినుము

అగ్నిష్టోమాది శ్రౌతక్రతువులు వైశ్వదేవాది స్మార్తయజ్ఞములు శ్రుతిస్మృతి ప్రసిద్ధమహాయజ్ఞములు, పిత్ర్యమైన శ్రాద్ధము, ఓషధిసంబంధమైన భోజనాదులగు ఔషధము, యాజ్యాపురోనువాక్యాది మంత్రములు, ఆజ్యము మున్నగు సర్వహవిస్సులు, ఆహవనీయాదులైన అగ్నులు, హోమము, ఇవన్నియు నేనేసుమా	16

ఈజగత్తునకుఁ దండ్రి తల్లి పోషకుఁడు పితామహుఁడు ఇవన్నియు నేనే జగత్తులోఁ దెలిసికొనదగిన వస్తువు నేనే. గంగాది పవిత్రపదార్థములు నేనే. నాలుగు వేదములు నేనే.	17

ప్రాప్యమైనవస్తువు, భరించువాఁడు, శుభాశుభద్రష్ట, వాసస్థానము, ఆపన్నార్తిహరుఁడు, ప్రత్యుపకారమపేక్షింపక యుపకారముచేయువాఁడు,

ఉత్పత్తి, నాశము, స్థితిః, ప్రలయాధిష్ఠానము, ఉత్పత్తిస్థానము స్థిత్యధిష్ఠానము ఇవన్నియును నేనే 18

ఎండకాలంబున సూర్యరూపంబునఁ దాపము గలిగించువాఁడ, వర్షము లేకుండచేయువాఁడు, వర్షకాలంబున వర్షించువాఁడు, లోకజీవనాధారమైనట్టి అమృతము, జీవకోటిని హరించు మృత్యువు, వేయేల ? ఇప్పుడున్నట్టియును, గడచినట్టియును రాబోవునట్టియును సమస్తవస్తుజాతము నేనే కావున సర్వాత్మకత్వమైన నాయుపాసనము యుక్తమేగాని యొండుగాదు 19

భగవదుపాసనప్రకారము దెలిపితిని, ఏప్రకారముగానైనను భగవంతు నుపాసింపక కేవల కామ్యకర్మములనష్ఠించువారి గతి యేమని యడుగ వచ్చును

కేవల వేదనిష్ఠామాత్రులై అగ్నిష్టోమాది యజ్ఞములచేత వసురుద్రాదిత్యాది మదీయవిభూతులను బూజించువారు సాత్త్వ మెఱుంగనివారైనను ప్రకారాంతరమున నేని నన్నే పూజించుచున్నారు గావున వారికి స్వర్గప్రతిబంధకములైన పాపములు నశించును అట్టివారు సత్త్వశుద్ధినిగాక స్వర్గతిని మాత్రము గోరుచుందురు గావున వారు తమకోరికప్రకారము దుఃఖములేని సురేంద్రలోకమును బొంది యచ్చట అమానుషములైన దేవభోగము లనుభవింతురు 20

అట్లు వారు కామ్యపుణ్యఫలముగా విస్తీర్ణమైన స్వర్గలోకంబు ననుభవించి, తద్భోగజనకమైన పుణ్యము క్షీణించినంతనే ఆదేహము నశించును గావున మరల దేహమును బొందుటకై మర్త్యలోకమును జొచ్చెదరు అట్లు మర్త్యలోకమునుజొచ్చి గర్భవాసాది యాతన లనుభవింతురు ఇట్లు వేదత్రయోక్తములైన కామ్యకర్మములను మాత్రము చేయువారు స్వర్గకాములై జన్మమృత్యుప్రవాహమునఁబడి వచ్చుచుఁ బోవుచుందురు. వీరికి జన్మరాహిత్య మెన్నఁడు లేదు 21

నాభక్తులు ద్వైతులని అద్వైతులని రెండు విధములు. అందు ద్వైతభక్తులు భజనీయమైనదిగానీ కాంక్షణీయమైనదిగానీ పురుషార్థము నేను దక్క—

మఱియొకటి లేదను విశ్వాసముతో నిండి నాచింతనమును క్షణమునైనఁగూడ మానరు, అట్లుమాని జీవింపఁజాలరు, అనవరతము నాయందునిష్ఠులై వారుందురు. వారికి సంబంధించిన ఐహికాముష్మికములు రెండు నేను భరింతును. అనఁగా వారిలోకంబున నున్నంతకాలము శరీరయాత్రాద్యర్థము ధనాదిలాభ తత్పరిపాలనకార్యమును, దేహత్యాగానంతరము నన్నుఁబొందిమఱల జనింపకుండుట అనెడిదానినిఇట్లుఐహికాముష్మికంబుల రెంటి నేనే భరింతును. ఇవి వారు కోరఁబనిలేదు. వారికేదేదివలయునో యదియెల్ల నేను విచారించి కలిగింతును. నాభక్తుల యోగక్షేమభారము ఋణభారమువలె నామీఁదనుండును. అద్వైత భక్తులసంగతియన్ననో, వారికి భేదదృష్టియేలేదు, వాసుదేవుఁడే సర్వమనెడి సర్వాద్వైత దర్శనులైయుందురు, తామే నేను, నేనే తాముగా భావింతురు గావున వారి యోగక్షేమములు నాయోగక్షేమములే యగును. ఎల్లరి యోగక్షేమములను వహించునది నేనే యైనను, ద్వైతభక్తుల యోగక్షేమములు వహించుటయందుఁ బ్రయత్నముండును, అద్వైతభక్తుల విషయమునఁ బ్రయత్నమే యుండదు, స్వాభావికమైయుండును. 22

'ఇంద్రాదిదేవతలు నావిభూతులంటివి, నాకు వ్యతిరేకమైన వస్తువు గాని దేవతాంతరముగాని లేదంటివి, వారిభజనముగూడ నాభజనమే యగునంటివి. ఆపక్షమున ఇంద్రాది దేవతారాధకులకు జననమరణములు వచ్చుటేల' యని శంకింపవచ్చును.

నాభక్తులు నన్నెట్లో యట్లే అన్యదేవతాభక్తులుగూడ వారిని శ్రద్ధతో యజించునప్పుడు ఆయజనము నన్నే చేరును. అయినను వారి యజనము విధి పూర్వకముగాదు, అనఁగా జ్ఞానయుక్తమైనది గాదు. ఏలయందువా ? నేను సర్వాత్మకుఁడను జ్ఞానముతో వారు యజించుటలేదు. ఇంద్రాదులకు నాకు భేదమును గల్పించి యజింతురు. 23

శ్రుతిస్మృత్యుక్తరూపములైన యెల్లయజ్ఞములను దత్తద్దేవతారూపంబుతో భుజించునది తత్తత్ఫలమిచ్చునది నేనే. ఈరహస్యము నెఱుంగరు. అందువలన వారు మహాప్రయాసతో యజించినను దుదకు భ్రష్టులగుదురు. నాసర్వ దేవతాత్మకత్వమెఱింగి యజించువారు సిద్ధిని బడయుదురు. 24

ఒక్కొక్కకర్మమునకు అనేకగాఁ గర్మభేదములేకున్నను సంకల్పభేదమాత్రం ఫలభేదముగలిగి గొందఱు అల్పసుఖభోగులై పతనులయ్యు, గొందఱు య సుఖభోగులై పునరావృత్తిలేకయుందుటయుఁ జూడగాఁ జిత్రమై నుగదా

ఇంద్రాదిదేవతలనుగూర్చి సంకల్పించి వ్రతమాచరించువారు ఇంద్రాది ను బొందుదురు, పితృయజనము సంకల్పించి శ్రాద్ధాదులొనర్చువారు ను బొందుదురు, యక్షరక్షఃపిశాచాది భూతయజన సంకల్పులు భూ ను బొందుదురు దేవపితృభూతాత్మకములైన యాయజ్ఞములనే భగ డైన వాసుదేవునినన్ను సంకల్పించి నాప్రీతికై యనుష్ఠించినచో అక్షయ వధికానందరూపమునైన నన్నుఁ బొందుదురు కావున నన్నేకర్మములచేత అనంతఫలదుఁడనైన నన్నే యజింపవలయును　25

నన్నుయజించుట అనంతఫలకత్వమైనను గష్టతరమని శంకింతువా ?

ఇంద్రాదులను యజింపవలయునన్నచో పశువులు ఆజ్యము సోమము గు బహువిత్తవ్యయాయాససాధ్యము లగువస్తువులు కావలయును. యజించుటకు అట్టివి అవసరములేదు, ఆకో, పూవో, పండో, నీరో, యొకటి చాలును అనాయాససాధ్యములైనట్టి యిట్టివస్తువులలో నేదో టితో ఎవడేని నన్నారాధింపవచ్చును నాయారాధనము భక్తిపూర్వ గా నుండవలయును. అఖిలలోకేశ్వరుఁడనైన నాకు వట్టివస్తువు లర్పిం సముద్రజలంబులతో సముద్రతర్పణము చేయుటగును ఇదియెంత భ్యమో విచారింపుము. శుద్ధచిత్తుఁడై పత్రాదికమును నాకర్పించునప్పు అఖండపూర్ణానందుఁడనై యవి గ్రహింతును సుమా నిజానందపరిపూ ను అతితుచ్ఛమైన పత్రాశనము తగునా యని శంకింతువు గాఁబోలు భక్తి ధానముగాని వస్తుమూల్యము ప్రధానముగాదు భక్తితో నొక్కనాఁడేని కొక్కయాకు సమర్పించినను అది మహాతురముతో గ్రహింతును సుదా డిచ్చిన పిడికెడుఅటుకులతోఁ నేను తనివి చెందుట యెఱుంగవా ? నేను క్తిరసైకగ్రాహిత్వస్వభావుఁడను గదా　26

నాభజనార్థము పత్రపుష్పాదులు ఆరామాదులనుండి తెచ్చి నాకర్పింప వలయుననుక్లేశముగూడ అవసరములేదు. స్వభావముగాఁగాని ఆవశ్యకముగాఁగాని చేయుకర్మములు నాకర్పింతురేని నాభజన సిద్ధియగును ఇది యన్నిటికన్న సులభముగదా కావున దేహయాత్రార్థము చేయుగమనాగమనాదిలౌకికకర్మలుగానీ, దేహధారణార్థము ఏమిభుజింతురోయదిగానీ, హోమదానతపస్సులు మున్నగు వైదికకర్మములుగానీ నిత్యనైమిత్తికకర్మములుగానీ ఇవి యెల్లనాకర్పింపుము. 27

ఇట్లు భగవంతునకు సర్వకర్మములు సమర్పించుట సన్న్యాసమనఁబడును. ఇది చిత్తశోధకమగును గావున దీనినే యోగమందురు ఇట్లు సన్న్యాసయోగశోధితచిత్తులై కర్మము లాచరించినప్పుడు కర్మములెల్ల భగవదర్పణము లగును గావునఁ దత్ఫలముగూడ భగవదర్పణమే యగుచున్నది దానంజేసి కర్మముల శుభాశుభఫలములు కర్తను చెందవు అట్టివాఁడు కర్మముక్తుఁడై జ్ఞానము వలన మద్భావాపత్తిరూపమైన మోక్షమునుఁ బొందుచున్నాఁడు. 28

'భక్తులనే అనుగ్రహింతువుగాని భక్తులుగాని వారిని అనుగ్రహింపవు గదా, అకారణంబైన నీకుఁగూడ రాగద్వేషకృత వైషమ్యము గలుగుగదా' అని శంకింతువా ?

నేను సర్వప్రాణులయెడఁ దుల్యుఁడనై వర్తింతును, నాకుఁ గొందఱు ప్రియులు కొందఱుద్వేష్యులు లేరు అట్లగునేని భక్తులకు అభక్తులకు ఫలవైషమ్య మేలయందువా? ఎవరు సర్వకర్మ సమర్పణపూర్వకమైన భక్తితో నన్ను భజింతురో, వారు మద్భజనశుద్ధాంతకరణులై మదాకారైకవృత్తితో నాయందు వర్తింతురు నేనుగూడ అతిశుద్ధమైనవారిచిత్తమునందు ప్రతిఫలించుచు వర్తింతును. స్వచ్ఛమైనవస్తువు దేనితోఁ దనకుసంబంధముగలుగునో దాని యాకారమును ప్రతిఫలించుట దానినైజముగదా స్వచ్ఛముగాని వస్తువు యొక్క వృత్తి తద్విపరీతము సూర్యకిరణము లెల్లెడలఁ బ్రసరించుచుండును అయినను అవి స్వచ్ఛమైన దర్పణాదులయందే ప్రతిఫలించునుగాని పెంకునందుఁ బ్రతిఫలించునా ? అట్లుండియు సూర్యుఁడు దర్పణమందు రంజించుచున్నాఁడనియుఁ బెంకునందు ద్వేషించుచున్నాఁడనియుఁ జెప్పనగునా ?

వస్తుస్వభావమర్యాదనుబట్టి కలుగు కార్యమును నిష్కారణముగా నింకొకరి మీఁద మోపరాదు అగ్ని తనను సేవించువారికిఁ జలిఁబోఁగొట్టును , కల్పవృక్షంబు తన్నాశ్రయించినవారికిఁ గోరికలిచ్చును అగ్నిని సేవింపకయే చలిపోలేదన్నను, కల్పవృక్షంబు నాశ్రయింపకయే అది కోర్కెలీయలేదన్నను అజ్ఞానముగాని వేఱుగాదు ఇందు అగ్ని కల్పవృక్షంబులకు రాగద్వేషంబులేవి గలవు ? దేవతలు పశుపక్ష్యాదులు మనుష్యులు మొదలగునవి జాతినిబట్టిగాని ఆకారమునుబట్టిగాని స్వభావమునుబట్టిగాని జ్ఞానమునుబట్టిగాని హెచ్చుతక్కువలు గలిగియున్నను సమాశ్రయణీయాంశంబున నేను వానికెల్ల సమమైయుందును , ఒకరికి హెచ్చుగా సమాశ్రయణీయుఁడను మఱియొకరికిఁ దక్కువగా సమాశ్రయణీయుఁడనుగాను అనఁగా సమాశ్రయణీయాంశంబున జాత్యాదులనుబట్టి ఇతఁడు నికృష్టుఁడని వాని ద్వేషింపను, ఇతఁడు ఉత్కృష్టుఁడని వానిని ప్రేమింపను. ఉత్కృష్టులొండె అపకృష్టులొండె ఎవరు నన్ను
భక్తితో భజింతురో వారు నాయందు నేను వారియందు వర్తింతును 29

భక్తిసామ్యమున్నను దుర్వృత్తుఁడు సువృత్తుఁడు సాధుత్వాసాధుత్వ వైషమ్యము గలిగియుందురు వారియిరువురయెడ నీకుఁ దుల్యవృత్తి యెట్లుండువా ?

శ్రుతిస్మృతులయందు ఎవనికిఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడదో అట్టి అతిపాపిష్ఠుఁడు సుదురాచారుఁ డనఁబడును అట్టివాని పాపమునుఁ బోకార్చుటకుఁగా భజనీయమైనది మఱియొకఁటి గలుగదు అట్టివాఁడుగూడ నన్ను భజించునేని, అతఁడు సాధువగునేగాని పాపిష్ఠుఁడు గానేరఁడు. ఏలయందువా ? నాభజనమే వానికిఁ బ్రాయశ్చిత్తమగును , కావున నట్టివానినెల్లరు మన్నింపఁదగును , అనఁగా నతఁడు వ్యవహారయోగ్యుఁడగును భగవంతుఁడే నాకు శరణమని దురాచారుఁడెప్పుడు అధ్యవసాయముచేయునో అప్పుడతఁడు ప్రాయశ్చిత్తుఁడై లోకవ్యవహారయోగ్యుఁ డయ్యెనని భావము నరకమును గలిగించుట లోకవ్యవహారదూరునిగాఁ జేయుట — ఈరెంటిని గలిగింపఁ బాపమునకు శక్తిగలదు సామాన్యప్రాయశ్చిత్తములు అసభ్యత్వదోషమును మాన్పఁజాలునేగాని పాపమును బోఁగొట్టఁజాలవు నాభజనమున్ననో వానిరెంటిఁ
జేయనోపును 30

అర్జునా ! నాభజనమువలనఁ బాపక్షయమే గాక జ్ఞానముగూడఁ గలుగును జ్ఞానమువలన అవిద్యానివృత్తిరూపమైన ముక్తి చేకూఱును అర్జునా! కుమీమాంసకు లీవిషయమై నోటికివచ్చినట్లు వదరుదురుగాక దురాచారుఁడైనను నాకు భక్తిచేయునేని అతఁడు కృతార్థుఁడగునేగాని ఎన్నఁడు నశింపఁడు , ఇది నాప్రతిజ్ఞ ఈప్రతిజ్ఞను ఢంకాకొట్టి చాటింపనగును. ఇందులకు అజామిళుఁడే నిదర్శనము. 31

'దురాచారులగోష్ఠి యటుండనిమ్ము , పశుపక్ష్యాదులు అతినికృష్టములైనవిగదా ? అవిగూడ నిన్నాశ్రయించినచో ముక్తిచెందునా' అని శంకింతువుగాఁబోలు.

పాపజన్మముగల తిర్యగాదులు , నిషాదాదులు, వేదాధ్యయనాద్యధికారము లేమింజేసి అతినికృష్టులైన స్త్రీలు వైశ్యులు, కృషిమాత్రపరులైన శూద్రులు వీరుగూడ నన్నాశ్రయించి ముక్తిఁ బొందుదురు. జటాయువు గుహుఁడు శబరి మొదలగువారిందులకు నిదర్శనముగదా 23

పాపయోనులుగూడ నన్నాశ్రయించిముక్తిఁ బొందుదు రనఁగా బుణ్యయోనులు సుకృతులు బ్రాహ్మణులు రాజర్షులునైన నాభక్తులు పరగతినిబొందుదురని వేఱ చెప్పవలయునా ? ఈమనుష్యలోకమన్ననో సుఖరహితమైనది , సుఖములేమన్నను ఇది నిత్యమైనదాయనిన నదియుఁ గల్ల , కావున నిందుఁ జిరస్థాయిగా జీవుఁడుండునని తలంపవలదు ఇట్టిదానిని జ్ఞానులువర్జింతురుగాని కోరరు. ఈలోకమిట్టిదైనను దీనియందొకగుణముగలదు. ఏదందువా ? పరమపురుషార్థమును సాధింపవలయునన్నచో మనుష్యలోక మెంతయు ననుకూలమైనదిగానున్నది మనుష్యలోకంబున జనించుటకు నిదియే కారణము అట్లు పరమపురుషార్థసాధనానుకూలమైన మనుష్యలోకంబున జనించి తత్సాధనమునకై యత్నింపనిచో మానవజన్మయే వ్యర్థమగును మనుష్యుని ఆయుష్కాలము నూఱేండ్లనియు, ఈజీవితకాలములోపల నెప్పుడో యొకప్పుడు పురుషార్థసాధనమునకై యత్నింపనగుననియుఁ దలంపవలదు పరమాయుష్కాలము నూఱేండ్లనిరేగాని యెల్లరు నూఱేండ్లు తప్పక జీవింతురని చెప్పలేదు ఎంతపర్యంతము భోగ్యకర్మము అనుభవింపవలసియుండునో యంత

పర్యంతము మాత్రమే జీవముండును. అనంతరము దాఁచినను అది నిలువదు. ఈకర్మానుభవకాలమింతని యెవరుఁ జెప్పఁజాలరు అందువలననే యీలోకము అనిత్యమని చెప్పితిని కావున మృత్యువుచేతఁబట్టి యీడ్వఁబడువారు వోలె జనులు ప్రతిక్షణము మరణసన్నద్ధులైయుండి ప్రతినిమిషమును మిక్కిలి యమూల్యముగా భావించుచు కర్తవ్యమును సాధింపవలయును. అర్జునా! నీవుగూడ అట్లే యొనర్పుము 33

నన్ను భజించుటకు మిక్కిలి సులభమైన మార్గమును జెప్పెద వినుము సర్వవిషయములనుండి నీమనస్సు మరలించి దానిని నాయందుంచుము ఇది యే భక్తికి మూలమైన సూత్రము ఇది చేయఁజాలవేని, అనఁగా నీమనస్సు విషయాంతరములందుఁ దగులుకొని మరలదేని నాయందు అతిమాత్రప్రేమ లక్షణభక్తినిఁ జేయుము ఇదియు సాధ్యముగాదందువా? అట్లగునేని నాకు బహిర్వ్యాజలైన నొనర్పుము పూజాద్గమ ద్రవ్యములు సమకూర్చుట కష్టతరమందువా? ఆపక్షమున నాకు నమస్కారమొనర్పుము నాకు నమస్కరించుసు ఫ్రతంబున దురితప్రతిబంధకములెల్ల దూరమై నీకు సుఖముగానే నాభజనము, నాభక్తి, నామనస్కత్వము ఇవి క్రమముగా సిద్ధించును ఇట్లు మత్పరాయణుఁడు మదేకశరణుఁడు నగువాఁడు నాప్రత్యక్స్వరూపమును ధ్యానించి బ్రహ్మాద్వైతమును బడయును జీవుఁడు బ్రహ్మాద్వైతమును బడయుట కంఠచామీకరణ న్యాయముగానుండును అనఁగా మెడలో ఆభరణమున్నను అదిమఱచి యందునిందు వెదకి తుదకది దనమెడలోనుండుటఁగాంచి పోయిన ఆభరణము దొరికినట్లు భావించుట కంఠచామీకరణన్యాయమందురు అదేవిధముగా జీవుఁడు తాను బ్రహ్మమైయుండియు అజ్ఞానంబున అదిమఱచి తుదకు జ్ఞానవశంబున తానే బ్రహ్మమని తెలిసికొనుచున్నాఁడు. 34

---

# గీతాహృదయము.

## పదియవ యధ్యాయము.

బ్రహ్మతత్త్వజ్ఞానము దానికి అంతరంగసాధనమైన భగవద్భక్తి వైభవమును తొమ్మిదవ యధ్యాయములోఁ జెప్పఁబడినవి. బ్రహ్మతత్త్వజ్ఞానమునకు బహిరంగసాధన భూతమైన భగవద్విభూతులు ఈయధ్యాయములోఁ జెప్పఁబడును. ఏడవయధ్యాయములో 'నీటియందలిరసము నేనే' అను ప్రదేశములలోను, తొమ్మిదవయధ్యాయములో 'నేను క్రతువును, నేనే యజ్ఞమును' అనుచోట్ల భగవద్విభూతులు చెప్పియున్నను, వానినే యీయధ్యాయములో విస్తరించుచున్నాఁడు. 'అర్జునా! నాయుపదేశశ్రవణాదరపరతంత్రుఁడవై యేమియుఁ బ్రశ్నింపకున్నను నీకుఁ దత్త్వమును జెప్పుచున్నాను వినుమ'ని యౌత్సుకముతో వానిని అభిముఖునిగా నొనర్చువాఁడై

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు

సర్వలోకేశ్వరుఁడు సాక్షాన్మహాదేవుఁడునైన పరబ్రహ్మముతోఁ బోరాడనోచిన భుజదండములుగల అర్జునా! అమృతంబునంబలె నావచనంబులఁ బ్రీతినొందుచున్న నీకు హితమునుగోరి యేదియిప్పుడు చెప్పఁదలచితినో యది పరమవచనముగాని సామాన్యమైనదిగాదు, కావున మరల వినుము 1

దేవతలు అధికతరజ్ఞానులు, మహర్షులన్నో తత్త్వార్థదర్శనులు. అట్టి దేవతలు ఋషులుగూడ నాప్రభావమును అనఁగా నానావిభూతులతో నే నావిర్భవించుటను ఎఱుంగరు. ఏలయందువా? దేవతలకు మహర్షులకు నెల్లరకుగల స్వరూపజ్ఞానశక్త్యాదులకు నేనే మొదటికారణమును. కావునవారెల్లరు నాయధీనులును బరిమితజ్ఞానశక్తిసంపన్నులుగానుందురు. అట్టివారు అపరిమితజ్ఞానశక్తిసంపన్నుని సర్వాతీతుని నన్నెఱుంగుట యెట్లు సాధ్యము? దానంజేసి నామాహాత్మ్యము నన్యులెఱుంగరు. నామాహాత్మ్యమును చెప్పవలయునన్న నేనే చెప్పవలయును. నీయెడ నాకుఁగల స్నేహమువలన నీవడుగని రహస్యమునగూడ చెప్పుచున్నాను 2

నేనే అన్నిటికి మూలకారణంబుగానున్నాను ; నాకు మతియొకటి కారణముగాదు ; అందువలన అజుండను అనఁగా జన్మరహితుండను, లోకములకెల్ల ఈశ్వరుండను. ఈసంగతి యెవఁడెఱుంగునో అతఁడు మానవత్వముగల మనుష్యులలోనెల్ల అసంమూఢుండై, అనఁగా సంసారహేతువైన అజ్ఞానరూపసంమోహంబులేనివాఁడై సర్వపాపంబులనుండి ముక్తుఁడగును. కావున నాప్రభావము నీవు వినవలసినదిగానున్నది ) ౩

నాప్రభావమును సురలుగూడ ఎఱుంగరంటిని అట్టిదానిని చూపెదను వినుము. బుద్ధి అనఁగా అంతఃకరణమునకుఁగల సూక్ష్మార్థవివేచనసామర్థ్యము, జ్ఞానము అనఁగా పదార్థముల నెఱుంగుట, అసంమోహము అనఁగా ప్రత్యుత్పన్నములైన బోద్ధవ్యవిషయములందు వ్యాకులమొందని మనఃప్రవృత్తి, క్షమ అనఁగా ఓర్పు, సత్యము అనఁగా బాహ్యేంద్రియముల నిగ్రహము, శమము అనఁగా శాంతి, సుఖము, అనఁగా ఇంద్రియానుకూల్యము దుఃఖము, ఇంద్రియప్రాతికూల్యము, భవము అనఁగా పుట్టుక, అభావము అనఁగా ఉత్పత్తికాకుండుట, అహింస అనఁగా పరిపీడానివృత్తి, సమత అనఁగా రాగద్వేషరాహిత్యము, తుష్టి అనఁగా యదృచ్ఛాలాభముతో సంతోసించుట, తపస్సు అనఁగా కాయేంద్రియముల శోషణము, దానము అనఁగా తనధనమును సత్పాత్రలకిచ్చుట, యశస్సు అనఁగా కీర్తి, అయశస్సు అనఁగా అపకీర్తి, ఇట్టి దృశప్రాణికోటినానావిధ కార్యవిశేషములు నావలననే కలుగుచున్నవి. ఇఁక నాప్రభావమేమని వర్ణింతు ? ౪-౫

సప్తమహర్షులు అందుకు మొదటి నలుగురు అనఁగా సనక, సనందన, సనాతన, సనత్కుమారులు స్వాయంభువ మొదలగు మనువులు నలుగురు నాస్వభావము అనఁగా జ్ఞానైశ్వర్యశక్తిరూపము గలిగిన నావిభూతులు. వారెల్లరు హిరణ్యగర్భుఁడనైన నాదు సంకల్పసంభవులు, మానసపుత్రులుగాను. అందువలన వారు సర్వప్రాణిశ్రేష్ఠులు, ఆ సనకాదులకుఁ బుత్రులు పౌత్రులు శిష్యులు ప్రశిష్యులుగా ఈలోకములోని ప్రజలెల్ల జనించిరి

భగవత్ప్రభావజ్ఞానంబువలన ఫలమేమందువా ? చెప్పెదను వినుము. జెప్పిన బుషిమన్వాదిరూపమైన విభూతియోగమ

రూపమైన నాయైశ్వర్యంబును ఉన్నదియున్నట్లు ఎవఁడెఱుంగునో యతఁడు ముక్తిహేతువైన సమ్యక్జ్ఞానయోగముగలవాఁడగుచున్నాఁడు, ఇందు సందియములేదు ఇదే ఫలము. 7

మహ్వాది విభూతిరూపంబున సమస్తజగత్తునకు నుత్పత్తిహేతువు నేనే యనియు, బుద్ధి జ్ఞానము మొదలగునవి నావలననే ప్రవర్తించుచున్నవనియు, ఎఱుంగుటవలన వివేకులై ప్రేమపూర్వకంబుగా నన్ను భజింతురు. 8

నా ప్రేమభజన మెట్టిదందువా ? నాకు జీవితమునర్పించి నన్ను వదలి క్షణమాత్రముగూడఁ బ్రాణధారణము నేని చేయనివారై యుండుట ఇట్టి ప్రేమభక్తులకు ధ్యానావస్థయని విక్షేపావస్థయని రెండవస్థలు గలవు. అందు ధ్యానావస్థయందు వారిస్వరూప మెట్లుండుననఁగా, వారిచిత్తము నాయందే యుండును, విక్షేపావస్థ భక్తగోష్ఠిరూపయనియు భక్తగోష్ఠిరహితయనియు రెండు విధములు. భక్తగోష్ఠిరూప విక్షేపావస్థయందు భక్తులు తాము తాము అనుభవించిన నాకళ్యాణగుణంబుల నొండొరులకు వర్ణించుకొనుచు సంతసించుచుందురు ; ద్వితీయ విక్షేపావస్థయందు భక్తగోష్ఠి లేనందున హరే ! గోవింద ! గోపాల ! అని నన్నుఁ గీర్తించుచుఁ దమలోఁదామే యానందించుచుందురు. 9

దీనిని విభూతియోగజ్ఞాన పూర్వక ప్రేమ భక్తియందురు. వీరికి ముక్తిహేతువైన సమ్యక్ జ్ఞానయోగ మెట్లు ప్రాప్తించునందువా ?

వారి భజనము ప్రీతిపూర్వకము, అందువలన వారు నిరంతరము మచ్చిత్తులై యుందురు వారి భజనము కామనాపూర్వకమగునేని కామ్యసిద్ధిపర్యంతమే వారి చిత్తము నాయందుండును ప్రేమపూర్వకభక్తులు భజనములేక క్షణముగూడ ఆత్మధారణముచేయరు. ఇట్టివారికి 'అవికమ్పేనయోగేన' అను శ్లోకములఁ జెప్పిన బుద్ధియోగమును అనఁగా సమ్యగ్దర్శనంబును నేనే యిత్తును. ఆబుద్ధియోగంబున ఆభక్తులు నన్నుఁ బొందుదురు. 10

'నీభక్తులు యోగసిద్ధినిగాని జన్మరాహిత్యమునుగాని గోరరు నీభజనైకప్రయోజనవరులైయుందురు, ఏదియు అడుగనివారికి నీవేల' సమ్యగ్దర్శన మిత్తునందువా ?

వారు కోరకున్నను వారికి నిరతిశయపురుషార్థమును అనుగ్రహించు వాఁడనై స్వయముగా వారి మనోవృత్తులందుఁ జేరి ప్రకాశమానమైన జ్ఞాన లక్షణదీపంబును వెలిగింతును, వెనువెంటనే వారి అజ్ఞానము నశించుచున్నది అడుగనిదే మేలయిత్తునంటివి భక్తులు నాయెడ నెట్లో నేను కూడ అట్లే వారియెడఁ దదాసక్తుఁడనై యుందును తద్భేదమును సహింపలేని[illegible] తాదాత్మ్యలిప్సవలనను వారికి మద్భావాపత్తిరూపమైన మోక్షమునకు హేతు వగు జ్ఞానయోగము నిత్తును భక్తులకు బుద్ధియోగమియ్యకున్నను భక్తాత్మ భావప్రతిపత్తి భగవంతునకు గలుగదాయని శంకింతువుగా బోలు భక్తులకు భగవదాత్మభావప్రతిపత్తి గలుగకున్నచో భగవంతునకు భక్తాత్మభావ ప్రతి
పత్తి గలుగదు. 'ఎవరెట్లు నన్ను భజింతురో వారి నట్లే నేను కూడ భజింతు'నని
మున్నే చెప్పియున్నాను ఆ కారణంబున వారికి అనాయాచితముగా సద్బో[illegible]
నమిచ్చుచున్నాను 11

ఇట్లు భగవద్విభూతులను సంక్షేపముగాఁ జెప్ప అర్జునుఁడు [illegible] అవి సవిస్తరముగా వినుకుతూహలముగలవాఁడై యిట్లనియెను

నీవు పరంధాముఁడవు అనఁగా స్వప్రకాశరూపుఁడవు, పరమపవిత్రుఁ
డవు, అనఁగా అవిద్యవలనఁ గలుగు సకల కలుష ప్రపంచము [illegible]
ర్చిన పావనుఁడవు, అనఁగా నిర్విశేషాద్వైతస్వరూపుఁడవు పర బ్రహ్మము
గాని వేఱుగాదు కావుననే నిన్ను శాశ్వతము అనఁగా [illegible]
ము అనఁగా సద్రూపసంభవము, కారణములకుఁ [illegible]
పుట్టువులేనట్టియు వ్యాపకరూపమైనట్టియుఁ బరమాత్మ[illegible] 12

ఎవరందురందువా? వారువీరుగాదు, వసిష్ఠాది ఋషు[illegible]
ఆసితుఁడు దేవలుఁడు వ్యాసుఁడు మున్నగువారు వచింతురు [illegible]
నీవే స్వయముగా అమాట నాకు చెప్పితివి సుమా. ఎప్ప[illegible]
ధ్యాయము 3-8 శ్లోకములలోఁ జెప్పలేదా?

కావున వేదములు ఋషులు చెప్పినట్టి శాశ్వత[illegible]
షుఁడవు నీవనుట సత్యమనియు స్తుతిపరముగా చెప్పినమా[illegible]
చున్నాను శిష్యుఁడను ప్రపన్నుఁడను [illegible]
టుంజేసి యింతకుమున్న ఈవిషయమై నాకు[illegible]

భగవానుఁడా ! నీకు అనుగ్రాహ్యులగు దేవతలొండె నిగ్రాహ్యులగు దానవులొండె నీవిభూత్యావిర్భావము తెలియంగరు. నిన్ను నీవుమాత్రమే యెఱుంగుదువు. 15

ఈయెఱుకకు మనస్సు నేత్రములు మున్నగునవి సాధనములుగావు. మఱియేది సాధనమందువా ? స్వరూపమే యిందులకు సాధనము. కావుననే నీకు పురుషోత్తముఁడను నామము సార్థమయ్యెడు. పురుష శబ్దవాచ్యమైన చరాచరాత్మక సమస్తజగత్తు నీకన్నఁ దక్కువయైనది, కావున దానికిఁ బురుషోత్తమత్వము గలుగదు. అది పరిమితజ్ఞానముగలది గావున అపరిమితజ్ఞానసంపన్నుని నిన్ను ఎఱుంగుట యెట్లు సాధ్యము ? నీవు భూతోత్పాదకుఁడవు, భూతనియంతవు, నాబోంట్ల మనుష్యులకన్న నెంతో మహిమాధికులైన దేవతలకుఁగూడ నధికుఁడవు , జగత్పాలకుఁడవు ఈకారణమునుబట్టి నిన్ను పురుషోత్తముఁ డందురు

నీవిభూతులను నీవుమాత్రమే యెఱుంగుదువు గావున, ఏయేవిభూతులతో నీలోకమెల్ల వ్యాపించియుందువో యావిభూతులను అత్యద్భుతములైనవానిని వచింప నీకేతగును. 16

విభూతుల నుపదేశించుటవలనఁ గలుగు ఫలమేమందువా ? నిరతిశయైశ్వర్యసంపన్నా ! ఏప్రకారము సదాధ్యానించినచో నిన్నెఱుంగనగును ? విభూతిరూపముల ధ్యానించినచో నిన్నెఱుంగనగునందువా ? ఏయేపదార్థములందు నిన్ను నేనుచింతింపవలయును ? అనఁగా ఏపదార్థములు నీవిభూతులు ? యోగులకుగూడ దుర్గ్రాహమైన నీరూపము విక్షిప్తచిత్తులైన నాబోంట్లకు నందునా ? కావున మొట్టమొదట నీవిభూతులను ధ్యానించి క్రమక్రమముగా నీరూపంబు తెలియంగోరుదు దానంజేసి నీవిభూతిజ్ఞానము నాకుముఖ్యము

సప్తమహర్షులు మున్నగువారు నావిభూతులేయని మున్నే చెప్పలేదా యనియందువా ? జనార్దనా ! నీయైశ్వర్యమును నీవిభూతులను ధ్యానాలంబనార్థము తొల్లి సంక్షేపముగాఁ జెప్పినది నిజమే. ఇప్పుడు సవిస్తరముగాఁ జెప్పుము. చెప్పినదే మగలఁ జెప్పుటవలన వినువారికి ఏవగింపుగలుగదాయని శంకింపవలదు నీముఖారవిందమునుండి స్రవించునది అమృతముగాని వేఱు

గాదు ఆయమృతంబును శ్రోత్రపుటంబులతోఁ గ్రోలుచున్న ఎంత గ్రోలి
నను దనివి తీఱదు 18

అర్జునుఁడిట్లు ప్రార్థింపఁగా శ్రీకృష్ణభగవానుఁ డిట్లనియెను

అర్జునా! నావిభూతులెల్లఁ జెప్పుటకు వినుటకు శక్యముగాదు. నా
దివ్య విభూతులలోఁ బ్రధానభూతములైనవిమాత్రము కొన్నిఁటిఁ జెప్పెదను 19

'యోగి! నిన్నెట్లు ఎఱుంగనగు'నని యంటివి. అర్జునా! అందులకు సమాధానము మొదటఁ జెప్పెదను వినుము. సమస్తజీవనముల హృదయమం దుండునట్టి ప్రత్యగాత్మ నేనేయని గ్రహింపుము. అనఁగా ప్రత్యగాత్మకును నాకు భేదములేదు. భూతముల యుత్పత్తి స్థితిలయములు నేనేయని యెఱుంగుము. అనఁగా సర్వభూతముల యుత్పత్తి స్థితిలయములకు నేనే యాధారమనియు మదన్యమొక్కటియు లేదనియు సర్వాద్వైతమనఁగా నిదేయర్థమనియు గ్రహింపుము. ప్రత్యగాత్మరూపుఁడనైన ధ్యానించినచో నన్నెఱుంగ
నగును 20

ప్రత్యగాత్మధ్యానమునకు సాధనముగా ఈ క్రిందఁ జెప్పఁబోవు భావములందు నన్ను ధ్యానింపవచ్చును. ద్వాదశాదిత్యులలో విష్ణువను ఆదిత్యుఁడు, ప్రకాశకరములలో విశ్వవ్యాపియై, ప్రకాశించుసూర్యుఁడు, సప్తసప్తక
మరుత్తులలో మరీచియనువాఁడు, నక్షత్రములలోఁ జంద్రుఁడు 21

నాల్గువేదములలో గానమాధుర్యము గలిగి యతిరమణీయమైన సామవేదము, దేవతలలో ఇంద్రుఁడు, పదునొకండు ఇంద్రియములలో సర్వప్రవర్తకమైన మనస్సు, సర్వభూతములకు సంబంధించినట్టిదియు చిత్తమని చెప్పఁబడు
నట్టియు బుద్ధివృత్తియైన చేతనము 22

ఏకాదశరుద్రులలో శంకరుఁడు, యక్షరాక్షసులలో కుబేరుఁడు, అష్టవసువులలో అగ్నియనువాఁడు, ఎత్తైనపర్వతములలో సుమేరుపర్వతము

రాజపురోహితులలో ముఖ్యుఁడైన బృహస్పతి, సేనాపతులలో స్క దేవసేనాపతియైన గుహుఁడు, దేవఖాత జలాశయములలో సగరపుత్రులు
త్రవ్విన జలాశయము 24

సప్తబ్రహ్మలలో అతితేజస్వియైన భృగువు, వాక్కులలో ఓంకారము, యజ్ఞములలో హింసాది దోషశూన్యము అత్యంతశోధకమునైన జపయజ్ఞము, స్థావరములలో హిమాలయము 25

ఎల్లవృక్షములలో రావిచెట్టు, మొదట దేవతయైయుండి మంత్రదర్శిత్వంబునంజేసి ఋషిత్వంబునుబొందిన దేవర్షులలో నారదుఁడు, దేవగాయకులైన గంధర్వులలోఁ జిత్రరథుఁడు, ఎట్టిప్రయత్నముచేయక జన్మముతోడనే ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాతిశయమును బొంది పరమార్థమునుబడసిన సిద్ధులలో కపిలముని 26

అశ్వములలోనెల్ల సముద్రమథనకాలంబున బుట్టిన ఉచ్చైఃశ్రవసమను అశ్వము, గజములలో సముద్రమథనకాలంబునఁ బుట్టిన ఐరావతము, నరులలో నెల్ల రాజు 27

అస్త్రములలో ఏయస్త్రము దధీచి యెముకతో నిర్మింపఁబడెనో యట్టి వజ్రాయుధము, గోవులలో సముద్రమథనకాలంబున జనించిన వసిష్ఠుని కామధేనువు, కామములలోఁ బ్రజోత్పత్త్యర్థమగు కామము, (అనఁగా రతిమాత్రహేతు కామముగాదని భావము) సర్పములలో సర్పరాజమగు వాసుకి 28

నాగములలో శేషుఁడు, జలచరములలో జలచరరాజగు వరుణుఁడు, పితరులలో పితృరాజగు అర్యముఁడు, ధర్మాధర్మములకు అనుగ్రహనిగ్రహ ఫలముల నిచ్చువారిలో యముఁడు 29

దితిపుత్రులలోఁ బరమసాత్త్వికమూర్తియై యెల్లరకు నానందమునుగూర్చు ప్రహ్లాదుఁడు, సంఖ్యాగణములలోఁ గాలము, మృగములలో సింహము, పక్షులలో వినతాసుతుఁడగు గరుత్మంతుఁడు 30

వేగవంతులలో వాయువు, శస్త్రధారులలోఁ బరమవీరుఁడును అఖిలరాక్షస కులక్షయకరుఁడునైన శ్రీరాముఁడుఁ రామకృష్ణులు సాక్షాత్స్వరూపులైనను ధ్యానార్థము విభూతులుగా గ్రహింపనగునని భావము) మత్స్యములలో మకరము, వేగముగల నదులలో గంగానది 31

ప్రాణులను బుట్టించువాఁడు పాలించువాఁడు సంహరించువాఁడు, విద్యలలో మోక్షహేతువైన అధ్యాత్మవిద్య, వాదములలోఁ దత్త్వనిర్ణాయక వాదము 32

వర్ణములలో సర్వవర్ణములకుఁ బ్రకృతియైన అకారము, సమాసములలో ఉభయపదప్రధానమైన ద్వంద్వసమాసము, కాలముహూర్తాదులలో అక్షయమైన కాలకాలుఁడు అనఁగాఁ బరమశివుఁడు, (రామానుజులవలె సాక్షాత్పర బ్రహ్మమగు శివునిగూడ ధ్యానార్థము విభూతిగా గ్రహింపవలెనని భావము) సృష్టికర్తలలో హిరణ్యగర్భుఁడగు బ్రహ్మ. 33

సంహారకులలో సర్వసంహారకుఁడైన మృత్యువు, ఉత్కర్షభాగ్యుల యుత్కర్ష, కీర్తి, సంపత్తి, సరస్వతి, చిరానుభూతార్థమును స్మరించు శక్తియగు స్మృతి, అనేక గ్రంథార్థధారణాశక్తియైన మేధ, క్షుత్పిపాసాది సహన శక్తియైన ధృతి 34

ఋగారూఢ గీతివిశేషరూపములైన సామములలో బృహత్సామము ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు, పదురెండు మాసములలో సమశీతోష్ణమై నానావిధములగు ఔషధులతో శాకములతో నొప్పుచు సుఖహేతువైన మార్గశీర్ష మాసము, ఆఱుఋతువులలో సుగంధిసర్వకుసుమరమణీయమైన వసంత ఋతువు 35

వంచించి సర్వస్వమును వెనువెంటనే యపహరించువారిలో జూదము, ప్రతాపవంతుల ప్రతాపము, జయించువారి జయము, ఫలముగలుగు వఱకు పట్టువదలకచేయునట్టి యుద్యమము, సత్త్వవంతుల జ్ఞానవైరాగ్యాదిరూపమైన సత్త్వకార్యము 36

వృష్ణికుల రాజులలో వాసుదేవపుత్రుఁడనై నీకిప్పుడుపదేశించుచున్న నేను, పాండవులలో అర్జునుఁడగు నీవు, వేదార్థమననశీలురైన మునులలో వ్యాసుఁడు, సూక్ష్మదృష్టిగలవారగు కవులలో శుక్రుఁడు 37

నియమము నతిక్రమించువారికి నగుదండనము, జయముఁ గోరువారి జయోపాయభూతమైన నీతి, దాఁచువిషయములలో మౌనము (నోరు తెఱవక

మిన్నకుండువారి భావము ఎవరికిఁ దెలియదని యర్థము), తత్త్వజ్ఞానవంతుల జ్ఞానము, ఇవన్నియు నావిభూతులు. 38

అర్జునా! వేయేల. చరాచరాత్మకములైన సర్వభూతములకు ఏది బీజమో యట్టి బ్రహ్మమును నేనే నన్నుఁగాదని జనించెడు చరాచరవస్తువొక్కటియు లేదుసుమా కావున సర్వప్రపంచము నాకార్యము, నాకన్న వేఱైనది లేదు. కావునఁ బైనఁజెప్పిన విభూతులకు నిట్టి యభేదమని గ్రహింపుము సర్వాద్వైతమనఁగా నిదేభావము. 39

అర్జునా! నాదివ్యవిభూతులకు అంతములేదు. నావిభూతివిస్తరమును సంక్షేపముగాఁ జెప్పితిని. 40

అర్జునా! నావిభూతివిస్తరము నెఱుంగుటకు దమకించునట్లున్నది. అట్లు ఎఱుంగుట నీతరముగాదు నావిభూతివిస్తర జ్ఞానోపాయమును సూత్రప్రాయముగాఁ జెప్పెదు వినుము.

లోకములో ఏదియేది యైశ్వర్యయుక్తమో భోగాన్వితమో, బలాదియుక్తమో అట్టి ప్రాణివస్తుమాత్రమెల్ల నాప్రభావాంశమేయని యెఱుంగుము. 41

అర్జునా! నావిభూతులు ఇవియివియననేల? ఈజగత్తును సర్వమును నేను నాయేకాంశంబున అధిష్ఠించి వ్యాపించియున్నాను నాయధిష్ఠితముగానిది తృణముగూడ లేదుసుమా. 42

---

# గీతాహృదయము.

---

## పదునొకండవయధ్యాయము.

పదియవయధ్యాయములో భగవంతుని విభూతులు చెప్పఁబడినవి. ఈ యధ్యాయములో విశ్వరూపప్రదర్శనము వర్ణింపఁబడును. రెండవయధ్యాయములో 'అశోచ్యా నన్వశోచః' అను 11-వ శ్లోకము మొదలు 'విష్టభ్యాహ మిదం ....' అను 10-వ యధ్యాయము 42-వ శ్లోకమువఱకు భగవంతుం డుపదేశించినది విని విగతమోహుఁడై తన కృతార్థభావంబును దెలుపఁగోరి

అర్జునుఁడడుగుచున్నాఁడు

స్వామీ ! శిష్యభావముతోఁ బ్రపత్తిచేసినందున నామోహంబును బాపవలయునను మహానుగ్రహంబు నాయెడ నీకుఁగలిగి యత్యంతరహస్యమైన ఆత్మానాత్మవివేకంబును 'నత్వేవాహం జాతునాసమ్' అని 2-వ యధ్యాయము 12-వ శ్లోకంబున మొదలుపెట్టి 'తస్మాద్యోగీభవ' అను 6-వ అధ్యాయము 46-వ శ్లోకమువఱకుగల త్వంపదార్థప్రధానమైన ప్రథమషట్కరూపంబున నుపదేశించితివి నీయుపదేశంబున నామనస్సు సర్వవికారశూన్యమైనది తత్ఫలముగా 'అహమేషాం హంతావయ్యైతే హస్యంతే' అనునట్టి నా మోహము నశించినది నీవొసంగిన త్వంపదార్థవివేకదానంబున ఎంతయో కృతార్థుఁడను. 1

కమలపత్రాక్షా ! చేతనాచేతనాత్మకములైన సమస్తభూతముల సృష్టిలయములను గూర్చి 7-వ అధ్యాయము 6-వ శ్లోకము మున్నగుచోట్లఁగల నీయుపదేశంబును నీనోటనే విననోఁచితిని. అవ్యయము అపరిచ్ఛిన్నమునైన నీమాహాత్మ్యంబునుగూడ 10-వ యధ్యాయము 42-వ శ్లోకము మున్నగువాని యందుఁ దెల్పినది విని ధన్యుఁడనైతిని 2

పురుషోత్తమా ! నీయీ మానుషరూపమునకన్న నన్యమైన యీశ్వర

రూపమును 10-వ అధ్యాయము 42-వ శ్లోకములోఁ జెప్పిన దానిని దర్శింపఁ దమకమయ్యెను. నీవుచెప్పినది నిజమో కాదోయని శంకించి పరీక్షార్థమిట్లు కోరుచున్నానని భావింపవలదు ఆపరమరూపంబును గన్నార దర్శించి కృతార్థుఁడ నగుదుఁగాక అనునట్టి పేరాశతో నిట్లడుగుచున్నాను పరత్వంబునకు ముంగొంగుఁబసిండివైన నీకుఁ బ్రపత్తిచేసిననాకుఁ గృతార్థతావిషయంబున సంశయంబు గలుగుటంజేసి యిట్లడుగుచున్నానని తలంతువా ? అట్టి భావమేలేదు. పరమేశ్వరా ! సోపాధికము నిరుపాధికమునైన నీయైశ్వర్యంబునుగూర్చి నీవుచెప్పినదెల్ల అక్షరాక్షరంబుల నమ్మితిని. నీరూపసందర్శనోత్కంఠము జన్మసాఫల్యసంపాదనార్థమేగాని వేఱుగాదు. 3

స్వామీ ! ఐశ్వరమైననీరూపంబు నియ్యజ్ఞునకుఁజూడ శక్యంబని తలంతువేని అవ్యయము నపరిచ్ఛిన్నమునైన యద్దాని నాకుఁ జూపుము నీ సంకల్పమే నాభాగ్యము నిదర్శన యోగ్యశక్తిని నాకిచ్చునది నీసంకల్పంబు దక్క యొండు గలుగదు మననమాత్రాననే దర్శనాధికారి నెట్లగుదు నందువా ? నీవు ప్రభుడవు, 'ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః' అని యెఱుంగనా ? అనధికారులనుచూడ అధికారులనుగాఁ జేయుశక్తి నీకుఁగలదు నీ స్వరూపదర్శనంబునకు యోగులుమాత్రమే యధికారులందువా ? నీవుయోగేశ్వరుఁడవు. అయోగులనుగూడ యోగులుగాఁ జేయఁగలవు 4

అర్జునుఁడిట్లు ప్రార్థించినంత శ్రీకృష్ణభగవానుఁ డిట్లనియెను

అర్జునా ! నారూపదర్శనంబు అనధికారులకు దుర్లభంబనుట సత్యము నాప్రసాదంబున నీవు నారూపదర్శనంబునకు సమర్థుఁడవగుదువు గాక నా రూపమందుఁ బ్రకారభేదములు వేనవేలుగలవు, అవియు నొక్కరూపున నుండవు ఆకృతియందేగాక వర్ణమందుగూడ నానాత్వము దాల్చియుండును ఒక్కొక్కటియు మహాద్భుతమై తోఁచును 5

ద్వాదశాదిత్యులు అష్టవసువులు అశ్వినీదేవతలిరువురు మరుత్తులు నలువదితొమ్మండ్రు గురు, బ్రహ్మ, ఈశుఁడు మొదలగువారేగాక ఇంతకుముం దెవ్వరుఁ గనివినియెఱుంగని విశేషంబులెన్నో యీ నాదేహములో నడఁగియున్నవి. వానినెల్లఁ జూతువుగాక 6

ఈసమస్తజగంబును నేను నాయేకాంశంబున వ్యాపించియుందునని పదవయధ్యాయము 42-వ శ్లోకములో జెప్పినమాట విన్నది మొదలు నీవిట్లు తమకించుచున్నావు చరాచరాత్మకమైన యీసమస్త జగంబు నాయం దెచ్చటనో యొకమూలనుండుటఁ జూతువుగాక నాయందొకమూల నణువు వలెనున్న యీప్రపంచంబును సయితము జూడవలయునన్నచో సామాన్యులు కోటి సహస్రవర్షంబులు విరువర లేక పరిభ్రమించినను సమగ్రంబుగాఁ జూడఁజాలరు అట్టి దానిని నీవిప్పుడు చూతువు గాక అంతియగాదు ఏ మేమి చూడఁగోరుదువో యదియెల్ల జూడుము. మేము జయింతుమో వారు జయింతురో యని నీవు 2 అధ్యాయము 6-వ శ్లోకములో భావించిన నీసందేహముగూడఁ దీఱుఁగాక 7

ఈమాటలు చెవిసోకినంతనే అర్జునుఁడు నిలువెల్లఁ గన్నులుగావించుకొని యామహాద్భుత దర్శనార్థ మువ్విళ్ళూరసాగెను శ్రీభగవానుఁ డది గ్రహించి యిట్లనియెను

అర్జునా! నాదివ్యరూపంబునుజూడ నీయీ ప్రాకృతనేత్రంబులు చాలవు గావున నందులకుఁ దగిననేత్రంబులను నీకిచ్చుచున్నాను ఆనేత్రంబులతో ఐశ్వర్యమైన నాయోగంబును అనఁగా ఘటితఘటనాసామర్థ్యాతిశయాత్మకమైన నావిశ్వరూపంబును జూడుము. 8

సంజయుఁ డింతవఱకుఁ జెప్పినిలివెన అనంతరవృత్తమును వినిపింపుమని ధృతరాష్ట్రుఁడు త్వరింప వానితో సంజయుఁ డిట్లనియెను.

శ్రీభగవానుఁ డిట్లు చెప్పి దివ్యదృష్టి నిచ్చి పరమము నైశ్వర్యమునైన తనరూపంబు నర్జునునకుఁ జూపంచెను రాజా! ఇంతటనేని పాండవులతో సంధితలంపని నీయజ్ఞానంబునకు నేమనవలయు? 9

అపరిమితంబులగు వక్త్రంబులతో అసంఖ్యాకంబులగు నేత్రంబులతోఁ జిత్రవిచిత్రంబులైన యనేకవిధదర్శనంబులతో నిట్టివనరాని వెఱఁగుపఱచు వింతవింత యాభరణంబులతో దివ్యకాంతుల మిఱుమిట్లు గొల్పుచున్న యనేకాస్త్రంబులతోఁ దేజరిల్లుచు 10. అలౌకికంబులైన మాల్యాంబరంబులు ధరించి అస్త్రా

కృతంబులైన గంధానులేపంబులు అలఁది సర్వాంశంబుల నాశ్చర్యంబుగూర్చుచు
ఆద్యంతంబులు గలుగక దేశకాలపరిచ్ఛేదశూన్యమై విశ్వతోముఖంబుగా నవ్వి
శ్వరూపంబు ప్రకాశించెను 11 ఆమూర్తితేజమేమని వచింతు! లెక్క
లేనిసూర్యు లొక్కసారి మింటఁబొడిచి వారికాంతినెల్ల నొక్కరాశిచేసినచో
మహాత్ముఁడైన యావిశ్వమూర్తియొక్క దివ్యతేజంబున కెనసేయవచ్చునేమో
యని తలంతు ఆతేజమంత నిరుపమానముగానుండినది 12 అనంతబాహూ
దరనేత్రము అపరిమితతేజస్కము అనంతదివ్యాయుధోపేతము స్వోచితాసం
ఖ్యేయదివ్యభూషణోజ్జ్వలము దివ్యమాల్యాంబరధరము దివ్యగంధానులేపనము
అనంతాశ్చర్యమయమునైన యాదేవదేవుని యనంతశరీరమునం దెందో యొక్క
మూల నీజగత్తు బ్రహ్మాది వివిధదేవ పశుపక్షిమనుష్యస్థావరాది భోక్తృవర్గంబు
లుగా పృథివ్యంతరిక్ష స్వర్గపాతాళాతలవితలసుతలాది భోగ్యస్థానంబులుగా
భోగ్యభోగోపకరణభేదభిన్నమైయుండెను భగవత్ప్రసాదలబ్ధంబులును ద
ర్శనయోగ్యంబులునైనట్టి దివ్యనేత్రంబుల కల్గించేసి యర్జునుఁ డావిశ్వరూ
పంబును జూడనోచెను. 13

అర్జునుఁ డట్లా విశ్వరూపంబున జూచి విస్మయమయుఁడై నిలువెల్ల పుల
కింప సంభ్రమంబునఁ దొట్రిలుచు నితికర్తవ్యతాజడుఁడై యానారాయణ
మూర్తికి శిరస్సుతోడ నమస్కరించి చేదోయి మొగ్గి యిట్లనియెను 14

స్వామీ! ఆదిత్యాది సమస్తదేవతలను స్థావరజంగమాత్మకములైన
సకలభూతసంఘంబులను వసిష్ఠాది నిఖిలఋషులను వాసుకి మున్నగు నెల్ల
యురగులను వీరికెల్లనీశుఁడై పృథివీపద్మమధ్యమందలి మేరుకర్ణికపైఁ గూర్చుం
డియున్న చతుర్ముఖబ్రహ్మను నీయందుఁ జూచుచున్నాను 15 విశ్వేశ్వ
రా! ఇన్నియని లెక్కింపరాని హస్తోదరవక్త్రనేత్రంబులుగలిగి యపరిచ్ఛిన్న
మైన రూపంబుతోనున్న నిన్ను ఎల్లెడలఁ గాంచుచున్నాను నీయాకారంబు
నకు ఆదిమధ్యాంతంబులు గోచరింపవు 16 సూర్యాగ్నులెల్లెడలఁ బ్రకా
శింతురేని వారి యేకరాశీకృతదీప్తి యెట్లుండునో యట్టిదీప్తితోఁ దేజరిల్లుచు
దివ్యనేత్రంబులకుఁదక్క సామాన్యనేత్రంబులకుఁజూడ సాధ్యముగానివాఁడ
వై ఆకారణంబున నిదియిట్టిదని నిశ్చయింపరాక తేజోరాశివై వెలయు కిరీటి

దాంగ గదాధరునిఁ జక్రధారిని నిన్ను నీప్రసాదంబునఁ జూచుచున్నాను
17 ఎవరిమాహాత్మ్యము ఎఱుంగఁదగినదని యుపనిషత్తులు వాకొనుచున్నవో
యట్టి నాశరహితమైన బ్రహ్మము నీవేయనియు, ఈవిశ్వమునకెల్ల మహో
త్కృష్టమైన యాశ్రయము నీవేయనియు, నాశరహితము వైదికనిత్యమునైన
ధర్మంబును బాలించువాఁడు నీవేయనియు, సనాతనపురుషుఁడు నీవెయనియు
నీ యతర్క్యనిరతిశయైశ్వర్యంబును గాంచినంతనే నిశ్చయించుకొంటిని 18

నా బ్రహ్మత్వనిశ్చయంబునకు హేతుభూతలక్షణంబు లేవందువా? ఆకాశమువలె సర్వవ్యాపకుఁడవై యాదిమధ్యాంతంబులు లేకుండుట, పరాభిభవనశక్తిగలైన వీర్య మింతనరాకుండుట అనంతబాహూదరనేత్రంబుల మూలంబైన విశ్వతోముఖత్వంబును జాటుచుండుట, సూర్యచంద్రులు నేత్రములుగా నుండుట, ప్రజ్వలించు నగ్ని ప్రకాశించుచు 'ముఖాదింద్రశ్చాగ్నిశ్చ' అను శ్రుత్యర్థంబును సార్థకము చేయుట, స్వతేజస్సుచేత సమస్తవిశ్వంబును తపించుట — ఈధర్మంబులు నీబ్రహ్మత్వనిశ్చయంబునకుఁ బ్రమాణములైన హేతువులు గదా మహాత్మా! ఆదిమధ్యాంతంబులు లేకుండుటగ నంటిని ఏలయందువా? పాతాళాది సత్యలోకాంతముగల యవకాశంబును సమస్తదిక్కులను నవొక్కరుండవే వ్యాపించియున్నావు ఇంత యంతరాళంబున నెందుఁజూచినను నీరూపంబు వ్యాపించియుండుటం జేసి నీకిది మొదలిది నడుమిది తుదయని నిశ్చయించు టెట్లు? అనంతవీర్యత్వ మెట్లందువా? అనంతము నమృతము సత్యస్వరూపంబునైన యే నీరూపంబును గాంచి ముల్లోకంబులు కంపిల్లుచున్నవో యారూపమే నీయనంతవీర్యత్వంబును వెల్లడింపదా? 20
ఈసురసంఘంబులు భీతిల్లి నిన్ను శరణుజొచ్చుచున్నవి అతిభీతులు కొందఱు 'జయజయ రక్షరక్ష' అని నిన్ను బ్రార్థించుచున్నారు మహాభయము సంప్రాప్తించుటం జూచి నారదాదిమహర్షిసంఘంబులుఁ గపిలాది సిద్ధసమూహంబులును స్వస్తిపూర్వకంబులుఁ బరిపూర్ణార్థవంతంబులునైన స్తుతులతో నిన్ను స్తుతించుచున్నారు సురాసురులిట్లు శరణార్థులై మహాత్ముల స్తోత్రములందుటయే నీబ్రహ్మత్వంబును నిరూపించుచున్నది 21
నీశరణుఁజొచ్చు సురసంఘంబు లెవ్వియనియందువా? ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, విశ్వేదేవతలు, అశ్వినులు, సాధ్యులు వాయుదేవగణంబులు, పితృ

కార్యము కించిన్మాత్రముగూడ గాన్పింపదు. 29 నీవదనాంతరంబు లట్లు
ప్రవేశించిన దుర్యోధనాదుల నెల్ల నమిలి మ్రింగుచుం దత్కోపవశంబున నో
యన వారి నెత్తుటి జొత్తిల్లు పెదవులను సారెసారెకు నాస్వాదించుచున్నావు.
నిజకఠోరదీప్తికిరణంబులం గప్పి జగమెల్ల నుడుకుడుకించుచున్న సకలలోక సం
తాపక నిరవధిక తేజోరాశికి నీకు ధార్తరాష్ట్రగ్రసన మొక విషయమా ? ఇం
దేమియుం జిత్రము గాదు 30 ఇంత యుగ్రరూపుఁడవు నీ వెవరో చెప్పుము
దేవవర ! నమస్కారము, నామీఁదఁ బ్రసన్నుఁడవగుము అవ్యయమైన నీ
రూపంబును జూపుమని ప్రార్థింపగా మహాఘోరమైన యీరూపంబును జూపితి
వి ఆర్తవత్సలునకు నిదియగునా ? ఏమిచేయవచ్చితివో చెప్పవం, ఒంపం
చో నాకు సమాధానము గలుగదు 31

అర్జును డిట్లడుగ శ్రీకృష్ణభగవాను డిట్లు వచించెను అర్జునా !
నీ వెవరుఁడవంటివి. చతుర్దశభువనంబులందలి జనుల నెల్ల సంహార మొనర్చునట్టి
సంక్షోభుఁడనైతి కాలాగ్నిరుద్రరూపపరమేశ్వరుఁడ నని గ్రహింపుము
ఎందులకు వచ్చితివంటివి దుర్యోధనాదులను రూపుమాపుటకై యిందువచ్చి
తిని ప్రతిపక్షసైన్యమందలి భీష్మద్రోణాది యోధులెల్లరుఁ గూడ నీజోక్య
మేమి లేకయే నశింపనున్నారు. 32 దుర్యోధనాదుల మరణము సిద్ధము గా
వున 'వారు జయింతురో మేము జయింతుమో' అను నీసంశయంబున కెట్టి
యవకాశము లేదు ఇఁకనైన యుద్ధమునకు లెమ్ము 'వారివినాశార్థమే ప
ప్రవృత్తిమై యుండఁగా నేను యుద్ధమునకు లేచి ఫలమేమి ?' యనియందు
వా ? దేవతలకుఁగూడ దుర్జయులైన భీష్మద్రోణాదుల నర్జునుఁడు జంపినాఁ
డను కీర్తిని బడయుటయే ఫలము సుమా కట్టి కీర్తివలన లాభమేమని తలంప
వలదు శత్రువులను జంపి సమృద్ధమైన రాజ్యంబు ననుభవింపుము. భీష్మా
దులు నశింపనున్నారని చెప్పినందున నీకముందెన్నడో నశింతురని భావింపకు
వారు చచ్చినవారేయని నమ్ముము. ఎట్లందువా ? తొల్లి శంఖరావము గా
వింపనప్పుడే వారిని జంపితిని. చంపినవారిని మఱలఁ జంప నేలయందువా ?
అర్జునా ! వారి బలపరాక్రమంబుల నెల్ల హరించి శరీరమాత్రులనుగా నొనర్చి
యున్న నీకుఁ గూర్చునిమిత్తము కొనయూపిరితో నుంచితిని. వారి దేహ

పాతమునకు నిమిత్తమాత్రుఁడవగుము, కాకతాళీయన్యాయంబునఁ గర్తవి కగను.

ద్రోణుఁడు ధనుర్వేదాచార్యుఁడను దివ్యాస్త్రసంపన్నుఁ డనియును, భీష్ముఁడన్ననో స్వచ్ఛందమరణశాలి గావునఁ బరులచేఁ జచ్చువాఁడు గాఁడనియు, అఖిలక్షత్రజేతయైన పరశురాముఁడుగూడ వానినోడింపలేఁ డయ్యె ననియు, జయద్రథుని సంగతి విచారింతమన్నచో 'నాపుత్రుని తల యెవ్వఁడు నేలద్రోయునో వానితలగూడ నప్పుడే నేలఁగూలుఁగాక' అని తన సంకల్పం బుతో నతని తండ్రి తపస్సుచేయుచున్నాఁడనియు దానంజేసి జయద్రథుఁడుఁ గూడ నజేయుఁడేయనియు, కర్ణుఁడన్ననో యింద్రదత్తమైన యమోఘశక్తి వానియొద్దనున్నదనియు స్వయముగాఁగూడ నతఁడు మహాబలుఁడనియుఁ గృ పాశ్వత్థామ భూరిశ్రవసులుగూడ నంతటివారేయనియు, ఇట్టివారిని జంపుట రాజ్యమనుభవించుట కీర్తిగాంచుట సాధ్యమాయనియు శంకింతువా ?

భీష్మద్రోణ జయద్రథ కర్ణాదు లంత యజేయులే యగుదురుగా వారినెల్ల నేను చంపియున్నాను చంపినవారిని జంపుట యేమిబరువు ? ఇట్టి భయనిమిత్త వ్యథవలదు యుద్ధమునకు లెమ్ము, రణంబున సపత్నరాజ జయంబు నీకుఁ దప్పకగను 34

ఆశ్రితవాత్సల్య జలధియైన కేశవు డిట్లు పలుకఁగా, భగవదమోఘాశీర్వచనంబుననే తాను బ్రాపించినట్లు భావించి యంజలిఘటించి పాండవశ్రేష్ఠుఁ డర్జున భీతులంజేసె వడఁకుచుఁ బునఃపున స్సాష్టాంగ ప్రణామంబు లాచరించినవాఁడై గద్గదస్వరంబున నర్జుఁ డిట్లనియెను 35

హృషీకేశా! 'యుద్ధమునకు లెమ్ము, యశస్సు పడయుము శత్రువుల జయించి రాజ్యమనుభవింపుము, వీరినెల్లఁ జంపియున్నాను నిమిత్తమాత్రుఁడ వగుము' అను నీమాటలనుబట్టి, భక్తవత్సలుఁడ వగుటంజేసి భగవంతుఁడవై యానుగ్రహార్థ మవతరించెనని కీర్తిక రణావలోకనార్థ దేవగంధర్వసిద్ధ విద్యాధరాది సంపూర్ణజగంబెల్ల సంతోషించుచు రంజిల్లుచున్నది ఇది యుక్తమేగదా రాక్షసులు భీతులై దిక్కులు పరువిడుచున్నారు అది యు

జేసి ద్రష్టృదృశ్యాత్మకమైన యీజగత్తు సర్వము నెవనికన్న వేఱుగాదో, ఎఱుంగునది ఎఱుంగఁదగినది రెండు నెవఁడో, పరబ్రహ్మమెవఁడో, విశ్వమెల్ల నెవఁడు అనంతరూపంబులతో వ్యాపించియుండునో, ఎవని యధిష్ఠాన సత్తావలన జగత్తునకు సత్త్వప్రతీతిగలుగుచున్నదో, ఎవనిఁగాదని జగత్తునకుఁ బృథక్సత్తాస్థితిలేదో 38 వాయుయమాగ్ని వరుణ చంద్ర బ్రహ్మలెల్లరు నెవని విభూతులో, ఎవఁడు హిరణ్యగర్భునకుఁగూడ జనకుఁడో యట్టి సహస్రమూర్తికి నీకు సహస్రనమస్కారములు సర్వదేవతాత్మకా! నిన్ను సారెసారెకు నమస్కరింతును (భక్తివిశ్వాసంబులు మెండగునప్పు డెన్నిప్రణతులానర్చినను ఆత్మకుఁ దృప్తిలేదని యిందుసూచితము) 39 సర్వాత్మకా! నీకుఁ బూర్వభాగమునుండి నమస్కరింతు, వెనుకభాగమునుండి నమస్కరింతు వేయేల! సర్వదిశలందు నీకు నమస్కరింతు సర్వము నీయందుఁ గల్పితము, నీయతిరిక్తమైన దేదియు లేదు, కావున నీకు సర్వత్ర నమస్కారము నీ శక్తిపరాక్రమంబు లనంతంబులు, దేశకాలవస్తు పరిచ్ఛేదరహితంబుగా సమస్తంబు వ్యాపించియుందువు గావున సర్వుఁడవు 40 నీవిశ్వరూపంబు నీ మహిమంబు సర్వకారణత్వ సర్వాత్మకత్వాది రూపమైన నీయైశ్వర్యంబు నెఱుంగక మోహావశంబునను జిరపరిచయకారణంబునను సఖమాత్రుని గానిన్ను భావించి 'కృష్ణా! యాదవా! చెలీ!' అనివినయరహితముగా నేమివచించితినో 41 పరిహాసార్థమేమి యసత్కారమాచరించి సర్వదేవనమస్కారార్హుఁడవైన నిన్నేమి యవమానించితినో, ఇదియది యననేల? విహారశయ్యాసనభోజనంబులం దేమేమి యొనర్చితినో, ఏకాంతమందుఁగాని సఖులమ్రోలఁగాని యేయపచార మొనర్చితినో యానాయపరాధంబులెల్ల క్షమింపుము అచ్యుతుఁడవు అనఁగా ఆశ్రితవాత్సల్యాది కళ్యాణగుణనిధివి గావున నీవు క్షమించుట యుక్తమేగదా నాయొనర్చిన యవినయంబుల కెంతయు వగతు మేనత్తకుమారుఁడు మాతులతనయునితోఁ బరిహాసంబుల చెల్లించుట సహజమే గావునఁ దప్పుగాదందువా? నీవు అచింత్యప్రభావుఁడవు, నీతత్త్వం బెఱుంగక నిన్నుఁ గేవలమాతులతనయునిగా భావించుటయే మొదటి యపచారము గదా 42 చరాచరాత్మకమైన యీజగత్తునకెల్లఁ దండ్రివి, పూజ్యుఁడవు, గురుఁడవు గుణంబులఁబట్టిగానీ స్వరూపంబువలనఁ గానీ, కర్మమువలనఁ గానీ శ్రేష్ఠతముఁడవు సర్వత్వము, ప్రాభవత్వము, గురుత్వము, గరిమత్వముఁ

జూచియెఱుంగరు. నీయెడ నాకుఁగల యనుగ్రహ బుద్ధిరూప ప్రసాదంబు నిదే ప్రకటింపఁదా ? 47 వేదాధ్యయనం బొనర్చిన నొనర్తురుగాక, కల్ప సూత్ర మీమాంసాది పూర్వకంబుగా వేదవిహిత యజ్ఞంబులనెల్ల యజించిన యజింతురుగాక, తులాపురుషాది దానంబులిచ్చిన నిత్తురుగాక, సంధ్యావంద నాగ్నిహోత్రాది క్రియలు యథావిధిఁ గావించినఁ గావింతురుగాక ; కృ చ్ఛ్రచాంద్రాయణాది మహోగ్రతపంబు లాచరించిన నాచరింతురుగాక, అంతమాత్రాననే నాయీరూపసందర్శన భాగ్యంబు గలుగదు. అట్టి యదృష్ట పూర్వరూపంబును నీవుఁ జూచినందులకై 'కృతార్థోఽస్మి' అని సంతసించుట కు మాఱుగా భయపడుటవేల ? 48 భయజనితమైన వివ్యథ మానుఁగాక ; దిక్కులుగూడ గానరాకున్న నిమూఢభావంబు తొలఁగుఁగాక, భయరహి తుఁడవు ప్రీతచిత్తుఁడవునై నిరుపమానమైన నాతొంటిరూపంబు నిదిగో చూ డుము 49

సంజయుఁడు చెప్పుచున్నాఁడు,—ఇట్లు శ్రీభగవానుఁడు వచించి యర్జునునకనుసారంబుగాఁ బూర్వరూపంబును జూపి భయగ్రస్తుఁడైయున్న యర్జునుని దన సౌమ్యాకారదర్శనంబున నాశ్వాసించెను. అహో ! భగవత్పరమకారుణ్యమేమందు ! పరమేశ్వరుఁడు లోకనియంతయయ్యు భ క్తులచేత కీలుబొమ్మవలె నర్తించుఁగదా ! 50

అర్జునుఁడు శ్రీకృష్ణరూపంబును గాంచి 'కృష్ణా ! అత్యంత సౌందర్య సౌకుమార్యశోభితంబగు నీమానుషరూపంబును వీక్షించి ప్రసన్నచిత్తుఁడనైతిని, భయంబు వీడితిని, స్వస్థము జెందితిని' అని వచింప 51 శ్రీభగవానుఁ డిట్లనియెను. అర్జునా ! ఎవరికిని జూడ శక్యము గాని నాయీదివ్యరూపంబును జూచితివి. నిత్యప్రత్యక్షులైన దేవతలు గూడ నాయీరూపంబును గాంచ నిరంతరము సుపేక్షించుచుందురు. ఎవరె నాయీరూపంబును జూచినవారు ఇతఃపూర్వముగాని ఇతఃపరముగాని గలు గరు. దేవతలే ఇట్లుండ మనుష్యుల గాథలఁగూర్చి చెప్పవలయునా ? 52 అర్జునా ! భక్తిరహితంబుగా నెన్నివేదము లభ్యసించినను, ఎన్ని ఘోరంబు లాచరించినను, కోటిదానములిచ్చినను, క్రతుశ్రేష్ఠ యజ్ఞంబు లెన్నిఁ గావించినను

# గీతాహృదయము.

## పదురెండవ యధ్యాయము

పదునొకండవ యధ్యాయములోఁ జెప్పిన విశ్వరూపంబు సగుణబ్రహ్మ రూపంబనియు, ఆవిశ్వరూపంబును ముముక్షువులు మొట్టమొదట నుపాసింపవలయుననియు నియ్యధ్యాయంబున నుపదేశించుచున్నాఁడు ఈయుపదేశంబునకు నవతారికగా ముక్తి అనఁగా నేమి ? ముక్తికై సగుణబ్రహ్మనిష్ఠ కర్తవ్యమా ? నిర్గుణబ్రహ్మనిష్ఠ కర్తవ్యమా ? అను ప్రశ్నంబులకు సమాధానము చెప్పుచున్నాఁడు.

అర్జునుఁడడుగుచున్నాఁడు —పదునొకండవ యధ్యాయము 55-వ శ్లోకంబులోఁ జెప్పిన ప్రకారము నిరంతరయుక్తులై నిన్ను అనఁగా విశ్వరూపంబునను‌న్న సాకారబ్రహ్మంబు నుపాసించు భక్తులలోను, ఇంద్రియగోచరముగానట్టియు అక్షరము నిరాకారము నిర్విశేషము సర్వోపాధికమునైన నిర్గుణబ్రహ్మంబును శ్రవణమననాదిధ్యానంబులతోఁ దదేకనిష్ఠగా నుపాసించువారిలోను యోగవిత్తము లెవరు ? అనఁగా మోక్షసాధనమైన యుపాయంబు యోగమనఁబడుననియు పైన జెప్పిన రెండువిధముల యుపాయజ్ఞులలో శ్రేష్ఠు లెవరనియు భావము 1

* సగుణబ్రహ్మోపాసకు లుత్తములా ? నిర్గుణబ్రహ్మోపాసకు లుత్తములా ? అను విషయము మాత్రమె యీశ్లోకంబునఁ బ్రతిపాద్యముగాని, ముముక్షువులు సగుణనిర్గుణనిష్ఠలలో దేని నవలంబింపవలయునను విషయము ప్రతిపాద్యముగాదని కొందఱందురు ఇందులకు సమాధానము వినుము

బ్రహ్మోపాసన యనఁగా నేమి ? బ్రహ్మవిషయంమైన వేదాంతంబును వినుట, విన్నదానిని మననము చేయుట, మననఫలంబుగా బద్ధిస్థమైనదానిని ధ్యానము చేయుట—కరూపమైన తదేకనిష్ఠను బ్రహ్మోపాసనంబందురు

గడిగినచో నందుఁ గ్లేశబాహుళ్యంబు గాన నందులకు నోడి నిర్గుణమే మానిన మాన వచ్చును. ఈకారణంబులవలన సగుణోపాసనంబును మొదట నారంభించుట రెంటిలో మేలైన యుపాయమగుచున్నది. మఱియు సగుణోపాసనంబు కేవల భక్తిమాత్రము. భక్తి స్వతంత్రమైన మోక్షమార్గముగాదు. భక్తివలన జ్ఞానము జ్ఞానమువలన మోక్షముఁ బ్రాపింపవలయును 'మద్భక్త ఏవ ద్విజాయ మద్భావాయోపపద్యతే' అనునది యిదేయర్థంబును దెలుపును

ఈకారణంబులఁబట్టి యీశ్లోకము సగుణోపాసకులు గట్టివారా ? నిర్గుణోపాసకులు గట్టివారా ? అను విషయంబును దీర్మానింపుమని యడుగదనియు, సగుణ నిర్గుణనిష్ఠలలో ముముక్షువులు మొదట దేనిననుష్ఠించుట మేలను విషయంబును దెలుపఁగోరుచున్నదనియు గ్రహింపవలయును.

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు —అర్జునా ! మొదట నాయందు అనఁగా సగుణబ్రహ్మమందు మనస్సు నేకాగ్రంబుగా నిల్పి నేనుఁ జెప్పినట్లు నిత్యయుక్తులై పరమశ్రద్ధతో నన్నుపాసించు ముముక్షువులు ఉపాయజ్ఞులలో శ్రేష్ఠులని నామతము ఏలయందువా ? 2

ఇదియని నిర్దేశింపఁదగినది సవిశేషమగును, సవిశేషము సగుణము, సగుణంబునకు రూపాదులుండును కావున నది యింద్రియగోచరము అట్లు నిర్దేశింపరానిది నిర్విశేషమగును, నిర్విశేషము నిర్గుణము, నిర్గుణంబునకు రూపాదులు గలుగవు, రూపాదులులేనిది ఇంద్రియగోచరము గాదు సగుణ బ్రహ్మము ఇంద్రియగోచరంబు గావున దానియందు మనస్సును సులభముగా నిలుపనగును 3

ధ్రువమనఁగా నిత్యము, అచలమనఁగా వికారములేనిది, కూటమనఁగా మిథ్యయైనదానిని సత్యముగాఁ జూపుట, కూటస్థమనఁగా అట్టికూటమునకు సాక్షిమాత్రమై యుండునది, అచింత్యమనఁగా మనస్సుతోఁ జింతింపరానిది, సర్వత్రగమనఁగా ఎల్లెడల వ్యాపించియుండునది, అవ్యక్తమనఁగా రూపములేనిది, అనిర్దేశ్యమనఁగా—ఇదియని నిర్దేశింపరానిది, అక్షరమనఁగా బ్రహ్మము.

ఇట్లు ధ్రువము అచలము కూటస్థము అచింత్యము సర్వత్రగము అవ్యక్తము అనిర్దేశ్యమునైన బ్రహ్మంబును సర్వభూతహితరతులై అందులకుం గారణభూతమైన సర్వత్ర బ్రహ్మబుద్ధిగలిగి అందులకుం గారణంబైన యింద్రియగ్రామనియతిం బడసి శ్రవణమననిదిధ్యాసనాదిరూపంబునం జింతింతువారు తద్బ్రహ్మంబునైన నన్నె బడయుదురు 4 అయినను ఇట్టి నిర్గుణచింతనము తొలుదొల్తనే సిద్ధింపదు కాదని ప్రయత్నించినను అధికతరక్లేశము తప్ప మఱియొంటి ఫలింపదు దేహధారులకు నిర్గుణచింతనము దుఃఖసాధనము గావునం దొలుదొల్తనే దానికై యత్నింపక వారు సగుణనిష్ఠ బూని క్రమక్రమంబుగా నిర్గుణనిష్ఠయం దర్హులగుట యుక్తము 5

నిర్గుణనిష్ఠ దుఃఖసాధనమనుటకు ధ్రువము మున్నగు నిర్గుణబ్రహ్మవిశేషణంబులే తెలుపుచున్నవి. ఎట్లనిన నిర్గుణబ్రహ్మము అవ్యక్తమై అనఁగా రూపమెట్టిది లేనిదై యున్నది అది యవ్యక్తము గావున దాని నిట్టిదని నిర్దేశింపరాదు అవ్యక్తము అనిర్దేశ్యము నగుటంజేసి యది మనస్సునకు నందదు, కావున దానిని జింతింపం దరముగాదు అనఁగా, అవ్యక్తము అనిర్దేశ్యము అచింత్యమునైనదియుండ నాయని శంకింతువు గాఁబోలు. అది సర్వత్రగము అనఁగా సర్వవ్యాపియైయున్నది కావున నవ్విషయంబునఁ గొంత తెలియనగును. 'ఆకాశముకూడ సర్వవ్యాపియేగదా? అది వ్యక్తమగుచుండ బ్రహ్మమాత్ర మేలవ్యక్తముగా'నుండవలెను? ఆకాశము వస్తురూపమైనది, బ్రహ్మము వస్తువుగాదు గావున వ్యక్తముగాదు. మఱియు బ్రహ్మము కూటస్థము, కూటస్థము గావున అచలము, అచలము గావున ధ్రువము (విశేషణంబులలో అవ్యక్త అనిర్దేశ్య అచింత్యములను మూడింటివలన బ్రహ్మతత్త్వము ఇంద్రియాతీతమని చెప్పి ఇంద్రియాతీతమైనది అభావమను నాస్తికవాదమును నిరసించుటకై సర్వత్రగ కూటస్థ అచల ధ్రువములను విశేషణంబులఁ బ్రతిపాదించి బ్రహ్మముండునట్లు సిద్ధాంతీకరించినారని గ్రహింపవలయును,

అర్జునా! ఈ కారణంబులఁ బట్టి తొలుదొల్తనే నిర్గుణబ్రహ్మోపాసనంబునకుం బూనక, సగుణబ్రహ్మమునకు నాయందు సర్వకర్మంబులు సమర్పించుచు మత్పరాయణులై నన్నె ధ్యానించుచు నిష్కామభక్తితో సన్నుతింతురేని 6

అట్టి భక్తులకు మృత్యురూపసంసారసాగరంబునుండి శీఘ్రంబుగా నుద్ధరింతును
సగుణనిష్ఠులకు ఈశ్వరప్రసాదంబున అనాయాసంబుగా సిద్ధిగలుగును గావున
సగుణనిష్ఠయే మొదట ననుష్ఠింపవలయును 7 కావున సగుణబ్రహ్మము
నైన నాయందే మనస్సు నిలిపి నేనే పరమప్రాప్యుడని నిశ్చయించుకొని వర్తిం
తువేని మత్ప్రసాదంబున జ్ఞానముంబడసి దేహాంతమందు నిర్గుణబ్రహ్మమునైన
నాయందుండువు ఇందు సంశయము లేదు 8

సగుణబ్రహ్మధ్యానమునకు శక్తిచాలనివా రేమిచేయవలయునందువా?
అట్టివారు ఏదేనొక ప్రతిమను ఆలంబనంబుగా గ్రహించి చిత్తమును విష
యాంతరంబులనుండి మరల్చి యాప్రతిమ యందునిల్పు నభ్యాస మొనర్పవల
యును. స్థిరచిత్తసమాధానంబును బడయుటకు నిదే యుపాయము ఇట్లు
చిత్తసమాధానము సంపాదించుకొని తర్వాత అంతర్ధ్యానంబునకు యత్నింపుము
9 ఈపాటి యభ్యాసంబునకుఁగూడఁ జాలనివారు నాకథాశ్రవణకీర్తనాదు
లొనర్పవలయును అట్లుచేయుచు సర్వకర్మంబులు మదర్థంబుగా నొనర్చు
చుండఁగాఁ జిత్తశుద్ధిగలిగి తన్మూలంబున ధ్యానాదులు సిద్ధించి తుదకు మోక్ష
ము గలుగును 10

భగవత్కీర్తనముగాని, తత్కథాశ్రవణంబుగాని, తన్నుతిగాని, తన్న
మస్కారముగాని ఏదిచేసినను జాలు అందొక్కటియేని చేయనేరనివాఁడు
నేనే శరణమని నిశ్చయించుకొని నన్నాశ్రయించి యింద్రియనియతిగలిగి వివే
కియై ఫలాభిసంధిమాని వానికర్మంబు లాచరింపవలయును 11

(సగుణబ్రహ్మధ్యానము ప్రధానము, అందులకుఁ జాలనివారు భగవ
త్ప్రతిమాలంబనంబున, ధ్యానాభ్యాసము చేయవలసినది, అందులకుఁ జాలని
వారు భగవదర్థకర్మానుష్ఠాన మొనర్పవలయును, అందులకుఁగూడ నోపనివా
రు సర్వకర్మఫలత్యాగ మొనర్పవలసినది కర్మఫలత్యాగమును గడపటఁ
జెప్పుటవలన నది యధమమైనదని భావింపవలదు)

జ్ఞానార్థము శ్రవణాభ్యాసము మొదటఁ జేయవలయును శ్రవణా
భ్యాసముచేసి చాలించుటవలన ఫలములేదు, విన్నదానినిగూర్చి యాత్మనిశ్చ
యము గావలయును. దీనినే జ్ఞానమందురు ఆత్మనిశ్చయరూపమైన యా

జ్ఞానము కలిగినంతనే చాలదు దానినిగూర్చి ధ్యానమొనర్చి యనుభవవేద్య మొనర్పవలయును కావున శ్రవణాభ్యాసమునకన్న ఆత్మనిశ్చయరూప జ్ఞానము మేలు, అట్టిజ్ఞానమునకన్న ధ్యానము మేలు ఈశ్రవణమననిది ధ్యాసంబు లొనర్పలేనివారు కర్మఫలత్యాగముచేయుట మేలు ఇట్టి త్యాగా నంతరము అవ్యవధానముగా సంసార శాంతిరూపమైన ముక్తికలుగును 12

(కర్మఫలత్యాగము వివేకపూర్వకమనియు అవివేకపూర్వకమనియు రెండువిధ. ఎ. వివేకపూర్వక కర్మఫలత్యాగము సర్వకామత్యాగమగును గావున దాన వెనువెంబడె మోక్షము కలుగుట న్యాయము అవివేకపూర్వక కర్మఫలత్యాగమునకుగూడ మోక్షమెట్లుగాని శంకింపవచ్చును ఇట్టిదాని ఫలనుగూడ మోక్షమగుననుట స్తోత్రార్థకమనియు, బ్రాహ్మణులు అగస్త్య మహర్షులంతనే వారెట్లు అగస్త్యమహర్షులుగారో యట్లే దీనిభావమనియు గ్రహింపవలయును )

ముముక్షువులు సగుణబ్రహ్మనిష్ఠ ననుష్ఠించుచు రాంగా నీశ్వరానుగ్ర హంబున వారికి నిర్గుణనిష్ఠ సిద్ధించునని చెప్పితిని నిర్గుణోపాస ననుష్ఠించి కృత కృత్యులైనవారి లక్షణభూత ధర్మంబులు చెప్పెద వినుము.

భూతములు ప్రతికూలంబులని అప్రతికూలంబులని రెండువిధములు అప్రతికూల భూతంబులు తత్త్వబుభుత్సగలవని తత్త్వబుభుత్స లేనివని మఱలరెం డు విధంబులు నిర్గుణోపాసంజేసి కృతకృత్యులైనవారు ప్రతికూలభూతంబుల యెడ ద్వేషబుద్ధిలేక, అప్రతికూలతత్త్వబుభుత్సా సహిత భూతంబులయెడ హితోపదేశపూర్వకమైత్రియు, అప్రతికూల తత్త్వబుభుత్సారహిత సంసార దుఃఖమగ్న భూతంబులయెడ కరుణయు గలిగి యుందురు ప్రతికూల భూతంబులవలన దేహబాధగలుగుననియు, అట్లువిబాధించుచున్నను వారియెడ ద్వేషభావములేకుండుట యెట్లనియు శంకింపవచ్చును వారు నిర్మములు అ నగా దేహాదులందు మమకారము లేనివారై యుందురు మమకారమున్నవో బాధానుస్మరణముండును మమకారములేనందున వారికట్టి స్మరణముండదు, స్మరణములేనందున ద్వేషకారణముగలుగదు మమకారమేలయుండదందు వా ? వారు నిరహంకారులు అహంకారమున్నగదా మమకారముండును

శరీరమున్నంతకాలము సుఖదుఃఖములు తప్పవనియు, సుఖ దుఃఖములు తప్పనంతకాలము రాగద్వేషములుండక మానవనియు శంకింతువా ? శరీరమున్నంతకాలము సుఖ దుఃఖములుండుననుట నిర్వివాదాంశము. అయినను సుఖ దుఃఖంబుల తత్త్వంబును జక్కగా గ్రహింతువేని యిట్లు వచింపవు. సుఖ దుఃఖముల స్ఫురణ మెప్పుడు గలుగును ? మనస్సు ఇంద్రియపరవశమై యున్నప్పుడుగదా యనిస్ఫురించును. మనోలయమైనప్పుడీస్ఫురణమునకు నవకాశమేమి గలదు ? వారు సమాధిలో నుందురు గావున వారి మనస్సు లయించియుండును, ఆ కారణంబున వారికి సుఖదుఃఖ స్ఫురణముండదు. దానంజేసి వారికి రాగద్వేషంబులకు నవకాశములేదు. సమాధ్యవస్థలోఁ గాకున్నను వ్యుత్థానావస్థలో వారికి మనోలయము గాదు గావున సుఖదుఃఖంబుల స్ఫురణముండుననియు దానంజేసి వారికి రాగద్వేషంబులు తప్పవనియు శంకింతువా ? వ్యుత్థానావస్థలో సుఖదుఃఖంబుల భాసమాత్రముండినను నిద్రలోనికలను మేల్కాంచినప్పుడు మిథ్యలని గ్రహించి వానికై హర్షవిషాదము లెట్లు బొందరో యట్లే వ్యుత్థానావస్థలో భాసమాత్రములై యుండు సుఖదుఃఖంబులఁగూడ మిథ్యలని గ్రహించి వానికై హర్షవిషాదంబులందరు. ఇట్లు సుఖదుఃఖంబులయెడ సమభావ మెప్పుడుండునో యప్పుడే క్షమగలుగును. క్షమయనఁగా నిందాస్తుతులకు వికారముచెందకుంట 13 మఱియు వారు శరీరస్థితికై యన్నపానాదులు దొరికినను దొరకకున్నను ఆతలంపేలేక సంతుష్టులై యుందురు ఏలయందువా ? వారు యోగులు అనఁగా స్వాత్మానుసంధానశీలురై నిరతిశయానందంబుతో నిండియుందురు. అట్టియానందంబున మునిఁగియుందురు గావున వారికిఁ దుచ్ఛములైన యన్నపానాదుల స్పృహయుండదు. ఈస్పృహరాహిత్యము వారికెట్లు వచ్చెనందువా ? వారు యతాత్ములు అనఁగా విషయచాపల్యరహితస్వభావముగలవారు. దానంజేసి వారెందునను చలింపక స్థిరనిశ్చయముతోనుందురు. ఆ కారణంబున వారు తుచ్ఛవైషయికానందంబు లభిలషింపక మనోబుద్ధులను పరబ్రహ్మమునైన నా కర్పించి అనఁగా నిష్కాములై యుందురు. ఇట్టి నాభక్తుండు అనఁగా అక్షరబ్రహ్మమునకు జ్ఞానరూపభజనంబొనర్చునట్టి నిర్గుణనిష్ఠుండు సగుణోపాసకున్నఁ బ్రియుండు 'ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః' అని యేడవ యధ్యాయములో

కేను చెప్పినదాని కిదే భావము. 14 నిర్గుణనిష్ఠులకు హర్షము అమర్షము భయము ఉద్వేగము గలుగవు. ఇష్టలాభోత్సాహము హర్షము; అపహానము అమర్షము, వ్యాకులము ఉద్వేగము ఈగుణములున్నప్పుడు పరాధిక్షేపాసక్తుండును అందువలన లోకులకు సంతాపము గలుగును, సంతప్తులైన లోకులు ప్రతిసంతాపంబుఁ గలిగింతురు హర్షాదులు లేమిం జేసి నిర్గుణనిష్ఠులు లోకులజోలికిఁబోరు, లోకులును వారిజోలికిరారు. ఎవఁడేని దుష్టుఁడు నిష్కారణంబుగా బాధగలిగించినను నిర్గుణనిష్ఠులచిత్తము వికారరహితమై యుండును గావున వారట్టి బాధకు లోనగరు నిర్గుణనిష్ఠుఁడు హర్షాదులను బుద్ధిపూర్వకముగాఁ ద్యజింపవాయని యడుగవచ్చును అతఁడు అద్వితీయబ్రహ్మస్వరూపుఁడగు క్షణంబుననే హర్షాదులు తమకై తామే దిగజారిపోవును, ప్రయత్నమే యవసరములేదు ఇట్టివాఁడు నాకెంతయుఁ బ్రియుఁడు 15 మఱియు నిర్గుణనిష్ఠునకుఁ గర్మఫలాపేక్ష గలుగదు. ప్రత్యవాయ పరిహారార్థమేని వానికిఁ గర్మానుష్ఠానము వలదాయనిన వదియు లేదు ఏలయందువా? అశుచియైనఁ బ్రత్యవాయముండును నిర్గుణనిష్ఠుఁడన్నచో శుచి అనఁగా పరమపావన జ్ఞానసంపన్నుఁడు 'నహిజ్ఞానేన సదృశం పవిత్రమ్' అని చెప్పియేయున్నాను అట్టి జ్ఞానపవిత్రునకు ప్రత్యవాయశంకయే గలుగదు. కర్మఫలములగు స్వర్గాద్యానందంబులు వానికి దూరమేగదా యందువా? అతఁడు దక్షుఁడు అనఁగా స్వర్గాది సర్వానందభూతమైన నిరతిశయ బ్రహ్మానందంబును గ్రోలు నిపుణుఁడు బ్రహ్మానందంబుఁ జవిఁగొన్నవాఁడు స్వర్గాది తుచ్ఛానందంబుల స్మరింపనైన స్మరించునా?

*సీ॥ మందారమకరంద మాధుర్యమునఁ గ్రోలు మధుపంబు వోవునే మదనములకు,
నిర్మలమందాకినీ వీచికలనూఁగు రాయంచచనునే తరంగిణులకు,
లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిలచేరునే కుటజములకుఁ,
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరక మరుగునే సాంద్రనీహారములకు
గీ॥ అంబుజోదర దివ్యపాదారవింద, చింతనామృతపానవిశేషమత్త,
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు, వినుతగుణశీల! మాటలు వేయునేల?।
అను భాగవతపద్య మీ భావంబునే వెల్లడించును

ఇతరకర్మంబులు వదలినను క్షున్నిమిత్తము భిక్షాటనాది కర్మమేనియుం దప్పదుగదాయని శంకింపవచ్చును. నిర్గుణబ్రహ్మనిష్ఠుఁడు ఉదాసీనుఁడు అనఁగాఁ గర్తృత్వశూన్యుఁడు, కావున నతఁడు భిక్షాటనాది కర్మంబులొనర్చినను గర్తృత్వభావము లేమింజేసి యవి కర్మములుగా నేరవు. మఱియు నుదాసీనుఁడగుటంజేసి యతఁడొనర్చు భిక్షాటనాది కర్మంబులకు ఫలభూతమైన అన్నపానాదులు లభింపకున్నను దన్నిమిత్తవ్యథ వానికిఁ గలుగదు.

మఱియుఁ బ్రియముగలిగినప్పుడు సంతోషము, అప్రియముగల్గినప్పుడు ద్వేషము, ప్రియమైనది నశించినప్పుడు శోకంబు, అప్రాప్తప్రియంబునకై కాంక్ష—ఇవిలేకుండుట ఉదాసీనత్వమగును. ఇట్టివి వానికిఁ గలుగవు గావున ఇది విహితము ఇది నిషిద్ధము అనుభావమే వానికుండదు. ఇట్టిభక్తుఁడు నాకుఁ బ్రియుఁడు 17 వైకారణంబున హితాహితంబులు మానావమానంబులు శీతోష్ణంబులు సుఖదుఃఖంబులు సమానంబుగా నతఁడు భావించును. 'సమదుఃఖసుఖః' అనుదానికిది వివరము. ఎప్పుడు సుఖదుఃఖంబులందు సమానభావముండునో యప్పుడు దేనియందు నెట్టియాసక్తి యుండదు 18 మఱియు నిర్గుణనిష్ఠుఁడు మౌనము వహించియుండును. ఏనిష్ఠునకైనను జీవమున్నంతకాలము శరీరపోషణంబు తప్పదనియు, శరీరపోషణార్థము వాగ్వ్యాపారము గూడ లేనిచో జీవయాత్ర యెట్లుజరుగుననియు శంకింపవచ్చును. నిర్గుణనిష్ఠుఁడు శరీరపోషణార్థము స్వయముగా నెట్టి యత్నముచేయఁడు. బలవత్ప్రారబ్ధవశంబున నేది ప్రాప్తించునో దానితోడనే జీవయాత్ర జరుగుచుండును; ఉన్నంతతోన సంతసించును. వానికి ఒకచోట నియతనివాసముండదు; మనస్సు స్థిరముగానుండును, నాభక్తి యెడబాయదు. ఇట్టివాఁడు నాకుఁ బ్రియుఁడు 19

భక్తిభక్తి అని సారెసారెకుఁ జెప్పుటేలయందువా? భక్తియే ముక్తికి ముఖ్యసాధనము గావున ఆసంగతి నీయెడ గాఢముగా నాటుటకై మఱిమఱి చెప్పుట.

ద్వేషములేకుండుట, సర్వభూతంబులయెడ మైత్రికరుణలు గలిగియుండుట, అహంకార మమకారంబులు లేకుండుట, సుఖదుఃఖంబులయెడ సమ

బుద్ధి గలిగియుండుట, ఓర్పు, సంతుష్టి, స్వాత్మానుసంధానము, విజితేంద్రియత్వము, స్థిరనిశ్చయము, అహింస, అపేక్షలేకుండుట, శుచిత్వము, దక్షత, సర్వారంభపరిత్యాగము, ఉదాసీనత్వము, వ్యథారాహిత్యము, అలంబుద్ధి, ఒకచోటనెడి నియతిలేకుండుట, నిర్వ్యాజభక్తి—ఇవియెల్ల ముముక్షువుల ధర్మంబులు. మోక్షేచ్ఛగలవారు వీనిని సాధింపవలయును ఈలక్షణంబులే స్థితప్రజ్ఞునకుఁగూడ రెండవ యధ్యాయములోఁ జెప్పఁబడినవి గావున ముముక్షువునకు స్థితప్రజ్ఞునకు భేదమేమని శంకింపవచ్చును జీవన్ముక్తుఁడైన స్థితప్రజ్ఞునకీ లక్షణంబులు స్వాభావికములైయుండును, ముముక్షువునందు సాధనరూపంబునుండును వారియుభయులకుఁగల భేదమిదియని గ్రహింపవలయును. నిర్గుణనిష్ఠుఁడు స్థితప్రజ్ఞుఁడు గాఁడాయని శంకింపవచ్చును అతఁడింకను సాధనావస్థలోనే యున్నాఁడు అది పరిపక్వమైనప్పుడు స్థితప్రజ్ఞుఁడగునని యెఱుంగునది స్థితప్రజ్ఞుడెల్ల నిష్ఠలుదాఁటి బ్రహ్మాత్మైక్యము నొందియుండును.

ముముక్షువులు శ్రద్ధావంతులై నాయందే చిత్తమునిల్పి యథోక్తముగా సగుణబ్రహ్మనిష్ఠారూపమైన ధర్మంబు నాచరించినచో అదియే క్రమక్రమంబుగా నిర్గుణనిష్ఠగాఁ బరిణమించి అమృతత్వసాధనమగున జ్ఞానరూపము అక్షరబ్రహ్మాత్మకమునైన నాభజనంబుఁ జేయునట్టి యట్టిభక్తులు నాకు మిక్కిలి ప్రియులు 20

మధ్యమషట్కము అనఁగా తత్పదార్థానుసంధానము ముక్తిహేతువని 7 మొదలు 12 అధ్యాయముల సిద్ధాంతము.

# గీతాహృదయము.

## పదమూడవ యధ్యాయము.

---

'తత్త్వమసి' అను మహావాక్యమందలి తత్పదార్థము అనఁగా బరమాత్మ యెట్టిదో మొదటి యాఱధ్యాయంబులలోఁ జెప్పఁబడినది, 'త్వం' పదార్థము అనఁగా జీవాత్మయెట్టిదో నడిమి యాఱధ్యాయంబులలోఁ జెప్పఁబడినవి పరమాత్మ జీవాత్మ యెట్లగునో కడపటి యాఱధ్యాయంబులలోఁ జెప్పఁబడు చున్నది.

పదురెండవ యధ్యాయములో 'అట్టి భక్తులను మృత్యురూపసంసార సాగరంబునుండి యుద్ధరింతు'నని 7-వ శ్లోకములో శ్రీభగవానుఁడు ప్రతిజ్ఞ గావించియున్నాఁడు ఈసంసారోత్తరణంబునకు జీవబ్రహ్మైక్యజ్ఞానము అనఁగా జీవమే బ్రహ్మమనెడి జ్ఞానము ముఖ్యహేతువుగానున్నది. జీవుఁడన్ననో కర్తృత్వభోక్తృత్వాదులతోఁగూడి అనఁగా నేను చేయుచున్నాను, నేను అనుభవించుచున్నాను అనునట్టి యభిమానము గలిగియున్నాఁడు బ్రహ్మమన్ననో కర్తగాఁడు, భోక్తగాఁడు ఇట్లు పరస్పరవిరుద్ధ స్వభావముగల జీవునకు బ్రహ్మమునకు అభేదమెట్లనెడి శంకగలుగుచు కర్తృత్వాదులు క్షేత్రధర్మములనియు, క్షేత్రమనఁగా దేహేంద్రియాంతఃకరణాది సంఘాత మనియు, ఈక్షేత్రమునకును ఈక్షేత్రము నధిష్ఠించియుండునిర్వికార శుద్ధచిన్మాత్ర రూపక్షేత్రజ్ఞుఁడైన జీవునకు సంబంధము లేదనియు ముందు వివరించి తర్వాత జీవుఁడే బ్రహ్మమగుట చెప్పఁబడును తన్నిమిత్త మీయధ్యాయ మారంభింపఁబడినది

ఏడవయధ్యాయములో 'భూమి నీరు అగ్ని వాయువు' మున్నగు విషయంబులను జెప్పుచు భూమ్యాదిక్షేత్రరూపమైన ప్రకృతి యొకటి, జీవాఖ్య క్షేత్రరూపమైన ప్రకృతియొకటి—ఇట్లు రెండు ప్రకృతులున్నట్లు చెప్పఁబడినది ఆరెంటికిఁగల పరస్పర తత్త్వవివేచనంబును మొదలు పెట్టుచు శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! ఇంద్రియాంతఃకరణంబుల సంఘాతమై భోగాయతనంబుగా నున్న యీశరీరంబు సంసారమనెడి పైరును బెంచుటకు భూమివంటిది గావున క్షేత్రమనఁబడును. ఈక్షేత్రము 'నాది' అని యెవఁడు భావించుచుండునో యతఁడు క్షేత్రజ్ఞుఁడందురు. క్షేత్రజ్ఞుఁడు కృషీవలుఁడట్టివాఁడు, క్షేత్రము వానిభూమివంటిది. భూమిలోని ఫలంబును గృషీవలుఁడనుభవించునట్లు క్షేత్రసంబంధి కర్మఫలంబును క్షేత్రజ్ఞుఁడనుభవించుచుండును. ఈ సంగతి తెలిసినవారు క్షేత్రక్షేత్రజ్ఞవివేకముగలవారగుదురు.

పైనఁజెప్పినదానింబట్టి క్షేత్రజ్ఞుఁడు దేహేంద్రియాది విలక్షణుఁడని స్పష్టముగదా. ఈక్షేత్రజ్ఞుఁడు బ్రహ్మైక్య స్వరూపుఁడెట్లో వినుము.

అర్జునా! ఈక్షేత్రజ్ఞుని జీవుఁడందురు. ఈ జీవుఁడు నేనేయని యెఱుంగుము. ఒక్కొక్క క్షేత్రమందు నొక్కొక్క జీవుఁడుండుననియు, రాముఁడు భీముఁడుగానట్లు జీవులు వేర్వేఱుగానుందురనియుఁ బరమాత్మ యన్ననో ఏకము అద్వితీయమనియు, పైకారణంబులఁబట్టి జీవబ్రహ్మము లొక్కటేయగుటెట్లనియు శంకింపవచ్చును. రామ భీమాదుల శరీరములే వేఱుగాని యాశరీరములోనున్న జీవులకు భేదములేదు. అన్ని శరీరములలో నుండునది యొక్కఁడే, ఆ యొక్కఁడే నేను. క్షేత్రమనఁగా శరీరమనియు, శరీరాభిమానియే క్షేత్రజ్ఞుఁడనియు, ఆక్షేత్రజ్ఞుఁడనువాఁడు నేనేయనియు గీతాశాస్త్రమందుఁజెప్పఁబడిన జ్ఞానమే తత్త్వజ్ఞానమనియు గీతాచార్యుండను భగవంతుండనైన నాయభిప్రాయము.

క్షేత్రస్వరూపమెట్టిది? దానిధర్మమేమి? దానివికారములెవి? దానియుత్పత్తికిఁ గారణమేమి? దానిప్రభావమేమి? ఈ విషయంబులెల్ల సంగ్రహంబుగాఁజెప్పెదను వినుము. 3 నేను క్రొత్తగాఁ గల్పించి చెప్పుచున్నానని తలంపవలదు. క్షేత్రక్షేత్రజ్ఞుల యాథార్థ్యముం గూర్చి తత్త్వార్థదర్శనులైన ఋషులును, తత్త్వవిన్మూర్ధన్యులు జనకరాజగురువులు బృహదారణ్యకాది కర్తలునైన యాజ్ఞవల్క్యాదులును వివిధధర్మశాస్త్రములందు విస్తరించియున్నారు. అందు ఆత్మస్వరూపంబును నిరూపించుచు 'ఆకాశమొక్కటియయ్యు ఘటంబులందెల్ల వేఱువేఱుగాఁదోఁచునో, సూర్యుఁడొక్క

డయ్యుఁ బెక్కుజలాశయంబులం దెల్లు వేఱువేఱుగాఁ దోఁచు'నో యట్లేయాత్మ యొక్కటయ్యు దేహభేదంబునంజేసి పెక్కుగాఁదోఁచుఁనని తెలిపిరి బుద్ధ్యాదులు క్షేత్రమనియు, వానికీశ్వరుఁడైన యాత్మ క్షేత్రజ్ఞుడనియు విజ్ఞానేశ్వరుఁడు వివరించియున్నాఁడు మనువు తనధర్మశాస్త్రమందు క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వము వర్ణించియున్నాఁడు వసిష్ఠుఁడు తనయోగశాస్త్రమందు 'దేహముజడమనియు, ఆత్మ శుద్ధసంవేదనాకారముఁ జిన్మాత్రమునియు నిరూపించియున్నాఁడు ఇట్లేఋగ్యజుస్సామాథర్వరూపములగు వేదంబులలోఁ గూడనివ్విషయంబు బహుభంగులఁ జెప్పఁబడినది బ్రహ్మసూత్రములందుఁ గూడనిది చెప్పఁబడియున్నది వేదాంతులు బ్రహ్మసూత్రంబులు అసందిగ్ధార్థకంబులు అవి నిశ్చయించిన యర్థంబునే యిప్పుడు నేను నీకుఁ జెప్పుచున్నాను, కావున సావధానంబుగావినుము 4

సాంఖ్యమతప్రకారము తత్త్వము లిరువదినాలుగు ఏవియన—పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచమహాభూతంబులు, అయిదు ఈ పంచమహాభూతంబులకుఁ గారణమైన అహంకారము అహంకారమునకుఁగారణభూతమై జ్ఞానాత్మకముగానుండుచు మహత్తత్త్వమని వ్యవహరింపఁబడు బుద్ధియు, బుద్ధికిఁ గారణభూతమై మూలప్రకృతి యనఁబడునట్టి అవ్యక్తము, బాహ్యములైన జ్ఞానేంద్రియంబు లైదుఁ గర్మేంద్రియంబు లైదు, అంతరింద్రియమైనమనస్సు, ఇంద్రియగోచరంబులగు శబ్దస్పర్శరూప రసగంధంబు లైదు,—మొత్తమున నిరువదినాలుగుతత్త్వములు 5 ఇచ్ఛాద్వేషంబులు, సుఖదుఃఖంబులు, జ్ఞానాత్మకమైమనోవృత్తి రూపంబుననుండు చేతనయు, ధృతి (ధైర్యము)—ఇవన్నియు క్షేత్రధర్మంబులు వికారముతోఁగూడినదానిని క్షేత్రమందురు, పైనఁజెప్పినధర్మంబులకెల్ల వికారముగలదు దానంజేసి యీధర్మంబులకు క్షేత్రత్వము సిద్ధించినది 6

* ఈయిరువదినాలుగుతత్త్వంబులలోఁ బ్రకృతి, మహత్తు, అహంకారము మున్నగువానిని సిద్ధాంత మంగీకరింపదు భగవంతుని మాయాశక్తియే ప్రకృతియనియు, భగవదీక్షణమే మహత్తనియు, సంకల్పమే అహంకారమనియు ఈమహత్త్వాహంకారములు ప్రకృతి సంబంధములనియు సిద్ధాంతులు వచింతురు అయినను వీరిమతప్రకారముగూడ దేహేంద్రియాహంకారంబులు ఆత్మధర్మములుగావు

అహంకారమే యాత్మయనియు, ఆత్మయనునది వేఱొకటి లేదనియు, ఇచ్ఛాద్వేషాదులు అహంకారధర్మంబులనియు, ఆత్మయన్నను అహంకారమన్నను ఒక్కటే గావున అహంకారధర్మములే యాత్మధర్మములగుననియు, కొందఱు వచింతురు. దేనికి వికారముగలదో దానికి నాశము సిద్ధమనుట స్పష్టము అహంకారాదులకు వికారముండుట నిర్వివాదాంశము కావున అహంకారమునకు నాశము స్వతస్సిద్ధము అహంకారమే యాత్మయగునేని ఆత్మకుఁగూడ నాశమున్నట్లు సిద్ధించును ఆత్మ యవినాశియని సాంఖ్యసిద్ధాంతము రెంటిమతము

క్షేత్రస్వరూపమో వివరించితిని క్షేత్రజ్ఞస్వరూపము వివరింపవలసియున్నది క్షేత్రజ్ఞస్వరూపమును వివరించుటకు ముందుగా క్షేత్రజ్ఞతత్త్వజ్ఞానంబునకు సాధనములేవో వచింతు వినుము

అమానిత్వము (ఉన్నట్టి లేనట్టి గుణంబులు తనయందున్నట్లు శ్లాఘించుటవలనఁగలుగు సంమానంబు మానిత్వమనంబడును, అట్టిది లేకుండుట అమానిత్వము), దంభము—తనకు లాభమో పూజయో కలుగవలయునని స్వధర్మంబును ప్రకటించుట, అట్టిది లేకుండుట అదంభత్వము, మనోవాక్కాయంబుల నన్యులకుఁ బీడఁ గలిగించుట హింసయనఁబడు, అట్టిది లేకుండుట అహింస, క్షాంతి—పరులవమానించినను చిత్తవృత్తి వికారమునొందకుండుట, ఆర్జవము—మనోవాక్కాయంబు లేకరూపంబున వర్తించుట, ఆచార్యోపాసనము—గురువును సమీపించి వినయనమస్కారపూర్వకంబుగాఁ దెలియనివిషయ మడుగుట శుశ్రూషించుట, శౌచము—మృజ్జలంబుల బాహ్యశుచియును విషయదోషదర్శనంబున రాగాదులైన యంతర్మలంబును గడిగికొని బహిరంతరంబులందు శుచిగానుండుట, స్థైర్యము—ముక్తిసాధనప్రవృత్తికి విఘ్నము వాటిల్లినప్పుడు నిజప్రయత్నంబును మానక సారెసారెకు వినువడక పట్టుదలతోఁ జాలుపడుట, ఆత్మవినిగ్రహము—దేహేంద్రియాదులకుఁగల మోక్షసాధన ప్రతికూలస్వభావంబును నిరోధించి వాని ననుకూలపఱచుకొనుట, 7 శబ్దస్పర్శరూపాదులైన యింద్రియార్థంబులను జూచినను వినినను వానియెడఁ గోరిక లేకుండుట, అనహంకారము—నేను సర్వోత్కృష్టుననుగర్వము లేకుండుట,

ప్రసూతి చావు ముదిమి జ్వరాదులు అనిష్టసంయోగంబునఁగాని యిష్టవియోగంబునఁగాని గలుగునట్టి యధ్యాత్మికదుఃఖంబులు, వాతపిత్తశ్లేష్మంబులవలనఁ గలుగు మలమూత్రదుర్గంధరూప దోషంబు—వీనింగూర్చి సారెసారెకు నాలోచించుట, 8 అసక్తి—పుత్రాదులందుఁ బ్రీతిలేకుండుట, అనభిష్వంగము—పుత్రాదులకు సుఖముగలిగినప్పుడు తనకు సుఖమబ్బినట్లు వారికి దుఃఖము గలిగినప్పుడు తనకు దుఃఖము సంభవించినట్లు భావించుట సంగమనఁబడును, అట్టిది లేకుండుట, ఇష్టానిష్టము లేవి ప్రాప్తమైనను హర్షవిషాదములు పొందకుండుట, 9 నాయందు అనఁగా నేను వాసుదేవుఁడనైన భగవంతుడనను నిశ్చయంబుతో స్వాత్మభూతుఁడనైన నాయెడ ఏకాంతికభక్తి గలిగియుండుట, పరిశుద్ధముఁ జిత్తప్రసాదజనకంబునైన చోటనుండుట, విషయతత్పరులగు జనులతోడి సహవాసము నిచ్చగింపకుండుట 10 ఆత్మానాత్మ వివేకజ్ఞానముఁగలిగి యుండె నిష్ఠుఁడైయుండుట, తత్త్వజ్ఞాన ఫలాలోచనంబు గలిగియుండుట (అట్లున్నగాని తత్సాధనప్రవృత్తి యుండదని భావము),—ఈ యిరువది క్షేత్రజ్ఞ తత్త్వజ్ఞానంబునకు సాధనంబులు వీనినే జ్ఞానమందురు. ఇందులకు విపరీతములైన మానిత్వాదులు జ్ఞానవిరోధములు, వీనినే యజ్ఞానమందురు కావున అజ్ఞానంబును బరిత్యజించి జ్ఞానంబును బడయనగునని భావము. ఇంక క్షేత్రజ్ఞస్వరూపము వినుము. 11

క్షేత్రజ్ఞస్వరూపము జ్ఞేయమేగాని దృశ్యముగాదు ఏలయందువా? వానికి రూపములేదు, రూపమున్నఁగదా కంటికి గోచరించుట కంటికి గోచరింపనిదాని నెఱుంగుటెట్లందువా? అసంగతియే చెప్పనున్నాను అది తెలిసికొందువేని మోక్షంబును బడయుదువు పరబ్రహ్మస్వరూపమే క్షేత్రజ్ఞస్వరూపము బ్రహ్మమునకెట్లు జననవికారములులేవో క్షేత్రజ్ఞునకుఁగూడ నట్లే జననవికారములు లేవు జననవికారంబులుగలది దృశ్యమగును, దృశ్యము తప్పక నశ్యము, నశ్యము క్షేత్రమగును, కావున క్షేత్రజ్ఞుఁడు జననవికారరహితుఁడని యెఱుంగుము బ్రహ్మాతిరిక్తంబునకెల్ల జననవికారంబులు గలవు గావునను జననవికారములులేనిది బ్రహ్మమొక్కటే గావునను క్షేత్రజ్ఞుఁడు బ్రహ్మమేయగును క్షేత్రజ్ఞుని జీవుఁడనుటయుఁ గలదు పైకారణంబులవలన జీవబ్రహ్మములకు అభేదము సిద్ధము ఈ బ్రహ్మము అనాదియు సగుణబ్రహ్మను

నైన సాకన్నంబరముండుగా నున్నాఁడు అనగా సగుణబ్రహ్మము సవిశేషమనియు నిర్గుణబ్రహ్మము నిర్విశేషమనియు జీవుఁడును నిర్విశేషనిర్గుణబ్రహ్మమేయనియు భావము ఈక్షేత్రజ్ఞుఁడు సత్తు అనిగాని అసత్తుఅనిగాని చెప్పఁదరముగాదు విధిముఖంబునఁ బ్రమాణవిషయమగునది సత్తు అనఁబడును నిషేధముఖంబునఁ బ్రమాణవిషయమగునది అసత్తు అన బడును మనస్సునకు అందినవిషయంబున విధినిషేధప్రమాణంబు లుపయోగించును క్షేత్రజ్ఞుఁడు మనస్సునకు నందనివాఁడు గావున నిట్టిప్రమాణంబు లతని విషయంబున నుపయోగింపవు మనస్సునకు అందనందున ఇదియనిగానీ యిది కాదనిగాని చెప్పఁదరముగాదు కావుననె 'యతోవాచోనివర్తంతే అప్రాప్య మనసాసహ' అని శ్రుతి వచించుచున్నది క్షేత్రజ్ఞుఁ డిట్లు నిర్విశేష స్వప్రకాశ చైతన్యరూపుఁడు గావున విధినిషేధప్రమాణంబులకు నతీతుఁడై సత్తు అనుటకు అసత్తు అనుటకు సాధ్యముగానివాఁడుగా నున్నాఁడు. మనస్సునకు వాక్కునకు నందనివాని నెట్లు చెప్పెదవు? 12 కరచరణంబులు నయనశిరోముఖశ్రవణంబులుగల యీశరీరమును వ్యాపించి యీయవయవముల వ్యవహారంబునకు నాస్పదరూపంబున నేదియున్నదో దాని సన్నిధానమహిమంబున నివి తమతమవ్యాపారంబులు సాగించుచున్నవో యదే క్షేత్రజ్ఞుఁడని యెఱుంగుము అనఁగా కరచరణాదులు జడములు గావున వానికి స్వతంత్రవ్యాపారము గలుగదు, జడములను వ్యాపారపరము లొనర్చునది యొకటియుండి తీఱవలయును అదే క్షేత్రజ్ఞుఁడని గ్రహింపుము 13 క్షేత్రజ్ఞుఁడే బ్రహ్మమనియు బ్రహ్మము నిర్విశేషమనియు జెప్పితిని నిర్విశేషుఁడెట్లు పాణిపాదాది సర్వవ్యవహారాస్పదుఁడగునని శంకింపవచ్చును శ్రవణవచనాది వ్యాపారంబులు జ్ఞానకర్మేంద్రియంబుల ధర్మములు అయినను వానిని క్షేత్రజ్ఞుని వ్యవహారములందురు, అంతియగాని నిజము విచారించినచో నతనికెట్టి వ్యవహారములేదు ఏలయనఁగా? అతఁడు అసక్తుఁడు అనఁగా ఎట్టిసంబంధము లేనివాఁడు అట్లుండియు క్షేత్రజ్ఞుఁడు సర్వాధారభూతుఁడై యుండును మఱియుఁ బరమార్థము విచారించినచో క్షేత్రజ్ఞుఁడు నిర్గుణుఁడయ్యు సత్త్వాదిగుణపాలకుఁడు గానుండును 14 కటకాది రూపంబుల లోపలవెలుపల సువర్ణమెట్లుండునో, యట్లే చరాచరములైన సర్వభూతముల

లోపలను వెలుపలను క్షేత్రజ్ఞుఁడుండును అనఁగా చరాచరాత్మకమైన జగ
త్తు సర్వము అతఁడుగానే యున్నాఁడు. అట్లుండియు రూపములేదు గా
వున వానిని నెఱుంగరాదు, అనఁగా ఇది యిట్టిదను విస్పష్టజ్ఞానంబునకు సర్హా
ముగాదు అందువలననే జ్ఞానులుగానివారికి క్షేత్రజ్ఞుఁడైన బ్రహ్మము యో
జనకోటిదూరంబున నెందో యున్నట్లు తోఁచును విశేషులకన్ననో క్షేత్ర
జ్ఞుఁడు స్వాత్మయే గావున నిత్యసన్నిహితుఁడట్లు స్పష్టముగా నుండును 15
భూతంబుల శరీరంబులు వేర్వేఱుగా నుండుటం జేసియుఁ బ్రతిశరీరమునందు
నొక్కొక్క క్షేత్రజ్ఞుఁడుండుటంబట్టియు క్షేత్రజ్ఞునకు సర్వాత్మకత్వ మెట్లు
వచ్చునని శంకింపవచ్చును శరీరములు వేఱనుట నిర్వివాదాంశము, అయిసను
శరీరమే క్షేత్రజ్ఞుఁడనెడి భ్రాంతివలన నొక్కొక్క శరీరమందు నొక్కొక్క
క్షేత్రజ్ఞుఁడుండునట్లు భావింతురుగాని యది సత్యముగాదు సూర్యుఁడొక్కఁ
డయ్యుఁ బెక్కు జలాశయములందు వేఱువేఱుగాఁ దోఁచునట్లు క్షేత్రజ్ఞుఁ డొ
క్కఁడయ్యు ఉపాధిభేదంబున దానుగూడ విభక్తుఁడట్లు భావింపఁబడు
చున్నాఁడు ఎల్లదేహములందునుండునది యొక్కయాత్మయేయైనను అంతమా
త్రాననే ఆత్మకు బ్రహ్మత్వము వచ్చునాయనియు, బ్రహ్మత్వము గలిగనేని
బ్రహ్మమువలె నాత్మయు జగత్సృష్టిస్థితిలయంబులకుఁ గారణభూతము కా
వలదాయనియు శంకింపవచ్చును జగత్సృష్టిస్థితిలయకారణత్వము జీవేశ్వ
రానుగతమైన శుద్ధచిన్మాత్రరూప నిర్విశేష బ్రహ్మమునకు మాత్రము చెప్పఁ
బడినదిగాని పరిచ్ఛిన్నశరీరాధిష్ఠితమైన యాత్మకుఁ జెప్పఁబడదు తాపశక్తి
సూర్యబింబమునకు గలదుగాని ఘటాది ప్రతిబింబిత సూర్యబింబంబునకుఁ గల
దా ? 16 బ్రహ్మధర్మంబులు క్షేత్రజ్ఞునకుఁ గలవాయని యందువేని కల
వని దృఢముగాఁ జెప్పవచ్చును బ్రహ్మధర్మంబులలోఁ బ్రధానమైనది ప్ర
కాశకత్వము క్షేత్రజ్ఞుఁడు ఆదిత్యాదులకుఁగూడ ప్రకాశము గలిగించు
చున్నాఁడు గావున వానికట్టి ధర్మములుండుట స్పష్టము క్షేత్రజ్ఞుఁడనెడి ఈ
యాత్మ యజ్ఞానంబునకు నందదు, జ్ఞానముజ్ఞేయము సర్వము నదియే ఎల్ల
ప్రాణుల హృదయమునం దడియుండను. హృదయమందుండుదానినిఁ బ్రాణు
లెల్లరు నేల యెఱుంగరందువా ? పైనఁజెప్పిన అమానిత్వాది జ్ఞానసాధనసంపత్తి
గలవారి కిదిగోచరించుచుండును తదితరులకు గోచరింపదు ఏలయందువా ?

అది జ్ఞానమాత్రగమ్యము, దానినెఱుంగ నన్యసాధనంబు లుపయోగింపవు. 17
5-6 శ్లోకములలో క్షేత్రమునుగూర్చియు, 7 మొదలు 11-వ శ్లోకమువఱకు జ్ఞానమునుగూర్చియు 12 మొదలు 17-వ శ్లోకమువఱకు జ్ఞేయమునుగూర్చియు సంగ్రహంబుగాఁ దెలిపితిని. ఇదియే సర్వవేదార్థము, గీతాశాస్త్రార్థము ఇది యెఱుంగుటకు నాభక్తులుమాత్రమే యధికారులు వారిది యెఱింగి బ్రహ్మత్వంబునకు యోగ్యులగుచున్నారు

ఇంతదనుక క్షేత్రస్వరూపము క్షేత్రధర్మము చెప్పఁబడినవి. ఇఁక 'దాని వికారమేమి ? దానియుత్పత్తి కారణమేమి ?' అను ప్రశ్నలకు సమాధానము వినుము.

అపరాప్రకృతి పరాప్రకృతి అని ప్రకృతులు రెండు గలవనియు, అందు అపరాప్రకృతి త్రిగుణాత్మకగా బరమేశ్వర మాయాశక్తిగా క్షేత్రరూపము గానుండుననియు, క్షేత్రజ్ఞుఁడని చెప్పఁబడునదే పరాప్రకృతియనియు 7-వ అధ్యాయములోఁ దెలిపితిని ఈఅపరాపరాప్రకృతులనే ప్రకృతి పురుషులనిగూడ చెప్పుదురు ఈప్రకృతి పురుషుల రెంటిని అనాదియందురు. అనాది యనఁగా ఆదికారణము తెలియరానిదని యర్థము ప్రకృతి అనాది యగుటవలననే దానికి జగత్కారణత్వము యుక్తము పంచమహాభూతంబులు ఏకాదశేంద్రియంబులును కలసి యగు పదునాఱు వికారంబులను, సత్త్వరజస్తమోగుణంబులను సుఖదుఃఖమోహంబులను ప్రకృతికారణకంబులని గ్రహింపుము. 19 కార్యమైన శరీరము కారణములైన యింద్రియములు వీనికి ఆకారముగలుగుటకుఁ బ్రకృతియే కారణము, అనఁగా శరీరేంద్రియంబులు ప్రకృతి పరిణామంబులని భావము ప్రకృతిప్రభావమేమో వినుము అపరాప్రకృతిపరిణామమైన శరీరమందుఁజేరి పరాప్రకృతి యగుపురుషుఁడు సుఖదుఃఖంబు లనుభవించుచున్నాడు పురుషుఁడు నిర్వికారపరబ్రహ్మాత్మకమని 17-వ శ్లోకములోఁ జెప్పితిని అట్టివానికి సుఖదుఃఖభోక్తృత్వరూపమైన సంసార మెట్లువచ్చెనని శంకింపవచ్చును 20

పురుషుడు నిజముగా అసంగుఁడు, అందువలన వానికి సుఖదుఃఖభోక్తృత్వరూపమైన సంసారమేలేదు అయినను అపరాప్రకృతిపరిణామ

భూతమైన దేహము తానే అనెడి అధ్యాసవలనఁ బ్రకృతిసంబంధసుఖదుఃఖ మోహాదిగుణంబుల నతఁడనుభవించుచున్నాఁడు అందువలననే వానికి సుఖ దుఃఖమోహహేతువులైన దేవయోని జన్మంబులు పశ్వాది యోనిజన్మంబులు ధర్మాధర్మమిశ్రములైన మనుష్య యోనిజన్మంబులును, సత్త్వరజస్తమోగుణాత్మకంబులును బ్రకృతిమయంబులునైన దేహతాదాత్మ్యాధ్యాసరూపసంబంధంబులు గలుగుచున్నవి. అధ్యాసవలన నిట్లు గలుగుచున్నదని భావము 21

ప్రకృతిపరిణామమైన యీశరీరంబునందు నుండు పురుషుఁడు ప్రకృతికి భిన్నుఁడు' అనఁగా ప్రకృతిగుణబద్ధుఁడుగాఁడు, అనఁగా పురుషుఁడు సంసారిగాఁడని భావము శరీరమునందుండియు దద్గుణబద్ధుఁడు గాకుండుటెట్లని శంకింపవచ్చును ఋత్విక్కులు యజమానులు మున్నగువారు యజ్ఞకార్యపరులై యుండఁగా వారిచెంతఁ గూర్చుండి వారికార్యములందలి గుణదోషంబులఁ బరికించుచుండు యజ్ఞవిద్యాకుశలుఁడెట్లు యజ్ఞకార్యపరుఁడు కాఁడో యట్లే పురుషుఁడుగూడ కార్యకారణ వ్యాపారంబులను విలక్షణుఁడై చూచుచుండును. అనఁగా ఉపద్రష్టయైయుండును అందువలనఁ బ్రకృతిగుణబద్ధుఁడుగాఁడు కార్యకారణప్రవృత్తులందుఁ దనకెట్టి జోక్యము లేకున్నను సమీపంబుననున్నందునఁ దత్ప్రవృత్తులకు ననుకూలుఁ డట్లు భావింపఁబడును, అనఁగా అనుమంత యగుచున్నాఁడు ఈపురుషుని సాన్నిధ్యంబున దేహేంద్రియాదులకు సత్తాస్ఫురణము గలుగుచున్నందున నతఁడు భర్తయనియు, సుఖదుఃఖాదిరూపబుద్ధి వృత్తులను దెలిసికొనుచుండుటం జేసి భోక్తయనియు, సమస్తభూతంబులకు నధిపతి గావున మహేశ్వరుండనియుఁ బరమాత్మయనియుఁ జెప్పఁబడును 22

ఈపురుషుని దెలియుటవలన ఫలమేమని యడుగవచ్చును ఈపురుషసాక్షాత్కారంబునఁ బ్రకృతి తద్వికారంబులు మిథ్యాభూతంబులని తెలియును. ఇట్టి జ్ఞానముగలవాఁడు ఒకవేళ ప్రారబ్ధకర్మవశంబున విధి నతిక్రమించి వర్తించినను మఱల జనింపఁడు. ఏలయందువా? జననమునకు అవిద్య కారణము, అట్టి యవిద్య వీనియందు నశించినది, అందువలన జననకారణము గలుగదు 23

ఆత్మజ్ఞానము గలిగినను అధికారితారతమ్యంబులనుబట్టి ఆత్మసాక్షాత్కారవిషయంబున సాధనభేదములు గలవు. అవి వివరింతు వినుము.

ఉత్తమాధికారులు ధ్యానయోగము ననుష్ఠించి ఆత్మసాక్షాత్కారంబును బడయుదురు. ఏధ్యేయమునందు మనస్సు తగులునో యదితప్ప మఱియొకటి తలంపకుండుటయు మనోవృత్తిప్రవాహమువలె నెడతెగక నిరంతర మాధ్యేయమువంకనే ప్రవహించుచుండుటయు ధ్యానమనఁబడును. ఈధ్యానము శ్రవణమననంబులకు ఫలభూతమగుటచేసి దీనిని నిదిధ్యాసమందురు. మధ్యమాధికారులు శ్రవణమననరూపమైన యాత్మచింతన మనుష్ఠింతురు, వారు నిదిధ్యాసము చేయఁజాలరు. అయినను శ్రవణమననంబులవలన వారికిఁ గ్రమంబుగా నిదిధ్యాసము సిద్ధించును. అది సిద్ధించినంతనే యాత్మసాక్షాత్కారమగును. మందాధికారులు పరమేశ్వరార్పణమైన నిష్కామకర్మము ననుష్ఠించి చిత్తశుద్ధినిఁ బడసి క్రమక్రమంబుగా శ్రవణమనననిదిధ్యాసంబుల నలవఱచుకొని తుట్టతుదకు నాత్మసాక్షాత్కారమొందుదురు. 24

అతిమందులు పైనఁజెప్పిన యుపాయంబులలో దేనినిగూడ ననుష్ఠింపఁజాలరు గావున, గురువుపదేశించు వాక్యంబును శ్రద్ధతో స్మరించుచుఁ గాలక్రమంబున శ్రవణమనననిదిధ్యాసలకు యోగ్యతఁబడసి తుదకు నాత్మసాక్షాత్కారమొందుదురు. 25

అర్జునా! స్థావరముగానీ జంగమముగానీ క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగంబునఁ బుట్టుచున్నవి. సత్యానృతంబుల కూడికవలె వీనిసంయోగంబుగూడ పరస్పరావివేకంబువలనఁదాదాత్మ్యాధ్యాసముగానుండును. ఈయధ్యాసమువలననే సర్వకారణజాతము గలుగుచున్నదనియు, సంసారము స్వరూపాజ్ఞాననిబంధనముగాని వేఱుగాదనియు, అజ్ఞానము నశించినంతనే తత్ఫలమైన సంసారముగూడ నశించుననియు, అజ్ఞానము తత్త్వజ్ఞానంబున నశించుననియు గ్రహింపుము 26

సురామాత్రగంగోదకంబులందన్నిటను సూర్యబింబమట్లు దేవతిర్యఙ్నరాది విచిత్రదేహభిన్న సర్వప్రాణులందు నేకరూపంబున నుండునట్టియు, భూతవికారంబులు నశించినను దాను నశింపకుండునట్టియు, 'ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో మానుషీం తనుమ్' ఇత్యాది ప్రమాణసహస్ర సంప్రతిపన్న పరబ్రహ్మభావమైనట్టియు క్షేత్రజ్ఞు నెవఁడు సందర్శించునో వాఁడే తత్త్వవేత్త

యగును క్షేత్రజ్ఞుఁడైన యాత్మనుదర్శించినంతనే ఇష్టానిష్టప్రాప్తి సర్వము పరిహృతమగును. క్షేత్రజ్ఞుఁడు నిరాకారుఁడు గావున తద్దర్శనము సాకారవస్తుదర్శనమువంటిది అనఁగాఁ గంటికి గోచరించునది కాదనియు, అది కేవలము అనుభవైకరూపంబున నుండుననియు గ్రహింపవలయును 27

జననము మున్నగు షడ్భావవికారములు లేనివాఁడు ఈశ్వరుఁడునైన పరబ్రహ్మము సర్వభూతములందు సముఁడై యున్నాఁడని యెవఁడు తెలిసికొనునో యతఁడు జననమరణరూపమైన సంసారవిమోచనముఁ గాంచును సంసారమెప్పుడు తొలఁగునో యప్పుడే మోక్షసిద్ధియగును ఈసంగతి తెలిసికొననివాఁడు ఆత్మహంతయగును 28

ఈశ్వరుఁడు సర్వభూతములందు సముఁడై యుండునంటినిగదా సముఁడైనవాఁడు కొందఱకు శుభముఁ గొందఱకు అశుభము చేయునాయనియు, ఈ శుభాశుభంబుల నీశ్వరుఁడు గలిగింపకున్నచో వానికిఁ గారణమేమనియు శంకింపవచ్చును

ప్రకృతి యనఁగా మాయ, దానినే యవిద్యయనిగూడనందురు ఈ ప్రకృతి అనఁగా పూర్వోక్తమైన అపరాప్రకృతి దేహేంద్రియాది రూపముగాఁ బరిణమించి సమస్తకార్యములఁ జేయుచున్నది ఆత్మ యేమిచేయదు, దేనినిఁ జేయింపదు ప్రకృతిపరిణామభూతమైన యంతఃకరణమే యాత్మయనునధ్యాసము కన్నుగప్పటంజేసి అంతఃకరణకార్యము నాత్మయం దారోపింతురు వాస్తవము విచారించినచో ఆత్మ యకర్తగాని యొండుగాదు 'అహంకారవిమూఢాత్మా కర్తాహమితిమన్యతే । చిత్తేకర్తరి తత్రాత్మా కర్తేవాహంధియాస్మృతః' అను ప్రమాణము అక్షరాక్షరముల సత్యము. ఇది తెలిసికొనువాఁడే నిజమెఱింగినవాఁడు 29

పైన వివరించినదానినిబట్టి శుభాశుభఫలంబులకు ఈశ్వరునకు సంబంధములేదని విశదమగుచున్నది ఇఁక నీశుభాశుభఫలంబులకుఁ గారణమేమని విచారించినచో భూతభేదము కారణమగుచున్నది భూతభేదంబువలనఁ గర్మవైషమ్యముఁ గర్మవైషమ్యమునుబట్టి శుభాశుభఫలములు గలుగుచున్నవి కర్మవైషమ్యముఁగట్టి క్షేత్రజ్ఞభేదమేల చెప్పరాదందువా ? అట్లుచెప్పుట

సరిగాదు వాస్తవము విచారించినచో భూతభేదముగూడ కల్పితమేగాని వేఱుగాదు. కల్పితభూతభేదము నాధారపఱచిచెప్పఁబట్టి యాత్మభేదము గూడ కల్పితమే యగుఁగదా భూతభేదము కల్పితమెట్లగునవా? 29

సమస్తమునకు ఆత్మ అధిష్ఠానము అధిష్ఠానంబునకు వేఱయినదేదియు నుండఁజాలదు కావున స్థావరజంగమాత్మక సర్వపదార్థములు ఆత్మకన్న వేఱనుట కల్పితమగును ఆత్మయే లేకున్నచో భూతములే యుండవు సర్వభూతంబులు ఆత్మరూపత్వమని యెవఁడు గ్రహించునో యతఁడు సర్వాద్వైతదర్శియై పరిపూర్ణుఁడునైన బ్రహ్మమే యగును భూతములు కల్పితములనుటకు దృష్టాంతము వినుము త్రాడు అనుపదార్థ మొకటియున్న యెడల గదా పాముగా దానిని సర్పమని భావించుటకు నవకాశముగలుగును. త్రాడే లేకున్నచో నిట్టిభ్రాంతికలుగుటకు నవకాశమేయుండదు అట్లే యాత్మయను పదార్థమొకటియుండుటంబట్టి భూతంబులయుత్పత్తికి నవకాశముగలుగుచున్నది 30

సర్పాదులకు రజ్జ్వాత్మకత్వమున్నను రజ్జువునకు సర్పవికారములతో నెట్టి సంబంధము లేనియట్లే సర్వభూతములు ఆత్మరూపంబులైనను భూతవికారంబులతో నాత్మకెట్టి సంబంధములేదు ఏలయనఁగా?

అపరోక్షానుభవయోగ్యమైనట్టియు ప్రత్యగాత్మరూపమైనట్టియు పరమాత్మ దేహమందున్నను అది స్వభావముచేతనే సర్వవికారశూన్యమైనది గావున దేహవికారములతో ఆత్మకెట్టిసంబంధము లేదు వ్యయము (అనఁగా మాఱుఁబాటు) ధర్మిస్వరూపోత్పత్తిరూపమనియు కేవలధర్మోత్పత్తిరూపమనియు రెండు విధంబులు ధర్మి అనఁగా అసలువస్తువు, దానిస్వరూపంబునకు మాఱుఁబాటుగలుగుట ధర్మిస్వరూపోత్పత్తి రూపవ్యయమగును ఈమాఱుబాటు ఉత్పత్తిగల వస్తువునకే యగుఁగాని యుత్పత్తియే లేనిదానికిఁ గలుగదు ఆత్మఅనాది అనఁగా జన్మమే లేనిది జన్మముండి యెడల జన్మోత్తరకాలంబున భావివికారంబులు గలుగుటకు నవకాశముండును జన్మమే లేనప్పుడు దానికి భావివికారము లెక్కడివి? కావున ఆత్మకు ధర్మిస్వరూపోత్పత్తి రూపవ్యయము లేదు వస్తువునకు మాఱుబాటు గలుగకున్నను దానిగుణమునకు మాఱుబాటు గలుగుట ధర్మోత్పత్తి రూపవ్యయమగును ధర్మముగూడ

నొకగుణమే. గుణముచ్ఛ నిష్క్రియాఱుబాటునకు నవకాశముండును గుణమే లేనిదాని కిదిగలుగదు ఆత్మ నిర్గుణమైనది, అనఁగా నిర్ధర్మకత్వమైనది, కావున దానికి ధర్మోత్పత్తి రూపవ్యయములేదు ఇచ్ఛాద్వేషాదులు ఆత్మదర్మములనుట ప్రసిద్ధమైయుండఁగా ఆత్మకు నిర్ధర్మకత్వము చెప్పుటెట్లని శంకింపవచ్చును ఇచ్ఛాద్వేషాదులు క్షేత్రధర్మములు అవి యాత్మధర్మములనుటయే గొప్పప్రమాదము ఆత్మ నిర్ధర్మకత్వముగుటంజేసి యది శరీరమందున్నను ఏపని చేయదు అందువలన నాత్మకుఁ గర్మఫలముగానీ తత్సంబంధముగానీ గలుగదు. దృష్టాంతము వినుము 31

ఆకాశమెల్లెడల వ్యాపించియుండును అదిలేనిచోటు లేదు అది బురదలోనున్నప్పుడు బురద దానికి నంటుకొనుటలేదు ఏలయందువా? దాని యసంగస్వభావమే కారణము. ఆత్మగూడ నెల్లెడల వ్యాపించియుండును అయినను అది యసంగస్వభావముగలది గావున దేహమందున్నప్పుడు గూడ దానికి దేహసంబంధము గలుగదు ఆత్మకు దేహితోఁగూడ సంబంధము లేకపోవుటకు దాని యసంగస్వభావమేగాక ప్రకాశకత్వముగూడఁ గారణముగానున్నది. 32

సూర్యుఁడు సర్వలోకంబుల నేకతంబుగా వెలిగించుచున్నను భూతంబుల నేత్రదోషంబులు వానినంటనట్లు ఆత్మ సర్వభూతంబులలోనుండి వానికి నిజసాన్నిధ్యంబునఁ బ్రవృత్తిఁ గలిగించుచున్నను తద్భూతంబుల సుఖదుఃఖాది గుణదోషంబు లతని నంటవు 33

పైనఁ జెప్పినట్లు క్షేత్రము జడమనియు సవికారమనియు క్షేత్రజ్ఞుఁడు చేతనము నిర్వికారుఁడు అని క్షేత్రక్షేత్రజ్ఞులకుగల భేదంబును, భూతంబుల ప్రకృతియైన యవిద్య అనఁగా మాయ అమానిత్వాదులవలనఁ దొలంగుననియు నెవఁడు జ్ఞాననేత్రంబుతోఁ జూచునో యతఁడు తత్త్వమెఱింగినవాఁడై బ్రహ్మము బొందును అనఁగా క్షేత్రక్షేత్రజ్ఞ యాథాత్మ్యం బెఱింగి అమానిత్వాది ధర్మనిష్ఠుండగువానికి సర్వానర్థంబులు నివర్తిల్లి పరమానందావిర్భావలక్షణంబగు పరమపురుషార్థము సిద్ధించునని భావము. 34

---

# గీతాహృదయము.

---

## పదునాల్గవయధ్యాయము.

క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపంబును బ్రసంగవశంబున మఱికొన్ని విషయంబులును బదుమూడవయధ్యాయములో నిరూపింపఁబడినవి. ఆవిషయములనే పదునాల్గవయధ్యాయములోఁగూడ విస్తరించుచున్నాఁడు

పదుమూఁడవయధ్యాయము 26-వ శ్లోకములో 'స్థావరంబులుగానీ జంగమంబులుగాని సమస్తము క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగంబునఁ బుట్టుచున్నవని చెప్పఁబడినది ఈసంయోగంబు స్వతంత్రముగా అనఁగా పరేచ్ఛలేకయే జరుగుచున్నదని నిరీశ్వరవాదులును సాంఖ్యులును జెప్పుదురు ఈశ్వరేచ్ఛతో జరుగుచున్నదని యితరులందురు ఇందేది నిజము ? మఱియు జీవుఁడు సదసద్యోనులందుఁ బుట్టుటకు గుణసంగమే కారణమని చెప్పఁబడినది. ఏయే గుణంబులతో నెట్లెట్లు సంగమంబు గలుగును ? గుణములనఁగా నెవ్వి ? అవి యెట్లు బంధించును ? భూతప్రకృతి మోక్షమెవఁడెఱుంగునో యతఁడు బ్రహ్మమును బొందునని అ. 13, 34-వ శ్లోకములోఁ జెప్పఁబడినది భూతముల గుణమేమి ? ప్రకృతి గుణమేమి ? వీనినుండి మోక్షమెట్లు ? ముక్తుని లక్షణములెవ్వి ? ఈవిషయములెల్ల నియ్యధ్యాయంబున వివరింపఁబడును

శ్రీకృష్ణభగవానుఁడు చెప్పుచున్నాఁడు —అర్జునా ! పూర్వాధ్యాయములోఁ జెప్పిన పరమాత్మ జ్ఞానసాధనంబునుగూర్చి విస్తరించి మఱలఁ జెప్పెదు వినుము పరమాత్మజ్ఞానసాధనంబులు యజ్ఞాదులు గలవందువు గాఁబోలు నేను చెప్పనున్నదట్టిదిగాదు ; ఉత్తమమైన సాధనము యజ్ఞాదులు బహిరంగసాధనంబులు , నాచెప్పఁబోవునది అంతరంగసాధనము , అందువలననే దానికింత యాధిక్యము ఈసాధనము ననుష్ఠించి మునులెల్లరు సంసారబంధమునుండి తొలఁగి ముక్తులైరి. 1

ఈసాధనము ననుష్ఠించి హిరణ్యగర్భాదులు నాసాధర్మ్యంబును బొందిరి

వారు సర్గకాలంబునఁగూడ మఱల జనింపరు, ప్రళయమైనను నశింపరు నా సాధర్మ్యంబును బొందిరనుటవలన ముక్తులకు ఈశ్వరసమానరూపత్వము వచ్చునని తలంతువుగాఁబోలు క్షేత్రజ్ఞుఁడైన జీవునకు ఈశ్వరునకు భేదమే లేదు. ఇరువురు నొక్కటేయైనప్పుడు సాధర్మ్యమనఁగా నీశ్వరస్వరూపమే యగునుగాని తత్సమాన ధర్మత్వముగాదు 2

ప్రకృతి పురుషుల సంయోగంబు స్వతంత్రమా ? పరతంత్రమా ? అనుదానికి సమాధానము వినుము

ప్రకృతి దేశకాలానవచ్ఛేదము గావున మహత్తు అనియందురు మహత్తు అనఁగా పరిమాణములేనిదని యర్థము మఱియు దానికి సర్వకార్యవృద్ధి హేతుత్వరూపమైన బృంహణత్వము గలదు గావున దానిని బ్రహ్మమనికూడ చెప్పుదురు మహత్తు బ్రహ్మమునైన యీప్రకృతి యీశ్వరుఁడనైన నాకు గర్భాధానస్థానము. ఈప్రకృతియందు నేను ఈక్షణరూపమైన సంకల్పబీజమునుంతును అది సర్వభూత జన్మకారణమగుచున్నది సంతానమునుగోరు తండ్రి స్త్రీహ్యాద్యాహారరూపంబునఁ దనలో నిమిడియున్న శరీరంబును బుట్టించుటకుఁగా యోనియందు రేతస్సేకపూర్వకంబుగా గర్భమును గలిగించును అది అనుశయవంతుఁడగు పుత్త్రునకు శరీరమగుచున్నది. (లోకాంతరమందు అను భూతముకాఁగా శేషించి ఇహలోకజన్మంబునకు హేతువైన కర్మము అనుశయ మనఁబడును. అట్టి కర్మముగలవాఁడు అనుశయవంతుఁడగును ) గర్భాధానజననకాలంబులకు మధ్య కలిలాద్యవస్థలు గలుగును అట్లే ప్రళయకాలంబున నాయందు లీనమైనట్టియు అవిద్యాకామకర్మంబు ననుశయించునట్టియు క్షేత్రజ్ఞుని సృష్టిసమయంబునఁ గార్యకారణ సంఘాతరూపంబుగాఁ బుట్టించుటకై చిదాభాసమనెడి రేతస్సును మాయావృత్తిరూపమైన గర్భమందుంతును అది ఆకాశవాయుతేజోజలభూమ్యాద్యుత్పత్త్యవస్థలఁ బొందుచున్నది నాయొనర్చు గర్భాధానమువలననే హిరణ్యగర్భాదుల యుత్పత్తి గలుగుచున్నదిగాని స్వతంత్రముగాఁ గలుగదు 3 దేవతలు పితరులు మనుష్యులు పశువులు పక్షులు సరీసృపములు మొదలగువాని యోనులందు జనించు తత్తన్మూర్తులకుఁ బ్రకృతియే యోని అనఁగా మాతృస్థానము, ఈశ్వరుఁడనైన

నేను బీజప్రదుఁడను, అనఁగా గర్భాధానము గలిగించు తండ్రిని. కావునఁ బ్రకృతి పురుష సంయోగము ఈశ్వరేచ్ఛతో జరుగుచున్నదని గ్రహింపుము 4

గుణములనఁగా నెవ్వి ? అవియెట్లు బంధించునను ప్రశ్నలకు సమాధానము వినుము

గుణములు సత్త్వము రజస్సు తమస్సు అని మూఁడు. ఇవి ప్రకృతి వలనఁ గలుగును. ప్రకృతి అనఁగా ఈశ్వరశక్తియైన మాయ. అదియే యీ గుణంబులకుఁ బుట్టినిల్లు. ప్రకృతియు గుణంబులును అంగాంగిభావంబుననుండును. దేహము ప్రకృతిపరిణామమని మున్నె చెప్పియున్నాను. అట్టిదేహమునందు క్షేత్రజ్ఞుఁడు తాదాత్మ్యంబుననుండును. ఆతఁడు వాస్తవముగా అవ్యయుఁడు నిర్వికారుఁడునైనను ప్రకృతి జన్యంబులైన గుణంబులు వానిని బంధించుచున్నవి. ఈబంధకమెట్టిదందువా ? ఆతనిని సుఖదుఃఖమోహాది స్వవిచారవంతునిగాఁ బ్రదర్శించును. ఇదే సత్త్వగుణబంధకము. సూర్యుఁడు నిజముగాఁ గదలకున్నను వానిబింబము నీటిలోఁ బ్రతిబింబించినప్పుడు నీటికదలికవలన నందలి బింబముగూడఁ జలించుచున్నట్లు గాన్పించువిధంబున క్షేత్రజ్ఞుఁడు నిర్వికారుఁడు నవ్యయుఁడునైనను క్షేత్రసంబంధంబ నఁజేసి క్షేత్రవికారంబు లతనియందుఁ దోఁచుచుండును. వాస్తవము విచారించినచో ఈబంధకత్వము కేవల మిథ్యాభూతమేగాని వేఱుగాదు 5

సత్త్వగుణలక్షణము, దానిబంధకత్వప్రకారము వినుము

సత్త్వగుణము ప్రకాశకమైనది, అనఁగా సత్త్వగుణము చైతన్యునకు ఆవరణాభిభవరూపమైన ప్రకాశము నిచ్చును. ఏలయందువా ? అది స్ఫటికమువలె నిర్మలమైనది. దానంజేసి చిద్బింబగ్రహణయోగ్యత దానికిఁ గలదు. మఱియు నది సుఖాభివ్యంజకమై యుండును. అందువలన నది దుఃఖమునకు వైరి. ఈసత్త్వగుణము స్వకార్యభూతములైన సుఖజ్ఞానములతో సంబంధముఁ గలిగించును, అనఁగా నేనుసుఖిని నేనజ్ఞానిని అను మనోధర్మములందు క్షేత్రజ్ఞుఁ డభిమానియగునట్లు చేయును 6

రజోగుణలక్షణము, దానిబంధకత్వ ప్రకారము వినుము.

రజోగుణము అభిలాషరూపంబుననుండును, అది తృష్ణాసంగమంబుల వలనఁ గలుగుచున్నది. లేనివస్తువునుగోరుట తృష్ణయందురు, ఉన్నదానితోఁ దనివిచెందక అధికముగాఁ గోరుట ఆసంగమందురు ఈరజోగుణము దృష్టాదృష్ట వస్తువులందు అభినివేశము అనఁగా 'నేనీపనిచేయుదును, ఈఫలమనుభవింతు' నను బుద్ధిని గలిగించును. ఇదేరజోగుణబంధకము. 7

తమోగుణలక్షణము, దాని బంధకత్వ ప్రకారము వినుము.

తమోగుణము అజ్ఞానమువలనఁ గలుగుచున్నది. అజ్ఞానంబునకు ఆవరణశక్తి మెండు. అందువలన నది యెల్లజీవులకు అవివేకరూపమైన మోహంబును గలిగించును. ప్రమాదము—జాగరూకత లేకుండుట, ఆలస్యము-ఎట్టియత్నములేక సోమరిగానుండుట, నిద్ర—సర్వేంద్రియ వ్యాపారంబులను మందగించుట—ఈరూపమైన బంధకము తమోగుణమువలనఁ గలుగును. 8

అర్జునా! ఏయేగుణంబునకు ఏయేపనులందు ఉత్కర్షయుండునందువా? సత్త్వగుణము సుఖవిషయములందుఁ బ్రవేశముఁ గలిగించును, అది దుఃఖకారణములవంక మరలనీయదు హాయిగా సుఖమనుభవించుటకు వీలున్నను అట్టిదానిని దలంపనీయక కర్మములొనర్చుటయందు లంపటుఁడైయుండునట్లు రజోగుణముచేయును తమోగుణము జ్ఞానమును గప్పివైచి ప్రమాదమువంకకే యీడ్చును అంతియగాదు ఎప్పుడేది చేయవలయునో యప్పుడు దానిని చేయనీయక జాగుచేయుట, ఎప్పుడుఁ దూగుచుండుట—ఇట్టివానియందది రుచి హెచ్చించును. 9

ఈగుణము లిట్లుచేయుటకు హేతువేమందువా?

రజస్తమోగుణంబులను మించి సత్త్వము ద్రేకము వహించినప్పుడు సత్త్వసంబంధకార్యములును, సత్త్వతమోగుణంబులను మించి రజోగుణముద్రేకించినప్పుడు రజోగుణకార్యంబును, సత్త్వరజోగుణంబులను మించి తమోగుణముద్రేకించినప్పుడు తమోగుణకార్యంబును ఒఱగుచుండును గుణముల స్వభావమే హేతువు 10

ఏలక్షణంబుల నట్టి యేగుణము ద్రేకించెనో యెఱుంగు టెట్లందువా ?

శరీరము ఆత్మకు భోగాయతనము శరీరమందలి నేత్రాదిద్వారములు వానివాని వ్యాపారంబులను జక్కగా నెఱవేర్చుచుఁ బ్రకాశవంతములై యుండునేని సత్త్వాభివృద్ధియున్నట్లు గ్రహింపుము 11 లోభము—పిసినారితనము, ప్రవృత్తి—నిరంతర మేదోయొకపనియందుఁ దగులుకొనియుండుట, కర్మారంభము—ద్రవ్యవ్యయాధికాయాసంబులకు హేతువులైన కామ్యనిషిద్ధ లౌకిక మహాగృహాది వ్యాపారంబు లారంభించుట, అశమము—ఒకనాటికి విరమరలేకుండుట, స్పృహ—ఇది నేడైనది, ఇది రేపుచేయుదునను సంకల్ప ప్రవాహములో మునుఁగుచు విషయాభిలాషతోనుండుట—ఇవి గానవచ్చినప్పుడు రజోగుణవృద్ధియున్నట్లు గ్రహింపుము 12 జ్ఞానకారణమున్నను జ్ఞానంబు గలుగకుండుట సోమరితనము, చేయవలసిన కార్యములందుఁగూడ నుపేక్ష, విపరీతజ్ఞానము—ఇవి గానవచ్చినప్పుడు తమోగుణము పెంపొంది యున్నట్లు గ్రహింపుము 13

మరణకాలంబున నేయేగుణము వృద్ధిగానున్న నేమిఫలమో వినుము.

సత్త్వగుణము వృద్ధిగానున్నప్పుడు మరణించువారు హిరణ్యగర్భాదుల నుపాసించినచోఁ బడయునట్టి ప్రకాశమయములును భోగస్థానములునైన యుత్తమలోకంబులకుఁ బోవుదురు 14 రజోగుణము హెచ్చుగానున్నప్పుడు మరణించువారు కర్మాధికారులై మనుష్యులుగా జన్మింతురు తమోగుణము వృద్ధిగానున్నప్పుడు చనిపోవువారు పశ్వాది మూఢయోనులందుఁ బుట్టుదురు 15

సత్త్వగుణాదులకు స్వానురూప ఫలమగును ఫలము గుణానురూపము గావున విచిత్రమైయుండును

పైశ్లోకముల సారాంశమేమన, సాత్త్వికుల కర్మములు సాత్త్వికములుగా నుండును గావునఁ దత్కర్మంబులకు ననుగుణమైన ఫలము అనఁగా ప్రకాశబహుళమైన సుఖము గలుగును రజోగుణవంతుల కర్మములు పాపపుణ్యమిశ్రములుగానుండును గావున దుఃఖబహుళము సుఖలేశము ఫలమగును. తామసులు పాపకర్ములు గావున వారికి అవివేక పరంపరారూపమైన ఫలము గలుగును 16

(ఫలవైచిత్రికి వైకారణములనే స్పష్టార్థముకొఱకు చెప్పుచున్నారు)

సత్త్వమువలన జ్ఞానముగలుగును జ్ఞానము ప్రకాశరూపమైనది అందువలన సాత్త్వికకర్మములకు తదనరూపమైన ఫలము అనఁగా సుఖము గలుగును. రజస్సువలన లోభము పుట్టుచున్నది, లోభము దుఃఖమునకు హేతువు అందువలన రాజసకర్మంబులకు దుఃఖము ఫలమగుచున్నది తమోగుణము వలనఁ బ్రమాదము మోహము అజ్ఞానము పుట్టుచున్నవి అందువలనఁ దామస కర్మములకు అజ్ఞానాదికము ఫలమగుట యుక్తమేగదా 17

సత్త్వాదుల ఫలమై జ్ఞానాదిగుణకార్యములను బ్రతిపాదించితిని సత్త్వాది గుణనిష్ఠులగతి వినుము

సత్త్వవృత్తులు శాస్త్రీయంబులను జ్ఞానపూర్వకంబులైన కర్మములనే చేయుదురు వారు ఊర్ధ్వలోకంబులకుఁ బోవుదురు ఊర్ధ్వలోకంబులు లోక దానిం(?)నొకటి నూఱంత లాభదమిచ్చును సత్త్వవృత్తులు వారివారి సత్త్వోత్కర్ష తారతమ్యమునుబట్టి గంధర్వాదిలోకంబులకుఁ జని యచ్చటి సుఖంబుల ననుభవింతురు రజోగుణవృత్తులు లోభాదులతోనిండిన కర్మములందే నిరతులగుదురు గావునను, వారికర్మములు పాపపుణ్యమిశ్రమములు గావునను, మనుష్యలోకమునఁ బుట్టుదురు, వారికి నూర్ధ్వలోకప్రాప్తి లేదు తమోగుణము అధమమైనదగుటవలనను, తమోగుణవృత్తులకు నిద్రాదులు తప్పవు గావునను వారికి నిరయమే శరణము సాత్త్వికులు రాజసులు ఎప్పుడో యొకప్పుడైనను తమోగుణవృత్తులగుట గలదు అంతమాత్రాననే వారికి నిరయము గలుగదు నిరంతర తమఃప్రధానులకే నిరయంబని గ్రహింపవలయును 18

గుణములే దేవమర్త్య తిర్యగ్యోనిజన్మంబులకుఁ గారణములంటిని ఈ గుణములు మహాదుర్జయంబులని వివరించితిని ఈగుణములను జయింపకఁగాని మోక్షము గలుగదని నిర్ణయించితిని వీనిని జయించి మోక్షముఁ బడయుమార్గమేమందువా?

శాస్త్రావలోకన గురూపదేశాదులవలనఁ దత్త్వదర్శన సంపత్తిని బడసి, గుణములే బుద్ధ్యాదులుగాఁ బరిణమించి వివిధకర్మంబులను జేయుచున్నవని యెఱు

ఈగుణములొనర్చు కర్మములతో ఆత్మకెట్టి జోక్యము లేదనియు అది నిర్వికార ము ఏకరూపమై యున్నదనియు గ్రహించునేని నిజమున గ్రహించుటకును నిజ మును గ్రహించినాడే గుణబంధములు విడి ముక్తుడై బ్రహ్మస్వరూపమును బొం దును అనఁగా ఆత్మజ్ఞానముచే గుణబంధమోచనమని భావము 19

బ్రహ్మస్వరూపమునుబొందుటనఁగా నేమో వినుము

సత్త్వాది గుణత్రయము దేహోత్పత్తికి హేతుభూతములని చెప్పిరి ఈగుణములను దాఁటినవాఁడు అనఁగా తత్త్వజ్ఞానంబున గుణకార్యంబుల నడఁచి వైనవాఁడో ఎవఁడు ముక్తుఁడగును వాని జననమరణ జరాదిదుఃఖములు గుణకృత ఇట్టి దుఃఖములులేక బ్రహ్మానంద మనుభవించుటయే బ్రహ్మమును బొందుటని భావము 20

అర్జునుఁడడుగుచున్నాఁడు — స్వామీ ! దేహమున్నంతకాలము గుణ ములుండును , గుణములున్నంతకాలము తత్కార్యములు తప్పవు గుణా తీతుఁ డేవిధముగా వర్తించును ? అనఁగా గుణాతీతుని లక్షణములేవి ? 21

రెండవయధ్యాయములో స్థితప్రజ్ఞుని లక్షణములు చెప్పియున్నాఁడు స్థితప్రజ్ఞుని లక్షణములే గుణాతీతుని లక్షణములు అయినను మఱల నర్జునుఁ డడుగుచున్నందున శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు.

అర్జునా ! సత్త్వకార్యమైన ప్రకాశముగానీ, రజఃకార్యమైన ప్రవృత్తి గానీ, తమఃకార్యమైన మోహముగానీ ఏది సంభవించినను గుణాతీతుఁడు దుఃఖ బుద్ధితో వానిని ద్వేషింపఁడు. గడచినవానిని సుఖబుద్ధితో మఱలఁ గోరఁ డు అనఁగా రాగద్వేష శూన్యుఁడైయుండును 22 గుణముల పరిణామా వస్థలైన సుఖదుఃఖంబులు గలిగినప్పుడు గుణాతీతుఁడు చలింపక తటస్థునిమాడ్కి నుండును. ఏలయందువా ? గుణములు వానివాని కార్యంబలలొనర్చుచున్నవని యు, తానేమియుఁ జేయుటలేదనియు, గుణకార్యంబులతో దనకెట్టి సంబంధ ములేదనియు వానికిసంపూర్ణజ్ఞానముగలదు గావున నతఁడట్లు తటస్థుఁడైయుండు ను తటస్థుఁడైయుండుననఁగా హర్షవిషాదములకు నాకులపాటు చెందఁడని భావ ము 23 హర్షవిషాదాకులపాటెప్పుడు లేదో సుఖదుఃఖము లొక్కటిగానే

యుండును ఏలయందువా? గుణాతీతుఁడు నిరతిశయానందమూర్తియై స్వస్థము గానుండును, వానికి హేయోపాదేయములు గలుగవు, మట్టి రాయి బంగారు వాని కొక్కటేయగును, ప్రియాప్రియములు లేవు ఇట్టిస్వస్థత వానికెట్లు వచ్చెనందువా? అతఁడు ధీరుఁడు అనఁగా నిర్విశేషాద్వితీయ బ్రహ్మాత్మైక్యజ్ఞాని. అందువలన నిందాస్తుతులు రెండు సమానములు 24 నిందాస్తుతులు సమానములైనప్పుడు మానావమానములుగానీ తత్సంబంధములైన మిత్రవైరిపక్షంబులుగానీ గలుగవు కర్మములవలనఁ బొందఁదగిన ఫలములు వానికిఁ గలుగవు గావున గుణాతీతుఁడు సమస్తకర్మములను ద్యజించియుండును. 25 సర్వము ద్యజించి యతఁడేమి చేయుచుండునందువా? భగవంతుఁడనైన నన్ను ఏకాంతిక భక్తితో సేవించుచుండును ఈనిష్ఠాఫలంబుగా ఆత్మతత్త్వజ్ఞానంబు గలిగి తత్ఫలంబుగా మోక్షాగ్రతను అనాయాసముగాఁ బడయును నిరంతర భగవచ్చింతనమే గుణాతీతుఁడగుటకు నుపాయమని భావము 26

భగవద్భక్తివలన బ్రహ్మభూయప్రాప్తి అనఁగా మోక్షమెట్లందువా?

భక్తానుగ్రహాది ప్రయోజనమునకై యేశక్తి బ్రహ్మమునందుఁ గలదో యాశక్తియే తాననియు, వాగర్థంబులకువలె శక్తికి శక్తిమంతునకు అవినాభావము గావునఁ దనకు బ్రహ్మమునకు వేఱుభావములేదనియు, శాశ్వతమైన మోక్షముగూడఁ దనయధీనమేయనియు నిత్యమోక్షఫలమై నదియు జ్ఞాననిష్ఠారూపమైనదియునగు ధర్మముగూడ తనయధీనమేయనియు గుణాతీతుఁడుండును ఆట్టిభక్తికి అనుగుణఫలమైన మోక్షము గలుగును మతియెంతో గతియంతని వినవా? 27

# గీతాహృదయము.

## పదునేనవ యధ్యాయము.

గుణాతీతునకు సంప్రాప్తమగు బ్రహ్మభావాపత్తిరూపమైన ముక్తిని గూర్చి పదునాల్గవయధ్యాయములోఁ జెప్పఁబడినది నిః సంసారికిఁ గలుగు మోక్షమునుగూర్చి యీయధ్యాయంబులోఁ జెప్పుచుఁ బూర్వాధ్యాయవిష యంబునే విస్తరించుచున్నాఁడు సంసారవిషయంబున విరక్తిఁజెందినవాఁడు నిఃసంసారియనఁబడును విరక్తికిఁ గారణమేమందురా? సంసారము దుఃఖ మయమైనదనియు, అందులకుఁ బ్రాల్మాలినను అది శాశ్వతమైనదిగాదనియు, అశాశ్వతము దుఃఖమయమునైనదాని కింత శ్రమయేలయనియు గాఢాభిప్రాయ ము గలుగుటయే విరక్తికిఁ గారణము సంసారమట్టి యశాశ్వతము దుఃఖ మయమునైనదని చూపించుటకుఁగా దానినొక రావిచెట్టునకుఁ బోల్చుచు శ్రీ భగవానుఁడు చెప్పుచున్నాఁడు

ప్రవాహవేగమునకు దరినుండి తెగి తలక్రిందుగాఁబడిన పెద్ద రావి మ్రానునకు సంసారము సరియగుచున్నది అట్లు తెగిపడిన వృక్షము మూలము పైకికొమ్మలు క్రిందికినుండునట్లు సంసారమునకు మూలమునైన అనఁగా బ్ర హ్మమునందున్నది బ్రహ్మమునందు మొలచి యీసంసారవృక్షము క్రిందికి మనుష్యాదిలోకంబులకుఁ దలక్రిందుగాఁ బ్రాఁకియుండును 1

ఈసంసారమునకు సర్వభ్రమాధిష్ఠానము స్వప్రకాశపరమానంద చైతన్య రూపమునైన పరబ్రహ్మము మూలమనియు, ఆమూలము ఊర్ధ్వము అనఁగా ఉత్కృష్టమైనదనియు, హిరణ్యగర్భాదులు కార్యోపాధుజీవులు మహ దహంకారంబులు తన్మాత్రావళీ సంసారవృక్షంబునకు శాఖోపశాఖలనియు, ఇవియెల్ల బ్రహ్మమునుండి యధోముఖములై నానాదిక్కులు బ్రాఁకి మను ష్యాదిలోకములవఱకు వ్యాపించియున్నవనియు భావము

ఏఁటిగట్టునఁ దెగి తలక్రిందుగాఁబడిన వృక్షము నేఁడుగాకున్నను రేఁపెనియు నెండి నశించునట్లు సంసారవృక్షముగూడ ఒకనాఁడుగాకున్న నొక

నాఁడేనియు నశింపక తప్పదు కావున నది శాశ్వతముగాదు తలక్రిందుగాఁ బడియున్న వృక్షము క్రిందికిఁ బోయినచో అదియొరఁగి పడనగును అందు వలన దానినాశ్రయింపరాదు, కాదని యాశ్రయించిన ముప్పుదప్పదు అట్లే సంసారవృక్షము నాశ్రయించిన ముప్పుదప్పదు

అశ్వత్థపదమునకు రేపుండనిదిఅని యర్థము, అనఁగా శాశ్వతముగానిదని భావము. సంసారముగూడ నట్టిది గావున దానిని అశ్వత్థమునకుఁ బోల్చుట సంసారము అశాశ్వతము అనాశ్రయణీయము అశాశ్వతమైన దయినను అది స్వయముగా నశింపదు. వృక్షంబును గొడ్డటివలె దీనిని జ్ఞాన కుఠారంబున నఱికినచో నిది నశించును ఈసంసారవృక్షంబునకు వేదములే యాకులు, ఆకులు వృక్షంబును బ్రోదిచేసి కాపాడునట్లు వేదంబులు సంసారంబును బెంపొందించి కాపాడును అనఁగా వేదములు కర్మప్రతిపాదకము లనియుఁ గర్మకాండము సంసారాభివృద్ధికరమైన ధర్మాధర్మంబులను బ్రతిపాదించుననియు, కర్మంబులను జేయుకొలఁది సంసారము పెరుగుచుండుననియు భావము ఈసంగతి గ్రహించినవాఁడే జ్ఞాని

సంసారమునకు మూలము పరబ్రహ్మమనియు, కర్మములు దానిని వృద్ధిపఱచునేగాని నశింపఁజేయవనియు, బ్రహ్మాత్మైకత్వజ్ఞానమొక్కటే దానిని నశింపఁజేయఁగలదనియు, ఇదియే సర్వవేదార్థమనియు భావము

సంసారవృక్షంబునకు జీవరాసులు శాఖలంటివి శాఖలు క్రిందికి మీఁదికి నలుదిశలకు వ్యాపించియుండును అట్లే జీవులలో దుష్కృతులు అధోగతులై పశ్వాదియోనులందు జనించుచుఁ బెచ్చు పెరుగుదురు, సుకృతులు ఊర్ధ్వగతులై గంధర్వదేవయక్షాదిరూపంబుల విస్తరింతురు వృక్షంబునకు జలమట్లు సంసారంబునకు గుణములు ముఖ్యములై ప్రోదిచేయుకొలఁది దానిని బెంచుచుండును ఈసంసారవృక్షంబునకు శబ్దస్పర్శరూపరసగంధంబులను విషయములే పర్ణములు చిగుళ్ళకు రక్తిమయట్లు విషయములకు రజోగుణము స్వాభావికము దీనివ్రేళ్ళు మనుష్యలోకమునందుఁ బ్రాఁకియుండును ఈ వ్రేళ్ళ స్వరూపమేమందువా? పుణ్యపాపప్రవర్తకములైన రాగద్వేషజనిత కర్మములే దానివ్రేళ్ళు కర్మములకు మనుష్యులుమాత్రమే యధికారులగు

టంజేసి, కర్మములు రాగద్వేషంబులతోఁ గూడియుండును గావునను, తత్త త్కర్మానుసారంబుగా దేవపశ్వాదిభావము గలుగుచుండును ప్రేళ్ళు మూల మునంటియుండుట సహజము, కొనలయందుండవు సంసారవృక్షము ప్రే ళ్ళట్టివిగావు, మొదటఁ దుదనెల్లెడలఁ గలవు అందువలన నీవృక్షంబు మహా శ్చర్యకరముగానున్నది ప్రేళ్ళు నఱికినగాని వృక్షము నశింపదు, ఏదోయొక చోటనున్నవో ప్రేళ్ళను నఱకవచ్చును నిలువెల్లనున్న నులిప్రేళ్ళను ఛేదిం చుట సాధ్యముగాదు ప్రేళ్లనెల్లఁ దెగగొట్టకున్నచో మిగిలిన ప్రేళ్లమూలం బున వృక్షము మఱలఁ జిగిర్చుటగలదు కావున సంసారవృక్షమును సమూల ముగా ఛేదించుట కష్టసాధ్యము, సమూలముగా ఛేదింపకున్నచో నది తల గెత్తి యభివృద్ధిగాంచును 2

సంసారము కర్మములవలనఁ బెంపొందుచున్నదనియు, కర్మనాశనము వలనఁగాని సంసారనాశనము గలుగదనియు భావము

మూలమిదియని స్పష్టపడినఁగాని వృక్షచ్ఛేదనము సాధ్యముగాదు కాదని కొమ్మలెన్ని నఱికినను ఫలములేదు సంసారవృక్షంబునకు మూలము బ్రహ్మముగుటంజేసి, బ్రహ్మజ్ఞానంబేర్పడినఁగాని వృక్షమూల మిదియని గోచ రింపదు మూలము గోచరింపనిచోఁ దచ్ఛేదనము దుర్ఘటము 3

సంసారవృక్షమిట్లు దురుచ్ఛేదమగుటంజేసి దానిని నఱకుటయను పురు షార్థసిద్ధియత్నమును మానవలసినదేనాయని శంకింపవచ్చును దీనిమూలము అనాదియైన యజ్ఞానంబునఁ బాముకొనియున్నది వైరాగ్యమనెడి ఖడ్గంబును ధరించి చుట్టునావరించియుండు ముండ్లపొదలను జక్కచేసి మూలమును చెదింప నగును నఱుకునప్పుడు ఖడ్గము మొక్కపోవచ్చును మొక్కపోయినప్పుడు తత్త్వజ్ఞాననిష్ఠయనెడి పదనురాతిమీఁద నూఱి వాదరను వాడిచేసికొను చుండవలయును వైరాగ్య శమదమాదులను సంపాదించి వివేకాభ్యాసంబు వలనఁ దత్త్వజ్ఞాననిష్ఠను దృఢీకరణ మొనర్చినగాని సంసారబంధము తొలఁగ దని భావము 3

బ్రహ్మాత్మ తత్త్వజ్ఞాన మార్గంబును గురువువలన నెఱుంగవలయును బ్రహ్మాస్మతత్త్వపదంబును బొందినవారు మఱల జననమరణరూపసంసారం

బునకు రారు. గురువు మార్గంబును జూపఁగలఁడేగాని, సంసారమూలమగు బ్రహ్మమునొద్దకుఁ గొనిపోఁజాలఁడు. శిష్యుఁడు గురూపదిష్టమార్గంబు నెడయక యేకాంతభక్తియనెడు త్రాఁటిని గట్టిగాఁ బట్టుకొని జంకు కళంకుమాని తెంపువహించి ప్రాఁకిప్రాఁకి గంతవ్యముఁ జేరవలయును. త్రాఁడు తెగినచోఁ గ్రిందఁబడి నశించును గావున నది గట్టిగా నుండవలయును. తెంపువహించి ప్రాఁకవలయునని చెప్పితిని. ఎట్టి తెంపు వలయునందువా? ఐంద్రజాలికునివలన గజాదులట్లు ఎవనివలన సంసారప్రవృత్తిగలిగెనో యామూలపురుషుని బొందువఱకు పట్టువదలని తెంపువలయును. పురుషార్థసిద్ధికి నొండు మార్గము లేదు. ఇట్లు యత్నించిన సిద్ధి తప్పకగును. 4

ఇట్లుకృతనిశ్చయుఁడై అహంకారమోహంబులఁ బాసి, ఆకారణంబునఁ బుత్రవిత్తాదిసంగరూప దోషంబులను జయించి ప్రతిబంధకములు లేనివాఁడై ఆత్మజ్ఞాననిష్ఠ నిల్చునేని విషయంబులమీఁది కోరిక వలసపోవును. కోరిక నశించినంతనే సుఖదుఃఖాది ద్వంద్వంబులకు అతీతుఁడగును. ఇట్టి నివృత్తజ్ఞాని త్రివిధపరిచ్ఛేద శూన్యమైన పదంబును అనఁగా ముక్తినిఁ బడయును.

సూర్యుఁడు చంద్రుఁడు, అగ్ని యీమూఁడు లోకప్రకాశకములు. ఈమూఁడింటి సహాయములేకయే బ్రహ్మపదము స్వతేజోవిరాజితమై స్వభాసకముగానుండును. సూర్యాది ప్రకాశాంతరములు లేకున్నను స్వయంప్రకాశరూపమై యపరోక్షమైయుండు నాస్వరూపంబును బొందినవారు మఱలరారు 6

(బ్రహ్మము గొప్పతేజోరూపంబున నుండునని యీశ్లోకంబు వచించునట్లు కొందఱు భావింతురనియు, ఈశ్లోకభావ మదిగాదనియు, బ్రహ్మసత్తామాత్రంబున సర్వసృష్టి గలుగుచున్నదని దీనియర్థమనియు శ్రీరామకృష్ణ పరమహంసగారు సెలవిచ్చిరి)

పొందునది జీవుఁడు, పొందఁబడునది బ్రహ్మము. జీవబ్రహ్మములకు అభేదముచెప్పుచో, అభేదమునకు వినాభావములేదు గావునను వినాభావము లేనివి పరస్పరమైక్యమగుటయే యసంగతము గావునను 'పొందుట' అనుమాటకే యప్పుడవకాశముండదనియు, భేదము చెప్పుచో 'సంయోగాః విప్రయోగాం

తాః' అను శాస్త్రప్రకారము సంయోగమునొందినదానికి వియోగము దప్పదు గావున జీవబ్రహ్మము లొకవేళ పరస్పరముకూడినను మరల విడిపడుటం జేసి 'పొందినవారు మరలరారు' అనిచెప్పుటకు వలనుపడదనియు, స్వర్గాదులను బొందినవారట్లు బ్రహ్మమును బొందినవారుగూడ తిరిగివచ్చుదురనియు, ఎట్లు విచారించినను 'యద్గత్వా ననివర్తంతే' 'ఏదిపొంది మరలరారో' అా చెప్పుట సరిపోదనియు శంకింపవచ్చును సమాధానము వినుము

సురనర పశుపక్ష్యాదిరూపంబులఁ గాన్పించు సమస్త జీవలోకమునందు జీవభావమునొంది యేదున్నదో, శరీరములు పుట్టుచు గిట్టుచున్నను ఏది జనన మరణంబులులేక నిత్యమైయుండునో, దేనినిగూర్చి మొదటియారుఅధ్యాయంబులలోఁ జెప్పితినో, యట్టియాత్మ పరబ్రహ్మమునైన నాయంశమే గాని వద్భిన్నము గాదు ఆత్మకు బ్రహ్మప్రాప్తియనుట కేవల వ్యావహారికము 7

అప్రాప్తప్రాప్తియని ప్రాప్తప్రాప్తియని ప్రాప్తి రెండు విధములు ఒక గ్రామమునుండ బయలుదేరి మఱియొక గ్రామముచేరుట అప్రాప్త ప్రాప్తియగును కంఠచామీకరణాదిప్రాప్తి ప్రాప్తప్రాప్తియగును కంఠమందే హారముండఁగా భ్రమవలన నదియందు లేదనుకొని యందందు వెదకి క్రమమెట్టి మెడయందే యదియుండుట గ్రహించి హారము దొరికినట్లు తలంచుట కంఠచామీకరణ ప్రాప్తియందురు. ఇట్టిది ప్రాప్తప్రాప్తియగును ఇందు భ్రమనివృత్తిమాత్రమే ప్రాప్తవ్యవహారముగాని వేఱుగాదు

జీవునకు బ్రహ్మప్రాప్తియనుట, అప్రాప్తప్రాప్తిరూపమా ? ప్రాప్తప్రాప్తిరూపమా ? అను విషయము నెఱుంగవలయును 'బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి'—'విముక్తశ్చ విముచ్యతే' అను శ్రుతులవలన జీవునకుఁగల బ్రహ్మప్రాప్తి ప్రాప్తప్రాప్తిరూపమని స్పష్టము 'నిత్యప్రాప్తస్య చాప్రాప్తి ర్ద్విభ్రమతః ఖలు దేహినామ్ । విభ్రమస్య నివృత్త్యా సా ప్రాప్తేతి వ్యపదిశ్యతే' అను సూతసంహితావాక్యంబుగూడ ఇదే యభిప్రాయంబును దృఢపఱచుచున్నది

జీవుఁడు బ్రహ్మస్వరూపుఁడై బ్రహ్మభావము నెల్లప్పుడుఁ బొందియే

యుండును ; క్రొత్తగా నిప్పుడు పొందవలసినదిలేదు నిత్యప్రాప్త బ్రహ్మ భావుఁడైన జీవుని అజ్ఞానవశంబున వేఱుగా భావింతురు ఈయజ్ఞానమెప్పుడు తీఱునో యప్పుడే సత్యము స్పష్టమగును ఇదే యర్థంబును 'సయోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతో౽ధిగచ్ఛతి' అనుచోటఁ దెలుపఁబడినది కావున బ్రహ్మాంశమై బ్రహ్మభూతుఁడైయున్న జవునకు బ్రహ్మప్రాప్తి విరుద్ధము గాదు

బ్రహ్మాంశమనఁగానేమి ? బ్రహ్మము సర్వగతుఁడు, వానికి అంశ ములు అనఁగా భాగములు గలుగవు అంశములు గలిగింపనగునేని బ్రహ్మము నశ్వరుఁడగునేగాని శాశ్వతుఁడు గాఁడు నుఁభగ్రాహ్యార్థము జీవుఁడు బ్రహ్మాంశమోయన నున్నాఁడని వచించుటగా గ్రహింపవలయును నిదర్శనము వినుము మహాకాశములేని చోటులేదు మహాకాశములో నొకఘటంబు నుంచినచో ఆఘటములోఁగూడ ఆకాశముండును ఘటము వెలుపలనున్న యాకాశంబునకు ఘటములోనున్న యాకాశంమునకు భేదములేదు రెండు నొక్కటే అయినను ఘటమను నావరణంబులో నున్నందున దానిని ఘటా కాశంబనియు, దాని వెలుపలనున్నది మహాకాశంబనియుఁ జెప్పఁటఁగలదు అట్లే పరబ్రహ్మము సర్వవ్యాపియైయున్నను శరీరమనునట్టి యావరణంబులో నున్నందున జీవుఁడనియు, శరీరబాహ్యంబుననున్నది, పరమాత్మయనియు ను లభగ్రాహ్యార్థము చెప్పుదురు

ఘటము పగిలినప్పుడు ఘటములోని యాకాశము మహాకాశములోఁ గలిసినదందురు ఆకాశము సర్వదా కలిసియేయుండునుగాని వేఱయియుండదు అడ్డముండిన ఘటముమాత్రము తొలఁగినది అయినను వ్యవహారార్థము ఘటా కాశము మహాకాశములోఁ గలిసినదందురు మహాకాశమునకు ఘటాకాశం బునకు వేఱుచేయుటయేని మహాకాశము పరిచ్ఛేదయోగ్యమై అపరిపూర్ణ మగును. అట్టిదానికి నాశము తప్పదు అట్లే పరమాత్మగూడ సర్వాంతర్యా మియై యుండును పరమాత్మ జీవరూపంబున శరీరములోనున్నంతనే విభక్త మని భావింపరాదు విభక్తమునకుఁ బూర్ణత్వము ఘటింపదు పూర్ణముగానిది నశ్వరమగును. కావున నజ్ఞానఁబునఁ బరమాత్మ జీవాత్మలు భిన్నములుగా

భావింపఁబడుచున్నవనియు, అజ్ఞానజమైన భ్రమ తొలఁగినప్పుడు పరమాత్మ జీవాత్మ లొక్కటేయను విషయము స్పష్టపడుననియు గ్రహింపవలయును.

'బ్రహ్మమునకన్న జీవుఁడు వేఱుగాకుండుఁగాక, జీవునకు బ్రహ్మ భావప్రాప్తియగుఁగాక, 'యద్గత్వా న నివర్తంతే' అనఁగా బ్రహ్మమును బొందినవాఁడు మరల రాఁడంటివిగదా సుషుప్తియందుఁగూడ జీవునకు బ్రహ్మ ప్రాప్తి కలుగుచున్నది మేల్కాంచినంతనే అట్టిప్రాప్తినుండి జీవుఁడు వేఱుపడి మఱలవచ్చుచున్నాఁడు గదా అట్లుగాదేని సుషుప్తియే ముక్తియగును, ముక్తియగునేని పునరుత్థానమే గలుగరాదు కావున బ్రహ్మభావమును బొందిన జీవుఁడు మఱలరాఁడు' 'అనుట పొసగదు' అని వాదింపవచ్చును జీవుఁడు సుషుప్తకాలమందు బ్రహ్మభావమును బొందుటలేదు జీవుఁడప్పుడు లీనుఁడైయుండును. భోగజనకమైన కర్మ ముదయించఁగానే చక్షురాదులైన పంచేంద్రియంబులు మనస్సు ఈయాఱింటిని సుషుప్తియం దజ్ఞానలీనుఁడైయున్న జీవుఁ డాకర్షించును. అట్లాకర్షించి జీవుఁడు సంసారపునరావృత్తుఁడగును జ్ఞానియన్నచో యట్లుగాదు. జ్ఞానికి అజ్ఞానము నశించియున్నది అందువలన నతఁడు బ్రహ్మభావంబును బొందియుండును భోగజనకకర్మములు వానికి లేవు అందువలన వానికి సంసారపునరావృత్తికిఁ గారణములేదు కారణములేని కార్యము గలుగదుగదా కావున సుషుప్తబ్రహ్మభావప్రాప్తి కాదనియు జ్ఞానికి అజ్ఞానికిఁగల భేదమిట్టిదనియు గ్రహింపనగు

మనస్సు పంచేంద్రియంబులు—వీనిని జీవుఁ డాకర్షించునంటివిని ఎప్పుడాకర్షించునో వినుము

దేహేంద్రియాదులకు స్వామియైన జీవుఁడు సుషుప్తియందు శరీరముతో సంబంధమువదలి బహిర్గతుఁడగును, ప్రబోధకాలంబున శరీరంబును మఱలఁ బ్రవేశించును శరీరమునుండి జీవుఁడు బహిర్గతుఁడగునప్పుడు పంచేంద్రియంబులను మనస్సు నాకర్షించి వెంటఁగొనిపోవుచు మఱల శరీరంబును ప్రవేశించునప్పుడు వానితోడ వచ్చుచుండును వాయువు స్రక్చందనకర్పూరాది గంధాత్మక సూక్ష్మాంశంబుల నాకర్షించి కొనిపోవునట్లు జీవుఁడు నయ్యాఱింటి సూక్ష్మాంశంబుఁ గొనిపోవుచుండును ఈయాకర్షణ మేలయందువా? 8

జీవుఁడు శ్రోత్ర చక్షుస్స్పర్శన రసన ఘ్రాణంబులను పంచబాహ్యేంద్రి
యములను మనస్సు అనునట్టి యంతరింద్రియంబును కరచరణాది కర్మేంద్రియం
బులను ప్రాణంబును అధిష్ఠించి శబ్దాదులైన విషయంబుల ననుభవించును విష
యభోగార్థము జీవుఁడిట్లు ఇంద్రియంబుల నాకర్షించునని గ్రహింపుము, 9
జీవుఁడిట్లు శరీరస్థుఁడైయున్నప్పుడుగనీ ఒక దేహంబును వదలి దేహాంతరగతుఁ
డగునప్పుడుగానీ సుఖదుఃఖ మోహాత్మకములైన సత్త్వరజస్తమోగుణంబుల
ద్వారమున విషయంబులను భోగించుచు నిట్లు సర్వావస్థలయందు దర్శనయోగ్యుఁ
డైయున్నను మూఢులు దేహమే యాత్మయను మోహమునకుఁ జిక్కియుండు
టంజేసి వానినిఁ జూడకున్నారు ఇట్టిమందమతుల దురదృష్టమేమనవలయు ?
జ్ఞాననేత్రులు అనఁగా శాస్త్రపరిశీలనంబునను గురూపదేశంబునను దేహాత్మ
వివేకముగలవారు జీవుని స్పష్టముగాఁజూతురు వారిభాగ్యమే భాగ్యము 10

ఆత్మ శరీరములోనున్నను దేహాతిరిక్తముగానుండును. ఈరహస్యంబును
యోగులు ధ్యానాదులవలనఁ జూడనేర్తురు కర్తవ్యకర్మాచరణంబున నంతః
కరణశుద్ధి పడయనివారికి ధ్యానము సిద్ధింపదు గావున నట్టివారు తమదేహాంత
రంబున నున్నట్టి యాత్మనే చూడనోపరు సత్త్వశుద్ధిగలవారికి మాత్రమే
నిదిధ్యాస సహాయంబున ఆత్మదర్శనమగును 11

అర్జునా! సంసారస్వరూపంబును నిరూపించితిని, భక్తిజ్ఞాన వైరాగ్యం
బులవలన సంసారనివృత్తియగునని తెలిపితిని, బ్రహ్మప్రాప్తి యనఁగా నేమో
వివరించితిని, ఇఁక బ్రహ్మస్వరూపంబును వినుము

సూర్యచంద్రాగ్నులందుండి యే తేజస్సు సమస్తజగత్తును వెలిగించుచు
న్నదో 12 పరస్పరసంబంధములేక విశీర్ణములైన యణువుల నొక్కటిగాఁ
గూర్చి భూమిని నిర్మించి యందలి చరాచరంబులనే శక్తి భరించుచున్నదో,
అమృతరసమయమగు సోముఁడై ధాన్యాది సమస్తౌషధుల నేది పెంచి పుష్టి
మంతములు చేయుచున్నదో 13 జఠరాగ్నియై ప్రాణులదేహము సొచ్చి
తదగ్నికి నుద్దీపకంబులగు ప్రాణాపానవాయువులను రేపి జీవకోటి భక్షించు
భక్ష్యభోజ్య లేహ్యచోష్య పదార్థంబులనెల్ల జీర్ణించి యన్నముగా నేదిగావించు

చున్నదో యదియెల్ల నేనేయని గ్రహింపుము బ్రహ్మస్వరూపము తేజశ్శక్తిరూపంబున నుందునని భావము 14

దంతంబుల సహాయంబున ఖండించి తినునట్టి రొట్టె మొదలగునవి భక్ష్యములు, నాలుకతోమాత్రము చప్పరించి మ్రింగునట్టి పాయసాదులు భోజ్యములు, నాలుకమీఁదనుంచినంతనే కరఁగి నీరగునట్టి ఫలరసాయనాదులు లేహ్యములు, దంతంబులతోనపలి సారమునుమాత్రము గ్రహించి పిప్పియుమ్మునట్టి చెఱుకు మొదలగునవి చోష్యములు ఈచతుర్విధాన్నంబును భగవంతుఁడు జఠరాగ్నిరూపంబున లోననుండి పచనముచేయుచున్నాఁడు.

(భగవంతుని విభూతులిట్లు సంక్షిప్తంబుగాఁ జెప్పుటవలనఁ బరిచ్ఛిన్నత్వము నిరసింపఁబడునేగాని తదియ సర్వాత్మకత్వము ప్రకటితము గాదనవచ్చునని శంకించి చెప్పుచున్నాఁడు)

ఆత్మనై బ్రహ్మాది స్థావరాంతము సర్వప్రాణికోటి బుద్ధియందుండి వానికి స్మృతియు జ్ఞానము అపోహనము గలిగించుచు నుందును ఇట్లు సర్వాత్మకుఁడనగుట వేదంబులవలన గ్రహింపనగును వేదజ్ఞుఁడను వేదవేద్యుఁడను వేదాంతార్థ సంప్రదాయప్రవర్తక తత్త్వజ్ఞాన గురూత్తముఁడ నగుటంజేసి నాయుపదేశము పరమవిశ్వసనీయము నామతంబునకు భిన్నముగా నుపదేశించువాఁడు గురువుఁగాఁడు వేదాంతవేత్తగాఁడు 15

పూర్వమనుభవించిన విషయముల జ్ఞానము స్మృతియగును, విషయేంద్రియసంయోగంబునఁ బుట్టుచుఁ బ్రకృత మనుభవరూపంబున నుండునట్టిది జ్ఞానమగును స్మృతిజ్ఞానంబులు రెండులేకుండుట అపోహమగును సుకృతులకు స్మృతిజ్ఞానంబులు దుష్కృతులకు అపోహము వారివారి పూర్వకర్మానుసారంబుగా భగవంతుఁడు గలిగించుచుండునని భావము.

నాపరమోపదేశమేమందువా ?

క్షరమని అక్షరమని లోకములో రెండు గలవు. నశించు స్వభావము గలది క్షరము, అట్టి స్వభావములేనిది అక్షరము ఈక్షరాక్షరంబులను పురుషులనిగూడ వ్యవహరించుట గలదు కార్యజాతమైన ప్రపంచమెల్ల క్షరము,

ఈకార్యజాతమునకుఁ గారణోపాధియైన పారమేశ్వర మాయాశక్తి అక్షరము ఈక్షరాక్షరంబులు రెండును జడములేగాని వేఱుగాదు 16 క్షరాక్షరము లైన యీరెండు జడరాసులకన్న వేఱైనది మఱియొకటిగలదు అది నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావమైయుండును దానిఁ బరమాత్మయనియుఁ బరమే శ్వరుఁడనియుఁ జెప్పుదురు అది నిర్వికారము నిర్వికారమయ్యు నది స్వ మాయాశక్తివలన ముజ్జగంబు లధిష్ఠించి భరించుచుండు దానినే యుత్తమపురు షుఁడందురు క్షరము అధమపురుషుఁడు, అక్షరము మధ్యమపురుషుఁడు, నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావనిర్వికార బ్రహ్మము ఉత్తమ పురుషుఁడు 17

క్షరాక్షరములు రెండు జడములైనను అందు అక్షరమునకుమాత్రము నాశనములేదు. పరమాత్మకు నాశములేదని పూర్వమే చెప్పియున్నాఁడు. పరమాత్మ అక్షరమునకన్న వేఱనిగూడఁ జెప్పియున్నాడు దీనింబట్టి పర మాత్మకు అక్షరమునకు రెంటికి నాశము లేదని యేర్పడుచున్నది నాశములేనిది ఒక్కటేగాని రెండుగలుగవని అద్వైతసిద్ధాంతమైయుండఁగా నాశములేనివి రెండుగలవని చెప్పుటవలన అద్వైతసిద్ధాంతమునకే భంగముగాదాయని శంకింప వచ్చును.

అక్షరము కారణోపాధికము గావున సంసారమునకు హేతువగుచున్నది సంసారబీజమునకు అంతము గాన్పింపదు. అది ఎప్పుడువచ్చినది ఎప్పుడు నశించునని కాలనిర్ణయముచేయ సాధ్యముగాదు ఆయర్థంబున అక్షరంబు నకు నాశములేదనుటయేగాని 'ఎప్పుడును నశించునదికాదు' అనునర్థంబునఁ గాదు అక్షరమునకు నాశముమాత్రము గలదు ఎట్లందువా? అక్షరము కా రణోపాధిగాఁగల సంసారము మాయోపాధికము, మాయ బ్రహ్మజ్ఞానంబున నశించును మాయతోడ సంసారముగూడ నశించుచున్నది కావున అక్ష రమునకు నాశము స్పష్టము పరమాత్మకన్ననో యెప్పుడుగానీ నాశములేదు అక్షరమునకుఁ బరమాత్మకుఁగల భేదమిదియని గ్రహింపుము

(క్షరాక్షరపురుషోత్తముల విషయమై మతభేదముగలదు అక్షరమనఁ గా జీవుఁడని శ్రీధరాచార్యులు వ్రాసిరి జీవుఁడే పురుషోత్తముఁడని యీ గ్రంథసందర్భము వివరించుచున్నది అక్షరమే జీవుఁడైనచో క్షరము జీవుఁడు

అను రెండుమాత్రముండును మూఁడున్నఁగాని ఉత్తమశబ్దము ప్రయోగింప వలనుపడదు కావునఁ బురుషోత్తమునకు అవకాశముండదు మఱియు క్షరాక్షరంబులను రెండు పురుషులుగాక మఱియొకటి గలదనియు దానిని పురుషోత్తముఁడందురనియు గీత చెప్పు విషయమునకే వ్యతిరేకమగును కావున అక్షరమనఁగా జవుఁడనుటకు వలనుగలుగదు )

(క్షరుఁడనఁగా బద్ధజీవుఁడనియు, అక్షరుఁడనఁగా ముక్తజీవుఁడనియు ఈరెంటికి వేఱయినది పరమాత్మగలదనియు, అదియే పురుషోత్తముఁడని చెప్పఁబడుచున్నదనియు శ్రీరామానుజాచార్యులు వ్రాసిరి 'క్షరఃసర్వాణి భూతాని' అని మూలము దీనింబట్టి ఎల్లభూతంబులు క్షరములగును భూతశబ్దంబునకు జీవుఁడను నర్థంబును జెప్పుదుమేని, ఎల్లభూతంబులు క్షరములన్నప్పుడు ఎల్లజీవులు క్షరములని చెప్పుటగును క్షరము బద్ధజీవుఁడని యాచార్యులవారు వ్రాసిరి గాన నెల్లజీవులు బద్ధులగుదురు ఎల్లజీవులు బద్ధులైనచో 'కూటస్థోఽక్షర' అను యన్నప్పుడు అక్షరుఁడు ముక్తజీవుఁడు గావున ముక్తజీవుఁడే యుండుటకు నవకాశముండదు మఱియు ముక్తజీవుఁడు పరమాత్మతో సామ్యుఁడనివారి మతము అట్లు చెప్పుచోఁ బరమాత్మగూడ ముక్తుఁడవుఁడగును. ఆపక్షమునఁ బరమాత్మకుఁ బురుషోత్తమత్వము సిద్ధింపదు పరమసామ్యులలో ఉత్తమ మధ్యమము లుండవుగదా ముక్తులకుఁ బరమాత్మకు ఆనందాంశంబుననే సామ్యముగాని సర్వాంశంబులందు సామ్యము చెప్పలేదనియు జగత్స్రష్టృత్వము ఈశ్వరునకేగాని జీవునకులేదనియు శేషశేషిత్వ న్యాయమునుబట్టిగూడ జీవేశ్వరులకు సర్వాంశసామ్యము పొసఁగదనియు వారు వాదింపవచ్చును అట్లగుచో రాజభృత్యులకట్లు శేషశేషులకుఁగూడ ఆనందాంశంబున సయితము తారతమ్యము తప్పదు కావున నెట్టిసామ్యము చెప్పఁదరముగాదు )

కార్యజాతమైన క్షరమునకంటెను, అనఁగా సంసారమునకంటెను సంసారమునకు బీజభూతమగు నక్షరమగు మాయాశక్తికంటెను పైనుండునట్టి యుత్కృష్టుఁడను గావున నన్నుఁ బురుషోత్తముఁడని లోకులు వేదములు నిర్వచించును 18

నా నామనిర్వచనజ్ఞానమువలనఁ గలుగు ఫలమేమందువా ?

అర్జునా! నా నామనిర్వచనజ్ఞానము స్ఫుటమైనవానికి భగవంతు పరిచ్ఛిన్నుఁడను నజ్ఞానముపోయి, నిఖిల జగదధిష్ఠానభూతుఁడు నిత్యశుద్ధ ముక్తస్వభావుఁడు అద్వితీయుఁడు అనుజ్ఞానము సిద్ధించును  ఇట్టి జ్ఞానము గినవాఁడు సర్వజ్ఞుడై 'వాసుదేవః సర్వ' మను సర్వాత్మకత్వభావముతో న భజించును. ఈభజనఫలంబుగా వానికి ముక్తియగును

అర్జునా! బ్రహ్మతత్త్వజ్ఞానులకు బ్రహ్మభావాపత్తిరూప ముక్తియ ననుటయే గీతాశాస్త్రసారము. ఇది పరమరహస్యము. నీవు అనఘ వగుటంజేసి యట్టిదానినిగూడఁ దెలిపితిని. ఈయధ్యాయార్థరూపమైన శాస్త్ర ము నెఱుంగు బుద్ధిమంతుఁడు సర్వ శాస్త్రార్థ జ్ఞానవంతుఁడును గృతకృత్యు నగును.



# గీతాహృదయము.

---

## పదునాఱవ యధ్యాయము.

బ్రహ్మాత్మతత్త్వజ్ఞానికి బ్రహ్మభావాపత్తిరూపమైన ముక్తి గలుగునని పదునేనవయధ్యాయములోఁ జెప్పఁబడినది ఈ బ్రహ్మాత్మైతత్త్వజ్ఞానమునకు అధికారియెవఁడో యీయధ్యాయములోఁ జెప్పఁబడును. జ్ఞానాధికారికి దైవీసంపద ముఖ్యముగావున దానింగూర్చి శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అభయము—ఇష్టవియోగము వచ్చినప్పుడు దుఃఖము అనిష్టప్రాప్తికి హేతువులు గాన్పించినప్పుడు భయము లేకుండుట, (శాస్త్రవచనంబును సందేహింపక యనుష్ఠించు నిష్ఠగూడ అభయమగును) సత్త్వసంశుద్ధి—అంతఃకరణ నిర్మలత్వము, (సత్త్వశుద్ధియన్న జాలును, 'సత్త్వసంశుద్ధి' యను టేలయని శంకింపవచ్చును భగవత్తత్త్వస్ఫూర్తికి యోగ్యమైనంత నిర్మలంబుగా అంతకరణముండవలయునని సూచించుటకై 'సంశుద్ధి' అని చెప్పఁబడెనని గ్రహింపవగును) జ్ఞానము—ఆత్మతత్త్వమునుగూర్చి శాస్త్రాచార్యోపదేశంబువలనఁ దెలిసికొనుట, యోగము—తెలిసికొన్న యర్థంబును జిత్తైకాగ్ర్యంబుతో స్వానుభమునకుఁ దెచ్చికొనుట, జ్ఞానయోగవ్యవస్థితి—ఎఱంగిన తత్త్వంబు అనుభవసిద్ధమగుటకుగా నిరంతరము తన్నిష్ఠుఁడైయుండుట, దానము—యథాస్థితి తనద్రవ్యంబును బాత్రకు నిచ్చుట, దమము—బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞము—అగ్నిహోత్ర దర్శపూర్ణమాది శ్రౌతములు దేవపితృభూతమనుష్య యజ్ఞములను స్మార్తములు, స్వాధ్యాయము—బ్రహ్మయజ్ఞము ఈ శ్రౌతస్మార్త బ్రహ్మయజ్ఞంబు లొనర్చుట, తపము—శారీరక వాచిక మానసికములగు త్రివిధతపంబు సేయుట, ఆర్జవము—మనోవాక్కాయవృత్తు లేకరూపంబున నుండుట 1 అహింస-మనోవాక్కాయంబులవలన నితరులకు బాధ కలిగింపకుండుట, సత్యము—ఉన్నదియున్నట్లు చెప్పుట, అక్రోధము—పరులు కోపించినను బైఁబడి కొట్టినను వారియెడ తత్కాలంబున గలుగుఁ గ్రోధము నడఁచివైచుట, త్యాగము—దుఃఖసంగపరిత్యాగము, శాంతి—అంతరింద్రియము

యొక్క యుపరతి, అపైశునము—ఒరులదోషంబులు వెల్లడించు స్వభావము లేకుండుట, భూతదయ—కష్టపడు భూతంబుల దుఃఖంబును సహింపలేమి, అలోలుప్త్వము—ఇంద్రియములకు విషయంబులతోడ సంబంధము గలిగినను వికారము చెందకుండుట, మార్దవము—సాధుజనుల సంశ్లేషంబునకు యోగ్యతఁ గలిగియుండుట, హ్రీ—చేయరానిది చేయుటకు లజ్జించుట, అచాపలము-వృథాచేష్టలు లేకుండుట; 2 తేజము—ప్రాగల్భ్యము అనఁగా స్త్రీబాలమూఢులకుఁ జులుకన కాకుండుట, క్షమ—పరిభవము గలిగినప్పుడు తన్నివారణంబునకు సమర్థుఁడైయుండియుఁ గ్రోధము చెందకుండుట, (క్షమకు అక్రోధమునకుఁగల తారతమ్యమును గ్రహింపవలయును) ధృతి—చిత్తము దుఃఖాదులవలన విసుగుచెందక స్థిరముగానుండుట, శౌచము—బాహ్యాంతరశుద్ధి, అద్రోహము—పరహింసార్థము శస్త్రాదులను గ్రహింపకుండుట, నాతిమానిత—నేను పూజ్యుండనను భావము లేకుండుట, పూజ్యులయెడ నమ్రభావము వహించుట యనియర్థము—ఈయిరువదియాఱు ధర్మంబులు సాత్త్విక శుభవాసనారూపంబులు ఇవి పుణ్యకర్మవశంబున శరీరారంభకాలంబునందే గలుగును ఇవి దేవయోగ్యములు గావున వీనికలిమి దైవసంపద యందురు ఇట్టి దైవీసంపత్తితోఁ బుట్టినవారు తత్త్వజ్ఞానాధికారులగుదురు 3

దంభము—తానొనర్చు ధర్మంబులు లోకవిదితము కావలయునని చాటించుట, దర్పము—ధనవిద్యాదులుగలవని గర్వించుట, అతిమానిత—నేను మహాపూజ్యుఁడనను అహంభావము, క్రోధము—చిత్తవృత్తి యెప్పుడు మండుచుండుట, పారుష్యము—నిష్ఠురత్వము, అజ్ఞానము—తగువు తగములు తెలిసికొనకుండుట, ఈయాఱుదోషంబులు రజస్తమోమయములైన యశుభవాసనలు ఇవి యసురయోగ్యములు గావున వీనిని ఆసురసంపదయందురు అర్జునా! మర్త్యులకు నివి పుట్టువుతోనవచ్చును. 4

దైవీసంపదతోఁ బుట్టినవారికి జ్ఞానము, జ్ఞానమువలన మోక్షము గలుగును ఆసురీసంపదతోఁ బుట్టినవారికి అజ్ఞానము, అజ్ఞానమువలన జననమరణరూపమైన నిత్యసంసారబంధము నగును. అర్జునా! ఈసంగతి విన్నంతనే నీముఖము మాటినది, నీతలంపు గ్రహించితిని దైవీసంపత్తితోఁ బుట్టితినో

ఆసురీసంపదతోఁ బుట్టితినో యని సందేహించుచు లోలోనఁ జింతించుచున్నావు, చింతమానుము దైవీసంపదతోఁ బుట్టితివి, సందేహమువలదు 5

అర్జునా! మనుష్యులు దైవప్రకృతివంతులుగానో అసురప్రకృతివంతులుగానో యీలోకంబున జనింతురు (అసురప్రకృతికి రాక్షసప్రకృతియు మోహనప్రకృతియు అంతర్భావములు గావున నవి ప్రత్యేకించి చెప్పఁబడవు విధివిహితము గానట్టి హింసాదిద్వేషము ప్రధానముగాఁగలది రాక్షసప్రకృతి, శాస్త్రార్థజ్ఞానభ్రంశమునకు హేతువైనది మోహినిప్రకృతి, శాస్త్రము సమ్మతింపని విషయభోగంబులకు హేతువైన రాగము ప్రధానముగాఁగలది ఆసురీప్రకృతి ఈమూడు ప్రకృతులకు వేర్వేఱు లక్షణములున్నను శాస్త్రనిషిద్ధకర్మాచరణంబునకు గారణభూతమైన ప్రకృతి మూఁడింటికి సామాన్యము గావున మూఁటిని గలిపి ఆసురీప్రకృతి క్రిందఁజెప్పుట అయుక్తముఁగాదు) దైవప్రకృతిలక్షణములు అనఁగా అభయము మున్నగునవి మొదటి మూఁడు శ్లోకములలోఁ జెప్పఁబడినవి ఆసురీప్రకృతిని విస్తరించి చెప్పెద వినుము (7 మొదలు 18-వ శ్లోకమువఱకు ఆసురీప్రకృతి విస్తరింపఁబడుచున్నది) 6

ప్రవృత్తి—ధర్మమాచరించుట నివృత్తి—అధర్మమును వర్జించుట—ఇవి విధివిధానములు ఆసురస్వభావము గలవారు ధర్మమని యాచరింపరు, అధర్మమని వర్జింపరు ధర్మాధర్మ విచికిత్సయే వారికిఁ గలుగదు అందువలన బాహ్యశుచిగాని అంతశ్శుచిగాని, వానికి హేతుభూతమైన యాచారముగాని, ఆచారమునకు మూలప్రమాణభూతమైనట్టిదియు శ్రుతిస్మృతిఇతిహాస పురాణాదికమైనట్టిదియు నగు సత్యంబు గాని వారెఱుంగరు అనఁగా అసురులు శౌచము ఆచారము వేదశాస్త్రజ్ఞానపరిత్వము లేకయుందురు 7

దర్మాధర్మంబులను నిబంధించు వేదశాస్త్రంబులను ప్రమాణముగా నంగీకరింపనిచో సుఖదుఃఖాదివ్యవస్థ లోకములో నెట్లగునని శంకింపవచ్చును

వేదశాస్త్రములు ప్రమాణములనుటే ప్రమాదమనియు, సుఖదు —వ్యవస్థకు ధర్మాధర్మంబు లెంతమాత్రము గారణములు గావనియు, ఈశ్వరుఁ

జేసువాఁడుండుట అతఁడు శుభాశుభకర్మఫలంబులిచ్చుట వట్టిబూటకమనియు, లోకములోఁ గాన్పించు సుఖదుఃఖ వైచిత్రి యెల్ల స్వాభావికమనియు ఆసురి మతమువారు వచింతురు. ఈశ్వరుఁడు ధర్మాధర్మముల మూలంబున జగత్తును బుట్టించుననియు, ఈశ్వరుఁడే లేనిచో జగదుత్పత్తియే యుండదనియు ఆస్తికుల మతము. ఆస్తికమతంబును వారంగీకరింపరు. కావ ప్రయుక్తులైన స్త్రీపురుషుల సంగమంబున జగత్తు గలుగుచున్నదనియు, జగదుత్పత్తికిఁ గామమే కారణమని యు నాశస్తికులు వాదింతురు. ఈశ్వరుని పేరే వారు విన సహింపరు. జగదుత్పత్తికిఁగామము కారణమగుటఁ గన్నారఁజూచుచుఁ గంటికిఁ గాన్పింపని యీశ్వరునకు నదిమూఁటగట్టుట వెఱ్ఱితనమందురు.

ఈతెగవారిని లోకాయతనులందురు. విరివతము నాశ్రయించినవారు తాము నష్టాత్ములగుటయేగాక 'స్వయంనష్టః పరానపి నాశయతి' అను న్యాయప్రకారము పరనాశమునకుఁ గారకులగుచున్నారు. ఈలోకాయతనులు మిక్కిలి యల్పబుద్ధులు, కేవల విషయపరాయణులు, వారికిఁ బాపభయమే లేదు, ఎంతకైన సాహసింతురు. వారి జననమే లోకకంటకము. 'గతానుగతి కో లోకః' అనునట్లు జనులొకరినొకరనుకరింతురు గావునను, లోకాయతనుల మనోవాక్కాయవృత్తులు కేవల భోగపరములై సామాన్యులకుఁ జవులూరించుచుండుఁ గావునను, వారు సర్వనాశకులగుదురు. ఇట్టి దుష్టులు సర్వవ్యాఘ్రాదిరూపంబుల జనించి క్రూరకర్మములొనర్చి ప్రాణిజాతికి హాని గలిగించుచుందురు. వారిమార్గము అధోగతికి హేతువు గావున ఆత్మశ్రేయము గోరువారెన్నడు నట్టి చెనటుల ననుసరింపరాదు. 9

లోకాయతనులు నష్టాత్ములంటిని. ఎట్లంటేని వినుము. కామమునే వారారాధింతురు గావున తదనుగుణమైన యవివేకపిశాచము వారిని బట్టియుండును. వివేకము లేమింజేసి తలంపులు దుష్టములుగానుండును. 'ఈ మంత్రముతో నీదేవత నారాధించినచో స్త్రీలు వశలగుదురు, ఈమంత్రముతో నీదేవతను జపించినచో రాజవశీకరణుగును, ఈమంత్రంబున స్తంభనాది సిద్ధులగును' అని క్షుద్రదేవతల నారాధించుట, తత్ఫలభూతములైన సిద్ధులను బడయుట, మున్నగు తుచ్ఛవిషయములందే మునిఁగి, వామాగమమునందుఁగల

మద్యమాంసాది సాధనములతో నశుచివ్రతము లాచరించుచుందురు. మఱియు దంభమానమదంబుల విఱ్ఱవీఁగుచుందురు (లోలోనఁ బాపాచారము లాచరించుచున్నను బరమేశ్వరోపాసకులను ఖ్యాతికై తమ ధార్మికత్వమును ప్రకటించుట దంభమగును. దంభమువలనఁ గలుగు లోకమాన్యత్వము మానమనఁబడును. దంభమానంబులవలన జనించు గర్వము మదమనఁబడును) 10

ఈలోకాయతనులు తమ యోగక్షేమంబులకై పన్ను పన్నుగడ లిన్ని యని యెన్నరాదు; వారి మరణముతో నవి యంతరింపవలయునే గాని యీలోపల నంతరింపవు, నేఁడుగాకున్నను రేపైనియు నశించు శరీరముల యుపభోగార్థము వారు బ్రహ్మప్రళయాంతముగా నాలోచించుచుందురు. వారి చింతనములెల్ల నిహలోకసంబంధములు, పరలోకముగలదని ప్రమాదవశంబునఁ గూడఁ దలంపరు. ఏలయందువా? విషయోపభోగపరత్వమే కారణము. విషయోపభోగంబునకు మించిన పురుషార్థముగలదని వారు కలలోఁగూడఁ దలంపరు. జీవమున్నంత కాలము హాయిగాఁ దినుట త్రాఁగుట భోగించుట- ఇదియే జీవితపరమావధియనియు, శరీర వియోగానంతరము భోగ్యముగాని సుఖముగాని లేదనియు, ఎల్లభోగములకు శరీరమే ప్రధానమనియు వారి నిశ్చయము 11

స్వార్థపరములైన యాశాపాశంబులతోఁ గట్టువడియుండుటం జేసి వలయునేని వారు తత్సిద్ధికై పరాపకారమునకు వెనుదీయరు. అందువలన వారు కామక్రోధవశులై యవి లాగినట్లు పోవుచు కామభోగార్థము అన్యాయమునకు వెఱువక చౌర్యవంచనాదు లొనర్చియైనను ధనసంపాదనంబునకుఁ గడంగుదురు 12

వారి కామపరాయణత్వ మెట్టిదనిన—నేఁడీధనము కోరినట్లు లభించి
నది, రేపో యెల్లుండియో యింతధనమువచ్చును, ముందటి దింతయున్నది,
ఇఁకనింత సంపాదింతు—ననురూపంబున నంతములేకుండును 13 క్రోధ
పారవశ్యమెట్టిదనిన—దుర్జయుఁడైన యీశత్రువును నేఁడు మట్టుపెట్టితిని,
తక్కినవారినిగూడ రూపుమాపి వారి ధనక్షేత్రాదులు హరింతును. ఇంత
సామర్థ్య మెక్కడిదందువా? సర్వవిధ భోగోపకరణములు పుత్త్రభృత్యాది

సాహాయ్యసంపత్తి బలపరాక్రమములు 14 ఆరోగ్యము ధనము కులీనత మున్నగు సర్వవిధైశ్వర్యంబులతో నొప్పు నాకన్న నధికుఁడెవఁడు ?' అని విఱ్ఱవీగుచు, 'ఈయజ్ఞముచేసి ప్రతిష్ఠను సంపాదింతు, ఎదిరించినవారికిఁ దలవంపుఁ గూర్తు, నటాదుల కీధనమిత్తు, వారు స్తుతింతురు, ఆయానందముగూడ నాకగు' నను భావనా పరంపరలతోఁ గూడియుండును ఆసురస్వభావులిట్లు అజ్ఞానంబున వివిధమోహములకుఁ జిక్కియుందురు 15

వారిట్లు మోహజాలములో మత్స్యమువలెఁ జిక్కి వివిధసంకల్పంబులతోఁ బరిపరివిధంబుల భ్రాంతిల్లుచు అనిష్టసాధనములైనను భోగంబుల మానఁజాలక తదాసక్తిఁ గలిగి తుట్టతుదకు దినదినవర్ధమాన కల్మష నిబిడీకృతమైన మురికికూపంబునఁ బడుదురు 16

యజ్ఞయాగాది వైదిక ధర్మాచరణము స్వర్గప్రదమైయుండఁగా అట్టి వొనర్చునట్టి వారికిట్లు నరకప్రద మేలయగునని శంకింపవచ్చును

వారు ఆత్మసంభావితులు అనఁగా తమకన్న నధికులు లేరని తమకుఁ దామే శ్లాఘించుకొనుదురు ; ఇది గొప్పయవినీతి, ఇట్టివారు సాధుజన పూజ్యులుగారు అవినీతికిఁ దోడుగా ధనమానమదంబులుఁ గలిగి మైమఱచియుందురు గావున వారుగావించు యజ్ఞాదులు అసురప్రకృతిఁగలిగి నామమాత్రములుగా నుండును ప్రతికర్మమునకు భక్తిశ్రద్ధలు ప్రధానములుగాని కార్యబాహుళ్యము ప్రధానముగాదు భక్తిశ్రద్ధలు లేమింజేసి సద్గతి కలుగక పోవుటయు మానమదపురస్సరంబులు గావున దుర్గతివచ్చుటయుఁ గర్మములకు స్వాభావికఫలము. ఇది న్యాయమేగదా 17

ఇష్టసిద్ధికి యాగదానాదికము బహిరంగ సాధనభూతము శ్రద్ధాభక్తులు లేమింజేసి అవి వారికి నిష్టసిద్ధి నొసంగకుండుఁగాక వివేక వైరాగ్యాదికము అంతరంగసాధనము అవియేని వారికి సిద్ధించునా యని యందువుగాఁబోలు

అహంకారము—నాయట్టివాఁడు లేఁడను భావము, బలము—పరుల అవమానించు సామర్థ్యము, దర్పము-తిరస్కారభావము, కామము—పరదార

దనాభిలాషయు, క్రోధము—ప్రయత్నమునకుఁ బ్రాతికూల్యముగలిగినప్పుడు జనించు మనోద్వేగము, లచ్చాంతికిగానొనర్చు పరసంహారము—అహంకారము వలన బలము, బలమువలన దర్పము, దర్పమువలనఁ గామము, కామమువలనఁ గ్రోధము గలుగుచుండును ఆసురప్రకృతిగలవారు అహంకారాదుల నా శ్రయించియుందురు అహంకారాదులు నశించినఁగాని వివేక వైరాగ్యంబు లుదయింపవు కావున వారిని వివేక వైరాగ్యాదులకును గడుదూరము ఇంతటి పాపాత్ము లైనను నాకు భక్తిచేయుదురేని పవిత్రులై యిష్టసిద్ధిఁ బడయనగును నాపేరుగూడ వారు వినసహింపరు ఈద్వేషమునకుఁ గారణమేమందువా? వారి శరీరములోనుండునది నేనేయనుసంగతి తెలియమియే కారణము స్వదేహములోనున్న నన్నెట్లు ద్వేషింతురందువా? అంత ర్యామియు సర్వనియంతనై నేనుండుట యెఱుంగక 'ఎవఁడురా భగవంతుఁడు? సర్వము స్వబుద్ధిబలంబున నాకు జరుగుచున్నది, నన్ను నియమించువాఁ డెవఁడు?' అని భగవన్నియంతృభావ నిరసనరూపమైన ద్వేషము వహింతురు ఇది స్వదేహాంతర భగవద్ద్వేషమగును రామకృష్ణాది భగవద్విగ్రహంబులకు జరుగు అతిమానుషదివ్యవైభవంబులను సహింపక మనుష్యమాత్రుల కిట్టి విభవములు జరుపుట వెఱ్ఱితనమని దోషారోపణము చేయుట పరదేహాంతర భగ వద్ద్వేషమగును ఇట్టి దుర్బుద్ధులను గురువులు మున్నగువారేల శాసింపరందు వా? గురూపదేశాదులు అజ్ఞానకృతములని వారికే దోషము మూటగట్టుటయే గాక వారిమాట యన్నంతనే యీదుర్మతులు వివదింతురు కావున నిమ్మూ ఢులు గురుజనాది శిక్షాతీతులు 18

ఇట్టి యాసురసంపదకు ఫలమేమందువా?

హింసాపరత్వము భగవద్ద్వేషభావముఁగల యీనరాధములను నరకసం సరణ మార్గములందుఁ ద్రోయుదును అందుండి చిరకాలమునకు వాగు వచ్చినను వారినంతతో వదలక వ్యాఘ్రసర్పాది మహాక్రూరయోనులందు, బడవైతును. ఇట్లుచేయుట వైషమ్య నైర్ఘృణ్యంబులనియు భగవంతున కిట్టివి తగునాయనియు శంకింతువు గాఁబోలు కర్మానుసారముగా ఫలము గలుగును అశుభకర్మములొనర్చి తత్ఫలము వారనుభవించుచున్నారు శుభా శుభ సర్వకర్మములు చేయించునది నీవేగదాయనియు నీవుచేయించుకర్మము

లు చేయుటయందు వారిదోష మేమిగలదనియు శంకింతువా ? నేనెట్టి కర్మమును జేయను చేయింపను ; సాక్షిమాత్రుడనైయుందు ప్రాణులు స్వప్రకృతిప్రకారము వర్తింతురు ఇందు నాకర్తృత్వమున్నదనిగాని నాకు వైషమ్య నైర్ఘృణ్యంబులు గలవనిగానీ తలంచుట కేవలము ప్రమాదము 19

వేనవేలు జన్మములెత్తిన తర్వాతనేని వారికి శుభము గలుగునాయని యడుగుదువా ?

ఆసురీయోనిజన్మమునకుఁ దొలుదొల్త కారణభూతమైన తమోగుణ మున్నంతకాలము వారు శుభమునుఁ బడయఁజాలరు తమోగుణము తొలఁగనిది వేదమార్గానుష్ఠానము భగవత్ప్రాప్తి వాంఛయు గలుగవు కావున వారు జన్మ జన్మంబునకు అధమాధమగతిఁ బొందుచుందురు వారిగతి యంతేనాయని యందువా ? మనుష్యదేహస్థితి కలిగినప్పుడే ఆసురసంపన్నిరసనార్థము దైవసంపదను యథాశక్తి ననుష్ఠింపవలయును తిర్యగాది దేహప్రాప్తి గలిగినప్పుడు తమోగుణబాహుళ్యంబునఁ బ్రతీకారసామర్థ్యము లేమింజేసి సాదనానుష్ఠానలాభము దుర్లభము అందువలన వారికిఁ దరణమే లేదు , తుదలేని సంకటంబులందుచుందురు 20

ఆసురసంపదలు లెక్కలేని రకములు , వానిపరిహార మెట్లందువా ?

నరకమునకు కామక్రోధలోభములను ద్వారములు మూఁడు గలవు ఏద్వారంబున జన్నపుటికి నాత్మనాశము తప్పదు ఈమూఁడు ఎల్లయసుర సంపదలకు మూలభూతములు ఈమూఁటిఁ ద్యజించినచో శుభమగును ఈ సంపదలు పుట్టకయే యుండవలయును , పుట్టినతర్వాత వానినిద్యజించు టెట్లందువా ? వివేకసహాయంబున వానిని ద్యజింపవచ్చును ప్రతిమర్త్యునందు వివేకము సహజమైయుండుననియు, దైవీప్రకృతియందుఅది ప్రకాశమానముగా ఆసురీప్రకృతియందు గాలిలోని దీపమువలె మహాదుర్బలము గానుండుననియు దుర్బలమైనదానికి బలముగలిగించినచో నది పుష్టిచెంది ప్రకాశించుననియు, వివేకప్రకాశము గలిగినంతనే ఆసురీప్రకృతి సన్నగిలుననియుఁ ఇప్పట్టునఁ బురుషస్వాతంత్ర్యమునుదానికిఁ బ్రశక్తిగలదనియు భావము 21

అర్జునా! తమోరూపనరకమునకు ద్వారములైన కామక్రోధలోభంబులను మూడింటిని వదలినవాఁడు ఆత్మశ్రేయ మొనర్చినవాఁడై తత్ఫలమగు ముక్తిని బడయును 22

ఏ ప్రకార మొనర్చుట ఆత్మశ్రేయమగునందువా?

వేదంబులును వాని యుపజవులగు స్మృతీతిహాస పురాణంబులును వచించు ప్రకారము కార్యాకార్యము లెఱింగి విధులొనర్చుచు నిషేధములు నిరసించుచు నుండవలయును. వేదాదులను నిర్లక్ష్యమొనర్చి స్వేచ్ఛామాత్ర వర్తియగువాఁడు పురుషార్థప్రాప్తికి యోగ్యతఁ బడయనేరఁడు. అట్టివానికి ఐహిక సుఖము గానీ స్వర్గమోక్షరూపమైన యాముష్మిక సుఖము గాని దక్కదు 23

కావున శ్రేయోభిలాషికిఁ గర్తవ్యాకర్తవ్యములందు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రప్రకారము విధినిషేధము లెఱిఁగి నిషిద్ధమైన యాసుర సంపద్రూపకర్మంబులు వర్జించి దైవసంపద్రూపకర్మంబు లాచరింపవలయును. కర్మాధికారభూమియైన యీ లోకంబునందు జన్మించినవారికి నిది కర్తవ్యము 24

# గీతాహృదయము.

---

## పదునేడవ యధ్యాయము.

ఎట్టివారు తత్త్వజ్ఞానంబునకు అధికారులను విషయము పదునాఱవ యధ్యాయములోఁ జెప్పఁబడినది. అట్టియధికారులకు ముఖ్యవిశేషణమేమన వచ్చును. సాత్త్వికశ్రద్ధయే ముఖ్యవిశేషణమని యీ యధ్యాయములోఁ జెప్పఁబడుచున్నది.

అర్జునుఁడడుగుచున్నాఁడు.

కృష్ణా! శాస్త్రము నుల్లంఘించి స్వేచ్ఛగా వర్తించువారు జ్ఞానాధికారులు గారంటివి. శాస్త్రోల్లంఘనము గావించినను, పెద్దల యాచారంబును వదలక మహాశ్రద్ధతో దేవతారాధనాదులు చేయువారు గలరు. వారి నిష్ఠ సాత్త్వికమా? రాజసికమా? తామసికమా? అనఁగా శాస్త్రానుష్ఠానమే ప్రధానమా? శ్రద్ధప్రధానమా? శ్రద్ధప్రధానమేని, అది సాత్త్వికము గావున, సాత్త్వికగుణముగలవారు జ్ఞానాధికారులే కదా? 1

శ్రీభగవానుఁడు చెప్పుచున్నాఁడు

అర్జునా! శ్రద్ధయనునది స్వభావంబువలనఁ బుట్టుచున్నది, కావున స్వభావమెట్టిదో శ్రద్ధయు నట్టిదిగా నేయుండును. స్వభావమనఁగా నేమందువా? జన్మాంతర పాపపుణ్యంబుల వాసనావిశేషము స్వభావమందురు. ఈస్వభావము వారివారి ప్రాక్తనకర్మఫలంబులనుబట్టి సాత్త్వికముగానో రాజసికముగానో, తామసికముగానో యుండును. శ్రద్ధయుఁ దదనుగుణంబుగా నుండును. ఇది వివరింతు వినుము 2

ఇందుఁ జెప్పఁబడు శ్రద్ధ కేవల స్వభావజమైనదేగాని శాస్త్రసంస్కారజన్యమైనదిగాదనియు, శాస్త్రము సత్త్వప్రబోధకము గావున, శాస్త్రవివేకము పూర్వజన్మమువలన గలుగుదానినిగూడ మార్చుననియుఁ గారణానుగుణంబుగాఁ గార్యముండు ననున్యాయప్రకారము సత్త్వప్రబోధకమగు శాస్త్రంబువలన సంస్కృతమైన శ్రద్ధ సాత్త్వికముగానే యుండుననియు గ్రహింపనగును

అర్జునా ! ప్రతిప్రాణికి అంతఃకరణమనునది యొకటి కలదు. స్వభావ మీ యంతఃకరణంబునఁ బ్రతిఫలించును అంతఃకరణము సత్వప్రధానమైనచో శ్రద్ధయు సాత్వికంబుగానుండును, అదిరజఃప్రధానమైనచో శ్రద్ధ రాజసముగానుండును, తమఃప్రధానమైనచో శ్రద్ధ తామసముగానుండును నైమూఁడు విధముల శ్రద్ధలలో నేదే నొకదానినిఁ బురుషుఁడు గలిగియుండును శ్రద్ధనుబట్టి పురుషుని నిష్ఠయుండును పైనఁజెప్పినదానింబట్టి జ్ఞానాధికారమునకు శ్రద్ధయే ప్రధానముగాదు, అదియు నొకయంగమగును 3

శ్రద్ధనుబట్టి నిష్ఠయుండునంటిని ఎట్లనిన వినుము ఎవని శ్రద్ధ యెట్టిదైనది వానిచర్యలు ప్రకటించుచుండును ఈచర్యలలో ఆరాదనము ప్రధానము. దేవతలు సాత్వికగుణ ప్రధానులు, దేవతల నారాధించువారు సాత్విక శ్రద్ధావంతులుగా నుందురు యక్షరాక్షసులు రజోగుణప్రధానులు, వారినారాధించువారు రాజస శ్రద్ధావంతులుగానుందురు, స్వధర్మభ్రష్టులై మరణానంతరము వాయుశరీరములతో నుండువారు ప్రేత లనఁబడుదురు ప్రేతలును భూతగణంబును తమోగుణప్రధానములు వారి నర్చించువారు తామస శ్రద్ధావంతులుగానుందురు. 4

శ్రద్ధవలెనే తపస్సుగూడ సాత్వికరాజస తామసికంబులని మూఁడు విధంబులు శ్రుతిస్మృతు లంగీకరింపకట్టియుఁ దనకుఁ బరులకుఁ బీడాకరమైనట్టియు తపమువలన ఫలములేదు ధార్మికత్వ ప్రకటనరూపమైన దంభము బురస్కరించుకొనియో, 'నేనింతపని చేయుచున్నా'ననెడి అభిమానము గలిగియో, ఈకోరికను అవశ్యము సాధింతునసెడి దురాగ్రహముతోడనో చేయునట్టి తపస్సు నిష్ఫలము 5 అట్లు చేయువారు వారి శరీరాకారంబుగాఁ బరిణమించియున్న పృథివ్యాది భూతసముదాయంబును ఉపవాసాదులవలన వృధాగాఁ గృశింపఁజేయుటయేగాక, వారిశరీరాంతరమున జీవరూపంబుననున్న నన్ను సయితము మదీయభోగ్యశరీర కృశీకరణమూలంబునఁ గృశింపఁజేయుదురు ఇట్టి తపోనిష్ఠులు కేవల వివేకశూన్యులనియు, మనుష్యరూపంబుఁ దాల్చిన యసురులనియు గ్రహింపుము అనఁగాఁ బుట్టువు బట్టి యసురులుగాకున్నను కర్మములనుబట్టి యసురస్వభావులై యుందురు. 6

రాజసతామసంబులు ఆసురంబులు గావున వానినెల్లవిధంబులఁ ద్యజింప వలయును సాత్వికము దైవీప్రకృతి గావున దానినభివృద్ధిచేసికొనవలయును సాత్వికము సిద్ధించునుపాయమేదందువా ? సత్వము శుద్ధియగుకొలఁది సాత్విక మభివృద్ధిచెందుచుండును. సత్వశుద్ధి ఆహారశుద్ధినిబట్టి యుండును. 'ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః' అని ప్రమాణము. కావున ఆహారశుద్ధి ప్రధానోపాయము సాత్వికాహారనిష్ఠనుబూని సత్వమయములైన యజ్ఞదానతపంబు లాచరించుచు రావలయును. సాత్విక యజ్ఞాదులుగూడ సత్త్వశుద్ధిఁ బోషకములు

సృష్టిజాతమెల్లఁ ద్రిగుణాత్మకము గావున గుణములనుబట్టి శ్రద్ధా తపస్సులెట్లో ఆహారాదులుగూడ నట్లే మూఁడు విధములు ఆయాగుణము గలవారి కయ్యవి రుచించును 7 చిరజీవనమును, చిత్తస్థైర్యమును, ఆత్మ విహితకార్య నిర్వహణంబునకు వలయు సామర్థ్యమును, వ్యాధిలేమిని, భోజ నానంతరతృప్తిని, సంతోషమును వృద్ధిచేయునట్టివియు, మధురరస ప్రధానము లై నట్టివియు, సహజముగానుండే ఆగంతుకముగానుండేఁ జమురుగలిగినట్టివియు, రసాద్యంశంబున శరీరమందు బహుకాల ముండనట్టివియు గర్గంధాది దృష్ట దృష్ట దోషశూన్యమైనట్టివియునైన భక్ష్యభోజ్యాదులు సాత్వికాహారమగును. కావున సాత్వికత్వమును గోరువారిట్టి యాహారంబులనే సేవింపవలయును 8

వేము మొదలగు మిక్కిలి చేదుపదార్థంబులును, చింతపండు మొదలగు మిక్కిలి పులుసు పదార్థంబులును, ఉప్పును, అత్యుష్ణపదార్థంబులును, మిరి యాలు మొదలగు మహాతీక్ష్ణపదార్థంబులును, ఆవ్య మొదలగు చమురులేని రూక్షవస్తువులును, అతిదాహకరంబులైన యావాలు మొదలగు వస్తువులును, తాత్కాలికపీడయగు దుఃఖంబును అనంతరము దౌర్మనస్యరూపమైన శోకం బును వ్యాధిని గలిగించును ఇట్టి పదార్థంబులు రాజసగుణముగలవారికిఁ బ్రియంబులు సాత్వికముగోరువారిట్టి వస్తువులను వర్జింపవలయును 9

చాలకాలముక్రింద వండి చద్దిపాటినపదార్థములు, సహజరసశూన్య మైనపదార్థములు, దుర్గంధముగలవస్తువులు, ఒకరాత్రికిఁ బూర్వమువండిన పదార్థములు, ఎంగిలివస్తువులు, యజ్ఞార్హములుగానట్టియు శుచికరములుగానట్టి యు మాంసాదులు తామసులకు బ్రియంబులు. సాత్వికులిట్టి పదార్థంబులను దగ్గఱకుఁగూడ రానీయఁగూడదు 10

ఆహారమువలెనే యజ్ఞములుకూడ మూఁడు విధంబులు

సామాన్యముగా యజ్ఞములు కామ్యములని నిత్యములని రెండువిధంబులు కామ్యములు ఫలాభిలాషమువలనఁ బ్రేరేపింపఁబడుచుండును కామ్యయజ్ఞంబులను సర్వాంగోపసంహారంబుగా ముఖ్యకల్పనతోనే యనుష్ఠింపవలయును నిత్యయజ్ఞములకన్ననో ఫలాభిసంధిలేదు, జీవనాదినిమిత్తసంయోగంబున నవి ప్రేరితములగుచుండును సర్వాంగోపసంహారము లేకున్నను బదులు సాధనమును గల్పించుకొని నిత్యయజ్ఞములను దప్పక చేయవలసినదనియు, అట్లు చేయుట ప్రత్యవాయపరిహారార్థము అవశ్యజీవనాదినిమిత్తమనియు శాస్త్రమర్యాద ఇట్టినిశ్చయము గలిగి మనస్సును తదేకాగ్రమొనర్చి యీశ్వరారాధనబుద్ధితో యథాశాస్త్రము అనుష్ఠింపఁబడుయజ్ఞము సాత్వికయజ్ఞమగును 11

అర్జునా! ఫలోద్దేశముతోఁగానీ ధార్మికత్వాదిఖ్యాతి నపేక్షించిగాని చేయఁబడు యజ్ఞము రాజసయజ్ఞమగును 12 శాస్త్రవిధిని మాని అన్నదానాదులొనర్పక మంత్రోచ్చారణంబున స్వరవర్ణలోపంబులు గలిగినను లెక్కసేయక దక్షిణలియ్యక శ్రద్ధలేక చేయుయజ్ఞము తామసయజ్ఞమని శిష్టులందురు 13

తపస్సు సాత్వికమని రాజసమని తామసమని మూఁడు విధములుగా నుండుట వివరించితిని ఇందొక్కొక్కటి మరల కాయికవాచికమానసికంబులని మూఁడు భేదములు,

దేవతలను ద్విజులను గురువులను తత్త్వవేత్తలను బూజించుట, స్నానాదులవలన శరీరమును శుభ్రముగా నుంచుకొనుట, విహితము లాచరించుచు నిషిద్ధంబులను వర్జించుచునుండుట, విశృంఖలవృత్తిమాని పరస్త్రీనివలచి యేకపత్నీవ్రతుఁడైయుండుట, భగవదారాధనార్థము మాత్రము శాస్త్రానుసారమైన యజ్ఞపశువిశసనముదప్ప యెట్టిహింస చేయకుండుట— ఇది శారీరక తపస్సగును. అనఁగా నిట్టికార్యములెల్ల శరీరావయవంబులతోఁ జేయఁబడును గాన దీనిని శారీరకతపస్సందురు 14

ప్రాణులకు దుఃఖము గలిగింపనట్లుగా ఉన్నది యున్నట్లుగా ప్రియ

వారికిఁ దత్కాల శ్రుతి సుఖమగునట్లుగాఁ బరిణామంబున సుఖకరమగునట్లుగాఁ బలుకుట, యథావిధి వేదాభ్యాసమొనర్చుట వాచిక తపస్సగును 15

మనస్సు నిష్కల్మషముగానుండుట, విషయచింతనతో వ్యాకులత్వము చెందకుండుట, ఏకాగ్రబుద్ధితోఁ దత్త్వచింతనముచేయుట, మనస్సు చలింపకుండునట్లు నిరోధించుట, అనఁగా సమాధిలోనుండుట, వ్యవహారములందు మాయదారితనము లేకుండుట—మానసిక తపస్సగును 16

కాయికవాచిక మానసిక తపస్సులను వివరించితిని. సత్త్వరజస్తమోగుణములతోఁగూడినప్పుడు అవి 1 సాత్త్విక కాయికమని 2 సాత్త్వికవాచికమని 3 సాత్త్వికమానసికమనియు ; 4 రాజసకాయికమని 5 రాజసవాచకిమని 6 రాజసమానసిక మనియు, 7 తామసిక కాయికమని 8 తామసికవాచికమని 9 తామసికమానసికమనియుఁ దొమ్మిది తెఱంగులగును.

ఆస్తిక్యబుద్ధిగలిగి ఫలముఁగోరక ప్రాప్తాప్రాప్తంబులకు వికారము చెందక, శరీరముతోఁజేయునది సాత్త్విక కాయికతపస్సనియు, వాచికముతోఁ జేయునది సాత్త్వికవాచిక తపస్సనియు, మనస్సుతోఁ జేయునది సాత్త్విక మానసిక తపస్సనియు వచింతురు 17

సత్కారము అనఁగా లోకశ్లాఘనము, మానము అనఁగా ఎదురేగుట వందనాదులొనర్చుట, పూజయనఁగా కాళ్ళుగడిగి ధనదానమిచ్చుట—సత్కార మాన పూజలుగోరి చేయునది రాజసికమగును ఇది కాయిక సంబంధమైనప్పుడు రాజసకాయికమని, వాచికసంబంధమైనప్పుడు రాజసవాచికమని, మనస్సంబంధమైనప్పుడు రాజసమానసికమని చెప్పఁబడును ఇట్టితపస్సువలనఁ గలుగుఫలము చిరకాలముండదు అదియు నైహిక సత్కారరూపంబున నుండునేగాని యంతకుమించదు ఇట్టితపస్సునకు నెట్టినియమము గలుగదు 18

అవివేకమువలని దురాగ్రహముతో దేహేంద్రియాది సంఘాతంబునకుఁ బీడాకరముగాఁ జేయునట్టిది గానీ పరులకు హానిగలిగించునట్టి యభిచారరూపమైనదిగాని యగు తపస్సు తామసమగును పైనఁ జెప్పినప్రకార మిదియుఁ

గాయికమైనచోఁ దామసికకాయికమని, వాచికమైనచోఁ దామసికవాచిక
మనియు, మానసికమైనచోఁ దామసిక మానసికమనియు ముత్తెఱంగులగును 19

దానముగూడ మూఁడు విధంబులు

ఇయ్యఁదగిన దనునిశ్చయబుద్ధిగలిగి ఫలాభిసంధిలేక ప్రత్యుపకార
మపేక్షింపక పూర్వరచితోపకారంబునకుఁ బ్రతిఫలముగాక కాశీప్రయాగాది
పుణ్యక్షేత్రములందు సూర్యగ్రహణాది పుణ్యకాలములలో శాస్త్రోక్త లక్షణము
లుగల పాత్రకుఁ బ్రతిగ్రహణమునకు యోగ్యుఁడైనవానికి నిచ్చునట్టి స్వర్ణ
భూమ్యాదిరూపమైన దానము సాత్త్వికదానమగును 20 ప్రత్యుపకారమును
గోరిగానీ, పుణ్యకాలము గాకపోయినను నావలన నితఁడుపకరింపఁబడుఁగాక
అనుతలంపుతోఁగానీ, స్వర్గాదిఫలము నపేక్షించి గాని, పశ్చాత్తాపయుక్తముగా
నీయఁబడునది రాజస దానమగును 21 స్వభావమువలననొండె సంసర్గంబున
నొండె దుష్టమగుటంజేసి యోగ్యముగాని ప్రదేశమునందు అశుచిసమయంబున
యోగ్యుఁడుగానివానికి నీయఁబడునట్టిదియు, దేశకాలపాత్రములు మంచివి
పనకూడినను బ్రియభాషణ పాదప్రక్షాళనాది పూజాత్మక సత్కారములు
లేక పుచ్చుకొనువానికిఁ బరిభవమగునట్లుగా నిచ్చునదియుఁ దామసదాన
మగును 22

పైనఁజెప్పిన లక్షణములనుబట్టి పరిశీలించిచో యజ్ఞదానాదులెల్ల రాజ
సములో తామసికములో యగుననియు, రాజసతామసికంబులు వర్జ్యంబులు
గావున నట్టి దానాదుల నొనర్చుటేలయనియు శంకింపవచ్చును అర్జునా!
అట్టిశంక నిరాధారముగాదు అయినను రాజస తామసిక కర్మంబులను
సాత్త్వికముగా మార్చవచ్చును ఏకర్మముగానీ సంకల్పమునుబట్టి సాత్త్వికమో
రాజసమో తామసికమో యగును. సంకల్పరహితముగఁ జేసినచో నెట్టిది
యు సాత్త్వికమేయగును సంకల్పరహితముగాఁ జేయఁజాలవేని నీవు చేయు
నదియెల్ల బ్రహ్మార్పణముగాఁ జేయుము అట్లు చేయునప్పుడు నీసంకల్పము
పరార్థమగును సంకల్పము స్వార్థమైనప్పుడే రాజస తామసికంబులు దాని
నంటియుండును అది పరార్థమైనప్పు డట్టివానికవకాశములేదు ఈయర్థము
నే యీశ్లోకము తెలుపుచున్నది ఎట్టికర్మమైనను అనుటవలన నిషిద్ధకర్మ
ములు త్యాజ్యమని భావము. 23

చరాచరాత్మకమైన సమస్తసృష్టికి మూలభూతమైన తత్త్వమొకటి కలదు. దానినిఁ బరమాత్మయని పరబ్రహ్మమని వచింతురు. ఆపరబ్రహ్మమునకు ఓమ్ అనియు, తత్ అనియు, సత్ అనియు మూఁడుపేర్లు వేదాంతవేత్తలగు పూర్వమహర్షులు నిర్దేశించిరి. ఇదానీంతనులుగూడ ఆపేర్లనే గ్రహించుచున్నారు. ఓమ్ అనునది బ్రాహ్మణాదికర్తలను, తత్ అనునది వేదాది కరణంబులను, సత్ అనునది యజ్ఞాది కర్మంబులను సూచించుననియు, కర్తృకరణకార్యంబులను తత్కారణమైన మూలంబునకు సమర్పించుటయే బ్రహ్మార్పణమనియు బ్రహ్మార్పణమస్తు అనుటకు మారుగా ఓంతత్సత్ అన్నచో నదే భావమగుననియు, అట్లుచేసినచో నయ్యాయిక్రియలందేదేని కాలుష్యమున్నను నశించుననియు గ్రహింపవలయును. అనఁగా ఓంతత్సత్ అనునది బ్రహ్మార్పణమస్తు అనుటకుఁ బర్యాయపదమని తెలియఁదగునది.

*ఓమ్ అనునది వ్యక్తావ్యక్తములకుఁ బరమునను మూలతత్త్వమనియు తత్ అనునది దాని యనిర్వచనీయత్వమును దెలుపుననియు, సత్ అనునది ఆపరతత్త్వము త్రికాలాబాధితము నిర్వికార నిర్వికల్ప నిత్యమునై యేకరాశిగా నుండుటను తెలుపుననియుఁ గొందఱమతము.

పరబ్రహ్మనామధేయమైన ఓంతత్సత్ అనుదానిలో ఓంకారమొక యవయవము. శాస్త్రవిహితములైన యజ్ఞదానతపఃక్రియలు ఓంకారోచ్చారణపూర్వముగా నొనర్చినచోఁ దత్క్రియలందేదేని వైగుణ్యమున్నను రహితమగును. బ్రహ్మవాదులట్లుచేయుదురు. ఓంతత్సత్ అను మూఁడింటిలో నొక్కటైన ఓంకారము నుచ్చరించి చేసినవే యంత నిర్దుష్టములగుచుండఁగా మూఁడింటి నుచ్చరించిచేసినప్పు డిఁకఁ జెప్పవలయునా? 24

ముముక్షువులు స్వర్గాదిఫలంబును సంకల్పింపక తత్ అను రెండవ యవయవంబు నుచ్చరించి వివిధయజ్ఞాదు లొనర్తురు. 25

సత్ అనునది సద్భావమునందును, అనఁగా లేదనుశంక లేనియందుఁగలుగునో యట్టిది కలదని రూఢిగాఁ బల్కు నర్థమందును, సాధుభావమందును శిష్టులు ప్రయోగింతురు. సత్ అని యుచ్చరించి యొనర్చు యజ్ఞాదులు వైగుణ్యంబును బాసి సాధువులగును. యజ్ఞాదులఫలము గోచరించునట్లు చేయుశక్తి

సత్ అనుదానికి గలదు ఈసత్ శబ్దము వివాహాది మంగళకర్మములందుఁ గూడఁ బ్రయోగింతురు 26

మఱియు ఈసత్ శబ్దము యజ్ఞతపోదానంబుల యందలి స్థిరభావంబును గూడ తెలుపుటకుఁగాఁ బ్రయోగింపఁబడుచున్నది 27

శ్రద్ధలేక శాస్త్రవిధినుల్లంఘించి ఫలాభిసంధితోఁజేయు యజ్ఞాదికర్మములాసురము లంటిని ఆసురకర్మములు చేయుచు ఓమ్‌తత్సత్ అన్నంతనే అవియు వైగుణ్యంబును బాయునా యని శంకింపవచ్చును

అర్జునా! శ్రద్ధలేనప్పుడు యజ్ఞాదులే గాదు ఏదియేకర్మమైనను అసాధువే యగును గాని సాధువుగాదు ఓంతత్సత్ అని యుచ్చరించి చేసినంతనే దానికి సాధుత్వము గలుగదు చప్రాతిపై విత్తనము చల్లిన నది యంకురించునా? కావున అశ్రద్ధతో నొనర్చిన కర్మము పరలోకప్రాప్తిఁ గలిగింపదు అట్టిదానిని సాధువులు గర్హింతురు గావున ఇహలోకంబునఁగూడ దానివలన ఫలంబు గలుగదు సాత్త్వికశ్రద్ధాపూర్వకంబుగా సాత్త్వికకర్మము లొనర్పవలయును అట్టికర్మములను ప్రమాదపణమొనర్చువారో నందలి వైగుణ్యంబు దైవయోగంబున నశించి వారి సాద్గుణ్యంబు లభించును కావునఁ గర్మాచరణంబున సాత్త్వికశ్రద్ధ ముఖ్యహేతువని గ్రహింపుము 28

# గీతాహృదయము

---

## పదునెనిమిదవయధ్యాయము.

జ్ఞానసంపాదనమునకు సాత్వికశ్రద్ధ ముఖ్యమైన యధికారి విశేషణమని పదునేడవ యధ్యాయములోఁ జెప్పఁబడినది ఇట్టి సాత్వికశ్రద్ధతోఁడి సన్యాసము జ్ఞానహేతువని యీయధ్యాయములో నిరూపింపఁబడును అనఁగా సాత్వికశ్రద్ధతోఁజేయుకర్మములనెల్లఁ గావించుచు ఫలమునుమాత్రము సన్యసించుచు వచ్చినచో జ్ఞానము గలుగునని భావము

అర్జునుఁ డడుగుచున్నాఁడు.

కృష్ణా ! సన్యాసము త్యాగము అను రెండుపదము లీగ్రంథమం దుపయోగించితివి ఈరెండు పదములు భిన్నార్థకములా ? ఏకార్థకములా ? భిన్నార్థకములైనచో సన్యాసము సాత్వికమనియు రాజసమనియుఁ దామసమనియు ముత్తెఱంగులగును త్యాగముగూడ నట్లే ముత్తెఱంగులగును సాత్విక సన్యాసమనట్టిది ? రాజససన్యాసమనట్టిది? తామససన్యాసమనట్టిది ? అట్లే సాత్వికత్యాగమనట్టిది? రాజసత్యాగమనట్టిది ? తామసికత్యాగమనట్టిది ? సన్యాసత్యాగ శబ్దములు ఏకార్థకములే యనియుందువా ? ఆపక్షమునఁగూడ సాత్విక రాజస తామససన్యాసంబుల స్వరూపంబు వినగోరుదు 1

శ్రీకృష్ణభగవానుఁడు —అర్జునా ! యుద్ధమోహము శాంతించుకొఱకు జ్ఞానముపదేశించితిని. మోహము తీఱెనట్లు నీవే యొప్పుకొంటివి యుద్ధసన్నద్ధులై నీయెదుటనున్న శత్రువులతోఁ బోరాడుట నీకిప్పుడు కర్తవ్యమై యుండఁగా అదిమాని సన్యాసమనఁనేమి? త్యాగమననేమి? అని మీమాంసచేయనగునా ? ఇట్లు పరాకునున్నచో శత్రువులు పైకొని నిన్ను మర్దింపరా ? అట్టి దకస్మాత్తుగా సంభవించెనేని నీకు సారథినైయుండియుఁ దత్ప్రతీకారమొనర్ప నాకు సాధ్యముగాదుగదా

# పదునెనిమిదవ యధ్యాయము.

అ—స్వామీ! కేశియను రక్కసి నోరుప్పలించి నిన్ను మ్రింగవచ్చినప్పుడు దానినోట నెడమచేయి దూర్చినంతఁ దత్కరము క్షణములోఁ బెరుగుచు దానినోరు పెద్దసిద్దెవలెఁ జీలి యది మడిసినది. అట్లు కేశిని గెడపుటంజేసి కేశినిషూదనుఁడను బిరుదుగాంచిన నీవు సారథివై నిరంతరము నన్నుఁ గాపాడుచుండఁగాఁ బ్రమాదముననేని నాకుఁ బరాభవము గలుగునా? సారథివై వాగెలుపట్టుట శత్రువులఁగొట్టుట రెండు నొక్కసారి యెట్లు సాధ్యముందువా? వాగ లొకచేతితో బట్టి రెండవచేతితో ముల్లోకంబులనుగూడ జయింపనేర్తువు. కేశి సంహారమే యిందులకు నిదర్శనము సుమా

శ్రీకృష్ణ—అర్జునా! నీకు సారథ్యముమాత్ర మొనర్తునని ప్రతిజ్ఞచేసితిని ప్రతిజ్ఞాభంగముగా యుద్ధముచేయఁజెల్లునా?

అర్జు—స్వామీ! నీవు హృషీకేశుఁడవు అనఁగా సర్వేంద్రియములకు నధిపుఁడవు, నీయాజ్ఞలేనిది ఏయింద్రియము వర్తింపదు. ఇంద్రియములు వర్తింపనినాఁడు నరుఁడు కదలమెదలలేఁడు. కావున శత్రుసంహారమునకై నీవు యుద్ధమొనర్పఁ బనిలేదు? వేయేల నీయాజ్ఞలేక యెవఁడుగాని విల్లు మోపెట్టఁగలఁడా? తుదకు నావంకనేనిఁ జూడఁగలఁడా? కాఁబట్టి నీవన్న శత్రుభయము నాకు లేశమాత్రముగూడ లేదు

శ్రీకృ—అర్జునా! అట్లయగుఁగాక. సన్యాసమనఁ ద్యాగమనఁగల భేదమేమంటివి. నీభావము స్పష్టపడదు, సుంత వివరింపుము

అర్జు—సన్యాసము ముఖ్యమని గౌణమని రెండువిధంబులు. అందు ముఖ్యసన్యాసము విద్వత్సన్యాసమని వివిదిషాసన్యాసమని మఱల రెండువిధంబులు. విద్వత్సన్యాసస్వరూపంబును మూఁడవయధ్యాయము 17వ శ్లోకములోను అయిదవ యధ్యాయము 13-వ శ్లోకములోను వివరించితివి. దానిఁబట్టి విద్వత్సన్యాసము సర్వకర్మత్యాగరూపమని స్పష్టము కావున దానిఁగూర్చి సంశయములేదు. బ్రహ్మజ్ఞానంబును బడయుట

గోరి తత్త్వప్రాప్తికి వలయు చిత్తశుద్ధికిఁగాఁ బరమేశ్వరార్పణబుద్ధితో వివిదిషుఁడు (తత్త్వజ్ఞానంబును బడయఁగోరువాఁడు) మొదటఁ గర్మములాచరించును కర్మములు చిత్తశుద్ధిమాత్రజనకములు గావునను చిత్తశుద్ధిగల్గిన తర్వాత తత్కర్మంబులవలన వానికెట్టి యితర ప్రయోజనము లేదు గావునను, వడ్లుదంచి బియ్యమును సంగ్రహించినపిదప పొట్టువలె వానికిఁ దత్కర్మములగును అందువలన వివిదిషుఁడు కూడ కర్మంబులను వర్జించును పరిణామము విచారించినచో విద్వద్వివిదిషా భేదముఖ్యసన్న్యాసన్న్యాసంబునఁ గర్మత్యాగము సిద్ధమగుచున్నది కావున నాప్రశ్న ముఖ్యసన్న్యాసమునుగూర్చినదే గాదు మఱియు విద్వత్సన్న్యాసి గుణాతీతుఁడుగానుండును గుణాతీతుని విషయమై సాత్త్వికాది గుణత్రయ విభాగయుక్తమగు ప్రశ్నయే యసంగతము వివిదిషాసన్న్యాసి గుణాతీతుఁడుగాకున్నను, కర్మములను వర్జించియుండును గావున వానివిషయమునఁగూడ గుణవిభాగయుక్త కర్మానుష్ఠానప్రశ్న యుక్తముగాదు ఎవనిగూర్చి యడుగునందువా? తత్త్వబోధగానీ తత్త్వజ్ఞానాభిలాషగానీ గలుగని కర్మాధికారులు కేవల కర్మానుష్ఠానపరులై యుండియుఁ గర్మఫలమును త్యజించుట గౌణసన్న్యాసమనఁబడును గౌణసన్న్యాసు - కర్మముల ననుష్ఠింతురు గావుననే వీరికర్మములు త్రిగుణములతోఁ గూడియుండుటకు నవకాశము గలదు. ఇట్టివారుచేయు కర్మఫలత్యాగము సన్న్యాసమనిపించుకొనునా? త్యాగమనిపించుకొనునా? అనునది స్పష్టముగా గ్రహించుటకై యిట్లు ప్రశ్నించితిని సన్న్యాసమునకుఁ ద్యాగమునకు భేదము గలదేని 'సన్న్యాసి' అని ఆఱవయధ్యాయము మొదటిశ్లోకములో నీవు చెప్పినది సరిపోవును భేదములేదేని, అట్టిత్యాగము సాత్త్వికరాజసతామసికములలో నేదేనొకటి యుండవచ్చును త్యాగసన్న్యాసశబ్దములేకార్థములగునప్పుడు అట్టి త్యాగిని సన్న్యాసియనికూడ చెప్పవచ్చును తాదృశసన్న్యాసముగూడ త్రైగుణ్యరూపమే యగును ఈవివరంబు తెలియఁగోరి సన్న్యాసత్యాగశబ్దములు ఏకార్థకములా? భిన్నార్థకములా? అని యడిగితిని

(స్పష్టార్థము పైశ్లోకభావంబు సంవాదరూపంబున వ్రాయఁబడినది)

అర్జునా! సన్న్యాసత్యాగశబ్దముల విషయమై మతభేదములు గలవు. స్వర్గపుత్త్రాదులనఁ గోరి తదర్థము శాస్త్రవిహితముగాఁ జేయఁబడు కామ్యకర్మంబులను వదలుట సన్న్యాసమని కొందఱు పండితులు చెప్పుదురు. విరిమత ప్రకారము కామ్యకర్మములను ఫలసహితంబుగా వదలుటమాత్రమే సన్న్యాసమగును, నిత్యకర్మములను వదలరాదుగాన, ఫలాభిసంధిమానివాని నాచరింపవలయును. నిత్యనైమిత్తిక కామ్యకర్మంబులనెల్ల ఫలాభిసంధిమాని యాచరింపవలసినదనియు, ఫలత్యాగమే సన్న్యాసముగాని కర్మస్వరూపత్యాగము సన్న్యాసముగాదనియు విచక్షణులు కొందఱు వచింతురు. కామ్యకర్మముల స్వరూపత్యాగమును, నిత్యకర్మముల ఫలత్యాగమును, సన్న్యాసశబ్దార్థమనియు, సర్వకర్మఫలమాత్రత్యాగము త్యాగశబ్దార్థమనియు ఉభయమతముల సారాంశమగుచున్నది. ఇట్లగుటవలన సన్న్యాసత్యాగశబ్దములు భిన్నార్థకములని యేర్పడుచున్నది. లోకవ్యవహారంబును బరీక్షించినచో త్యాగశబ్దార్థమందే సన్న్యాసత్యాగశబ్దములు రెండు ఏకార్థకములైన పర్యాయపదములవలెఁ బ్రయోగింపఁబడుచున్నవి. లోకవ్యవహారమిట్లు పండితమతమట్లు నుండుటంజేసి నీకీసందేహము జనించియుండును. 2

ప్రతికర్మమునకు ఫలము వెనువెంటనే యుండుననియు, ఫలరహితమైన కర్మమే యుండదనియు, ఫలము ననుభవించితీఱవలసియుండుటంజేసి కర్మము కామ్యమైనఁగానీ నిత్యమైనఁగానీ నైమిత్తికమైనఁగానీ బంధహేతువగుచున్నదనియు, బంధమోక్షమును గోరువారెల్ల కర్మములను స్వరూపముతో వదలవలసినదనియుఁ గొందఱు పండితులు వాదింతురు. కర్మములవలనఁదక్క మఱియొకటఁ జిత్తశుద్ధిగలుగదనియు, బ్రహ్మజ్ఞానము గోరువారికిఁ జిత్తశుద్ధి యత్యావశ్యకమనియు, చిత్తశుద్ధిని సంపాదించునిమిత్తము యజ్ఞాది శాస్త్రసమ్మతకర్మంబులను గర్మాధికారులు తప్పక చేయవలసినదనియుఁ గొందఱిమతము. 3

అర్జునా! సన్న్యాసత్యాగశబ్దములు పర్యాయపదములేగాని భిన్నార్థకములుగావు. త్యాగమనఁగాఁ గామ్యకర్మత్యాగమా? సర్వకర్మస్వరూపత్యాగమా? సర్వకర్మ ఫలమాత్రత్యాగమా? ఈవిషయంబున నామతము

వినుము. త్యాగము సాత్త్వికరాజసతామసభేదంబులతోఁ ద్రివిధమైయుం
డును వీని పరస్పరభేదసూక్ష్మంబు లెఱింగి చెప్పఁగలవాఁడు మదన్యుఁడు
గలుగఁడు భరతవంశరాజులలో నుత్తముఁడవు గావున నాయుపదేశంబునకు
నర్హుఁడవు. మఱియు నీవు పురుషశ్రేష్ఠుఁడవు గావున నీకుఁగల త్యాగసం
పత్తి సాత్త్వికమేగాని రాజసతామసికంబులుగావు 4

కర్మాధికారులు యజ్ఞదానతపోరూపంబులగు కర్మంబులను జేసి తీఱ
వలయునుగాని యెంతమాత్రము వదలరాదు ఏలయందువా ? యజ్ఞాదులు
చిత్తశోధకములు అనఁగా జ్ఞానప్రతిబంధకమైన కాలుష్యంబునుబాపి జ్ఞానో
త్పత్తికి వలయు యోగ్యతను గలిగించును ఇట్టి యోగ్యతాసంపాదనము
ప్రతిమనుష్యునకు ముఖ్యము. ఇట్టియోగ్యత గలుగవలయునన్నచో ఫలాభి
సంధి రహితంబుగా యజ్ఞాదికర్మముల ననుష్ఠింపవలయును. 5 కర్తృత్వాభి
మాన ఫలాభిసంధిపూర్వంబుగాఁ గర్మములొనర్చిన నవి తప్పక బంధకము
లగును, జ్ఞానోదయము గలుగదు కర్తృత్వాదులుమాని చేసినచో నవియే
జ్ఞానోదయంబునకు సహాయకారులగుచున్నవి కర్మానుష్ఠానమునఁగల మర్మ
మిదే. నాపరమమతమును జెప్పితిని, ఇంతకుమించిన మతము గలుగదు

ఎల్లకర్మములకుఁ బ్రేరేచునది ఫలాభిలాషయేయనియు, అభిలాష
వదలినచోఁ గర్మాచరణంబునకు మనస్సు రాదనియు, ఆపక్షమునఁ గర్మప్ర
వృత్తికే భంగము వచ్చుననియు శంకింపవచ్చును. ఫలాభిలాష మానుట
యనఁగా స్వర్గాదిఫలంబులను కోరకుండుటయని యెఱుంగుము అంతేగాని
జ్ఞానోదయ ఫలంబునుగూడ కోరవలదని చెప్పలేదు కావునఁ గర్మప్రవృత్తికి
వలసిన ప్రేరణము గలదు. మఱియు నిత్యకర్మములకుఁ గామ్యకర్మములకు
స్వరూపభేద మంతగా లేదు భేదమెల్లఁ గర్తృసంకల్పంబువలనఁ గలుగు
చున్నది. ఏకర్మమునైనను ఫలాభిసంధిమాని చేసినచో నది చిత్తశుద్ధికర
మగుచున్నది కావున 'కామ్యకర్మత్యాగము సన్యాస'మనెడి మతము సరి
గాదు సర్వకర్మఫలత్యాగమే సన్యాసమగును మూఁడవశ్లోకములోఁ జెప్పిన
'సర్వకర్మ స్వరూపత్యాగము సన్యాస' మను మతముగూడ సరిగాదు ఏల
యందువా ? దోషములేని కర్మమే గలుగదనియుఁ గర్మములుచేయుచేల

దోషంబులు మూటఁగట్టుకొను టెలయనియుఁ గర్మములే చేయకున్నచో దోషములే గలుగవుగదా యనియు వారిభావము పాపము వీరు వట్టిభ్రాంతులు. దోషమెందున్నది గ్రహింపలేక యిట్లు ప్రమాదపడుచున్నారు ఈప్రమాద బీజమును విశదీకరించుటకై త్యాగము త్రివిధమని నాల్గవశ్లోకములోఁ బ్రస్తావించితిని త్రివిధత్యాగమునకుఁగల పరస్పరభేదంబును, గుణతారతమ్యంబును, గ్రహింతువేని భ్రాంతిబీజము నీకే స్పష్టమగును ఆసంగతి చెప్పెద వినుము 6

చిత్తశుద్ధికొఱకు కర్మములు చేయుదురు కామ్యకర్మములు చేయుట వలనఁ జిత్తశుద్ధి లభింపకపోవుటయేగాక జననమరణరూపసంసారము తప్పక గలుగుచున్నది ఈసంసారము తొలఁగు నిమిత్తమేగదా జ్ఞానము, అందులకు ముఖ్యమైన చిత్తశుద్ధియు, అందులకు నుపకరణమైన కర్మప్రవృత్తియు, నవసరములు కావున సంసారకారణములగు కామ్యకర్మములు త్యాజ్యములగుట యుక్తమే. నిత్యకర్మము లట్టివిగావు ; అందుఁ గామ్యవిషయమే గలుగదు నిత్యకర్మము లనుష్ఠింపనిచోఁ బ్రత్యవాయము తప్పదు సంసారహేతుభూతములుగావు గావునను, అనుష్ఠింపకున్నచోఁ బ్రత్యవాయము వచ్చును గావునను నిత్యకర్మములు తప్పక చేయవలయును మఱియు నిత్యకర్మములు చిత్తశుద్ధి జనకములు గావున, ఆకారణమునుబట్టిగూడ అంతఃకరణశుద్ధిని గోరునట్టి కర్మాధికారులు వానిని ద్యజింపరాదు. 7

దర్శపూర్ణమాస జ్యోతిష్టోమాదులు నిత్యకర్మములలోఁ జేరినవైనను వ్రీహిపశుహింసా మిశ్రములు గావున వానియందు దోషమున్నదనియు దోషయుక్తకర్మములను ద్యజించుట యుక్తమే గదా యనియు శంకింపవచ్చును. ఈవాదము సాంఖ్యప్రలాపము దర్శపూర్ణమాసాదులు విధివిహితములు. అందలి పశుహింసాదులు దుష్టములుగావు ఏలయందువా ? దోషము కర్తృబుద్ధియందున్నది గాని కర్మమునందు లేదు కర్మదోషమునం దిది ప్రధానసూత్రము ఫలాభిసంధియుండుట, అదియు స్వార్థమగుట—ఇట్టివిగల కర్మము దోషదుష్టమగును ఇదే కర్మదోషమునకు నావచించిన బీజము ఈ రహస్యంబు గ్రహింపక సాంఖ్యులు స్వార్థఫలాభిసంధిరహితయాగాది నిర్దోష

కర్మములందు దోషబుద్ధిఁ గలిగియుందురు. ఇట్టి మోహమునకుఁ జిక్కి నిత్యములను బరిత్యజించుట తామసత్యాగమగును.

అంతఃకరణశుద్ధి లేమింజేసి శరీరకష్టమునకునోడి కర్మాధికారులు కొందఱు కర్తవ్యకర్మములనుగూడ వదలుదురు ఇట్టిత్యాగము రజోగుణాత్మకము దుఃఖమూలకత్వము నగుచున్నది కావున నిది రాజసత్యాగమందురు. ఇట్టి త్యాగమువలనఁ ద్యాగఫలమైన జ్ఞాననిష్ఠ కలుగదు.

విద్వత్సన్యాసులు వివిదిషాసన్యాసులుగూడ కర్మములను ద్యజింతురని యు వారిత్యాగముగూడ రాజసత్యాగమేల గాదనియుఁ బ్రశ్నింపవచ్చును అకర్త్రాత్మబుద్ధితో వారు కర్మములు త్యజింతురేగాని దుఃఖబుద్ధితోఁగాదు వారి త్యాగమునకు రాజసత్యాగమునకుఁ గలభేద మిది యని గ్రహింపుము చక్కగా నాలోచించినచో విద్వద్వివిదిషాసన్యాసులు కర్మములను ద్యజించుటలేదనియుఁ గర్మములే వారిని ద్యజించుచున్నవనియు స్పష్టమగును 'నకర్మాణి త్యజతే యోగీ కర్మభి స్త్యజ్యతే హ్యసౌ' అను జ్ఞానవాసిష్ఠ వాక్యమునువినవా ? 8

తామసరాజసత్యాగములఁగూర్చి చెప్పితిని సాత్త్వికత్యాగ మెట్టిదో వినుము. "ఇదినాకుఁ గర్తవ్య" మనుబుద్ధితో నిత్యకర్మములు చిత్తశుద్ధిపర్యంతముఁ జేయుచు, కర్తృత్వాభినివేశఫలకాంక్షలు వదలుటేని అది సాత్త్వికత్యాగమగును. 'సత్త్వా త్సంజాయతే జ్ఞానమ్' అను వచనప్రకారము ఇట్టి సత్త్వగుణము శాస్త్రార్థజ్ఞానంబునకు మూలమగును సర్వ కర్మత్యాగము యుక్తమా ? సర్వకర్మ ఫలమాత్రత్యాగము యుక్తమా ? అను వివాదము అజ్ఞుఁడగు ముముక్షువునకే యన్వయించునుగాని జ్ఞానికి నన్వయింపదు ముముక్షువు విషయంబున సర్వకర్మత్యాగము తామస రాజసాత్మకమగును ఇట్టి త్యాగము సరిగాదు సాత్త్వికమైన సర్వకర్మ ఫలమాత్రత్యాగమే వానికి యుక్తము. ఇది నా సిద్ధాంతము 9

సాత్త్వికత్యాగమువలని ఫలమేమందువా ?

తామసరాజసములు జ్ఞానప్రతిబంధకములు సాత్త్వికత్యాగికి నట్టి ప్రతిబంధకములు గలుగవు , అతఁడు శుద్ధచిత్తుఁడగును చిత్తశుద్ధి గలుగు

టంజేసి సాధనచతుష్టయసంపత్తియు గురూపసదన వేదాంత శ్రవణాదిసంపత్తియు వానికిఁ జేకూరును ఆ కారణంబున వానికి బ్రహ్మాత్మతత్త్వ సాక్షాత్కారము గలుగును తత్త్వసాక్షాత్కారంబున అవిద్యకములైన సకలసంశయవిపర్యయములు నివారితములగును , కర్మములుచేయవలసిన యావశ్యకతయుఁ దొలంగును అందువలన వానికిఁ బాపకర్మములందుఁ బ్రతికూలభావముగానీ పుణ్యకర్మములందుఁ బ్రీతిగానీ యుండదు అనఁగా ఆత్మ కర్తగాదను భావము వానియందు స్థిరమైయుండును గావున నిఖిలకర్మకలాపము అవిద్యాతత్కార్యమనియుఁ, బుణ్యపాపంబులతోడ నాత్మకెట్టి సంబంధములేదనియుఁ, బ్రారబ్ధోపనత పుణ్యపాపంబులు అంతఃకరణ సంబంధంబులు గావున అవి భుక్తముగానిదే నశింపవనియు, నతఁడు నిశ్చయించుకొని తామరాకు మీఁది నీటిబిందువువలె నుండును అర్జునా ! సాత్త్వికత్యాగంబునఁ జిత్తశుద్ధియు దానివలన సర్వకర్మ సన్యాసరూప జ్ఞాననిష్ఠయు ఫలములగుట గంటివా ? 10

సర్వకర్మ సన్యాసమనఁగా ఎట్టికర్మమును జేయకుండుట యగునా యని శంకింపవచ్చును

సర్వకర్మసన్యాసమనఁగాఁ గర్మములను బొత్తుగాఁ జేయకుండుటగాదు అంతోయింతో కర్మమొనర్పక యూఱకుండుట సాధ్యముగాదని మూఁడవ యధ్యాయము అయిదవశ్లోకములోఁ జెప్పియేయున్నాను ఆరబ్ధదేహాభరణార్థము ప్రాణి యనుదినము దేహధర్మములొండె వర్ణాశ్రమధర్మంబులొండెఁ జేయుచునుండును కావున సర్వకర్మసన్యాస మనఁగాఁ గర్మస్వరూప సన్యాసము గా నేరదు సర్వకర్మములను ఆత్మచేయుచున్నదని సామాన్యుల భావము జ్ఞాని యట్లు తలంపఁడు ఆత్మ కర్తగాదనియుఁ గర్తృత్వ మాత్మయందు అజ్ఞానంబువలన నారోపితమగుచున్నదనియు గ్రహించి జ్ఞాని వర్తించును అకర్త్రాత్మజ్ఞానమే సర్వకర్మసన్యాసము అట్టి జ్ఞానములేక కర్మములను వదలినంతమాత్రాననే కర్మసన్యాసముగాదు , అట్లు వదలుటయు సాధ్యముగాదు

త్యాగమునుగూర్చి వివరించితిని. ఇఁక గౌణసన్యాస ముఖ్యసన్యాస ములకుఁ గలభేదము చెప్పెద వినుము 11

ప్రతికర్మమునకు నేదే నొకఫలము తప్పదు కర్మస్వభావమునుబట్టి తత్ఫలము నరకప్రాప్తి మొదలైన అనిష్టఫలముగాఁగానీ, పుత్రపశ్వాది మానుష సుఖమైన మిశ్రఫలముగాఁగానీ, యుండును వివిదిషాపర్యంత సత్త్వశుద్ధి గలుగకమున్నే చనిపోయినవానికి అనఁగా గౌణసన్యాసికిఁ ద్రివిధమైన యాకర్మఫలము గలుగును ముఖ్యసన్యాసులకు అనఁగాఁ బరమహంస పరివ్రాజకాదులకు నెందు నెప్పుడుఁ గర్మఫలము గలుగదు ఏలయందువా ? వారు జ్ఞానులు, జ్ఞానాగ్నివలన వారికర్మములెల్ల భస్మములైయుండును, అనఁగా ముఖ్య సన్యాసులకుఁ గర్తృత్వాభిమానము లేశమాత్రముగూడ నుండదుగావునఁ గర్మఫలము వారికిఁ గలుగదు కర్మఫలమున్నఁగదా దానినను భవించుటకుగా జననమరణములు గలుగును గౌణసన్యాసులకన్ననో కర్తృత్వాభిమానము వారియందు సవాసనగా నశింపదు. అందువలనఁ గర్మఫలానుభవార్థము వారికి జననమరణములు తప్పవు కర్మఫలానుభవకారణముండుటంజేసి గౌణసన్యాసులకు జననమరణ సహితసంసారము, కర్మఫలానుభవ కారణము లేమింజేసి ముఖ్యసన్యాసులకు జననమరణ రహితమైన మోక్షము సిద్ధించుచున్నవి 12

* ఈశ్లోకమునందలి సన్యాసిశబ్దము గౌణసన్యాసిపరమనియు గౌణసన్యాసులకుఁ ద్రివిధకర్మఫలము గలుగదనియుఁ గర్మఫలంబనుభవింపవలసినది లేదు గావున జననమరణరూపసంసారము వారికిఁ గలుగదనియు శ్రీధరాచార్యులు వ్రాసిరిగాని యిది సమంజసముగాదు ఏలయందువా ? ఈశ్వరార్పణబుద్ధితో ఫలాభిసంధి రహితముగాఁ జిత్తశుద్ధికొఱకు కర్మము లనుష్ఠించువాఁడు సయిలము చిత్తశుద్ధి సిద్ధించు మధ్యకాలములో మృతుఁడయ్యెనేని వానికి శరీరగ్రహణము తప్పదు ఆకారణంబుననే వివిదిషాసన్యాసి శ్రవణమననాదు లొనర్చుకాలములో మృతి చెందెనేని యోగభ్రష్టుఁడై శుచిమంతులు శ్రీమంతులునగు వారియింట జనించునని యాఱవయధ్యాయములోఁ జెప్పఁబడినది అట్టివారికిఁగూడ జ్ఞానాధికారిశరీరప్రాప్తి తప్పదనఁగా గౌణసన్యాసులకుఁ దప్పుననుటెట్లు చెల్లును ?

పరమార్థము విచారించినచో ఆత్మకుఁ గర్తృత్వస్వభావము సహజమని శంకింపవచ్చును గాని యది ప్రమాదము. ఆత్మకుఁ గర్తృత్వస్వభావ మెన్నఁడు లేదు అదిష్ఠానాది తాదాత్మ్యమైన యధ్యాసమువలన ఆత్మకుఁ గర్తృత్వస్వభావమున్నట్లు భావింతురు ఇట్టి యధ్యాసమునకుఁ గారణమేమందువా ? వినుము *

కృతము అనఁగా కర్మము, కృతాంతమనఁగాఁ గర్మపరిసమాప్తి ఎల్ల కర్మములకుఁ బరిసమాప్తి యెట్లు గలుగుచున్నదని విచారించినచో జ్ఞానోత్పత్తివలనఁ గలుగుచున్నదని స్పష్టమగును 'సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే' అని చెప్పియేయున్నాను ఈకర్మముల యుత్పత్తికిఁ గారణ మేమని విచారించినచో నీక్రిందఁ జెప్పఁబోవు నైదును గారణములని తేలుచున్నది ఇట్లు నేను కల్పించి చెప్పుటగాదు వేదాంతశాస్త్రము లిట్లు చెప్పుచున్నవి ఈరహస్యము వివరింపఁగలవాఁడు నాకన్న మఱియొకఁడు గలుగఁడు, ఉపదేశించుటకు నీకన్న మించిన శిష్యుఁడును గలుగఁడు గావున నిట్టి పరమరహస్యంబునుగూడ నీకుఁ జెప్పుచున్నాను నాచెప్పుచున్నది వేదాంతార్థము గావున విశ్వాసముతో గ్రహింపుము

వేదాంతమెల్ల ఆత్మకర్తృత్వపరమనియు, అదిచెప్పునదెల్ల ఆత్మవిషయకముగానుండుట యుక్తమనియు, కర్మకారణము లున్ననో అనాత్మభూతములనియు అనాత్మవస్తువులతో వేదాంతమునకుఁ బ్రసక్తి యెట్లుగలుగుననియు శంకింపవచ్చును కర్మకారణములు అనాత్మభూతములైనను ప్రమాదవశంబున వానిని ఆత్మరూపంబున గ్రహించుచున్నారు అట్లు గ్రహింపరాదనియు, ఆత్మకుఁ గర్మగారణములకు సంబంధములేదనియు నిరూపించుటకై యాత్మయనునెట్టిదో అనాత్మభూతములైన కర్మకారణము లెట్టివో తేటతెల్లముగా వివరించుట యవసరమగుచున్నది ఈసంగతి స్పష్టమైనఁగాని నిష్క్రియాత్మతత్త్వజ్ఞానము గలుగదు అందువలన వేదాంతమందు అనాత్మభూతకర్మకారణంబులకుఁ బ్రసక్తి గలిగినది　13

అదిష్ఠానము, కర్త, వివిధకరణములు, క్రియలు, దైవము— ఈయైదును గర్మకారణములని చెప్పఁబడును అధిష్ఠానమనఁగాఁ గర్తృకరణ క్రియాశ్రయ

మైన శరీరము  కర్త అనఁగా చిదచిద్గ్రంథిరూపమైన అహంకారము. వివిధ కరణములనఁగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియాదులు. క్రియలు అనఁగా నాగ కూర్మ కృకర దేవదత్తధనంజయప్రాణాపానాదులు  దైవము అనఁగా జక్షు రాదులకు ననుగ్రాహకమైన యాదిత్యాదిరూపము　14

అధిష్ఠానాదులకుఁ గర్మకారణత్వ మెట్లందువా ?

ప్రాణి తన మనోవాక్కాయంబులతోఁ జేయు ప్రతికర్మమునకుఁ బైనఁజెప్పిన యైదు హేతువులుగానున్నవి  అందువలన వానికిఁ గర్మకారణత్వము గలిగినది.　15

ఎల్లకర్మము లిట్లు అధిష్ఠానాదులవలన జరుగుచుండఁగా, కేవలము అసంగోదాసీనస్వభావమై సాక్షిమాత్రముగా నుండునట్టిదియుఁ గర్తృత్వమునకే తగదనియునైన యాత్మవలనఁ గర్మములెల్ల జరుగుచున్నట్లు అజ్ఞాని భావించుచున్నాఁడు  ఇట్టిభావమేల గలిగెనందువా? శాస్త్రన్యాయంబులవలన బుద్ధి సంస్కృతము గానంగున విపరీతభావములు గలుగుచుండును  ఆత్మతత్త్వము అసంగోదాసీనస్వభావమని శాస్త్రము చెప్పుచున్నది  ఆత్మవిషయమున శాస్త్రస్థితి యెట్టిదైనది 'అహంకారవిమూఢాత్మా' అను  3-వ అధ్యాయము 27-వశ్లోకములో నేను చెప్పియున్నాను  న్యాయమును బరిశీలించినను ఆత్మకు నిర్ధర్మకత్వ నిర్వికారత్వాదు లేర్పడుచున్నవేగాని  కర్తృత్వ మేర్పడుటలేదు. ఆసంగతి 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మా' అను 13-వఅధ్యాయ 31-వ శ్లోకంబున సూచించితిని  మఱియుఁగర్తృత్వ నిర్వాహకములైన జ్ఞానేచ్ఛాకృత్యాదులెల్ల  క్షేత్రధర్మంబులని క్షేత్రాధ్యాయంబునఁ బ్రతిపాదించియున్నాను  కావున శాస్త్రన్యాయంబుల వాసన యేమాత్రమున్నను ఆత్మ కర్త యను భావమే జనింపదు  అట్టివాసన లేని దేహాత్మవాదులు ఆత్మ కర్తయందురు గాని పండితులు భావింపరు  తార్కికాదులకు శాస్త్రవాసన సమగ్రముగాఁగలదనియు వారుగూడ ఆత్మయే కర్తయని భావింతురనియు వారు పండితులు గారాయనియు శంకింపవచ్చును  తార్కికాదులు దుర్మతులు, అనఁగా వారిమనస్సు వివేకప్రతిబంధకపాపమువలన మలినవంతమై యుండును  దానంజేసి నిజము వారిహృదయములంగుఁ బ్రతిఫలింపదు వారిబుద్ధి అసచ్ఛాస్త్రన్యాయ సంస్కృతమేగాని సచ్ఛాస్త్రన్యాయ సంస్కృతముగాదు  కావున భ్రాంతి వారిని విడువదు　16

'నేను కర్తను' అనుభావ మెవనికిలేదో, అనఁగా నెవనిభావము అహంకారరహితంబు శుద్ధస్వరూపమాత్రపరిశిష్టంబునై యుండునో, ఫలాభిసంధి లేమింజేసి యెవని యంతఃకరణమునకుఁ బుణ్యపాపకర్మఫలములైన హర్షపశ్చాత్తాపంబులు తగులవో, యట్టివాఁడు సర్వప్రాణులను జంపినను వానిచేత లోకదృష్టికి హననమగునేగాని పరమార్థదృష్టికి హననముగాదు వానికిఁ దత్కార్యమైన యధర్మంబు పొరయదు అహంకారమున్నచోఁ గర్తృత్వముండు ననియు, ఫలాభిసంధియున్నచో బంధకముండుననియు అహంకారఫలాభిసంధులు లేనివారికిఁ గర్తృత్వబంధకంబులుండవనియుఁ భావము. కావున ఆత్మనిష్ఠుఁడు సర్వకర్మసన్న్యాసి యనుట యెంతయు యుక్తము

ఆత్మ కర్తగాదనియు దానికి బంధకములేదనియుఁ జెప్పుటకు మఱియొక కారణముగూడ గలదు క్రియాకారకఫలకలాపము త్రిగుణాత్మకము. ఆత్మయన్ననో నిర్గుణము నిర్గుణము గుణాత్మకములకుఁ గర్త యెట్లగును ? ఎట్లు విచారించినను ఆత్మ కర్తగాదనుట స్పష్టము 17

జ్ఞానము జ్ఞేయము పరిజ్ఞాత యీమూఁడు కర్మంబును బ్రవర్తింపఁజేయును. జ్ఞానమనఁగా ఇష్టార్థమును సాధించుటకు నిదితగును ఇదితగదని యెఱుంగుట, జ్ఞేయమనఁగా ఇష్టసాధనమైన కర్మము, పరిజ్ఞాత అనఁగా జ్ఞానమున కాశ్రయమైన యహంకారము కరణము కర్మ కర్త అని కర్మసంగ్రహము మూఁడు విధంబులు సాధకతమము కరణము, ఈప్సితతమము కర్మము, చిదచిత్సంధిరూపమై 'నేను' అను శబ్దంబునకు నర్థమై యుండు స్వతంత్రుఁడు కర్త. 18

*ప్రతికర్మము మొదట మనస్సుచే నిశ్చయింపఁబడి తర్వాత యింద్రియములవలనఁ జేయఁబడుచున్నది. కర్మప్రవర్తనమునకు మానసికవిచారము ప్రథమప్రేరణముగానున్నది దీనినే కర్మచోదనయందురు ఈవిచారము జ్ఞానము జ్ఞేయము జ్ఞాత అని మూఁడు విధములు స్పష్టార్థము ఉదాహరణము విను. కుండచేయవలయునని కోరుట జ్ఞేయము, అకుండ యిట్లుండవలయు ననుట జ్ఞానము, ఇట్లు నిశ్చయించు కుమ్మరి జ్ఞాత. కుమ్మరి యిట్లు నిశ్చ

యించి మృత్తిక తెచ్చి చక్రము మున్నగు సాధనల మూలమునఁ గుండఁ జేయు మన్నాఁడు. కుండకు మృత్తిక కర్తయగుచున్నది చక్రము మొదలగు నవి సాధనములగుచున్నవి, కుండ కర్మమగుచున్నది కర్మచోదన అనఁగా అంతఃకరణక్రియలు, కర్మసంగ్రహము అనఁగా అంతఃకరణక్రియలకు సంబంధించిన బాహ్యక్రియలు కర్మచోదనా కర్మసంగ్రహంబులు రెండుఁ గూడనిదే కర్మము పూర్తిగాదు *

గుణసంఖ్యానమనఁగా సాంఖ్యశాస్త్రము ఆశాస్త్రమునందు జ్ఞానము కర్మము క్రియ కర్త మున్నగువానిలో నొక్కొక్కటియు సాత్త్విక రాజస తామసభేదంబులతో మూఁడువిధంబులని చెప్పఁబడినది ఎట్లనిన వినుము 19

జ్ఞేయమునకు జ్ఞానము ఉపాధిగావున, జ్ఞానశబ్దమువలన నిందు జ్ఞేయము గూడ గ్రాహ్యమనియు, కారకత్వము క్రియోపాధికత్వము గావున కరణ కర్మకారకములెల్లఁ గ్రియాంతర్భావములని 'కర్మచ' అను చకారమువలన సూచితమనియుఁ గర్తయనుటవలన జ్ఞాతయు గ్రాహ్యమనియు నెఱుంగునది

పదునాల్గవ యధ్యాయములో గుణాతీతునకు జీవన్ముక్తత్వము నిరూపించుచు 'తత్ర సత్వం నిర్మలత్వాత్' ఇత్యాదులలో గుణములకుఁ గలబంధకత్వప్రకారము చెప్పితిని పదునేడవయధ్యాయములో 'యజంతే సాత్త్వికా దేవాన్' ఇత్యాదులలో గుణకృతమైన త్రివిధస్వభావముల నిరూపించి రజస్తమస్స్వభావము అసురమనియు దానిని ద్యజించి దైవమైన సాత్త్విక స్వభావంబును సంపాదింపవలసినదనియు, సాత్త్వికస్వభావాభివృద్ధికి సాత్వికాహారాది సేవ మిక్కిలి సహాయకారియనియుఁ దెలిపితిని మఱల నిప్పుడు గుణభేదములను జెప్పుట చర్విత చర్వణము గాదాయని శంకింపవచ్చును సమాధానము వినుము. ఆత్మ స్వభావముగానే గుణాతీతమైనది, ఆత్మకుఁ గ్రియా కారక ఫలసంబంధములేదు కర్మచోదనరూపమైన జ్ఞానాదులును, కర్మసంగ్రహరూపమైన కరణాదులను త్రిగుణాత్మకములని స్ఫుటమైఁగాని ఆత్మ గుణాతీతుఁడగుట బోధపడదు ఈవివరమేర్పడుటకుఁగా మఱల గుణభేద విచార మవసరమైనది.

జ్ఞానము సాత్త్వికమని రాజసమని తామసమని త్రివిధమంటివి అది వినుము

బ్రహ్మాది స్థావరాంతము సమస్తభూతములందు అనుస్యూతమై యాత్మ యున్నదనియుఁ దేశకాలవస్తుభేదములనుబట్టి భూతంబులు నానావిధంబులుగా నున్నను ఆత్మమాత్రము త్రివిధపరిచ్ఛేదశూన్యమై యేకవిధముగా నున్నదనియు నెఱుఁగు జ్ఞానము సాత్త్వికజ్ఞానమగును

ఘటాదులకు మన్ను ఎట్లో యట్లే సర్వభూతములకు ఆత్మ యధిష్ఠానమని వైరాగ్యమువలన నేర్పడు మన్నది ఘటములు నానారూపములుగా నండును ఘటము లెన్నిరూపములో ఘటములకు అధిష్ఠానమైన మన్ను గూడ నన్నిరూపంబులు వహింపకతీఱదు ఇది ప్రత్యక్షసిద్ధము అట్లే యాత్మ గూడ నదధ్యస్తమగు భూతములెన్నిరూపములో యన్నిరూపంబులు తాను వహింపకతీఱదు. న్యాయమిట్లుండఁగా, ఆత్మ త్రివిధపరిచ్ఛేదశూన్యమై యేకవిధంబుగానుండుట యెట్లు ? అని శంకింపవచ్చును

ఆత్మ యవ్యయమైనది, అనఁగా ఉత్పత్తి వినాశాది సర్వవికారశూన్యమైనది మృత్తిక యట్టిదిగాదు కావున ఆత్మకు మృత్తికకు అధిష్ఠానవిషయంబున సర్వసామ్యము పొసఁగదు ఇట్టి యద్వితీయాత్మ తత్త్వజ్ఞానమే సాత్త్వికజ్ఞానమగును రాజసతామసజ్ఞానము ద్వైతజ్ఞానమగును ద్వైతజ్ఞానము సంసారకారణమగును , అద్వైతజ్ఞానము సంసారవిముక్తిహేతువు ఇదే భావంబును 'వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః' అను సప్తమాధ్యాయములోని పందొమ్మిదవ శ్లోకపాదము సూచించుచున్నది 20

భూతంబులు నానాజాతులుగా వివిధరూపంబులతో సుఖదుఃఖావస్థలు గలిగియుండునట్లే యాభూతంబుల దేహమందున్న యాత్మగూడ భిన్నభిన్న స్వరూపంబులతో వివిధావస్థలపాలై యుండుననుజ్ఞానము రాజసజ్ఞానమగును అనఁగా నొకజంతువునందలి యాత్మకు మఱియొక జంతువునందలి యాత్మకు భేదమనియు, ఇట్లు భిన్నస్వరూపంబులనున్న యాత్మలకున ఈశ్వరునకును భేదమనియు, ఈశ్వరునకుఁ జేతనంబులకు అచేతనంబులకుఁ బరస్పరభేదమనియుఁ

దలంచుట కుతార్కికము గావున అట్టిజ్ఞానము రాజసజ్ఞానమని భావము ఇట్లు తలంచువారు ఈశ్వరునకు స్వగతభేదంబుఁ, జేతనంబులకు జీవేశ్వరభేదంబు, అచేతనంబులకు స్వపరభేదంబులని, మూఁడు భేదములు చెప్పుదురు 21

ఏదేనొక దేహమో ప్రతిమయో చూచి ఆత్మయన్నను ఈశ్వరుఁడన్నను అదేయనియు, అదే పరిపూర్ణమైనదనియు అంతకన్న మఱియొకటిలేదనియు ఉపపత్తిగాని పరమార్థాలంబనముగాని లేనట్టి బుద్ధితో భావించుట తామస జ్ఞానమగును. ఇది కేవలము తుచ్ఛము గాన దినిఫలముగూడ నల్పముగానే యుండును ఇట్టి దేహాద్యాత్మాభిమాన రూపజ్ఞానము చార్వాకాదులకు నభిమతము

అద్వైతజ్ఞానము సాత్త్వికమనియు, ద్వైతజ్ఞానము రాజసమనియు, దేహాద్యాత్మజ్ఞానము తామసమనియు వివరించితిని ఇఁకఁ గర్మత్రైవిధ్యము వినుము 22

రాగద్వేషములు లేక, ఆ కారణంబున ఫలాభిసంధి రహితముగాఁజేయు సంధ్యాగ్నిహోత్రాది స్వధర్మానుసార ముక్తిప్రతిపాదన కర్మములు సాత్త్వికములు సాత్త్వికకర్మములుచేయు కర్తకు ఇష్టావాప్తిరూపమైన ఫలేచ్ఛగానీ అనిష్టపరిహారరూపమైన ఫలేచ్ఛగానీ యుండదు 23 ఫలాభిలాషతోఁగానీ అహంకారముతోఁగానీ 'నాసాటి శ్రోత్రియుఁడు నాకు సమానమైన యాజ్ఞికుఁడు గలఁడా?' అను నభిమానముతోఁగాని సర్వాంగోపసంహారముగా మహాక్లేశముతోఁజేయు కర్మములు రాజసములగును 24 అనుబంధము అనఁగా వెనుకవచ్చు దుఃఖము, క్షయము అనఁగా ద్రవ్యనాశనము, హింస అనఁగా పరపీడ; పౌరుషము అనఁగా కర్మమును బూర్తిచేయు సామర్థ్యము- ఇవి తలంపక కేవలము అవివేకంబుతోఁజేయు దుర్యోధనాదుల యుద్ధమువంటి కర్మములు తామసములగును 25

కర్త మూఁడు విధములనుట వినుము

ఫలాభిసంధిగానీ, నేనెంతపనిచేసితినో చూడుమనెడి గర్వోక్తిగానీ లేక ప్రారంభించినది పరిసమాప్తియగు పర్యంతము ఎట్టికష్టములువచ్చినను పట్టు

వదలక సహించుచు, ఉత్సాహముగలిగి, ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను హర్షవిషాదరూపంబులగు వికారములు పొందక ముక్తసంగుఁడు కేవల శాస్త్రప్రమాణయుక్తుఁడునై చేయువాఁడు సాత్త్వికకర్తయగును 26 కామపరవశుఁడైగాని, యశస్సుగోరిగాని, స్వర్గపుత్రాది ఫలంబుఁగోరిగాని, చేయువాఁడు, కర్మాపేక్షితమైన దక్షిణయిచ్చుటకు మనస్సురాక, పరులను బీడించి వారివలనఁ గర్మముచేయించుచుఁ గర్మాపేక్షితమైన శుద్ధిలేక, ఫలము సిద్ధించినప్పుడు హర్షము, విఘ్నమైనప్పుడు శోకముఁ బొందువాఁడు రాజసకర్తయగును 27 విషయపరితంత్రతవలనఁ గర్తవ్యంబులందు జాగరూకతలేక శాస్త్రసంస్కారశూన్యుఁడై పాషాణహృదయము గలిగి, నిజమెఱింగియుఁ బరవంచనార్థములేనిది పల్కుచు మహోపకారుఁడను భ్రాంతి లోకులకుఁ గలిగించుచు లోలోన వారిపనులు చెఱచి తాను లాభముఁ బొందుచు అవశ్యకర్తవ్యములనుగూడ చేయక తనివి యెట్టిదో యెఱుంగక నిరంతరము దుఃఖించుచు నిత్యసందేహియై దేనికిఁ దెంపుసేయక నేఁడుచేయవలసినది మాసమునకుఁగూడ చేయక యుండువాఁడు తామసకర్తయగును 28

జ్ఞానము, కర్మము, కర్త—ఇవి గుణభేదములనుబట్టి యొక్కొక్కటి యెట్లు మూఁడు విధములుగానుండునది తెలిపితిని బుద్ధి, ధృతి—ఇవిగూడ గుణములనుబట్టి ఒక్కొక్కటి మూఁడు విధములు వీనిభేదము సమగ్రముగాఁ జెప్పెదను వినుము బుద్ధియనునది సర్వతత్త్వంబులను సమస్త పురుషార్థములను నిశ్చయించునది గావున దానిసంగతి చక్కగా వినుము 29

అర్జునా! కర్మమార్గమన నేమో సన్న్యాసమార్గమన నేమో, ప్రవృత్తికిఁ గర్మమేల కర్తవ్యమో, నివృత్తికిఁ గర్మము కర్తవ్యమేలగాదో, ప్రవృత్తిమార్గంబువలన గర్భవాసాది దుఃఖములు గలుగు టెట్లో, నివృత్తిమార్గంబున నట్టివి గలుగకుండు టెట్లో ప్రవృత్తిమార్గమందు అజ్ఞానకృతమగు కర్తృత్వాభిమానముండుటవలన నది బంధకమగుట, నివృత్తిమార్గంబునందు అజ్ఞానము జ్ఞానముచేత నశించుమ గావున అజ్ఞానమూలమైనబంధము గలుగకుండుట—ఇట్టివిషయంబు లెఱుంగునట్టి యంతఃకరణము సాత్త్వికబుద్ధియగును 30 శాస్త్రవిహితమైనది ఏలధర్మమగునో, శాస్త్రనిషిద్ధము ఏలయధర్మమో, లౌకికవిషయములందుఁ

జేయఁదగినదేదో చేయఁదగనిదేదో యను సందర్భములందు సందేహము గలిగి
యుండునది రాజసబుద్ధి యగును 31 అజ్ఞానదోషము గప్పియుండుటంజేసి
అధర్మము ధర్మముగా ధర్మము అధర్మముగా మంచిది చెడ్డగాఁ జెడ్డది మం
చిదిగాఁ బ్రతివిషయమును విపరీతముగాఁ దలంచుబుద్ధి తామసబుద్ధి యగును.
ఏడవ శ్లోకమునఁ జెప్పిన తామస పరిత్యాగంబునకు ఈ తామసబుద్ధియే
కారణము 32

ధృతి మూఁడు విధములగుట వినుము

ధృతి యనఁగా మనోనిశ్చయమును వదలకుండునట్టి ప్రయత్నము
మనస్సు ప్రాణములు ఇంద్రియములు చేష్టలు—వీనిని జలింపనీయక సమాధి
సుప్రయత్నముతో నియమించునది సాత్వికధృతి యగును ఇట్లు నియమించు
టంజేసి మనః ప్రాణేంద్రియాదులు శాస్త్రమర్యాద నతిక్రమింపఁజాలవు 33
కర్తృత్వాభినివేశము పూర్ణముగాఁగలిగి ఫలంబునుగోరి ధర్మకామార్థంబులు
నిత్యకర్తవ్యము లనునది రాజసధృతి యగును ఇది మోక్షమును మాటయే
తలంపదు 34 దుర్బుద్ధిగలవాని నిద్రాభయంబులును, ఇష్టవియోగమువలని
శోకంబు దైన్యంబు, నిషిద్ధవిషయ సేవాపరత్వమైన మదము, నిద్రాభయ
శోకములకుఁ గారణములగు విషయములందుఁ దగిలియుండుట—ఇట్టిరూపమైన
ధృతి తామసధృతి యగును 35

అర్జునా! క్రియాకారకములు మూఁడు విధములగుటఁ జెప్పితిని.
క్రియాకారకముల ఫలమైన సుఖముగూడ గుణభేదమునునట్టి మూఁడు విధం
బులు అలవాటునంజేసి యెచ్చోట దృప్తిఁజెందునో, ఎచ్చో రమించుచుండగా
నెల్లదుఃఖంబులకు నవసానము గలుగుచుండునో, అత్యంతాయాస సాధ్యములైన
జ్ఞానవైరాగ్యధ్యానసమాధులవలన నేది లభ్యమో, 36 సాధనావస్థయం
దేది విషమువలె దుఃఖావహమైయున్నను బరిణామంబున నమృతముగానుండు
నో, ఆత్మనిష్ఠగలబుద్ధి నిద్రాలస్యాదులమాని స్వచ్ఛతను బడయుటఁజేసి యేది
గలుగునో యట్టి సమాధిసుఖము సాత్వికసుఖమని యోగులు వచితురు
విషయసుఖము తాత్కాలికమాత్రమేగాని పర్యవసానంబున మోహదుఃఖా
త్మకమైయుండును సాత్వికసుఖమట్టిది గాదు, సాత్వికసుఖము ఆధ్యాత్మిక
సుఖమగును సాత్వికసుఖమును సాధించుటకై మహాప్రయాసపడవలయుఁ

యని గ్రహింపనగును. ఇట్లు బుద్ధిని ఆత్మనిష్ఠ గావించినవానిని బ్రాహ్మీస్థితుఁడని, స్థితప్రజ్ఞుఁడని, గుణాతీతుఁడని, సమ్యగ్దర్శియని నిర్గుణనిష్ఠుఁడని చెప్పుదురు

సత్త్వరజస్తమోగుణంబులు ప్రకృతివలనఁ గలుగుచున్నవని చెప్పితిని ఈమూఁడుగుణములు గలుగునియట్టిపదార్థము భూమియందుఁగానీ ఆకాశమందుఁగానీ దేవలోకంబునఁగానీ లేదు

అర్జునా! గౌణసన్యాసస్వరూపము తెలిసినదిగదా సారాంశము వినుము త్యాగమన్నను సన్యాసమన్నను ఒక్కటేగాని వేఱుగాదు త్యాగము సాత్త్వికాది భేదమువలన మూఁడు విధంబులు. అందుఁ గర్మఫలత్యాగము సాత్త్వికము, కాయక్లేశ భయాదులవలనఁజేయు కర్మత్యాగము రాజసము, మోహావశంబునఁ గర్మమును ద్యజించుట తామసము

కర్మఫలత్యాగమే సన్యాసమనుటవలన ఎట్టివాఁడు ఎట్టికర్మముల నాచరింపవలసినది ఎట్లు ఫలత్యాగ మొనర్పవలసినది అనెడి కర్మానుష్ఠానప్రకారమునుగూర్చి నీకు శంక గలుగవచ్చును దీనినే గుణకర్మవిభాగ సిద్ధాంతమని చెప్పినను జెప్పవచ్చును ఈసిద్ధాంతము ననుసరించియే చాతుర్వర్ణ్యరూపమైన శాస్త్రవ్యవస్థ నిర్మితమైనది ఈశాస్త్రప్రకారము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు తమతము వర్ణవిహితకర్మములను జేయవలయును కర్మములొనర్చుచు ఫలత్యాగము సేయు టెట్లందువా? కేవల పరమేశ్వరార్పణబుద్ధితోఁ గర్మములనష్ఠించుటే ఫలత్యాగమగును గుణములనుబట్టి కర్మములు నిర్ణయింపఁబడినవి. నాలుగువర్ణముల కర్మవిభాగము వివరింతు వినుము. 40

అర్జునా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వారివారి స్వభావజగుణములే కర్మములను బ్రత్యేకించి నియమించుచున్నవి స్వభావమనఁగాఁ బూర్వజన్మసంస్కారము ఈసంస్కారమునకు అనురూపముగా గుణములుండును సత్త్వప్రధానులుగానుండువారు బ్రాహ్మణులు, సత్త్వమునకన్న రజోగుణము ప్రధానముగా నుండువారు క్షత్రియులు, తమస్సునకన్న రజోగుణము ప్రధానముగానుండువారు వైశ్యులు, రజస్సునకన్న తమోగుణ

ప్రధానముగాఁగలవారు శూద్రులు ఏగుణమునకుఁ దగిన కర్మమును ఆగుణమే నిర్ణయించుకొనుచుండును కర్మములను శాస్త్రములు నిరంకుశముగా విభజించి నియమింపలేవు స్వభావగుణముల తత్త్వమునుబట్టి యనుభవసిద్ధమైన విషయంబులను శాస్త్రీకరించిరి 41

శమము-అంతరింద్రియనిగ్రహము, దమము-బహిరింద్రియనిగ్రహము, తపస్సు-శారీరాదికమైనది పూర్వాధ్యాయములోఁ జెప్పఁబడినది, శౌచము-బాహ్యాభ్యంతరశుచి, క్షాంతి-ఓర్పు, ఆర్జవము-మనస్సులోనొకటి వెలికి నొకటిగాకుండ ఉన్నంతచెప్పుట చేయుట, జ్ఞానము-శాస్త్రీయజ్ఞానము; విజ్ఞానము-అనుభవజ్ఞానము, ఆస్తిక్యము-వేదాదులందు సత్యత్వనిశ్చయము; ఇవి బ్రాహ్మణజాతికి స్వభావ గుణజన్యములైన కర్మములు. 42

శమదమాదులు నాల్గుజాతులకు సాత్త్వికావస్థయందుఁ గలుఁగవా యని శంకింపవచ్చును అవి నాలుగుజాతులకుఁ గలుగవచ్చును. అయినను బ్రాహ్మణులయందు బాహుళ్యములు, పుట్టుకతోనే వారు సత్త్వస్వభావులు; ఇతరవర్ణములందు సత్వోద్రేకము స్వభావముగాదు. సంస్కారమువలన సిద్ధించుచుండును సత్వోద్రేకముగలవాఁ డీగుణములును తదనుగుణకర్మములను ఎల్లజాతులందుఁ గూడనగును ఈయభిప్రాయంబును సూచించుటకే స్మృతిపురాణాదులందు శమదమాదులు సర్వవర్ణ సాధారణ ధర్మములుగాఁ జెప్పఁబడినవి.

శౌర్యము-యుద్ధమందు నిర్భయమైన ప్రవృత్తి, తేజము-ఇతరులవలన అవమానము పొందకుండుట, ధృతి-మహావిపత్తు గలిగినను డీలుపడకుండుట, దాక్ష్యము-కార్యములపట్ల మోహముచెందక వాని నొనర్చుట, యుద్ధాపలాయనము-యుద్ధమందుఁ జావు సిద్ధమైనను వెన్ను చూపకుండుట, దానము-ఇయ్యఁదగినవారికిఁ బిడికిలి బిగింపకుండుట, ఈశ్వరభావము-పదిమందిపై నధికారము సాగించి వారిని నియమించు శక్తి గలిగియుండుట-ఇవి సత్త్వము అప్రధానము రజస్సు ప్రధానమునైన స్వభావముగల క్షత్రియజాతికి విహితములైనకర్మములు 43

కృషి-పైరుపెంచు నిమిత్తము దున్నుట, గౌరక్ష్యము-పశువులను కాపాడుట, వాణిజ్యము-కొనుట అమ్ముట-ఇవి తమస్సు అప్రధానము రజస్సు

ప్రధానమునైనస్వభావముగల వైశ్యజాతికి విహితములైన కర్మము. బ్రహ్మక్షత్రియవైశ్యజాతులకుఁ బరిచర్యసేయుట శూద్రులకు అనఁగా రజస్సు అప్రధానము తమస్సు ప్రధానమునైన స్వభావముగలవారికి విహితకర్మములు. 44

శ్రుతిస్మృతులలో నాల్గువర్ణములకు విధించిన కర్మములకు నియమ లక్షణములని గ్రహింపవలయును.

జనులు తమతమ వర్ణాశ్రమములకు విహితములైన కర్మములందుఁ బరినిష్ఠితులై జ్ఞానయోగ్యతను బడయుదురు. జనులని ప్రత్యేకించుట యేల యనఁగా దేవతలు కర్మాధికారులు గారు గావున వారికివియన్వయింపవు. దేవతలు ఉపాసనామాత్రముచేత జ్ఞానయోగ్యతను బడయుదురు. 45

మోక్షమనఁగా జననమరణరూపమైన సంసారముతోఁడవిముక్తి. మోక్షమును బడయుట యెల్లరకుఁ బరమావధి. ఇందులకు జ్ఞానము పరమసాధనము, జ్ఞానమునకు చిత్తశుద్ధి ముఖ్యాంగము. చిత్తశుద్ధికి సత్త్వగుణము ప్రధానము. అందువలన సత్త్వగుణాభివృద్ధికి నెల్లరుఁ బ్రయత్నింపవలసియున్నది. సత్త్వగుణము ఇంద్రియనిగ్రహంబునఁ జేకూరును. ఇంద్రియనిగ్రహంబునకు ఆహారవ్యవహారనియమము అత్యంతము సహాయపడును.

ఆహారాదినియమము చెప్పఁబడినది. ఆనియమప్రకారము వ్యవహరించినచోఁ గ్రమముగాఁ గ్రిందితరగతివారు పైతరగతికివచ్చి తుదకు సత్త్వగుణసంపత్తిని బడయుదురు. ఇట్టిది పూర్వవాసననుబట్టి ఒక్కజన్మములోనే సిద్ధింపవచ్చును లేక వేనవేలు జన్మములు కావలసియుండవచ్చును. ఇదియు ప్రయత్నమునుబట్టియుండును. ఇందులకు విశ్వామిత్రాదులే నిదర్శనము. కర్మానుభవవిషయమునఁ బురుషప్రయత్నమంతగా ఫలకారిగాకున్నను నిజోద్ధరణవిషయమున మాత్రము పురుషప్రయత్నమునకు సర్వస్వాతంత్ర్యము గలదు. ఈరహస్యము 6-వ యధ్యాయము 5-వ శ్లోకమున విస్పష్టముగాఁ జెప్పబడినది. నిమ్నజాత్యుద్ధారకులు ఈపరమరహస్యమును గ్రహించి స్వభావానుసారముగా నడిపించినచో నిమ్నజాతులు సక్రమాభివృద్ధి నొందును. అట్లుచేయక స్వభావవిరుద్ధమార్గ మవలంబించి యొక్కసారిగా వారి నున్నత

# పదునెనిమిదవ యధ్యాయము.

స్థితికిఁ గొనిరా యత్నించుచోఁ బచ్చికాయను బండవేయుటగును వివక్ష మాని కలసిమెలసి యన్నపానాదులు స్వీకరించినమాత్రాననే రజస్తమో గుణ ప్రధానులు సత్త్వగుణసంపన్నులుగారు మీఁదుమిక్కిలి సత్త్వగుణమునకు సంపర్కదోషంబునఁ గొంత న్యూనత తప్పదు

స్పర్శవిషయమునఁగూర్చిగూడ తీవ్రమతభేదము గానవచ్చెడు స్పర్శ దోషము కలదందురా ? లేదందురా ? అంటువ్యాధులు స్పర్శవలనఁ గలుగు నని వైద్యశాస్త్రము పలుకుచుండఁగా చికిత్సాలయములందు రోగిని తాఁకి వైద్యుఁడు గావించుకొను శుద్ధివిధానకలాపము స్పర్శదోషమును వేనోళ్లఁ జాటుచుండఁగా నట్టిది లేదనుట కేవలము సాహసము

స్పర్శదోషము బాహ్యమని ఆభ్యంతరమని రెండువిధంబులు బాహ్య స్పర్శదోషంబునకుఁ బైనఁజెప్పిన యంటువ్యాధులు మున్నగునవే నిదర్శనములు అభ్యంతరస్పర్శదోషము ఆహారికమని తైజసికమని మఱల రెండువిధములు ఆహారపదార్థములు రక్తరూపముగా మాఱి నిజస్వభావానుగుణముగా సత్త్వరజస్తమోగుణంబులకు నుద్దీపకము గలిగించుట మున్నగు విషయములు ఆహార నియమప్రకరణంబునఁ జెప్పఁబడినవి తైజసికస్పర్శదోషము స్థూలపరీక్షలకుఁ జిక్కునదిగాదు దివ్యదృష్టివలననే దానిని గ్రహింపనగును సత్త్వరజస్తమో గుణములు గలుగని పదార్థమే సృష్టిలోఁ గలుగదని 40-వ శ్లోకములోఁ జెప్పఁబడినది. గుణమునుబట్టి ప్రతివస్తువునకుఁ దేజోమండల మావరించియుండును ఈ తేజోమండలము అండాకారముగా నుండునందురు

సత్త్వగుణము ప్రధానమనియు ! ఆహారవ్యవహారాది నియమంబులు పాటించి దాని నభివృద్ధిగావించుకొనుట ముముక్షువులకుఁ గర్తవ్యమనియుఁ బైనఁజెప్పఁబడినది సత్త్వము స్వచ్ఛముగాఁ బ్రకాశమానముగా నుండునని యు రజస్సు రాగయుక్తముగా నుండుననియు, తమస్సు మలినవంతముగా నుండుననియుం సయుక్తము వివరింపఁబడినది శుద్ధసత్త్వోపేతుని స్థితప్రజ్ఞుఁడందురు మహాత్ముఁడు లీకోటిలోఁ జేరుదురు. వీరి తేజోమండలము స్వచ్ఛముఁ బ్రకాశమానమునై యుండుటయేగాక వజ్రకవచమువలె బలవత్తరమై రజస్తమస్సులకు దురవగాహముగానుండును అట్టివారికిఁ బ్రతికూలతేజస్స

మెంతసోకినను నేగిగలుగదు వారు అతీతులు గావున స్పర్శదోషము వారికి లేదు. తమోగుణము రజోగుణముగా, రజోగుణము సత్త్వగుణముగా మార్చుకొని సత్త్వసంపత్తిని బడయుట కర్తవ్యమని చెప్పఁబడినదిగదా. అట్టి పరిణామావస్థలో సత్త్వరజస్సులు బహుకోమలప్రాయములుగా నుండును. అట్టి కోమలప్రాయ సత్త్వరజస్సులకుఁ దదధిక రజస్తమస్స్పర్శలు క్రమముగా దాపరించెనేని నిరాఘుతీవ్రతకు అంకురంబులవలె నవి నసిచెడి నశించును. ఇట్టియాపద కలుగకుండుటకై వారు దవ్వుననుండుట మేలు ఇట్లు గావించుట యాత్మరక్షణార్థమే గాని పరగర్హణార్థము గాదు. అస్పృశ్యతా నియమమును బాటించినంతనే వారు భూతదయాది దైవగుణశూన్యులని భావింపరాదు దోషము నంగీకరించుచు దానినుండి రక్షించుకొనుటయందు విపరీతము గాన్పింపదు

*ప్రకృత సంఘస్థితినిబట్టి నియమమును బాటింపఁ దరముగాదందురా? అందులకై వగవవలయునేగాని, ఆకారణంబున శాస్త్రతిరస్కారము చేయు టేల ? దోషసంస్కారోద్యమముమాని యెల్లరు అంచపరంపరగా దోషకూపంబుననే దుమికినచో నది యధఃపతనమగునేగాని యుద్ధరణము కాఁజాలదు

గుణతేజోభేదములుగల నాల్గువర్ణములవారు స్పర్శదోషమును దమలోఁదాము పాటింపనప్పుడు పంచమవర్ణమువారి యెడమాత్రము పాటింపనేల యని శంకింపవచ్చును గుణతేజోవిషయములందు నాల్గువర్ణములలో నొక్కొక్క వర్ణమునకుఁగల భేదమునకన్నఁ బంచమవర్ణమువారి భేదము బహుళము తీవ్రమునై యుండుటంబట్టి వారి నంతదూరము ంచిరి నాల్గువర్ణములలోఁగూడ స్పర్శదోషము పాటింపలేదనుట ప్రమాదము. వారియందుఁగూడ నిట్టి దనుష్ఠేయమనియే శాస్త్రసిద్ధాంతము కాలవైపరీత్యంబునంజేసి కట్టుబాట్లు సడలి సాంకర్యము తలయెత్తినది ఆత్మకళ్యాణము జగత్కళ్యాణము గోరు వారు లోపంబులను సంస్కరించుట యుక్తము

ఆధ్యాత్మిక విచారమునట్లుంచి లౌకికదృష్టితోఁ జూచినయెడల స్పర్శదోషాచరణము అసురక్రియయనియందురా ? అస్పృశ్యతానివారణము కోరుటెందులకు ? జగత్కల్యాణము నిమిత్తముగదా ! జగత్కల్యాణము తుట్ట

తుదకు అధ్యాత్మతత్త్వముపై నాధారపడియుండఁగా దానిని మఱచినచో స్థిరమైన కార్యసిద్ధియగు టెట్లు ? మూలకారణంబును వదిలి బాహ్యలక్షణములకు, జికిత్సచేసియు ఫలము లేదుగదా !

శ్రీశంకరభగవత్పాదులవారి మనీషాపంచకంబునుగూర్చి గాథయొకటి గలదు. అతీతులకు సమదర్శనత్వము సహజమగుటను మనీషాపంచకము సూచించునని గ్రహింపవలయును. ఈయర్థమునే 5-వ అధ్యాయము 18-వ శ్లోకము తెలుపుచున్నది

అర్జునా ! ఏయేకర్మము లెవరెవరికి యుక్తములో వివరించితిని జనులు తమతమకర్మముల నేప్రకారమనుష్ఠించినచో జ్ఞానయోగ్యతగల్గునో వినుము.

బ్రహ్మాది స్తంభపర్యంతము సమస్తభూతంబులకుఁ బ్రవృత్తి అనఁగా చేష్ట యేపరమేశ్వరునివలనఁ గలుగుచున్నదో, ఏపరమాత్మ చేతనాచేతనాత్మక సమస్తజగంబు నధిష్ఠానరూపముచే వ్యాపించియుండునో యాపరమేశ్వరుని మానవులు తమతమ కర్మములతో నారాధించినచో జ్ఞానయోగ్యత గలుగును కర్మానుష్ఠానప్రకారమెల్లఁ బరమేశ్వరారాధన స్వరూపమని భావము కర్మారాధన మెట్లందువా ? భృత్యుఁడు తనయేలికయాజ్ఞను దలఁదాల్చి ఫలాభిసంధిరహితముగా యథావిధి చేయునట్లు నరులు సర్వప్రేరకుఁడు సర్వనియంతయునైన పరమేశ్వరుని యాజ్ఞారూపంబులగు శ్రుతిస్మృతులందలి స్వస్వధర్మంబులను నిష్కామబుద్ధితో నాచరించుట కర్మారాధనమగును. పరమేశ్వరుఁడు సర్వకల్పనాధిష్ఠానము గావునఁ గర్మార్పణంబువలన వానికి వికారము గలుగదు 46

తమతమకర్మములను నియతియేలయనియు, బ్రాహ్మణకర్మములు క్షత్రియులు, క్షత్రియకర్మములు బ్రాహ్మణులు—ఇట్లు నాల్గువర్ణములవారు వివక్షమాని అనులోమవిలోమముగా కాలానుగుణముగా సేల చేయరాదనియు, భక్తితో ఫలాభిసంధి వదిలి కర్మముచేయు టొక్కటే ప్రధానముగాని వర్ణాశ్రమధర్మనియమితములైన ధర్మములనే చేయవలయుననుట యేలయనియు శంకింపవచ్చును

స్వభావానుసరణము సౌలభ్యము హితమునగుగాని స్వభావవిరుద్ధవర్తనము ఏటికి ఎదురీదినట్లగును. స్వభావమనఁగాఁ బూర్వసంస్కారము. సంస్కారమునుబట్టి సంప్రాప్తములైన కర్మములు లోకదృష్టికి గుణహీనములుగా నుండవచ్చును. అంతమాత్రాననే వానిని త్యజింపరాదు. పరులకు సంప్రాప్తమగు కర్మము గుణవంతముగాఁ దోఁపవచ్చును. అట్లని దానిని స్వీకరించి యెంత శ్రద్ధాభక్తులతోఁ జేసినను ఫలములేదు. గుణదోషంబులు కర్మమందు లేవనియుఁ గర్తృబుద్ధియందున్నవనియుఁ జక్కఁగా గ్రహింపవలయును. ధర్మవ్యాధునిచరిత్రచే యిందులకు నిదర్శనము. కర్మానుష్ఠానము స్వభావశుద్ధినిమిత్తము. ఏస్వభావము ఏకర్మమువలన శుద్ధిపడవలయునో యాస్వభావమే యాకర్మమును నిశ్చయించుకొనుచున్నది. స్వభావవిరుద్ధవర్తనుఁడు లోకదృష్టికిఁ గానవచ్చు కార్యసిద్ధినిగానీ పరమార్థదృష్టికి ముఖ్యమగు సత్త్వశుద్ధినిగానీ పడయక రెంటఁజెడిన రేవఁడువలె నశించును. 47

అర్జునా! స్వభావజమైన కర్మమెట్టిదైనను దోషవంతము కానేరదు. ఒకవేళ దోషవంతమైనను దానిని వదలరాదు. విషమందు జనించు పురుగునకు విషము మరణకారి గాదుగదా. స్వధర్మమందు దోషమెంచి పరధర్మంబును బెద్దసేయుదువేని, అదిమాత్రము దోషరహితముగా నుండునా? అగ్నికి ధూమమువలె సర్వకర్మంబుల నేదేనొక దోషమాశ్రయించి యుండునేగాని దోషరహితమైనకర్మ మొక్కటియుఁ గలుగదు. ఏలయందువా? త్రిగుణాత్మకముగాని వస్తువేలేదని మున్నే చెప్పియున్నాను. గుణసంగతి యెప్పుడుండునో దోషము వెనువెంటనే యుండును. స్వపరధర్మంబులరెంట దోషము సహజము గావునను, దోషరహితకర్మము లేదు గావునను, గర్మానుష్ఠానపరులు తమస్వభావమునకు అనుగుణమైన ధర్మమొనర్చుట సుకరముఁ బరమశ్రేయము నగును.

అర్జునా! గౌణసన్న్యాసంబును సవిస్తరంబుగా నిరూపించితిని. ఇఁక విద్వత్సన్న్యాసము వివరింతు వినుము.

సాత్త్వికత్యాగరూపమైనది గౌణసన్న్యాసమని నిరూపించితిని. గౌణసన్న్యాసమువలన దురితక్షయమగును. దురితక్షయమైనంతనే స్పృహ అనఁగా

యోగంబులకు భంగపాటు రాకుండునిమిత్తము) దృష్టాదృష్ట విషయంబులంగు దృఢవైరాగ్యంబు వహించి 52 అహంకార నిమిత్తకమైన మదమునకు నెడమీయక, ప్రారబ్ధవశంబునం బ్రాప్తంబులగు విషయములందు సంయితము కామము క్రోధము పరిగ్రహము వదలి, దేహజీవనమాత్రమేనియు మమకార మునొందక, అహంకారమమకారములు లేమింజేసి సర్వకర్మంబులు నుపరతిం జెందును గావునం దన్మయుండైయుండు పరమహంస పరివ్రాజకుండు బ్రహ్మ సాక్షాత్కారంబునకు యోగ్యుండగును 53

అనఁగా విశుద్ధబుద్ధి, ఆత్మనియమము, విషయపరాఙ్ముఖత, రాగద్వేష రాహిత్యము, వివిక్తసేవిత్వము, లఘుభోజనము, మనోవాక్కాయనియతి, ధ్యానము, యోగము, వైరాగ్యము, అహంకార మమకార బల దర్ప కామక్రోధ పరిగ్రహత్యాగము—ఇవి జ్ఞానప్రాప్తికి సాధనములు. ఇవి యనుష్ఠించినచో అజ్ఞానము నివర్తించును అజ్ఞాన నివృత్తియే బ్రహ్మసాక్షాత్కారము.

బ్రహ్మభూతుఁడు అనఁగా 'బ్రహ్మైవాహమస్మి' యనుదృఢనిశ్చయము గలవాఁడు ప్రసన్నాత్ముఁడుగా (శుద్ధచిత్తుఁడుగా) నుండును. కావున నతఁడు నష్టముగలిగినప్పుడు శోకింపఁడు, లేనిదానిని గోరఁడు. వానికి నిగ్రహానుగ్రహప్రాప్తి లేదు గావున సర్వభూతములయందు నతఁడు సముఁడై యుండును. సర్వభూతసమత్వ మెట్టిదందువా ? తనకు సుఖదుఃఖములెట్లో యితరులకుఁగూడ సుఖదుఃఖము లట్లేయని భావించుట సర్వభూతసమత్వ మగును. ఇట్టి స్థితినిబడసి శుద్ధబ్రహ్మమునైన నాయందు జ్ఞానరూపమైన యుత్తమభక్తిని అనఁగా 7-వ అధ్యాయము 16-వ శ్లోకములోఁ జెప్పిన నాల్గు విధముల భక్తులలో నుత్తమమైన భక్తిని బొందును. పరాభక్తియే జ్ఞానమని భావము 54

జ్ఞానరూప పరాభక్తివలన నన్ను సాక్షాత్కరించుకొందురు ఎట్టి వానినిగా నన్ను సాక్షాత్కరించుకొందురందువా ? ఉపాధివలన నానాభేద ములతో నుందుననియు ఉపాధిభేదంబులను నిరసించినచో సత్యజ్ఞానానంద ఘనుఁడననియు నన్నెఱుంగుదురు అట్లు నన్ను సాక్షాత్కరించుకొని నా తత్త్వమెఱింగిన యనంతరమే నారూపంబును బొందుదురు, అనఁగా బ్రహ్మ

భూతులగుదురు. కామ్యకర్మము లొనర్చి తత్ఫలమైన స్వర్గాదులు పడయు టకుఁ గొంత విలంబముండుననియు, జ్ఞానఫలమైన ముక్తిని బడయుటకు సాధనోత్తరవిలంబము సుంతయు లేదనియు జ్ఞానముగలుగుచే ముక్తియగుననియు భావము 55

భగవద్విభూతి గుణంబులను జూచిన వెనువెంటనే యనన్యాధిక నిరతిశయ భక్తి గలుగుననియు, ఆభక్తివలన భగవంతుని బొందుదురనియు, భగవత్ప్రాప్తికి భక్తియే హేతువనియు, ఈయర్థమునే యీశ్లోకము తెలుపుచున్నదనియు శ్రీరామానుజాచార్యులవారు వ్యాఖ్యానించిరి

ఈభక్తి జ్ఞానరూపమైనదా ? జ్ఞానహేతువైనదా ? జ్ఞానరూపమైనదగునేని అద్వైతవిశిష్టాద్వైతములకు భేదమే గలుగదు అనఁగా విశిష్టాద్వైతులు దేనిని భక్తియందురో దానినే యద్వైతులు జ్ఞానమనుట యగును అట్లుగాక, యీభక్తి జ్ఞానహేతువైనదని యందురేని ఈభక్తికిని 'భక్త్యామామభిజానాతి' అను 55-వ శ్లోకములోని భక్తికిని భేదమున్నదా ? లేదా ? భేదములేదనుట చెల్లదు ఏలయందువా ? శ్రీరామానుజాచార్యులవారు వచించుభక్తి జ్ఞానమునకు హేతువేగాని జ్ఞానమునకు ఫలము కాజాలదు కారణము ముందు కార్యము వెనుకయగుట స్పష్టముగదా. కావున భక్తికారణంబున జ్ఞానఫలము గలుగుచున్నది మఱియు 55-వ శ్లోకములోని భక్తి తత్త్వదర్శనమునకుఁ గారణముగాఁ జెప్పఁబడినదేగాని తత్త్వదర్శనానంతరము గలుగు ఫలముగాఁ జెప్పఁబడలేదు భేదమున్నదందురేని 55-వ శ్లోకములోని 'తత' అను సర్వనామశబ్దము ఆశ్లోకములోని 'భక్త్యామామభిజానాతి' అనువాక్యమందలి భక్తిని పరామర్శించుచున్నది గావున, అట్టి సర్వనామము ప్రయోగింపఁబడియుండదు

సారాంశమేమనఁగా—భక్తి యనఁగాఁ బ్రేమరూపక్రియ యనియు, అది జ్ఞానమునకు సాధనమనియు, జ్ఞానము ముక్తి సాధనమనియు గీతాచార్యుఁడైన భగవంతుని మతము ఇదె భావమును 10-వ అధ్యాయము పదియవదగు 'తేషాం సతతయుక్తానాం' అనుశ్లోకమందును, 13-వ యధ్యాయము 19-వ దగు 'మద్భక్త ఏతద్విజ్ఞాయ' అనుచోటను స్పష్టపఱచినాఁడు

11-వ అధ్యాయము 54-వ దగు 'భక్త్యా త్వనన్యయా' అను శ్లోకములోని భక్తి జ్ఞానమూలకముగా ముక్తికి హేతువగుననియు స్వయముగా హేతువు కాదనియు గ్రహింపవలయును

ఫలత్యాగపూర్వకంబును భగవదేకారాధనరూపంబునైన కర్మంబు ననుష్ఠించుట సాత్త్వికత్యాగాత్మకమైన సన్న్యాసంబనియు, అట్టి సన్న్యాసంబు తత్త్వజ్ఞానహేతువనియు నియ్యధ్యాయార్థము దానిని వివరింతు వినుము

నిత్యనైమిత్తికంబులనేగాక కామ్యాది సర్వకర్మంబులనుగూడ నన్నే యాశ్రయణీయునిగా గ్రహించి స్వర్గాది ఫలంబులనుగోరక గావించువాఁడు చిత్తశుద్ధి జ్ఞానరూపమైన నిత్యపదంబును మత్ప్రసాదంబునఁ బడయును ఆ పదము వైకుంఠ కైలాసాదులవలెఁ బరిచ్ఛిన్నమైనదిగాదు, త్రివిధపరిచ్ఛేదరహితంబు అఖండానందాత్మకంబునైన బ్రహ్మప్రాప్తిగా నుండును 56 కావున నీవు బుద్ధియోగంబు నాశ్రయించి ఫలాభిసంధిమాని మదేక పురుషార్థంబుగా సమస్తకర్మంబులను వివేకముతో నాకు సమర్పించుచు నిరంతరము మచ్చిత్తుఁడవగుము నీచేయు కర్మంబులెల్ల నాకు సమర్పితములగుచుండునేని నీకు నిరంతరమైన మచ్చిత్తత అనఁగా నాయందే మనస్సు లయించుట సిద్ధించును బుద్ధియోగము సంగతి రెండవ యధ్యాయము ముప్పదితొమ్మిదవ శ్లోకమందు 'బుద్ధిర్యోగే త్విమాం శృణు' అనుచోట వివరించియున్నాను. 57

పైప్రకారముచేయుచు మచ్చిత్తుఁడవగుదువేని నాప్రసాదంబున నీవు నీదుఃఖంబులనెల్లఁ దరింతువు నీచిత్తము నాయఁదు లయింపఁజేయుట తప్ప మఱియొకపనికై నీవు ఎట్టిప్రయత్నముచేయ నవసరములేదు, అందులకుఁగా నెట్టి ప్రయాసము వలదు. కృత్యాకృత్య విషయంబులనెల్ల నెఱుంగుదుననియు ఒరులుచెప్పునది చేయుటేల యనియు అహంకారవశంబునఁ దలంచి నావచించునది వినవేని సర్వపురుషార్థభ్రష్టుఁడవై నశింతువు. ప్రాణికోటికిఁ జేయఁదగినదేది చేయఁదగనిదేది అను విషయంబున నాకన్నఁ దెలిసినవాఁడు గానీ, ప్రాణికోటిని వారివారిధర్మంబులందు నాకన్న శాసించువాఁడుగాని గలుగఁడు 58

అహంకారంబునకుఁ జిక్కి నావచించినది యత్యేనెట్టిక 'యుద్ధము

జేయుటలేదు' అని తలంతువేని, నీయహంకారము వృధయేగాని ఫలకారిగాదు ఏలయందువా ? నీప్రకృతియే నిన్నీకార్యంబునకు నియోగించును. ప్రకృతి ప్రోల నీయహంకారస్వాతంత్ర్యంబులు సాగవు 59

నాయిష్టమునకు విరుద్ధముగాఁ బ్రకృతి నన్నెట్లు నియోగింపఁగల దందువా ?

అర్జునా ! నీవు అహంకారరూపమోహంబునకుఁ జిక్కి చేయనిచ్ఛగింపకున్నను నీప్రకృతి నిన్నువదలదు, బలవంతపఱచియేని నీవలనఁ దత్కార్యముసే చెయించును ప్రతివ్యక్తియుఁ దనస్వభావజమైన కర్మంబునకు బద్ధుఁడైయుండును, ఊఱకుండఁ దలంచినను స్వభావము (ప్రకృతి) ఊఱకుండనీయదు ఈభావంబును 3=వ యధ్యాయము 33-వ శ్లోకములో సూచించియున్నాను 60

ప్రకృతి యంతబలవత్తరమైనది యగుచో నీ యీశ్వరత్వ మేమగు నందువా ?

బొమ్మలాటలో సూత్రధారుఁడు సూత్రములలాగి యిచ్ఛవచ్చినట్లు బొమ్మల నాడించుచందంబున, ఈశ్వరుఁడనైన నేను భూతశరీరములనెడి బొమ్మల హృదయమందుఁజేరి వాసనాత్మక మాయారూప విక్షేపశక్తి మూలకంబునఁ బ్రాణికోటి నాడించుచుందును 61

బొమ్మలు చేతసంబులు గావున సూత్రదారుఁ డాడించునట్లాడుట న్యాయమేయనియు, ప్రాణులు చేతనంబులు గావునను, వానికి బుద్ధిగలదు గావునను, బుద్ధికి లోపడి చేష్టలుండుఁ గావునను, ప్రాణు లీశ్వరాయత్తములై వర్తించుననుట న్యాయముగాదనియు, ప్రాణులెల్ల ఈశ్వరాయత్తవర్తనంబులగునేని బుద్ధియుండియు ఫలమేమనియు శంకింపవచ్చును ప్రాణులకు బుద్ధిగలదనుట నిజమేగాని ఆబుద్ధిగూడ ఈశ్వరాయత్తమైయుండును ఈ సంగతి పదవ యధ్యాయము ఎనిమిదవ శ్లోకములో 'మత్తస్సర్వం ప్రవర్తతే' అనుచోట పదునేనవ యధ్యాయము పదునేనవ శ్లోకములో 'సర్వస్యచాహం హృది సన్నివిష్టో' అనుచోటను వివరించియున్నాను ఈశ్వరుఁడు సర్వాం

తర్యామి గావున భూతంబుల హృదయంబు నధిష్ఠించియుండును ఈశ్వరుని వలననే చేతనంబుల బుద్ధి కర్మాధికమెల్ల జరుగుచున్నది కావున ఈశ్వరత్వము అఖండితము సుమా

ఈశ్వరుని యాజ్ఞలేక యేదియుఁ బ్రవర్తింపదు గావున స్వాతంత్ర్యాహంకారంబులు మాని త్రికరణశుద్ధికి నయ్యీశ్వరునే శరణుపొందుము అర్జునా ! మఱియొకటి నీకు శరణము గలుగదు ఈశ్వర ప్రసాదంబున జ్ఞానరూపమైనట్టియు సవిలాసావిద్యానివృత్తి రూపమైనట్టియు నిత్యమైనట్టియు అద్వితీయానందంబును బడయుదువు 62

ఈశ్వరుని యాజ్ఞలేక యేదియు ప్రవర్తింపదని చెప్పుటవలన బుద్ధిగూడ ఈశ్వరప్రేరణంబుననే వర్తించుచుండుననియు, ఆపక్షమున బుద్ధికి స్వాతంత్ర్యము లేమింజేసి యది నిశ్చయించు హితాహిత విధానమునకుఁ దన్నిశ్చయప్రకారము జరుగు మంచిచెడు వ్యాపారములకు నీశ్వరుఁడే కర్తయగుచున్నాఁడనియు, మనుష్యకోటి తమ ప్రవర్తనమునకెట్టి జవాబుదారితనంబును వహింపదనియు, ఆకారణంబున విశృంఖలవృత్తి విహారంబునకు నాటవిడు బొసఁగినట్లగుచున్నదనియు శంకింపవచ్చును

బుద్ధియు జడమేగాని వేఱుగాదు దానికి స్వతంత్రశక్తిలేదు సూదంటురాయి సాన్నిధ్యంబున అయశ్శలాకకట్లు ఈశ్వరసాన్నిధ్యంబున బుద్ధికిఁ బ్రేరణశక్తిగలిగి యది వ్యవహరించుచున్నది ఈశ్వరకర్తృత్వము సాన్నిధ్యమాత్రమేయనియు, ఈపనిచేయింపుమనిగాని యీపని చేయింపవలసినదనిగానీ యీశ్వరుఁడు బుద్ధిని నియమించుటలేదనియు, తత్త్వమెఱుంగక భ్రాంతికిఁ జిక్కి యీశ్వరుఁడు చేయించుచున్నాఁడు, నేను చేయించుచున్నాను, నాకర్తృత్వమేమియు లేదని మానవకోటి విశృంఖల విహారమొనర్పరాదనియు, దుర్వాసనలను సద్వాసనలవలన నడంచుచందంబున విపరీతస్ఫురణ కోలాహలంబును శాస్త్రజ్ఞాన సదుపదేశాదులవలనఁ ద్రొంచివుచ్చనగుననియు, దీనినే పురుషకారమందురనియు, ఈపురుషకార సహాయార్థమే కర్మకలాపమెల్లఁ బ్రతిపాదింపఁబడినదనియు గ్రహింపవలయును.

ప్రకృతి అనఁగా స్వభావము, దానినతిక్రమింప సాధ్యముగాదనియు,

ఎల్లరు స్వభావమునకు లోఁబడి వర్తింపక తప్పదనియు 59-వ శ్లోకములోఁ జెప్పఁబడినది అంతమాత్రాననే ప్రకృతి దుర్జయయని భావింపరాదు. దానిని జయించుటే సాధ్యముగానియెడల నిష్కామకర్మాది కోలాహలమున కెల్ల నొక్కదండము పెట్టి మిన్నకుండనగును. ప్రకృతి దురత్యయయనఁగా వట్టిమాటలకది లోఁబడదనియు విశేషప్రయత్నముగావించినఁగాని దానిని గెలువరా దనియు, పరులపై భారమువైచి మిన్నకుండిన ఫలములేదనియు, ప్రతివ్యక్తి తన ప్రకృతిని బరిశుద్ధపఱచుకొన యత్నింపవలయుననియు భావము అనఁగాఁ బ్రకృతిగూడ పురుషప్రయత్నమున వశపడునని సారాంశము

ఆత్మ బుద్ధి ప్రకృతి యీమూఁటి కార్యంబును జక్కఁగా గ్రహించుట ముఖ్యము ఆత్మ యనఁగాఁ బరమేశ్వరుఁడేగాని వేఱుగాదు, బుద్ధియను నది మహాసూక్ష్మమైన యంతఃకరణము, ప్రకృతియనునది అనాదికర్మఫలము ఆత్మకుఁ బ్రకృతికి మధ్య అద్దపుబిళ్ళవలె బుద్ధియుండును ఆత్మ స్వప్రకా శము అనాదికర్మఫలము మంచిదిగానున్నచో ప్రకృతియు సాత్త్వికమై తేజోవంతముగానుండును అప్పుడు బుద్ధియు స్వచ్ఛముగానేయుండును గావున ఆత్మప్రకాశమును బ్రకృతితేజస్సును రెండు స్వచ్ఛమైన బుద్ధియను నద్దముగుండాఁ బ్రసరించి యొండొంటిదాఁకి మహాతేజోవంతమగును ఇది స్థితప్రజ్ఞుఁడయెడఁ బరికింపనగును అట్లుగాక ప్రకృతి రజోమయమో తమో మయమో యైనప్పుడు బుద్ధియు నట్టివర్ణము గలిగియుండును అట్టి సందర్భ ములలో ఆత్మప్రకాశము స్వరూపముతో బుద్ధియను నద్దపుబిళ్ళగుండా ప్ర కాశించి యవ్వలి ప్రకృతిపై సోఁకి దానిని మార్పఁజాలదు. ఇట్టివారికే నిష్కామకర్మయోగ ముపదేశింపఁబడినది ఈయోగంబున బుద్ధి వ్యవసా యాత్మికమగునేని అది స్వచ్ఛత దాల్చును బుద్ధి యెప్పుడు స్వచ్ఛమగు నో యప్పుడు ఆత్మప్రకాశము స్వరూపముతోఁ బ్రసరింపఁజాలును ఆత్మ ప్రకాశబలంబున బుద్ధి కవ్వలనున్న ప్రకృతి తత్త్వము మాఱును సూర్య కిరణ మొకప్రక్క చీకటికోన యొకప్రక్క యీరెంటిమధ్య తెల్లయద్దము నొకసారి, ఎఱ్ఱయద్దము నొకసారి, నల్లయద్దము నొకసారి యుంచి పరీక్షించి నచోఁ వైచిత్ర్యరహస్యము సులభగ్రాహ్యమగును చీఁకటికోనలోపల మణి దీపకలు స్వతస్సిద్ధములైయుండునేని అప్పుడు సత్త్వప్రకృతికి సామ్యమగును

అర్జునా ! రెండవయధ్యాయము 11-వ శ్లోకమగు 'అశోచ్యా నన్వ శోచః' అనునది మొదలు, ఈయధ్యాయము 62-వ శ్లోకమగు 'త్వమేవ శర ణంగచ్ఛ' అను దానితో గీతాశాస్త్రము సంపూర్ణమైనది ఇందు రహస్య తరమైన విషయమెల్లను దెలిపితిని. 9-వ అధ్యాయము 1-వదగు 'ఇదంతు తే గుహ్యతమమ్' అను శ్లోకములో జ్ఞానము గుహ్యతమమని చెప్పి యిప్పుడు గుహ్యతరమని చెప్పుటవలన నీకు సందేహము గలుగవచ్చును. అచ్చట కర్మ యోగ భక్తియోగాదులను వివక్షించుచు జ్ఞానము గుహ్యతమమని సూచించి తిని. ఇందేమియు దోషము లేదు —భక్తుఁడవు సఖుఁడవు గావున నీవు నా కెంతయుఁ బ్రియుఁడవు దానంజేసి నీకీ బ్రహ్మాత్మ తత్త్వజ్ఞానంబు నుపదే శించితిని. ఉపదిష్టమైన గీతాశాస్త్రంబును సమగ్రంబుగా విమర్శించుకొని యెట్లిష్టమో యట్లు గావింపుము. 63

గీతాశాస్త్రంబును సమగ్రంబుగా విమర్శించినచో మోహము నశించి కర్తవ్యము స్పష్టమై దానినొనర్ప నిచ్ఛ జనించుననియు, ఆప్రకారము చేయు మనియు భావము.

శ్రీభగవదుపదిష్టమైన జ్ఞానంబువలన అప్రతిబద్ధము నపరోక్షమునైన సాక్షాత్కారంబు గలుగునందాఁక, తత్ప్రతిబంధక పాపక్షయనిమిత్తము స్వ వర్ణాశ్రమధర్మంబులను బరమేశ్వరారాధనంబుగా ననుష్ఠించుట కర్తవ్యమను విషయము శాస్త్రపర్యాలోచనంబునఁ గలుగుననియు ఆప్రకారము చేయు మనియు సారాంశము

జ్ఞానసాధనంబులలో ముఖ్యమైన దేదియని యందువా ?

సర్వరహస్యములలో నుత్తమము శ్రేష్ఠమునైనట్టి యుపదేశంబును గీతాశాస్త్రంబునం దచ్చటచ్చటఁ జెప్పియున్నాను అయినను నీయెడఁగల యనుగ్రహ విశేషంబున మఱలఁ జెప్పెదు వినుము నీకు భయపడిగానీ నీ వలన నర్థము గోరిగానీ చెప్పుటగాదు, అత్యంతము ప్రియుఁడవగు కారణం బున ప్రియునకు దాఁపఁదగినది గలుగదు గావున నీవడిగిన సర్వగుహ్యతమ మైన దానిని జ్ఞానసాధనంబును జెప్పుచున్నాను. 64

కర్మయోగంబు గుహ్యమైనదనియు, కర్మయోగ ఫలమైన జ్ఞానము గుహ్యతరమైనదనియు, అంతకన్న భక్తి అతిశయమైనది గావున గుహ్యతమమైనదనియు శ్రీమధుసూదన సరస్వతిగారు వ్రాసిరి భక్తి జ్ఞానసాధనమే గాని జ్ఞానఫలముగాదు 64-వ శ్లోకములోని 'తతోవక్ష్యామి తే హితమ్', అను దానియందలి 'హిత' శబ్దమునకు జ్ఞానప్రాప్తి సాధనమని యర్థముచెప్పి అది సర్వహితములలో హితతమమైనదని శ్రీశంకరభగవత్పాదులవారు రచించిరి 6-వ అధ్యాయము 47-వ దగు 'యోగినామపిసర్వేషా' మను శ్లోకములో వసురుద్రాదిత్యాది దేవతాంతర భక్తులకన్న భగవద్భక్తు లుత్తములని వారు చెప్పుటయం దిదేభావముగాని వేఱుగాదు కర్మయోగఫలమైన జ్ఞానము భక్తికి సంగమగును, భక్తిఫలమైన జ్ఞానము మోక్షప్రదమగును భక్తి గుహ్యతమమైనదని శ్రీమధుసూదన సరస్వతిగారు వచించుట ప్రరోచనార్థమని గ్రహింపనగును.

అర్జునా! జ్ఞానమునకు సాధనము లేవియని యడిగితివి నాయందే మనస్సును ఏకాగ్రంబుగా నిలుపుట, నన్నే భక్తిసేయుట, నాకె సర్వకర్మములు సమర్పించుట, నన్నే నమస్కరించుట—ఇవి జ్ఞానసాధనంబులు. నన్నే యని నిర్దేశించుట యేలయందువా? దేవతాంతరంబుల నుద్దేశించి పైనఁజెప్పిన ప్రకారము చేయువారు ఆదేవతాంతరములనే పొందుదురు. దేవతాంతరంబులు జ్ఞానము నీయనోపవు దేవతాంతరములు పరిచ్ఛిన్నంబులు గావున వారిచ్చు ఫలంబును బరిచ్ఛిన్నంబుగానే యుండును కావున దేవతాంతర భక్తులకు జననమరణ సంసారము తప్పదు.

పైనఁజెప్పిన నాల్గు సాధనంబులు పరస్పర నిరపేక్షములైన స్వతంత్ర సాధనంబులు. ఎట్లనిన వినుము కంస శిశుపాలాదులు నాయెడఁ బరమద్వేషులు, నన్నుఁగూర్చి భక్తియజనాదు లేవియుఁ జేయరు అయినను ద్వేషభావమువలననే వారు నన్ను నిరంతరముఁ దలంచుచు మదేకమనస్కులై యుండిరి ఆకారణంబున వారికి భగవత్ప్రాప్తి కలిగినది.

కావున నీవును నిరంతరము మదేకచింతనపరుఁడవగుము మనస్సు దన్నిగ్రహమగుటంజేసి యట్లచేయనోపవేని, నాభక్తుఁడవగుము మనస్సు

యంబులకు భేదము గల్గినప్పుడు శ్రీధరీయంబును నిరసించిరి. దీనింబట్టి శ్రీసరస్వతి గారి మతమేమని నిశ్చయింపనగు? మఱియు గీత భక్తిని బోధించునదగు నేని 'ఇతితే జ్ఞానమాఖ్యాత' మను 63=వ శ్లోకంబునకు శ్రీసరస్వతిగారు రచించిన వ్యాఖ్యయే వారిమతమునకు విరోధమగుచున్నది. శబ్దస్వారస్యంబునుబట్టిగూడ భాష్యము గీతాతాత్పర్యంబునకు విరుద్ధముగాఁ దోఁచెడు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనుదానియందలి 'పరిత్యజ్య' శబ్దంబునకు 'అనాదరించి' యనునది ముఖ్యార్థము కాఁజాలదు. పరిత్యాగ అనాదరణపదంబులు పర్యాయశబ్దంబులు గావు. అదియునంగాక, 'మామేకం శరణం వ్రజ-నన్నే శరణొందుము'—అని చెప్పుటవలననే ధర్మానాదరణంబు సిద్ధించుచుండఁగా మఱలనదే సంగతిని జెప్పనేల? కావునఁ బరిత్యాగ శబ్దమునకు అనాదరణ మర్థముగాదు. అనధికారికి జ్ఞానోపదేశము తగదను విషయమునుగూర్చి విచారించినచో, అర్జునుఁడు జ్ఞానోపదేశమునకుఁ దగినంత యర్హత గలిగియుండుట పూర్వమే వివరింపఁబడియున్నది, కావున వానికి జ్ఞానోపదేశము అయుక్తము గాదు. అతఁడు తన యధికారమెంతో యంతలోనుండక, అధికారమునకు మించినట్టి సన్న్యాసంబునకు మోహావేశంబున నుపక్రమింపనుండెను. సన్న్యాసమునకు వలయు సంపద వానియందు లేదని నిరూపించి, సన్న్యసించుటకు వలయు తత్త్వంబును శ్రీకృష్ణభగవానుఁడుపదేశించినాఁడు. ఇట్లుచేయుట యుక్తమే గాని యయుక్తముగాదు. క్షత్రియులకు సన్న్యాసాధికారమున్నదా యను విషయము విచారించి-చో, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముగ్గురు సన్న్యాసార్హులే యని జాబాల్యాద్యుపనిషత్తులు స్పష్టముగాఁ జెప్పుచున్నవి. సన్న్యసించిన రాజులచరిత్రము లెన్నియో పురాణేతిహాసంబులందుఁ గలవు. కావున అర్జునునకు సన్న్యాసాధికారము గలదు. సన్న్యాసంబునకు ఏసంపత్తివలయునో యది గలిగిన తర్వాత యెవనికేని సన్న్యాసము తనంతటు తానే వచ్చునుగదా.

'నేను' అను అహంకారము కించన్మాత్రముగూడ లేక మనోవాక్కాయంబులను భగవదర్పణంబుగావించి కేవల సాధనమాత్రుఁడై యీశ్వర ప్రేరణ మేవిధంబునఁ గల్గునో యట్లు వర్తించుటయే సర్వధర్మ పరిత్యాగమనియు, ఆయర్థమే యిందు వివక్షితమని శ్రీరామకృష్ణ పరమహంసగారు సెలవిచ్చిరి. ఆస్థితికివచ్చినవాఁడు స్థితప్రజ్ఞుఁడగును. గావునను స్థితప్రజ్ఞుఁడు సర్వకర్మసన్న్యాసియగుట సిద్ధముగావునను, పరమహంసగారిభావము భాష్యభావముతో

సమన్వయించుననవచ్చును

అర్జునా ! ఈశాస్త్రంబును జితేంద్రియుఁడు కానివానికిఁగాని, నాయెడ భక్తిలేనివానికిఁగానీ, నాకుఁ బరిచర్యచేయనివానికిఁగానీ, పరమేశ్వరత్వంబును ద్వేషించువానికిఁగానీ, యుపదేశింపరాదు 67

జితేంద్రియత్వము, భక్తి, పరిచర్యాభావము, పరమేశ్వరత్వభావము గలవాఁడే యుపదేశార్హుఁడు పైనాల్గింటిలో భక్తి ప్రధానము భక్తిలేక తక్కినవి మూఁడున్నను ఫలములేదు భక్తయొక్కటియున్నఁ బాత్రత గల్గును. ఇదేభావము ఉత్తరశ్లోకంబుగూడ సూచించును పరమేశ్వరత్వంబును ద్వేషించువాఁడు మహాపాపిష్ఠుఁడనియు వానికెంతకు గూడ రానియు రాదని 'నచమాం యోఽభ్యసూయతి' అనునది సూచించును

ఈశాస్త్రంబు పరమగుహ్యము , దీనిని సర్వత్ర ప్రచారింపరాదు , నాభక్తులకుమాత్రము చెప్పనగును. ఈశాస్త్రంబును అర్థసహితంబుగా బోధించి యది నాభక్తులమదియందు నాటునట్లుచేయుట నాకుఁ బరమభక్తి సేయుటే యగును గావున అట్టియుపదేశకుఁడు నన్నుఁబొంది ముక్తుఁడగును. ఇది నిస్సంశయము 68

నాభక్తుల కీశాస్త్రంబు నుపదేశించువానికన్నఁ బ్రియకరుఁడు మనుష్యలోకములోనే నాకుఁ గలుగఁడు అట్టివానికన్నఁ బ్రియతరుఁ డీలోకంబునను నాకు లేఁడు 69

శాస్త్రంబుల కెల్లమనుష్యులధికారులు , దేవతలవిషయంబున శాస్త్రప్రసక్తియే లేదు , దానింజేసి మనుష్యలోకము మాత్రమిందు ప్రస్తావితము

నాభక్తులెల్లరు నన్నుఁ బొందుదురని చెప్పితిని నాభక్తులలో నాల్గు తరగతులున్నవనిగూడ దెలిపితిని. ఎల్లరకు నొకవిధమైన ఫలమె గలుగు నప్పుడు ఉత్తమభక్తిచేసి ప్రయోజనమేమనియు, ఉత్తమ మధ్యమాధమ భక్తులని వేర్వేఱు చేయుటేలయనియు శంకింపవచ్చును మోక్షముకన్న నధికమైనది గలుగదు, అది భక్తమాత్రసాధారణము ఉత్తమభక్తులకు ప్రత్యేకించి యిచ్చుటకు నాయొద్ద మఱొకటిలేదు గావున అట్టివానికి నేనెబ్బుడు ఋణపడియుందును.

అధ్యాపకునకు (ఉపదేశకునకు) గలుగు ఫలము చెప్పితిని, అధ్యాయికి (ఉపదేశము పొందువానికిఁ) గలుగు ఫలము వినుము

అర్జునా! మన సంవాదాత్మకమైన గీతాశాస్త్రము జ్ఞానమయమును బరమధర్మసంయుక్తము ముక్తి కారణముగానున్నది దీనిని జపరూపంబునఁ బఠించునతఁడు సర్వయజ్ఞరాజమైన జ్ఞానయజ్ఞపూర్వకంబుగా నన్నుఁ బూజించుటగును అర్థమెఱుంగక గీతను బఠించిన ఫలమేమని యడుగవచ్చును. అర్థానుసంధానపూర్వకంబుగాఁ బఠించువానికి సాక్షాత్తుగా మోక్షము చేకూరును అర్థమెఱుంగకున్నను బఠించువానికి గీతావాక్యము చెవిఁబడుటవలన సత్త్వశుద్ధియుఁ దన్మూలకంబున జ్ఞానోత్పత్తియు, జ్ఞానంబువలన మోక్షంబు క్రమముగా గలుగును 70

గీతను వినువాని కేదేని ఫలముగలదాయని శంకింపవచ్చును

పరమకారుణికుఁ డెవఁడేనిఁ బెద్దగాఁ బఠించునప్పుడు శ్రద్ధాయుక్తుఁడై వినువాఁడు (అనఁగా బూటకమునకై యెలుగెత్తి పఠించుచున్నాఁడను ద్వేషబుద్ధిలేక వినువాఁడు) కేవలాక్షరమాత్ర శ్రోతయైనను (అర్థము తెలిసికొనక విన్నను) పాపముక్తుఁడై యశ్వమేధాది ప్రశస్తకర్మము లాచరించిన పుణ్యాత్ముల వడయు శుభలోకంబులను బడయును 71

అర్జునా! గీతాశాస్త్రంబునెల్ల ఏకాగ్రబుద్ధితో అర్థావబోధకముగా వింటివా? నీయజ్ఞానంబును దన్నిమిత్తం మోహంబును మొదలంట నశించినవా? ఇట్లడుగుటేలయని శంకింపవలదు జ్ఞానోత్పత్తిపర్యంత మెంతకష్టమైననోర్చి శిష్యునకు బోధించుట గురువునకుఁ బరమధర్మంబు నీయజ్ఞానంబు నశింపదేని మఱల బోధింతును 72

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు

అచ్యుతా! నీయుపదేశించిన యాత్మజ్ఞానంబువలన అజ్ఞానకృతమైన వామోహము నశించినది, సంశయములెల్ల వీడినవి నీపనుపుచేయ సర్వసిద్ధుఁడను. 73

♦ గీతాశాస్త్రంబు నభ్యసించువానికి భగవత్ప్రసాదంబున మోక్షఫలపర్యంత జ్ఞానము తప్పకగలుగునని యీశ్లోకమూలంబున శాస్త్రఫల ముపసంహృతమని గ్రహింపనగును శాస్త్రార్థ మింతతో సమాప్తము ఈక్రింది శ్లోకంబులు కథాసందర్భములు.

సంజయుఁడు చెప్పుచున్నాఁడు

రాజా ! శ్రీకృష్ణార్జునసంవాదంబు నెల్ల వింటిని అది విన్నది మొదలు విస్మయరోమహర్షంబులొందవెదు 74 యోగీశ్వరుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు పరమేశ్వరభావముతోఁ బరమరహస్యమైన యోగంబును జెప్పగాఁ జెవులార విననోచితిని వ్యాసమహర్షి నాకనుగ్రహించిన దివ్యచక్షుః శ్రోత్రాది లాభంబు సిద్ధించినది 75

రాజా ! ఈసంవాదము శ్రవణమాత్రంబున సర్వపాపంబులను హరించును మహాద్భుతమైన దీనిని తలంచితలంచి సారెసారుకుఁ బులకితశరీరుఁడ నగుచున్నాను 76 రాజా! ధ్యానార్థం బర్జునునకు భగవంతుఁడు చూపిన విశ్వరూపంబు పరమాశ్చర్యకరంబు ఆరూపంబును స్మరించిస్మరించి యెంతయు విస్మయానందంబులొందుదు 77 సర్వయోగసిద్ధులకుఁ బ్రభువును సర్వజ్ఞుఁడును సర్వశక్తియు భక్తదుఃఖనివారణార్థము శ్రీకృష్ణుఁడై యవతరించిన వాఁడు నగు భగవానుఁడు శ్రీమన్నారాయణమూర్తి యేపక్షంబుననుండునో, గాండీవధన్వియగు నరుఁ డేపక్షంబుననుండనో, నరనారాయణులున్న యాపక్షంబున రాజ్యలక్ష్మియు విజయలక్ష్మియు ధనలక్ష్మియు నీతిలక్ష్మియు స్థిరముగానుండునని నానిశ్చయము రాజా ! నీపుత్రవిజయకాంక్ష నికనేని మాని భగవదనుగ్రహీతులును లక్ష్మివిజయాదిభాగ్యభాగులునైన పాండవులతో సంధియొనర్పుము 78

గీ॥ నరుఁడు నారాయణుండుఁ బొనరేడవలను
నిఖిల సంపదలనుగాంచి నెగడునటు,
పురుషకారంబు దైవంబుఁ బొందుగన్నఁ
గలుము లొవగూడు ననునీతిఁ గఱపుసుమ్మ ॥

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజక సార్వభౌమ శ్రీమదద్వైత
విద్యాప్రతిష్ఠాపనాభినవ శంకరాచార్య సర్వతంత్ర స్వతంత్ర
శ్రీమద్రామ బ్రహ్మానంద తీర్థ భగవత్పాద శిష్య శ్రీ
వేంకటనాధ విరచిత బ్రహ్మానందగిరి నామక గీతా
వ్యాఖ్యానంబునకు సంగ్రహంబగు
'గీతాహృదయము' సమాప్తము

కావలి, 24—6—34

ఇట్లు విధేయుఁడు,
దొడ్ల వేంకటరామరెడ్డి,
గ్రంథకర్త

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 7 | డిటవిరియె | డిట్లనియె |
| 8 | 9 | మూ | మూడు |
| 15 | 8 | అర్జుని | అర్జునుని |
| 21 | 1 | అర్జునా ? | అర్జునా ! |
| 21 | 16 | వకరివలన | ఒకరివలన |
| 33 | 24 | తెల్లజేయని | తెల్లఁజేయని |
| 34 | 5 | అసాంఖ్య | ఆసాంఖ్య |
| 47 | 17 | జిక్కుడు | జిక్కుఁడు |
| 52 | 3 | వలదనియ, | వలదనియు, |
| 53 | 1 | సన్యాస ములకన్న | సన్న్యాసముఁ కన్న |
| 54 | 4 | మేలుగు | మేలగు |
| | | నందువా ? | నందువా ? |
| 56 | 8 | భాష్యాం | భాష్యాం |
| 58 | 24 | చేయఁదను | చేయఁడను |
| 59 | 11 | గలగి | గలిగి |
| 71 | 15 | మనోశక్తి | మనశ్శక్తి |
| 72 | 21 | జన్మించు | జన్మింతు |
| 79 | 3 | ఒద్ధక | బంధక |
| 80 | 8 | తుత్పిపా సలు | క్షుత్పిపా సలు |
| 83 | 2 | ఇని | ఇవి |
| 83 | 11 | చాంద్రాయ | చాంద్రాయ |
| 84 | 9 | సాదింప | సాధింప |
| 87 | 19 | వచ్చుచుది | వచ్చుచుం |
| 89 | 5 | భోజినా | భోజనా |
| 90 | 5 | చెప్పఁపడి | చెప్పఁబడి |
| 93 | 19 | యంటవనట | యంటవనుట |
| 94 | 18 | ఏదానొకటి | ఏదేనొకటి |
| 94 | 22 | పాయాపస్థలు | పాయా పస్థలు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 96 | 26 | బ్రహ్మయే | బ్రహ్మమే |
| 96 | 27 | గంగోదకక మని | గంగోదక మని |
| 101 | 1 | నిరూపము | నిరూపణము |
| 102 | 1 | వక | ఒక |
| 102 | 2 | అప్రియుఁడు | అక్రి యుఁడు |
| 103 | 19 | చెప్పఁబడును | చెప్పఁబ డును |
| 104 | 8 | బహిప్రదేశ | బహిః ప్రదేశ |
| 104 | 25 | గలఁదను | గలఁడను |
| 105 | 19 | భాగూడ | భాసగూడ |
| 105 | 21 | నిండి | నించి |
| 106 | 10 | మగుట | మనుట |
| 106 | 16 | బార్య | భార్య |
| 107 | 2 | మధురా | మధురా |
| 107 | 6 | మత్స్వరూప | మత్స్వరూప |
| 108 | 7 | అంతకరణ | అంతఃకరణ |
| 109 | 15 | భూమికకు | భూమికను |
| ,, | 20 | వనోవృత్తి | మనోవృత్తి |
| ,, | 21 | వాగ్స్వామి | వాగ్స్వామి |
| ,, | 22 | వాఙ్మయ | వాఙ్మయ |
| ,, | 23 | బోడమచు | బోడముచు |
| 111 | 14 | యెట్టనిన | యెట్లని |
| 113 | 14 | సంపత్తియు | సంపత్తి యగును, |
| 113 | 27 | సంబంధ | సంబంధ |
| 116 | 22 | తీసుకొను | తీసికొను |
| 118 | 2 | వార, | వారికి, |
| 122 | 21 | స్పర | స్పర్శ |
| 122 | 23 | జిహ్వాని | జిహ్వాదిని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 124 | 7 | శుద్ధ | శుద్ధ |
| 125 | 26 | భుజించు | భజించు |
| 127 | 12 | సన | సం |
| 127 | 16 | దుమ్మఁడు | తుమ్మఁడు |
| 128 | 6 | నిచ్చునిది | నిచ్చునది |
| | 14 | దేతలు | దేవతలు |
| | 17 | శాశ్ప | శాశ్వ |
| | 23 | రూపమ్తైన | రూపమైన |
| 130 | 5 | లం | లందు |
| 131 | 17 | మైననేది ? | మైనదేది ? |
| 133 | 10 | యుఁడు | యుండు |
| | 16 | మగుదు | మగును |
| | 18 | క్షోభ | క్షోభము |
| 134 | 1 | వచ్ఛును | వచ్చును. |
| | 7 | నుష్ఠింప | అనుష్ఠింప |
| 135 | 4 | వమ్మును | వచ్చును |
| 137 | 9 | నగుట | వగుట |
| | 17 | నదువా ? | నందువా ? |
| 139 | 27 | జహ్మ | బ్రహ్మ |
| 140 | 7 | గలుగని | గలుగునని |
| 141 | 8 | భజనకన్న | భజనమున కన్న |
| 143 | 21 | పరమార్థ | పరమార్థదృ |
| 144 | 1 | స్వరూపు డైన | స్వరూపమైన |
| ,, | 7 | సంశ్లేశము | సంశ్లేషము |
| | 14 | నుంచి | నుండి |
| | 22 | వశమై | వశమై |
| 145 | 5 | నందువా ? | వందువా ? |
| 148 | 15 | భజింతు | భజింపు |
| ,, | 18 | ప్రషిద్ధ | ప్రసిద్ధ |
| 150 | 26 | ప్రయాస తో | ప్రయాసము తో |
| 151 | 18 | వటి | వట్టి |
| 152 | 5 | కర్మలు | కర్మములు |
| 153 | 26 | భజనమున్న చో | భజనమన్న చో |
| 157 | 12 | సఖము, అనగా | సఖము అనగా |
| ,, | ,, | కూల్యము | కూల్యము, |
| | ,, | దుఃఖము, | దుఃఖము అనగా |
| 158 | 2 | సమ్యకజ్ఞాన | సమ్యక్ జ్ఞాన |
| ,, | 23 | శ్లోకములు | శ్లోకములో |
| | 26 | నైనప్ర యోజనవరులై | నైకప్రయో జనపరులై |
| | 27 | నందునా ? | వందువా ? |
| 159 | 4 | నంటివి | వంటివి |
| ,, | 19 | సస్వరూప | స్వస్వరూప |
| 162 | 22 | నుతుఁడగు | సుతుఁడగు |
| ,, | 24 | ంరామ | (రామ |
| 163 | 19 | తాప | ప్రతాప |
| 171 | 9 | వచ్చుతి | వచ్చితి |
| 173 | 10 | కుందురు ? | కుండు ? |
| ,, | 24 | బదంపడి యిట్లు | బదంపడి యతఁడిట్లు |
| 174 | 16 | జితపరి | జిరపరి |
| 176 | 11 | భ్రీత | ప్రీత |
| 177 | 4 | నుంచి | నుండి |
| 180 | 5–6 | ఏవద్విజా | ఏతద్విజ్ఞా |
| 181 | 17 | బ్రహ్మ | బ్రహ్మము |
| 184 | 27 | సగుణనిష | సగుణనిష్ఠ |
| 190 | 13 | భూతంబు లు, అయిదు | భూతంబులు అయిదు, |
| 191 | 27 | లేకుఁడుట, | లేకుండుట |
| 192 | 4 | అసక్తి | ఆసక్తి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 206 | 8 | ఫఃమై | ఫలమైన | 253 | | పదునాఱవ యధ్యాయము | పదునెనిమిదవ యధ్యాయము. |
| 210 | 8 | గొడ్డటి | గొడ్డట | 256 | 5 | గలుగునని | గలుగని |
| 213 | 23 | ద్విభ్రమః | ద్విభ్రమః | 259 | 13 | స్వభావు | స్వభావాను |
| 215 | 17 | సుషుప్తిబ్ర హ్మ | సుషుప్తి బ్రహ్మ | 260 | 6 | నిగాపు | విదాఘు |
| 218 | 18 | వని | నది | 262 | 4 | పరులకు స | పరులకు సం |
| 220 | 6 | బ్రహ్మె | బ్రహ్మ | 263 | 12 | ప్రాప్తిలర | ప్రాప్తి పర |
| ,, | 8 | గూడి | గూడ | 297 | 2 | ప్రక | ప్రకృ |
| 221 | 16 | పితృభూ | పితృభూత | 267 | 18 | చేతసం | అచేతనం |
| 223 | 5 | మోహాన | మోహినీ | 268 | 2 | బుద్ధి కర్మ | బుద్ధికర్మ |
| 227 | 7 | సాపాత్మ | పాపాత్మ | 268 | 19 | వలసినదని | వలదని |
| 233 | 12 | రాజన | రాజస | 268 | 21 | చేయించుచు | చేయుచు |